| | |
|---|---|
| **వెల** | : **రూ. 50/-** |
| ఆంగ్ల మూలం | : A Book for Parents, A.S. Makarenko, Foreign Languages Publishing House, Moscow 1954, translated from the Russian by Robert Daglish |
| ప్రథమ ముద్రణ | : జూన్, 2002 |
| పునర్ముద్రణ | : 2006, 2008 |
| కవర్ బొమ్మలు | : అన్వర్ |
| ప్రతులకు, వివరాలకు | : **హైదరాబాద్ బుక్ ట్రస్ట్**<br>ప్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్,<br>హైదరాబాద్-28. ఫోన్ : 23521849 |

ముద్రణ : ఓం సాయి గ్రాఫిక్స్, నారాయణగూడ, హైదరాబాద్. ఫోన్ : 27564141

# విషయ సూచిక

# CHAPTER - 1

# నేనెందుకిది రాశాను?

ఈ పుస్తకం రాయబోవడం సాహసమేమో?

తమ పిల్లలను పెంచడం ద్వారా ఈ కాలం తల్లితండ్రులు ఈ దేశ భవితనే కాక, మొత్తం ప్రపంచం భవిష్యత్తునే నిర్దేశించగలరు. ఇంత కీలకమైన బాధ్యత నిర్వహణ విషయంలో సలహాలు, సూచనలు ఇవ్వగల శక్తి నాకు ఉన్నదా? అసలు ఆ హక్కు గానీ, ఆ ధైర్యం కానీ ఉన్నాయా నాకు?

అయితే అదృష్టవశాత్తూ ఇంత పెద్ద బాధ్యతను పూర్తిగా నేనొక్కడినే మోయనవసరం లేదు. ఇంతకుముందే అనేకమంది మేధావులు రాసిన పలు విలువైన పుస్తకాలు మనకు అందుబాటులో ఉన్నాయి. ఎందరో వీరుల సాహసకృత్యాలు, ఆదర్శాలు మనముందున్నాయి. ఈ గ్రంథాల నుంచీ, ముందు తరాల వారి అనుభవాల నుంచీ నేర్చుకోగల పాఠాలెన్నో ఉన్నాయి. అయినా కొందరు అమ్మానాన్నలు పిల్లల పెంపకంలో విఫలం అవుతూనే ఉన్నారు. అప్రధానమైన విషయాలను పట్టించుకుంటూ, కీలకమైన అంశాలను నిర్లక్ష్యం చేయడం ద్వారా బిడ్డల శిక్షణకు సంబంధించిన అతి ముఖ్యమైన బాధ్యతల నిర్వహణలో విఫలం కావడం కళ్లెదుట కనిపిస్తూనే ఉంది. పిల్లవాడిని పెంచడం అంటే వాడిని ఉన్నత వ్యక్తిత్వం, క్రమశిక్షణ, సత్ప్రవర్తన, శ్రమ పట్ల గౌరవం, పెద్దల పట్ల గౌరవం, జీవితంలోని అత్యంత సుందరమైన పార్శ్వాలను అర్థం చేసుకోగలగడం వంటి లక్షణాలు గల వ్యక్తిగా తీర్చిదిద్దడం. ఈ అంశాలలో పాఠకులకు ఏ చిన్న సాయం అందించినా ఈ పుస్తకం లక్ష్యం నెరవేరినట్టే.

పిల్లల పెంపకంలో పెద్దలు చేసే పొరపాట్లు మొత్తం కుటుంబ సంబంధాలను ధ్వంసంచేసి, ఆ కుటుంబంలో ఆనందాన్నే హరించగల ప్రమాదం ఉంది. ఏ సమాజంలోనైనా పిల్లల పెంపకంలో జరిగే పొరపాట్లు, తల్లితండ్రుల తప్పిదాలు, వైఫల్యాలు దారుణమైన ఫలితాలకు దోహదం చేస్తాయి. కుటుంబ సభ్యుల మధ్య, వైరుధ్యాలను గుర్తించడంలో విఫలమైతే ఎదురయ్యే ఫలితాల గురించి నా అనుభవంలోకి వచ్చిన కొన్ని ఉదంతాలను వివరిస్తాను.

ఒకసారి ఒక తల్లి తన కుమారుని గురించి నాకు ఒక లేఖ రాసింది.

"మాకు ఒక్కడే కొడుకు. ఇప్పుడు అసలు అటువంటి కొడుకు వద్దనిపిస్తోంది. వాడితో మాకు ఎదురవుతున్న దురదృష్టకరమైన, విచారకరమైన అనుభవాల ఫలితంగా మాకు అకాల వృద్ధాప్యం దాపురించిందనిపిస్తోంది. ఇది కేవలం విచారకరం మాత్రమే కాదు. అత్యంత బాధాకరంగా ఉంది. కళ్లెదుటే పిల్లవాడు పతనమైపోతుంటే ఏమీ చేయలేని నిస్సహాయస్థితి.

నిజానికి వాడు ఇలా తయారవవలసినవాడు కాదు. ఈ కాలం పిల్లలు ఎంత సంతోషంగా, సరదాగా ఉంటున్నారో చూసి, దిగులు కలుగుతుంది. తన ప్రవర్తనతో వాడు అనుక్షణం మమ్మల్ని చంపుతున్నాడు. వాడు చేసే ఏ పనినీ సహించడం అసాధ్యంగా ఉంటోంది."

ఇదీ విషయం.

ఆ పిల్లవాడి తండ్రి వంక చూశాను. అతని రూపం అంత ఆకర్షణీయంగా లేదు. దుస్తులు ధరించిన తీరులోనే నిర్లక్ష్యం, బద్ధకం తెలుస్తున్నాయి.

"నేనొక కార్మికుడిని..... వీడు నా కొడుకు. నేను వాడికి చదువు కూడా చెబుతాను. కావాలంటే అడగండి" అన్నాడు గోడవార ఉన్న కుర్చీలో కూర్చొన్న పిల్లవాడిని చూపిస్తూ.

వాడికి పదమూడేళ్లుంటాయి. అందంగా, చక్కగా ఉన్నాడు. తండ్రి వంక శ్రద్ధగా చూపు నిలిపాడు.

ఆ తండ్రి పిడికిలి బిగించిన చేతిని గాలిలో ఆడిస్తూ ఆందోళనగా మాట్లాడుతున్నాడు. 'ఒక్కడే కొడుకు... మొత్తం నన్ను ధ్వంసం చేస్తున్నాడు. వంటి బట్టలు తప్ప ఈ రోజు నాకింకేం మిగల్లేదు.'

ఆ పిల్లవాడు, కళ్లు ఒకసారి చికిలించి మళ్లీ మామూలుగా నిటారుగా కూర్చుని, తండ్రి వంక చూస్తున్నాడు. ఆయన నిస్సత్తువుగా కుర్చీలో వెనక్కి వాలి, తలవంచుకుని నాతో అన్నాడు. "వీడిని తీసుకుపోండి... ఎక్కడికైనా సరే... వాడి విషయంలో ఏం చేయలేను... చేయలేక పోయాను..." అతని గొంతులో ఓటమి, అభ్యర్థన మిళితమై ఉన్నాయి. అంతలోనే తల ఎత్తి కొడుకు వంక చూసాడు. "మిషా... ఏమిటిది? ఇలా ఎందుకు తయారయావు?" అని ఆవేదనగా అడిగాడు. వాడేం మాట్లాడలేదు. హటాత్తుగా నాకు అర్థమైంది. వాడు తండ్రిని ద్వేషిస్తున్నాడు. వాళ్లిద్దరూ శత్రువులు. బహుశా జీవితాంతం ఇలాగే మిగిలిపోతారేమో! ఏదో ఒక అతి చిన్న విషయంలో వారి వ్యక్తిత్వాల మధ్య ఘర్షణ ఆరంభమై ఉండాలి. అహాలు దెబ్బతిని ఉండాలి. ఎదుటి మనిషి పట్ల అనాలోచితంగా ప్రదర్శించే నిర్లక్ష్యం ఈ పరిస్థితులకు దారి తీస్తుంది. విప్లవకారుడు కూడ అయిన ఈ తండ్రి బిడ్డ శిక్షణకు బెత్తమే సరైన ఆయుధమని భావిస్తున్నట్లు తెలుస్తూనే ఉంది. ఆ పిల్లవాడు అందుకు ఎదురు తిరిగాడు. ఇది తండ్రికి నచ్చని, ఊహించని పరిణామంగా మిగిలింది.

నేను మిషా వంక తదేకంగా చూస్తూ, కఠినంగా చెప్పాను. "నువ్వు ఇకపై శిక్షణా శిబిరంలో ఉండాలి" అని.

ఆశ్చర్యకరంగా వాడి కళ్లలో సంతోషం మెరిసింది. చిన్నగా నవ్వుతూ, తండ్రి వంక నిర్లక్ష్యంగా చూశాడు. ఆ కళ్లలో ఎంత ద్వేషం గూడుకట్టుకొని ఉందో చెప్పలేను. వాడు గదిలో నుంచి బయటికి నడవగానే, తండ్రి విచారంగా నా వంక చూశాడు. "నేను నా కొడుకుని ఎందుకు దూరం చేసుకున్నాను?" అని ఎవరినీ ఉద్దేశింపని ప్రశ్న వేశాడు.

నేను జవాబు చెప్పలేదు.

"అక్కడ వాడికి బావుంటుందా?" అని అతను ఆత్రంగా మరో ప్రశ్న వేశాడు.

★ ★ ★

పిల్లల్లో ఇలా అకారణ ద్వేషం రగల్చడం, లేదా వారికి అనవసర ప్రాధాన్యం ఇచ్చి గారాబంతో చెడగొట్టడం వల్ల అమ్మానాన్నలు చివరికి దుఃఖాన్నే మిగుల్చుకోగలరు. పిల్లల మాటలకు వేరే

అర్థాలు వెదకి, వారి ఆరిందా కబుర్లను మెచ్చుకుని కితాబులివ్వడం, అనవసరంగా దండించడం కూడా సత్ఫలితాలనివ్వదు.

పెద్దలందరితో సమ ఫాయిలో కూర్చుని పెద్ద పెద్ద కబుర్లు చెప్పే పిల్లలను చూసి ఆనందించడం అంటే చేతులారా వారి బతుకుని ధ్వంసం చేయడమే అవుతుంది కూడా.

అమ్మా నాన్నలు ఆ కుటుంబంలో ఒక వ్యక్తిని పెంచి పెద్దచేస్తున్నామని అందుకు తాము పూర్తిగా బాధ్యులమనీ ఒక్కొక్కసారి మరచిపోతారు. ఇది కేవలం నైతిక బాధ్యత మాత్రమేనని ఊరట చెందడం హానికరం. ఈ నిర్లిప్తత కారణంగా జీవితంలో ఒక రోజు మీరు పూర్తి నిస్పృహకు లోనయ్యే ప్రమాదం పుష్కలంగా ఉంది. చిన్నప్పుడు చురుకుగా, ఉషారుగా ఉన్న పిల్లవాడు, అందరికీ ఆనందాన్ని పంచిన పసివాడు ఈ రోజు ఇలా తయారయ్యాడేం! అని విస్తుపోయే దురదృష్టకర అనుభవం ఏ తల్లికీ, తండ్రికీ రాకూడదు.

అంత చక్కటి పిల్లవాడిలో ఇప్పుడు మీకు ఇంత విషాదాన్ని మిగల్చగల మార్పు రాత్రికి రాత్రి విరుచుకుపడదు. ఇది క్రమంగా వచ్చే మార్పు. దానిని ఆరంభంలోనే పసికట్టగలిగితే, అనారోగ్యకరమైన ధోరణులను మొగ్గలోనే తుంచగలం. భవిష్యత్తులో విషాదాన్ని కలిగించగల ధోరణులను పిల్లల్లో గమనించినప్పుడు వెంటనే తగిన విధంగా స్పందించడానికి బదులు, ఆ సంగతిని గ్రహించినట్టు, ఎటువంటి ప్రమాదం లేనట్టు మనలను మనం భ్రమింపచేసుకుని నిశ్చింతగా ఉండడం అన్నింటికంటే ప్రమాదకరం. పిల్లల కళ్లల్లో, ప్రవర్తనలో, రోజువారీ దినచర్యలో సూచనప్రాయంగా మార్పు కనిపించినా, దానికి కారణం ఏమిటని ఆలోచించి, తప్పు ఎక్కడ జరిగిందో గుర్తించడం, దానిని పరిహరించేందుకు గట్టి ప్రయత్నం చేయడం తప్పనిసరి. అంతే తప్ప సాకుల కోసం వెదకడం మంచిది కాదు.

★ ★ ★

క్లబ్బులో నాతో పాటు కూర్చుని టీ చప్పరిస్తున్న ఆ మనిషి ఉన్నట్టుండి కోపం తెచ్చుకుని నా మీద ఎగరడం, మా విద్యావేత్తలను తప్పుపట్టబోవడం ఆశ్చర్యం కలిగించింది. "మీ విద్యావేత్తలు ఎప్పుడూ సరైన పద్ధతుల గురించి ఉపన్యాసాలిస్తారు, అందరినీ విమర్శిస్తారు. అయితే మౌలిక వైరుధ్యాలను పట్టించుకోరు" అన్నాడు ఆరోపణ చేస్తున్న కంఠస్వరంతో.

"ఏమిటా మౌలిక వైరుధ్యం?" అని ప్రశ్నించాను నేను.

"వైరుధ్యం ఏమిటా? ఏమిటని అడుగుతున్నారా? అంటే అదేమిటో తెలియకుండానే దానిని పరిష్కరిస్తారా?" సవాలు చేశాడాయన.

"పరిష్కరించగలను. అయినా మీరెందుకిలా ఉద్రేకంగా మాట్లాడుతున్నారు?" అతను నన్నేం పట్టించుకోలేదు.

"మీరేం పరిష్కరించలేరు. పరిష్కారం లేని సమస్య అది. దాన్ని త్యాగం చెయ్యి, దీన్ని త్యాగం చెయ్యి అని ఉపదేశాలు ఇస్తే కుదరదు. అసలు నేను ఇలాంటి త్యాగాలకు సిద్ధమే కాదనుకోండి. అప్పుడెలా?" అని ప్రశ్నించాడతను.

"అసలు సమస్య ఏమిటో చెప్పండి" రెట్టించాను నేను.

"ఏముంది! ఎవరైనా ఉద్యోగం చేయాల్సిందే. అదికాక ఇతర బాధ్యతలు ఉండనే ఉంటాయి. పిల్లలు, కుటుంబ సంరక్షణ, స్నేహాలు, అభిరుచులు.... ఇలా నా మొత్తం

సమయాన్ని సమాజమే హరిస్తోంది. ప్రతి నిమిషానికి ఒక పని నిర్దేశించి ఉంటుంది. అటువంటప్పుడు ఇక పిల్లలను పెంచేందుకు సమయం ఏదీ? పెంపకం అంటే ఇంట్లో కూర్చుని వాళ్లతో గడపడం, మాట్లాడడం... వాళ్ల సందేహాలు తీర్చడం. అంటే మరే పని లేకుండా ఇంట్లో నిర్వ్యాపారంగా కాలం వెళ్లబుచ్చడం... అంతేగా? దీనికి పరిష్కారం ఏమిటి?" అతని గొంతులో అసహనం, విసుగు స్పష్టంగా తెలుస్తున్నాయి.

"మీకు ఒక కొడుకు ఉన్నాడా?"

"ఉన్నాడు. ఆరో క్లాసు. పదమూడేళ్లు. మంచివాడు. బాగా చదువుతాడు. కానీ ఈ వయసుకే వాడొక దిమ్మరి. తల్లిని ఒక సేవకురాలిలా చూస్తాడు. బండగా ప్రవర్తిస్తాడు. ఈ మధ్య వాడి స్నేహితుడొకడు ఇంటికి వచ్చాడు. ఇద్దరూ అవతలి గదిలో మాట్లాడుకుంటున్నారు. వీడి నోటి వెంట ఎన్ని బూతులు? ఎంత అసహ్యంగా మాట్లాడాడని!" సమస్యని విపులీకరించాడతను.

"మీకు భయం కలిగిందా?"

"అదేం ప్రశ్న? నిండా పదమూడేళ్లు లేవు. వాడికి తెలియని సంగతులు లేవు! ఏదీ వాడికి రహస్యం కాదు. బహుశా బూతు కథలు కూడా చదివే ఉంటాడు." అతని గొంతులో నిస్సహాయత.

'అంటే మీ కొడుక్కి మీరుకాక, మరెవరో ఈ చెత్త సంగతులన్నీ నేర్పుతున్నారనే దిగులా?' నేను నిలదీశాను.

"ఏమిటిది, హాస్యమా?" అంటూ మిర్రి మిర్రి చూశాడతను. "నేను సమస్య గురించి మాట్లాడుతున్నాను. మీకది వేళాకోళంగా ఉంది" అంటూ లేచి టీకి డబ్బు చెల్లించి వెళ్లిపోయాడు.

★ ★ ★

నేనేమీ వేళాకోళం చేయలేదు. అతన్ని ఒక ప్రశ్న వేశాను. తిన్నగా సమాధానం చెప్పకుండా చర్రున లేచి వెళ్లిపోయాడాయన. ఇంతసేపూ ఆయన క్లబ్బులో కూర్చుని నాతో మాట్లాడుతూ టీ తాగాడు. 'మౌలిక వైరుధ్యం' గురించి చెప్పాడు. ఇదంతా ఆయన దృష్టిలో సామాజిక జీవనమే. ఈ విధంగా ఆయన తన సామాజిక బాధ్యత నెరవేర్చాననుకుంటున్నాడు. ఇష్టంలేని ప్రశ్న వేయగానే సంభాషణ తుంచి వెళ్లిపోయాడు. ఇప్పుడాయన మరెవరితోనో 'మౌలిక వైరుధ్యం' గురించి చర్చిస్తూండవచ్చు.

పిల్లలను పెంచడం అంటే వారితో నిర్ణీత సమయం గడిపి, వారితో మంచి చెడుల గురించి కాస్సేపు ప్రసంగించడమేనని ఈయన ఉద్దేశం. అందుకు సమయం చాలడం లేదని ఫిర్యాదు. ఇది ఈయన ఒక్కరి సమస్య మాత్రమే కాదు. చాలామంది తల్లితండ్రులు ఇలానే భావిస్తారు. తాము కూర్చుని ప్రసంగిస్తే చాలు పిల్లల పట్ల బాధ్యత తీరిపోతుందని వీరి ఉద్దేశం. కానీ పెంపకం బాధ్యత అంటే ఇదేనా? దీనితోనే బాధ్యత తీరిపోతుందా? అసలు పిల్లలతో కూర్చుని మాట్లాడడం అనే విషయానికి చాలామంది అనవసర ప్రాధాన్యం ఇస్తారు.

చెప్పే వారికీ, వినే వారికీ మధ్య ఉండేది కేవలం మూడడుగుల దూరం మాత్రమే కాదు. ఒక టీచరు తన విద్యార్థి ఎదుట ఈ దూరంలో కూర్చుని ఎంతసేపు మాట్లాడినా, పిల్లవాడు తను వినదల్చుకొన్నదే వింటాడని గమనించాలి. మనం చేసే ప్రసంగం, శబ్దాలు.... పిల్లవాడి చెవినపడి, వాటిని కర్ణభేరి ఏ రూపంలో మెదడుకు ఎక్కిస్తుందో ఊహించడం అసాధ్యం.

వినీవినీ విసుగొచ్చి చివరికి పిల్లవాడు అవతలికి పారిపోతే మళ్లీ బాధ మిగిలేది పెద్దలకే. వాడు అదుపుతప్పి పోయాడనీ, దిమ్మరులతో తిరిగి చెడిపోతున్నాడనీ బాధపడేది మనమే.

ఏవో కొన్ని సిద్ధాంతాలను విశ్వసించి, వాటి సాయంతో కొన్ని నిర్ధారణలకు వచ్చి పిల్లల పెంపకంపై కొన్ని అభిప్రాయాలు ఏర్పరుచుకొని ముందుకు సాగితే తల్లితండ్రులు మంచి ఉపాధ్యాయులు కాగలగడం అన్నది కల్ల. పిల్లలపై బయటి శక్తుల ప్రభావం లేకుండా, పూర్తిగా మన ఆధీనంలోనే విద్యా బోధన సాగించాలనే దుర్గ వ్యతిరేక ప్రయోజనాలను ఇచ్చే ప్రమాదం సైతం ఉంది. విద్యార్జన అనేది ఒక సామాజిక ప్రక్రియ، ఇందుకు అమ్మానాన్నలు, ఉపాధ్యాయులే కాక తోటి పిల్లలు, పరిసరాలు, ఇతర అనుభవాలూ అన్నీ తోడ్పడతాయి. పిల్లవాడు ఈ క్రమంలో సంక్లిష్టమైన అనేక రకాల సంబంధాల్ని పరిసరాలతో ఏర్పరచుకుంటాడు. తిరిగి ఈ వేర్వేరు సంబంధాల మధ్య అనివార్యంగా కొన్ని బంధాలు ఉంటాయి. ఒకదానికొకటి ప్రభావితం చేస్తాయి. పిల్లవాడు ఎదుగుతున్నకొద్దీ ఈ సంబంధాల ప్రభావం వాడి శారీరిక, మానసిక, నైతిక ఎదుగుదలపై ప్రభావాన్ని చూపుతూనే ఉంటాయి. పరస్పర విరుద్ధమైన, సంక్లిష్టమైన ఈ బంధాల వల్ల ఎదుగుదల సంక్షుభితం అవుతుందని బెంగ పడనవసరం లేదు. పిల్లవాడి వ్యక్తిత్వంపై ఈ ప్రతీ సంబంధం నిర్దిష్టమైన పద్ధతిలో ప్రభావం చూపుతుంది. ఈ మార్పులు సరైన దిశలో ఉండేలా చూడడం ఉపాధ్యాయుని బాధ్యత.

ఈ విషయాలను దృష్టిలో ఉంచుకుంటే బయటి శక్తుల, వ్యక్తుల, సంబంధాల నుంచీ, వాటి ప్రభావం నుంచీ పిల్లవాడిని కాపాడాలనేది అనవసరమైన ప్రయత్నమని బోధపడగలదు.

అలా అని బిడ్డల పెంపకంలో కుటుంబం, మరీ ముఖ్యంగా అమ్మానాన్నల పాత్ర ఉండదా? కచ్చితంగా ఉంటుంది. ఉండాలి కూడా. అయితే కుటుంబం అనే సమిష్టి వ్యవస్థ పిల్లవాడిని పెంచడం అనేది శూన్యం నుంచి సాగే ప్రక్రియ కాదు. ఎదిగే పిల్లవాడు పరిసరాల నుంచి సమకూర్చుకున్న జ్ఞానాన్ని సవ్యంగా ఉపయోగపడేలా చూడడంలో అమ్మానాన్నల పాత్ర ప్రాధాన్యం వహిస్తుంది. భవిష్యత్తులో మానవుడిని రూపొందించేందుకు తల్లి, తండ్రి, ఉపాధ్యాయుల పరిమిత పాత్ర - కూర్చోబెట్టి ఉపన్యాసాలు ఇవ్వడం వల్ల పూర్తి ప్రయోజనం ఉండదు.

పిల్లలను మన జీవితాలకు పరిమళం చేకూర్చగల సున్నితమైన, అలంకారప్రాయమైన పూలగుత్తులుగా పరిగణించడం కూడా పొరపాటే. భవిష్యత్ వైఫల్యాల పునాదులు ఈ భావనలో ఉన్నాయి. అవును పసిపిల్లలు మన పూలకుండీల్లో వాడిగే జీవంలేని పూలగుత్తులు కారు, కుటుంబం అనే చెట్టునుంచి జీవన చైతన్యాన్ని ఆస్వాదిస్తూ విచ్చుకొనే మొగ్గలు. మనోహరమైన ఈ పూదోటలను సంరక్షించుకోవాలంటే అందుకు తగిన శ్రమపడవలసినదే.

అవును తల్లితండ్రులు తోటమాలిలా కష్టించి పిల్లలను పెంచాలి. సారవంతమైన మట్టి, పరిశుభ్రమైన గాలీ అందమైన తోటలకు ఆలంబన. సూర్యుడు వాటి ఊపిరి. ఈదురుగాలులు, పెనుతుపానులూ ఈ వృక్షాల పోరాట పటిమను ద్విగుణీకృతం చేస్తాయి. అవి మోడువారి పోకుండా పక్క చెట్లు ఆదుకుంటాయి. తోటలో ఒక చెట్టు ఎదిగి ఫలసాయాన్ని ఇవ్వాలంటే అందుకు ఇన్ని శక్తులు సహకరించాలి. అంటే ఇక్కడ తోటమాలి ప్రేక్షక పాత్ర నిర్వహిస్తాడని కాదు. అతనేమీ చేయడనీ కాదు. చెట్లు వాటంతట అవే ఎదిగి, గాలికి పెరిగి, తమంత తాము

జీవన పోరాటంలో రాటుదేలి, చివరికి పుష్పించేవరకూ తోటమాలికి పనేమీ లేదనుకోవడం పొరపాటు.

ప్రకృతిని శ్రద్ధగా గమనిస్తూ, అభిమానంతో దీని అభివృద్ధికి కృషిచేయడం మనిషి ఏనాడో నేర్చాడు. ఇప్పుడతను ప్రకృతి గమనాన్నే నిర్దేశించగలుగుతున్నాడు. పిల్లల విషయంలో పెద్దలం, అమ్మానాన్నలం మనం చేయవలసింది ఇదే.

కుటుంబ సంరక్షణ, పిల్లల పెంపకంలో పెద్దలు ఇదే వైఖరి అనుసరించాలి. పిల్లల పెరుగుదలను ప్రభావితం చేసేవి, అందుకు సహకరించేవి, అడ్డుపడేవి - ఎన్నో కారణాలు పరిసరాల్లో ఉంటాయి. అలా అని పెంపకంలో వైఫల్యాలను ఈ శక్తులపైకి నెట్టడం పెద్ద అవరోధం.

పిల్లలు తమ పెద్దలతో, ముఖ్యంగా తల్లితండ్రులతో అనుచితంగా ప్రవర్తించారంటే, క్రమ శిక్షణ లేకుండా దిమ్మరులుగా, దొంగలుగా, గూండాలుగా తయారయ్యారంటే, కుటుంబం, చదువు పట్ల బాధ్యతను విస్మరించారంటే అందుకు కారణాల కోసం ఎక్కడో అన్వేషించవద్దు. తొలి తప్పు మీదే - అమ్మానాన్నలదే అని గుర్తించండి. ఇలా జరిగిపోయిన తప్పుల గురించి ఆవేదన చెందడం కంటే, ఏ తరహా వైఫల్యాలు పిల్లలను పెడదారిలోకి నెడతాయో గుర్తించండి. అందుకు నా ఈ ప్రయత్నం ఉపకరిస్తే ఆ మేరకు అది ఒక విజయమే.



# CHAPTER - 2

# కుటుంబమే తొలి పాఠశాల

నేను ఇంకా యవ్వనంలో ఉన్న రోజుల్లో ఒకసారి ఒక రాచకుటుంబం నుంచి ఆహ్వానం వచ్చింది. కొంచెం మందకొడిగా ఉండే వాళ్ల అబ్బాయికి సెలవల్లో చదువుచెప్పి, మరోసారి పరీక్షలకి తయారుచేయాలి. ఆ వేసవిలో రాకుమారుని కుటుంబం మా పట్టణానికి సమీపంలో తమ సొంత ఊరిలోని భవనంలో గడపబోతోంది. నన్ను అక్కడికి రమ్మని కబురు. వారు ఇచ్చే మంచి జీతమేకాక, రాచకుటుంబంతో కలసి గడపటంలోని సౌఖ్యంపట్ల ఆకర్షణ కూడా తోడైంది. ఆ ఊరిలో రైలు దిగేసరికి స్టేషన్ బయట నా కోసం నాలుగుచక్రాల గుర్రపుబండి ఒకటి సిద్ధంగా ఉంది. ఎండలో బండి గుర్రాలు రెండూ నల్లగా నిగనిగలాడుతున్నాయి. బండి తోలేవాడి వీపు కూడా నిటారుగా ఠీవీగా కనిపించింది. రాజుల వైభోగం వారి ఠీవీ, వ్యవహారశైలి గురించి అంతవరకూ పుస్తకాల్లో చదివానేకానీ ఎన్నడూ స్వయంగా చూడలేదు.

వేగంగా నడుస్తున్న బండి గతుకుల్లో పడినప్పుడల్లా చింకిపాతలా ఉన్న నా పాతపెట్టె ఎగిరెగిరి పడింది. నన్నేదో నిస్పృహ ఆవరించింది. దిగాలుగా అనిపించింది. అసలు ఇక్కడికి, ఈ రాచరికపు మర్యాదల మధ్యకు నేనెందుకు వచ్చినట్టు? ఇక్కడవారి నియమాలు, సంప్రదాయాలు వారికి ఉంటాయి. వారి సొంత గుర్రపుబళ్లు, వాటికి సరిపోయే బండివాళ్లు ఉంటారు. నేనెందుకిలా ఇక్కడ చిక్కాను? అన్న ఆలోచన నన్ను వేధించింది.

ఆ ఎస్టేట్‌లో నేను రెండు నెలలు ఉన్నాను. వచ్చినరోజు బండి ప్రయాణంలో ఆవరించిన నిస్పృహ అంతకాలం నన్ను వెన్నాడుతూనే ఉంది. చివరికి అదే బండిలో నేను స్టేషన్‌కు తిరిగి వెళ్తున్నప్పుడు నా పెట్టె మళ్లీ అలానే ఎగిరెగిరి పడింది. అయితే నాకు మొదటిసారి కలిగినట్టు సిగ్గు అనిపించలేదు. బండి కానీ, ఆ బండివాడు కానీ, ఆ గుర్రాలు కానీ నన్ను కించపరచలేక పోయాయి. మొత్తంమీద ప్రపంచం నాకు సంతోషం కలిగించలేకపోతోంది. ఆ రెండునెలల్లో నన్ను ఆహ్వానించిన రాకుమారుడు ఒక్కసారికూడా తన ఎస్టేట్‌కు వచ్చి నన్ను పలకరించలేదు. చక్రవర్తిగారి సేవలో ఆయన తలమునకలై ఉన్నాడు. ఆ భవంతిలో ఆ రాకుమారుని భార్య; ఇద్దరు కుమార్తెలు, పన్నెండేళ్ళ కొడుకు, సేవకులు మాత్రం ఉండేవారు. ఆమె సన్నగా, పొడవుగా ఉండేది. పొడవాటి ముక్కు, కోలమొహం..... పిల్లలకూ అవే పోలికలు. ఆ పిల్లవాడికే నేను పాఠాలు చెప్పినది. వారితోపాటు రోజూ ఇరవైమందైనా భోజనం చేసేవారు. వాళ్లంతా ఎవరో నాకు ఇప్పటికీ అర్థం కాలేదు. కొందరు ఆ ఎస్టేట్‌లోనే ఉండేవారు కాగా, మరికొందరు బయటినుంచి వచ్చి రెండు, మూడు రోజులపాటు ఇక్కడ అతిథులుగా ఉండి వెళ్లేవారు. ఈ

అతిథుల్లో చాలామంది ఈ కుటుంబానికి సమఫాయిలో ఉండేవారే. వాళ్లకి ఎన్నెన్నో బిరుదులు, పతకాలు ఉండేవి. ప్రపంచంలో ఇంత చెత్త ఉందనీ, అది మాకు ఇంత సమీపంగా ఉందనీ నాకు మునుపు తెలియదు.

వాళ్ల మాటలు, ప్రవర్తన, భేషజం చూసి అసలు ప్రపంచంపైనే విరక్తి కలిగింది. ఇంత పనికిమాలినవాళ్లు ఉంటారని నేనెప్పుడూ ఊహించలేదు. బహుశా అందువల్లే అనుకుంటాను వారిలో మెచ్చే గుణం ఏమన్నావుందా అని తెగ అన్వేషించాను.

వారివంక చూస్తున్నప్పుడు అనివార్యంగా మా నాన్న గుర్తుకొచ్చేవాడు. ప్రతిరోజూ ఫ్యాక్టరీ కూత వినిపించగానే ఐదు గంటకల్లా నిద్ర లేచేవాడు. పదిహేను నిమిషాల్లో తయారై మా ఇసకవీధిలో కంచెపక్కగా నడుస్తూ పనిలోకి వెళ్లేవాడు. చేతిలో ఎర్ర రుమాల్లో చుట్టిన భోజనం డబ్బా ఉండేది. సాయంత్రం ఆరుగంటల ప్రాంతంలో ఇంటికి తిరిగివచ్చేవాడు. అలసిపోయిన మొహంతో, విచారంగా కనిపించేవాడు. ఇంట్లోకి రాగానే చేతిరుమాలు జాగ్రత్తగా మడిచి వంటింట్లో చిన్నబల్లపై పెట్టేవాడు. ఈ రాజులు, రాణులు, మేజర్ జనరళ్లు, వారి వందిమాగధుల్లో ఎవరికైనా సాధారణమైన నూలు రుమాలు ఖరీదెంతో తెలిసే అవకాశం ఉందా? అటువంటి రుమాలును ఎంత భద్రంగా కాపాడుకోవాలో, భోజనం పూర్తయిన తరువాత దాన్ని జాగ్రత్తగా మడతలు పెట్టి ఎలా దాచుకోవాలని వాళ్లలో ఎవరికైనా తెలుసా? ఏ విలువలూ తెలియని, కేవలం ఆదర్శాలను వల్లించే గుంపు అది. రాజుల రోజువారీ జీవితం తాలూకు వివరాలను గమనిస్తున్న కొద్దీ నాలో చికాకు, విసుగూ పెరిగిపోయాయి. వారి అర్థంపర్థంలేని డాంబికం, దర్పం ఎవరికీ ఎందుకూ ఉపయోగపడేవి కావు. విలాసవంతమైన వారి ఆహార అలవాట్లు, ఖరీదైన చాకులు, ఫోర్కులు, ధగధగలాడే గ్లాసులూ, పింగాణి సామగ్రీ ఇవన్నీ కూడా మనుషుల సహజ స్వభావాన్నే హేళన చేస్తున్నట్టు అనిపించేది. ఇటువంటి నిస్సారమైన, సంతృప్త జీవితం గడిపేవారు చివరికి బడుద్ధాయిలుగా, పశువులుగా మిగిలిపోరా అనిపించేది. అయినా ఇటువంటివారు ఎంతకాలం బతుకుతారు అని అనుకొనేవాడిని. కానీ వాళ్లు బతుకుతారు. వందల సంవత్సరాలనుంచీ బతుకుతున్నారు. ప్రతిరోజూ వారు మరొకరు సాధించిన విజయాల గురించి ఈర్ష్యగా మాట్లాడుకునేవారు. ఎవరి కష్టాల గురించో చర్చించి ఆనందపడేవారు. పెళ్లిళ్లు, అవార్డులు, బిరుదులు, తీరని కోరికలు, ఎదురయే నిరాశ, ఎస్టేట్ల అమ్మకాలు, కొనుగోళ్లు వారి ప్రధాన చర్చనీయాంశా లుగా ఉండేవి.

నా విద్యార్థి నిజంగానే కొంత మందబుద్ధి, అయితే అతని అక్కలు, అమ్మగారు కూడా మానసికంగా, మేధోపరంగా వెనకపడినవారుగానే కనిపించేవారు. రెండు రెళ్లు నాలుగు అని తెలుసుకోవలసిన అవసరం కూడా వారికి ఉండేదికాదు. ఎంతసేపు సంపద, బిరుదులు, భర్తలకు చక్రవర్తిగారి ఆస్థానంలో ఉండే పలుకుబడే వారికి ప్రధానం. రోజువారీ జీవనంలో పాటించవలసిన కనీస నైతికవిలువలు, సౌందర్య స్పృహ వంటివి వారికి గతజన్మ స్మృతులు.

అయితేవారికి ఏ ఆందోళన లేదనుకొంటే పొరపాటు. ఎంతసేపు మరింత ఆస్తి సంపాదించాలనే ఆబ, దాని గురించే నిరంతర అన్వేషణ వారి జీవితాల్లో ప్రధాన భాగంగా ఉండేవి. ఇప్పటికీ తమకు అపారంగా ఆస్తులున్నాయన్న సంగతి వారికి తట్టేదేకాదు. ఎవరో ఒక వంతెన కట్టి కాంట్రాక్టు సంపాదించినా, మరెవరో ఒక ఫ్యాక్టరీ ఏర్పాటు చేసినా, ఇంకెవరో తన వాటాలపై

లాభం చేసుకున్నా వీరికి బెంగ కలిగేది. బాధ అనిపించేది. దొరికిన అవకాశాలను చూసినా, ఎదురవ్వని ప్రమాదాలను ఊహించుకున్నా వారికి భయం కలిగేది. దేనిపై ఒక నిర్ణయం తీసు కోలేకపోవడం, ఎప్పుడూ ఆందోళనతో గడపడం వారి తత్వం. తాము చేయలేక పోతున్న పనుల గురించి, తీరని కోరికల గురించి నిరంతరం మధనపడేవారు. పారిస్‌లో ఉన్న తన సోదరునికి ఒక ఉత్తరం రాయలేకపోతున్నానని రాకుమారుని భార్య దిగులుపడేది. ఇది ఆరునెలలనుంచీ వేధిస్తున్న తీవ్ర సమస్య! క్రితం సంవత్సరమే తనకు ఒక పడవ కొని ఇస్తానన్న నాన్నగారు ఇంకా ఆ పని చేయలేదని ఈ పిల్లవాడి దుగ్ధ.

★ ★ ★

ఇంటికి తిరిగివచ్చిన తరువాత, కష్టాన్ని నమ్ముకుని బతికే నా కుటుంబంతో గడుపుతున్నప్పుడు ఆ రెండునెలలూ నేనెంతటి పనికిమాలిన మనుషుల మధ్య ఉన్నానో బాగా తెలిసివచ్చింది. నా ఈ సొంత ప్రపంచం వారికంటే అన్ని విధాలా సంపన్నమైనదని, సజీవ వర్ణాలతో మెరిసే దృశ్యమనీ అర్థమైంది. నా వాళ్లు మానవ సంస్కృతి సృష్టికర్తలు. వీళ్లెవరు? కార్మికులు, టీచర్లు, వైద్యులు, ఇంజనీర్లు, విద్యార్థులూను. ఇక్కడ వ్యక్తులు, వారి సొంత వ్యక్తిత్వాలూ స్పష్టంగా తెలుసుకోగలం. వారికి కొన్ని విశ్వాసాలు, కొన్ని లక్ష్యాలు ఉన్నాయి. వాటిని సాధించాలన్న తపన, ప్రయత్నం ఉన్నాయి. అందుకు పోరాడగల సత్తా ఉంది. మా నాన్నగారి స్నేహితులు ఆయనలానే అనుభవజ్ఞులు. ఆ రాజులు, వారి వందిమాగధులకంటే తెలివైనవారు. సంపూర్ణమైన మానవులు. మా నాన్న చిరకాల మిత్రుడు కుద్యకోవ్ రంగులువేసే పనివాడు. ఆయన ప్రతి ఆదివారం మా ఇంటికి వచ్చి మా ఎదురుగా కూర్చునేవాడు.

కులీనుల గురించి ఈసడింపుగా మాట్లాడేవాడాయన. "నాకు వారి సాహచర్యం వద్దే వద్దు. వారితో కలిసి ఒక గ్లాసు ఓడ్కా అయినా తాగను. నేను ఇక్కడికి వస్తున్నానంటే మీతో అదీ ఇదీ మాట్లాడవచ్చనే. ఈ రాజులూ, చక్రవర్తులూ లేకుండా ఎవరైనా బతకగలరు. కానీ ఒక పెయింటర్ లేకుండా ఎవరైనా ఉండగలరా?" అనేవాడు.

తరువాత కొంత పెద్దవాడినై, తెలివితేటలు వచ్చిన తరువాత కులీన రాజవంశస్థులకు, మా కుటుంబాల్లోని కొందరికీ మధ్య కొంత పోలిక ఉన్నట్టు నాకు అర్థమైంది. కుద్యకోవ్ తన కుమార్తెకు పెళ్లి చేసిన తీరులో అది స్పష్టంగా కనిపించింది. ఆమె చక్కటి, ఆకర్షణీయమైన యువతి. ఒక యువ మెకానిక్‌ను ప్రేమించింది. అతన్నే పెళ్లాడాలని భావించింది. కానీ ఆమె తండ్రి ఆ ఆలోచనను సహించలేకపోయాడు. "ఏమిటి? వాడెవడు? ఓ చిన్న మెకానిక్. అంతేగా? జీవితాంతం కష్టపడినా, తలనెరిసే నాటికి మహా అయితే రోజుకు ఓ రూబులున్నర సంపాదించ గలడు. వద్దు ఆ ఆలోచన మానుకో" అని కఠినంగా శాసించాడు.

ఆమె బతిమాలింది. ఏడిచింది. కానీ కుద్యకోవ్ మనసు కరగలేదు. "ఇటువంటి ఏడ్పులు మాను. నాకు నువ్వు ఒకే కూతురివి. కొంచెం హాయిగా బతకాలని కోరుకుంటున్నాను. అంతేగా. ఇప్పుడు నువ్వు మనకంటే తక్కువ స్థాయివాడిని పెళ్లాడతానంటున్నావు. బుద్ధిమాలినపని" అన్నాడు. చివరికామె ప్రేమని మరిచి, తండ్రి ఎంపికచేసిన ఇంజన్ డ్రైవర్‌ని పెళ్లాడింది.

ఆ సమయంలో ఒక ఆదివారం కుద్యకోవ్ మా ఇంటికి వచ్చినపుడు ఈ వృత్తాంతం అంతా చెప్పాడు. తన కుమార్తె బుద్ధిలేని ఆలోచన గురించి వివరించాడు. "ఎవడో మెకానిక్ అట.

ఏముంది వాడిలో వాడి అందమైన గడ్డం చూసి ముచ్చటపడుతోందేమో. మరి నేను చూసినవాడు ఇంజన్ డ్రైవర్‌కు సహాయకుడు. రెండేళ్లలో డ్రైవర్‌గా ఎదుగుతాడు. ఇంత కష్టపడి ఇన్నేళ్లూ దాన్ని పెంచినది చివరికి వీధినపోయేవాడికి కట్టబెట్టేందుకా?" అన్నాడు.

మా ఈ చిన్న ప్రపంచంలో పెయింటర్ కంటే ఇంజన్ డ్రైవర్ హోదా, స్థాయి ఎక్కువ. నాకు ఏడేళ్ళ వయసప్పుడు ఇంజన్ డ్రైవర్‌లను అబ్బురంగా చూసేవాడిని. నా దృష్టిలో వారు కులీనులు. నా తండ్రి మాత్రం కుద్యకోవ్‌తో విభేదించాడు. ఉన్నతవర్గాలపై తన అసమ్మతిని దాచలేదు.

"ఎవరు, ఎవరి వెంటపడుతున్నారు? నీ తరహా నాకు నచ్చలేదు. ఎప్పుడూ నువ్వు నీకంటే పై వర్గాలవారితో పూసుకు తిరుగుదామని తహతహలాడతావు" అని చికాకుపడ్డాడు.

"ఏమిటీ నేనా?" అని నిర్ఘాంతపోయాడు కుద్యకోవ్.

"కాదా మరి?" అని నాన్న రెట్టించాడు. "గత ఆదివారం నువ్వు ఎవరితో కలిసి చేపలవేటకు వెళ్లావు. ఆ బానపొట్ట..... రైల్వే ఇన్‌స్పెక్టర్‌తో కదూ? అప్పుడు నీ భార్య ఆ నోవక్‌ల ఇంటికి వెళ్లి పొద్దు గడపలేదా?" అని రెట్టించాడు.

"అదేంలేదు. ఉన్నత వర్గాలతో సన్నిహితంగా ఉండాలనే సరదా నాకేం లేదు. ఇక చేపలు పట్టడం అంటావా? నాకది సంతోషం కలిగించే అలవాటు" అని కుద్యకోవ్ సంజాయిషీ ఇచ్చాడు.

నిజమే. నాన్న విమర్శలో నిజం ఉంది. కుద్యకోవ్‌కు కులీనులతో గడపాలనే కోరిక బలంగా ఉంది. రైల్వే ఇన్‌స్పెక్టర్ సంపన్నుడు. నోవక్ అనే ఆయన సీనియర్ కండక్టర్. ఇంజన్ డ్రైవర్‌కంటే పెద్ద ఉద్యోగి. మా కాలనీలో నోవక్ సమస్థాయిగలవారు ఒక్కరైనా లేరు. నోవక్ స్వతహాగా ధనికుడు. కాలనీకి దూరంగా విశాలమైన ఆవరణలో చుట్టూ ఎత్తయిన కంచెవేసిన ప్రహరీ మధ్య వాళ్ల ఇల్లు ఉండేది. అది రెండతస్తుల మేడ. కింది భాగంలో కిరాణా దుకాణం ఉండేది. అదికూడా నోవక్‌లకు చెందిన దుకాణమే. మేం పిల్లలం ఈ దుకాణం వరకూ వెళ్లేవాళ్లం. ఇంట్లో ఏదైనా సరకు తేవలసివస్తే మేం వెళ్లేవాళ్లం. మేడపై భాగంలో నోవక్‌ల ఇంటి కిటికీలు, ద్వారాలకు కట్టిన లేసు పరదాలు కనిపించేవి.

సీనియర్ కండక్టర్ నోవక్ వారానికి రెండుసార్లు తన సొంత గుర్రం బండిలో మా ఇళ్లముందు నుంచి ఠీవిగా ఉద్యోగానికి వెళ్లేవాడు. బాగా పాలిష్ చేసిన బూట్లు, పక్కనే ఖరీదైన చేతిసంచీ ఉండేవి. టిక్కెట్‌లేని ప్రయాణికులనుంచి వసూలు చేసిన డబ్బంతా ఆ సంచిలో వేసుకుని వస్తాడని మేం అనుకునేవాళ్లం.

నోవక్‌గారి పిల్లలు ఎప్పుడూ పరిశుభ్రమైన దుస్తుల్లో, చక్కగా తలలు దువ్వుకుని కనిపించేవారు. వారి స్కూలు దుస్తులు కొత్తగా మెరిసిపోతుండేవి. భుజాలకు బ్యాడ్జీలు ధరించి, రోజూ మా వీధుల్లోంచే వాళ్లు బడికి వెళ్లేవాళ్లు. వారితోపాటే మిగిలిన సంపన్నుల పిల్లలు ఉండేవారు. పోలీసుల పిల్లలు, మతాధికారి కూతుళ్లు, ప్రధాన ఎకౌంటెంట్‌గారి అబ్బాయిలూ అంతా కలిసి నడిచేవారు.

ఈ ధనికుల వ్యవహారాలన్నీ ఎంత గుంభనంగా, గోప్యంగా ఉన్నా మా కుటుంబాలు క్రమంగా వారిని అనుకరించే ప్రయత్నాలు ప్రారంభించాయి. వారి సంస్కారాన్ని, వారి ప్రమాణాలనూ పాటించాలని, ఆ స్థాయికి ఎదగాలనీ మా కార్మికవాడలో కొందరైనా కలలు

కనేవారు. ఆ కులీనులనుంచీ కుద్యకోవ్ వంటి సాధారణ పెయింటర్ ఇంటివరకూ ఉన్న అదృశ్య నిచ్చెనద్వారా ఉన్నత వర్గాల సంస్కృతి, వారి ధనాపేక్ష, దురాశ మా కార్మికవాడకూ చేరాయి. నిజానికి కార్మిక వర్గం ప్రజలకు మిగిలినవారికంటె భిన్నమైన నైతిక నియమావళి ఉంది. కానీ అనుకరణల వల్ల ఈ విలక్షణ వ్యక్తిత్వాన్ని కోల్పోతున్నవారూ మా మధ్య ఉన్నారు. ఒక రాకుమార్తెకు పొడవాటి ముక్కుతో పాటు, ఆస్తి, నగలు వారసత్వంగా సంక్రమించి ఉండచ్చు. మా వాడలోని ఒక పెయింటర్ కుమార్తెకు కుట్టుమిషను, ఇత్తడి కమ్మీలు బిగించిన మంచం, ఒక గ్రామ్‌ఫోన్ గురించిన కలలూ వారసత్వంగా సంక్రమించాయి. క్రమంగా అన్నివర్గాలకూ సంపద కూడగట్టు కోవడం ఒక అలవాటుగా, జీవనశైలిగా మారుతుందని పించేది. సంపాదన మార్గాలు, ఫలితాలు భిన్నంగా ఉండవచ్చు. నోవక్‌గారు టిక్కెట్‌లేని ప్రయాణికుల నుంచి డబ్బు వసూలు చేస్తారు. రైల్వే ఇన్‌స్పెక్టర్ అక్షరజ్ఞానంలేని కార్మికుల జీతభత్యాలనుంచీ కొంత కాజేయవచ్చు. కుద్యకోవ్ వంటివారు ఉద్యోగం మాత్రమేకాక, అదనంగా శ్రమించి డబ్బు పోగుచేస్తారు. ఇదంతా దేనికని అడిగితే పిల్లల చదువులు, కట్నాలు, వృద్ధాప్యంలో హాయిగా బతకడం వంటి అవసరాలు ఎలాగూ ఉంటాయి. అందుకే ఎవరికివారు తాము ఉన్న స్థాయినుంచి పైకి ఎదగాలని తాపత్రయపడతారు. కుద్యకోవ్ తప్పేమీ లేదేమో.

ఆర్థికంగా పైస్థాయికి ఎదగడానికి పెళ్లి కూడా ఒక మార్గం కావడంలో వింత లేదు. ఉన్నత వర్గాల్లో పెళ్లిళ్లు అయితే పూర్తిగా ఈ దృష్టితోనే కుదిర్చినవి. కనీసం వధూవరులు ఒకరినొకరు చూసుకోకుండా వివాహానికి సిద్ధపడిన సందర్భాలు కూడా నాకు తెలుసు. ఇంక మా కార్మిక వర్గాల్లో ఆడ-మగపిల్లలు కలసి తిరగడం, స్నేహం చేసుకోవడం మిగిలే ఉన్నాయి. కానీ పెళ్లి దగ్గరకి వచ్చేసరికి ఈ స్నేహం, ప్రేమ వంటి లెక్కలకు స్థానం ఉండదు. కట్నం, ఎదుటివారి ఆస్తిపాస్తులు పెళ్లిళ్లను నిర్ణయించేస్తున్నాయి. కాస్త మూడు నాలుగు వందల రూబుళ్లు కట్నం కోసం జాగ్రత్తచేస్తే అది కూతురి మంచి భవిష్యత్తుకి దారివేయగలదన్న ఆశ తల్లితండ్రులది. ఈ విషయాలన్నీ నిర్ణయించే అధికారం తండ్రులదే. కాబట్టి కుద్యకోవ్ కూతురికి తను అనుకున్న కుర్రవాడిని కట్టబెట్టగలిగాడు.

తల్లితండ్రులకు పిల్లలపై కొంత నియంత్రణ, అధికారం ఉండాలనే నా ఉద్దేశం. ఒకలా చెప్పాలంటే ఆ అధికారం సమాజమే వారికి కట్టబెడుతుంది. పిల్లలను ప్రేమతో, జాగ్రత్తగా క్రమశిక్షణ కలిగినవారిగా తీర్చిదిద్దే బాధ్యత వారిపై ఉన్నప్పుడు దానిని సక్రమంగా నిర్వర్తించేం దుకు కొంత అధికారం ఉండి తీరాల్సిందే. ఈ ప్రేమాభిమానాలు, పిల్లవాడిని తీర్చిదిద్దేందుకు అవసరమైన అధికారం లేకపోతే గాలికి పెరిగే పిల్లలు సమాజానికి ఎప్పుడూ భారమే అవుతారు. ఎందుకంటే తల్లితండ్రుల ప్రేమ, వారి నియంత్రణ కరువైన పిల్లలు సాధారణంగా అస్తవ్యస్తంగానే ఎదుగుతారు. పిల్లలతో తల్లితండ్రులు అంటిముట్టనట్టు ఉంటే పిల్లలు ఎలా తయారవుతారో నేను స్వయంగా చూశాను.



ఒకసారి పన్నెండేళ్ల కుర్రవాడు ఒకడు నా దగ్గరికొచ్చాడు. ఇంకా చిన్నవాడేమో కూడా. వాడు నా ఎదురుగా కూర్చుని ఏదో చెప్పబోయాడు. కానీ ఉద్వేగం వాడికి మాట రానివ్వలేదు. వాడి తల పూర్తిగా క్షవరం చేసి ఉంది. గుండు తళతళ మెరుస్తోంది. పెద్ద కళ్లల్లో నీళ్లు నిండి ఉన్నాయి.

అయితే వాడి హావభావాల్లో ఏదో కృత్రిమత్వం ఉంది. తను చూసిన సినిమాల్లో ఏదో పాత్రను అనుకరించాలని వాడు ప్రయత్నిస్తున్నట్టు అనుమానం కలిగింది. లేకపోతే అంత చిన్నపిల్లవాడి నుదురు ఎంతో గంభీరంగా ఉన్నట్టు ముడతలు పడడం, ఒక కనుబొమ్మ ఏదో ఆలోచిస్తున్నట్టు పైకి లేవడం సాధారణంగా మనం చూడం. వాడు ఎవరో ముసలిపాత్రను అనుకరిస్తున్నట్టు ధృవీకరించుకొన్నాను.

"ఊఁ చెప్పు. ఏంటి విషయం? ఏం కావాలి? నీ పేరేమిటి?" అని అడిగాను ఆ మొహాన్ని శ్రద్ధగా పరిశీలిస్తూ.

వాడు ఒకసారి నిట్టూర్చాడు(!). బల్లపైకి చెయ్యిచాపి, ఎంతో భారంగా తల తిప్పాడు. తెచ్చి పెట్టుకొన్న వణుకు వాడి గొంతులో వినిపించింది.

"కోల్య. నా పేరు కోల్య. చెప్పేందుకు ఏముంది? నాకు ఉండేందుకు స్థలం లేదు. తినడానికి తిండి లేదు."

"నాన్నలేడా?"

వాడు ప్రయత్నంమీద కళ్లల్లోంచి నీళ్లు పిండాడు. నిశ్శబ్దంగా తల అడ్డంగా ఊపాడు.

"అమ్మ"? అడిగాను.

వాడు తన రెండు చేతులూ మోకాళ్ల మధ్య ఇరికించుకొని, కళ్లు పైకెత్తి, కిటికీలోంచి బయటికి చూశాడు. (గంభీరంగా, విషాదంగా కనిపించడానికి నానా తంటాలు పడుతున్నాడు.)

"అమ్మ... హుఁ... ఉండి ఉపయోగం ఏమిటి? ఆవిడ రైల్వే సామన్ల గదిలోనో, క్లబ్‌లోనో పనిచేసి సంపాదిస్తుంటే నన్నేం చూడగలదు?"

"అలాగా. నన్నేం చెయ్యమంటావ్?"

నా వంక తిరిగి, భుజాలు ఎగరేశాడు.

"ఏదో ఒకటి చేయాలి. నన్ను అనాధపిల్లల కాలనీకి పంపండి".

"కాలనీకా? లాభం లేదు. అది అనాధలకే. నీకు అర్హత లేదు. పైగా అక్కడ బతుకు మరీ కష్టంగా ఉంటుంది" వివరించాను.

వాడు నిరాశగా తల పక్కకి వాల్చి "అలా అయితే నేనెలా బతకాలి? ఏం తినాలి?" అని నన్ను ప్రశ్నించాడు.

"అంత దారిలేకపోయిందా? నువ్వు మీ అమ్మతోనే ఉంటున్నావుగా?" అడిగాను.

"ఐదు రూబుళ్ల ఆదాయంతో ఎవరైనా బతకగలరా? కొన్ని బట్టలైతే ఉండాలిగా?"

ఇక ఎదురుదాడి మొదలపెట్టక తప్పదని నిర్ణయించుకొన్నాను:

"సరే ముందీ విషయం చెప్పు. అసలు నువ్వు బడి ఎందుకు మానేశావు?"

హటాత్తుగా నేను ప్రారంభించిన దాడికి వాడు తట్టుకోలేడని, భోరున ఏడుస్తాడనీ అనుకొన్నాను. అలాగేం జరగలేదు. వాడు తలతిప్పి ఆశ్చర్యపోతున్నట్టు మొహం పెట్టాడు. "తిండానికే లేదంటున్నప్పుడు బడికి ఎలా పోగలను?" అని ఎదురు ప్రశ్న వేశాడు.

"అంటే ఇవాళ ఉదయం ఏమీ తినలేదా?" నిలదీశాను.

తన విషాద భంగిమలు, కంట నీరు నాలాంటి వాడి దగ్గర పని చెయ్యవని వాడు తెల్చుకున్నట్టు న్నాడు. కుర్చీలోంచి లేచి గంభీరంగా నా వంక చూశాడు.

"ఈ ప్రశ్నలన్నీ ఎందుకండీ? నాకు సాయం చేయడం ఇష్టం లేకపోతే సరే. నేను మరోచోటికి ఎక్కడికైనా వెళ్తాను" అన్నాడు.

"అలాగా? అలాంటి తత్వమంటావ్ నీది. అంటే నువ్వొక యోధుడివన్నమాట!" అన్నాను. "అవును" అన్నాడు నా వంక చూడకుండా కళ్లు దించి.

"కాదు నువ్వొక అబద్ధాలకోరువి, నీ అబద్ధాలని నమ్మను, తిండానికి తిండి కూడా లేదా" అసలు నువ్వు చచ్చిపోలేదని నీకు నమ్మకం ఉందా?" అన్నాను కోపంగా.

"సరే నమ్మకపోతే మీ ఇష్టం. నేను వెళ్తాను" అంటూ బయట తలుపువైపు కదిలాడు.

"ఆగు" అని గద్దించాను. "నువ్వు నా సమయాన్ని వృధా చేశావు. అబద్ధాలతో కాలం గడిపావు. పద వెళ్దాం" అన్నాను.

"వెళ్దామా? ఎక్కడికి?" అన్నాడు భయంగా నా వంక చూస్తూ.

"ఇంటికి పద మీ అమ్మగారితో మాట్లాడాలి."

"నేను ఎక్కడికి రాను. ఎందుకు రావాలి?"

"ఎందుకేమిటి? పిచ్చిగా మాట్లాడకు. నువ్వు ఇంటికి వెళ్తున్నావు. నాతో వస్తున్నావు"

"ఇంటికి వెళ్లాల్సిన అవసరం నాకు లేదు. మీరేం చేసినా పర్వాలేదు" అన్నాడు మొండిగా.

నాకు ఆగ్రహం ముంచుకొచ్చింది. "వాగుడు కట్టిపెట్టు. నీ ఇల్లెక్కడ? చెప్పనంటే సరే. నోరు మూసుకొని ఇక్కడ కూర్చో.

ఐదు నిమిషాల తరువాత వాడు తలవంచుకొని వినయంగా నా కారులో కూర్చుని ఇల్లు ఎక్కడో చెప్పాడు.

అదొక శుభ్రమైన చిన్నగది. తలుపులకు పరదాలు, బల్లపై కూజాలో తాజా పూలు, నేలపై తివాచీ, పక్కనే మంచం ఉన్నాయి. కోల్యా మౌనంగా నడుచుకుంటూ వెళ్లి మంచంపై కూలబడ్డాడు. తలవాల్చి ఏడుపు మొదలుపెట్టాడు. ఎవరిమీదో ఏదో ఫిర్యాదు చేస్తున్నట్టు అస్పష్టంగా గొణుగు తున్నాడు. వాళ్ల అమ్మకూడా వాడిలానే ఉంది. పెద్ద కళ్లు, నిండైన బుగ్గలూ, ఆరోగ్యంగా కనిపించింది. ఆమె వాడి చేతుల్లో టోపీ తీసుకుని గోడకి ఉన్న మేకుకి తగిలించి, నా వంక తిరిగి చిన్నగా నవ్వింది.

"మావాడేం అల్లరి చేశాడు? మీరే వాడిని తీసుకొచ్చారా?" అని అడిగిందామె. కోల్యా ఏడుపు, ఎక్కిళ్లు ఆపి అమ్మ వైపు తిరిగి "నన్నెవరూ ఇక్కడకు తీసుకురాలేదు. నేనే వచ్చాను. ఆయనే వస్తానని వెంట వచ్చారు." అంటూ నా వైపు చూశాడు. "మాట్లాడండి. నా గురించి మాట్లాడాలన్నారుగా" అన్నాడు సవాలు విసురుతున్నట్టు.

ఆమె మౌనంగా నా మాటలకోసం ఎదురు చూస్తోంది. నేనేం మాట్లాడకపోవడంతో ఆమే ప్రారంభించింది.

"వీడితో వేగడం ఎలాగో తెలియడం లేదు. ఇదివరకు బానే ఉండేవాడు. మధ్యలో మా అన్నయ్య దగ్గరకు పంపాను. తిరిగి వచ్చినప్పటినుంచీ ఇలా తయారయ్యాడు. వాడు చెప్పేది నిజం అనుకోకండి. అసలు వాడికేం కావాలో వాడికే తెలియదు. ప్రతిదీ కావాలి. ఇష్టం వచ్చినట్టు తిరుగుతాడు. బడి మానేశాడు. నాలుగో తరగతి చదివేవాడు. వాడికేం తక్కువో అడగండి. మంచి బట్టలు, కాళ్లకి బూట్లు, మంచం అన్నీ ఉన్నాయి. పసందైన విందు భోజనాలు

లేకపోవచ్చు. కానీ ఏనాడూ వాడు ఆకలితో తిరగలేదు. క్లబ్‌నుంచి వంటసామాను తెచ్చుకొంటాం. ఇక్కడే వంటంతా."

కోల్యా ఏడుపు పూర్తిగా ఆపేశాడు. అయితే దిండుపై నుంచి మాత్రం తల తియ్యలేదు. బహుశా ఏం మాట్లాడాలి అని ఆలోచిస్తున్నాడేమో.

ఆమె మాటలు నాకు ఆశ్చర్యం కలిగించాయి. ఆమె అపురూపమైన ఆశావాది అని తెలిసిపోతోంది. ఈ కోల్యతో ఎంత ఇబ్బంది పడుతోందో అర్థమవుతోంది. అయినా ఆమె దాన్ని పెద్ద సమస్యగా భావించి దిగులుపడడం లేదు. ఒకసారి ఊపిరితీసి మళ్లీ ప్రారంభించిదామె.

"ఇదివరకు మరీ అన్యాయంగా ఉండేది. తొంభై రూబుళ్ల జీతం. చూడండి. ఇప్పుడు నెలకు నూట ఇరవై రూబుళ్లు. పైగా ఉదయమంతా ఖాళీగా ఉంటాను. ఆ సమయంలో ఏదో ఒక పనిచేస్తూ నాలుగు డబ్బులు సంపాదిస్తాను. నేను చదువుకొంటున్నాను కూడా. మూడు నెలల్లో నన్ను గ్రంథాలయం గుమస్తాగా పంపుతారు. జీతం నూట ఎనభై రూబుళ్లు ఇస్తారు." ఆమె ధీమాగా నవ్వింది. ఆమె తీరులో అలసటకానీ, ఉద్వేగం కానీ లేవు. ఆశావాదానికి ప్రతీకలా ఉందామె. ఈ అత్యున్నత వ్యక్తిత్వంపై కోల్య జరుపుతున్న అర్థరహితమైన, అసంబద్ధమైన తిరుగుబాటును పోల్చి చూస్తే నాకు వాడిపై చికాకు పెరిగింది. నేనామె వంకే చూస్తూ తన మాటలు శ్రద్ధగా వింటున్నాను.

"వాడు కాస్సేపు అరుస్తాడు, ఏడుస్తాడు. కానివ్వండి ఏం చేయగలను? నా దగ్గర ఉండటం బాగా లేకపోతే నీకు నచ్చిన చోట ఉండు అన్నాను. బడి మానేస్తావా మానైమన్నాను. నీ ఇష్టం వచ్చినట్టు చేస్కో కానీ, నా దగ్గర మాత్రం సణగవద్దు అన్నాను. నీలాంటి బుర్ర తక్కువ పిల్లవాడు చెప్పే సోది వినే ఆసక్తి, తీరిక ఉన్నవాళ్లకి చెప్పుకో. మా అన్నయ్య ఇంట్లో నుండే వాడు పాడైనది. ప్రతిరోజూ ఏదో సినిమాకి పంపేవారు. వాళ్లకి ఉచితంలెండి. అలా నేనెక్కడ పంపగలను. అంత డబ్బేది? అందుకే హాయిగా కూర్చుని ఏదో పుస్తకం చదువుకొమ్మని చెబుతాను. వినడు. వాడిష్టం. ఈ మధ్య కొత్తగా కాలనీకి వెళ్తానని అల్లరి మొదలుపెట్టాడు. అక్కడ వాడి స్నేహితులున్నారట? ఏం చైగలను" అని నిట్టూర్చిందామె.

కోల్య లేచి కూర్చుని తల్లి నవ్వు మొహంవైపే అపేక్షగా, శ్రద్ధగా చూస్తున్నాడు. ఆమె అది గమనించి నవ్వుతో వాడిని మందలించింది.

"చూడండి ఎలా కూర్చున్నాడో, ఏం అమ్మ దగ్గర నీకు బాగాలేదేం. ఫో. నీతో మాట్లాడను. ఎక్కడికి పోతావో పో" అంది.

"ఎందుకలా మాట్లాడతావమ్మా. నేనేం చేశానని. మన సోవియట్‌ల పాలనలో నాకు ఏదైనా అడిగే హక్కు ఉంది." అని కోల్య సమాధానం చెప్పాడు.

"ఏమిటీ?" అందామె నిగ్గదీస్తున్నట్టు.

"అవును. ఏమైనా అడిగే హక్కుంది" అన్నాడు కోల్య టక్కరినవ్వుతో.

★ ★ ★

ఈ తల్లీకొడుకుల సంవాదం విని ఎవరిది తప్పో తేల్చే ప్రయత్నం చేయకండి. అన్ని వివరాలు, వాస్తవాలు తెలిస్తే తప్ప ఎవరూ తీర్పు చెప్పలేరు. నాకైతే వారిద్దరి ధోరణీ నచ్చింది. ఆశావాదులన్నా, మన ప్రభుత్వంపై "ఏమన్నా అడగవచ్చు" అన్న విశ్వాసం గల పిల్లలన్నా

నాకు అభిమానం కలుగుతుంది. ఇలాంటి పిల్లలు చాలా అవకతవకపనులు చేసి పెద్దలకు ఆందోళన కలిగిస్తారు. కానీ వాళ్లు ఎప్పుడూ ఆనందం కలిగిస్తారు కూడా. వాళ్ల డిమాండ్‌లకు అంతు ఉండదు. వచ్చి నా బోటి అధికారులను వేధిస్తారు.

"నన్ను కాలనీకి పంపండి"

"నన్ను ఫ్లయింగ్ స్కూల్‌కి పంపండి. పైలట్‌ని అవుతాను."

"నాకేదైనా పని ఇవ్వండి. పని చేస్తాను. చదువుకొంటాను. నిజం."

ఇలా ఉంటాయి వాళ్ల డిమాండ్‌లు.

తల్లీకొడుకులిద్దరి వైఖరి నన్ను ఆకర్షించినప్పటికీ ఇద్దరిలోనూ లోపాలు కనిపించాయి. కోల్యకు తన తల్లి ఆశలు, ఆకాంక్షలు, బతుకుకోసం సాగిస్తున్న పోరాటంతో నిమిత్తం లేదు. తప్పెవరిదై ఉండాలి? సినిమాలు చూపించాడంటున్న ఆ మేనమామది కాదు. ఆయనవద్ద కొంత కాలం ఉండడం వల్ల కోల్య భ్రమలు కొంత పెరిగాయంతే. విమానాలు నడిపే శిక్షణ పొందడం, సినిమాలు చూడడం, రుచికరమైన భోజనం తినడం తప్పుకాదు. పిల్లలంతా ఇలాంటి వాటికోసం తహతహలాడతారు. అలా అని ఎవరికివారు పెంచుకొనే కోరికలన్నింటినీ వారి అవసరాలుగా మనం పరిగణించనవసరం లేదు. ఇలా అందరికీ బుర్రలో పుట్టిన ఆశలన్నీ తీరుస్తూపోతే రేపు భవిష్యత్తులో ఈ పిల్లలు వాస్తవాలతో రాజీ పడలేరు.

కోల్యను కలిసిన తొలి క్షణాల్లో వాడు తన సమయంకంటే ముందు ఉన్నాడని, మెల్లగా సాగే కుటుంబ రథంలో ప్రయాణం వాడికి విసుగు కలిగిస్తోందని పొరపాటు ఉద్దేశం ఎవరికైనా కలగవచ్చు. అలా పొరబడి వాడి కోరికను తీరిస్తే నష్టం ఏమిటి? అని అనుకోవచ్చు. ఇలాంటివి జరగడం నాకు తెలుసు. కోల్యలాంటి కుర్రవాళ్లు చిన్న చిన్న నియంతలు. వాళ్లు ముందు తల్లితండ్రులను తికమక పెడతారు. తర్వాత నా బోటి అధికారులను డిమాండ్‌లతో ఉక్కిరిబిక్కిరి చేస్తారు. తలచింది సాధించడం కోసం ఏ మార్గమైనా తొక్కుతారు. ఫిర్యాదులు, కన్నీళ్లు, దొంగవేషాలకు సైతం సిద్ధపడతారు. దీనికి ప్రధాన కారణం పిల్లలకు సరైన నైతిక దృక్పథం కొరవడటం. సమిష్టి జీవంతో సంబంధం లేకపోవడం కూడా మరో కారణం. పిల్లల చిన్నతనంలో కుటుంబ జీవనంలో సమైక్యత లేకపోవడం, నిర్దిష్టమైన అలవాట్లు, క్రమబద్ధమైన జీవితం, అందరితో కలిసిమెలిసి ఉంటూ ఇచ్చిపుచ్చుకొనే ధోరణికి అలవాటు పడకపోవడం వల్ల పిల్లల్లో నైతిక శూన్యం ఏర్పడుతుంది. ఫలితంగా పిల్లల ఊహాజనితమైన అవసరాలు పెరిగిపోతాయి. వాటికి నిజ అవసరాలకీ ఎటువంటి సంబంధం ఉండదు. అందరితో కలిసిమెలిసి సంఘజీవనం సాగించినప్పుడు ఏర్పడ్డ అవసరాలకు ఎంతో కొంత విలువ ఉంటుంది. ఈ అవసరాలు పన్నెండేళ్ల వయసులోనే బలమైన ఆకాంక్షలుగా మారకపోవచ్చు.

అందుకే పిల్లలకు అతి చిన్న వయసునుంచే నలుగురిలో కలిసిమెలసి బతకడం నేర్చుకోవడం అలవాటు చెయ్యాలి. కోల్యకు ఇలాంటి అనుభవం లేదు. వాడికి అమ్మ తప్ప వేరే లోకం తెలియదు. ఆమె ఎంత మంచి వ్యక్తి అయినా, ఆ ఒక్కరితో సాన్నిహిత్యం పెంచుకొన్నంత మాత్రాన పిల్లవాడి అన్ని మానసిక అవసరాలు తీరినట్టుకాదు. పైగా అన్నీ పిల్లవాడి ఇష్టానికే వదిలే ఆమె తత్వం వాడిని మరింత పాడు చేస్తుంది.

★ ★ ★

అల్యోష వయసు పధ్నాలుగు, వాడి బుగ్గలు ఎర్రబారి ఉన్నాయి.

వాడు తన అమ్మను నిలదీస్తున్నాడు. "ఏంటీ, రైల్లో ఫస్ట్‌క్లాస్ టికెట్ తీశారు. అలా అయితే నేను వెళ్లను గాక వెళ్లను."

వాడి అమ్మ వాడి వంక ఆశ్చర్యంగా చూసింది.

"ఎందుకు వెళ్లవు?" అడిగిందామె.

"మీరైతే హాయిగా డీలక్స్ క్లాసులో వెళ్తారా? నాకేమో చెత్త ఫస్ట్‌క్లాస్ టికెట్ తీస్తారా?" అన్నాడు అల్యోష కోపంగా.

"క్రితం ఏడాది మేం వెళ్లినప్పుడు మన దగ్గర కాస్త డబ్బులున్నాయి...." వివరించబోయిందామె.

"దీనికీ, డబ్బుకీ సంబంధం ఏమిటి? డబ్బుట... డబ్బు... హుం... నాకు తెలుసు కారణం. నేను వెళ్తున్నాను కాబట్టి, నా మొహానికి ఫస్ట్‌క్లాస్ అయితే చాలనుకొని ఉంటారు" అని సాధించాడు.

తల్లికి కోపం వచ్చేసింది. "నీ యిష్టం వచ్చినట్టు అనుకో. మాకేం బాధలేదు. నచ్చకపోతే అసలు వెళ్లకు. సరేనా" అందామె తీవ్రంగా.

"ఆఁ. అదీ సంగతి. నేను వెళ్లక్కర్లేదా. ప్రయాణం లేకపోతేనే నీకు సంతోషం. అలా అయితే టిక్కెట్ వెనక్కి ఇచ్చేయచ్చు. మళ్లీ అమ్మేయవచ్చు. ఇదంతా డబ్బుల కక్కుర్తే కాదా?"

వీడికి సమాధానం చెప్పడం కూడా దండగ అని తేల్చుకున్న తల్లి, విసుగ్గా భుజాలు ఎగరేసి అక్కడినుంచి బయటికి నడిచింది. వాడి అనుమానాలు తీర్చడానికి ఆమెకు కొంత వ్యవధి కావాలేమో. కానీ అల్యోష అక్క నాద్య మొండిఘటం. ఆమె విషయాలను తేలికగా తీసుకోదు. దేన్నీ వాయిదా వేయదు. ఆమెకు అంతర్యుద్ధం నాటి రోజులు ఇంకా గుర్తున్నాయి. ఇల్లు వదిలి పారిపోతున్నప్పుడు తమని ఇతర ప్రాంతాలకు చేరవేసిన గూడ్సురైలు కూతలు ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. రేపటిపై ఆశలేకున్నా అంతిమ విజయంపై విశ్వాసంతో పళ్ల బిగువున సాగించిన పోరాటాన్ని ఆమె మరిచిపోలేదు.

నాద్య తన తమ్ముడివంక పెదాలు కొరుక్కుంటూ సాలోచనగా చూసింది. ఆమె వైఖరి చూడగానే అల్యోషకు బెదురు పుట్టింది. మరో క్షణంలో అక్క తనపై విరుచుకుపడబోతోందని వాడికి అర్థమై పోయింది. వాడు నెమ్మదిగా లేచి అక్కని పట్టించుకోనట్టు, తాను ప్రశాంతంగా ఉన్నానని రుజువు చేసేందుకు ఏదో కూనిరాగం తీస్తూ పచార్లు ప్రారంభించాడు. ఈ వేషాలేవీ నాద్య దగ్గర సాగలేదు.

ఆమె తమ్ముడి వంక కోపంగా చూస్తూ "ఏరా నాన్నా, డీలక్స్ క్లాసులోనే ప్రయాణించడం బాగా అలవాటు అయిపోయిందా? ఫస్ట్‌క్లాసులో వెళ్లలేవుకదూ?" అంది పళ్ల బిగువున.

అల్యోష చుట్టూచూస్తూ తప్పించుకోడానికి ఏదో సమాధానం చెప్పడంకోసం తడుముకొన్నాడు.

"డీలక్స్ తరగతి అలవాటు అయిపోయిందని నేను అన్నానా? అదెలా ఉంటుందో చూద్దామని అడిగానంతే. ఏం అలాంటి ఆసక్తి ఉండడం పాపమా?" అని ప్రశ్నించాడు.

"ఫస్ట్‌క్లాస్ సంగతి అలా ఉంచు. అదే మూడో తరగతి రైలు పెట్టెలో అయితే అసలు కూర్చోలేవు కదూ?" అని నిలదీసిందామె.

"అవును. నేనసలు... అయినా నీకెందుకు?" అంటూ ఎదురు తిరిగాడు వాడు.

"నాకెందుకా? నాకే కావాలి. అసలు సెలవులు ఇవ్వగానే సముద్రతీర విహారాలకు వెళ్తాననే హక్కు నీకు లేదు. నువ్వు శుభ్రంగా ఆరోగ్యంగా ఉన్నావు. సెలవుల్లో ఇష్టం వచ్చిన చోటికి వెళ్లేందుకు నువ్వేమీ ఘనకార్యాలు చేయలేదు. అర్థమైందా? ఏమీ చేయలేదు. నీలాంటి వాళ్ల గొంతెమ్మ కోరికలను ఎవరైనా ఎందుకు తీర్చాలి? నెత్తికి ఎందుకు ఎక్కించుకోవాలి? చెప్పు. తిన్నగా సమాధానం చెప్పు?" అందామె విసురుగా.

"అలా చెప్పు. అదా నీ ఉద్దేశం? అంటే నాకు సెలవుల్లో సరదాగా తిరిగొచ్చే హక్కు లేదు. సరే. రాత్రి భోజనం చేసే అర్హత అయినా ఉందా?..." అంటూ అక్కని వేళాకోళం చేయబోయి తటాలున ఏదో స్ఫురించినట్టు ఆగిపోయాడు.

ఇప్పటికే తను చాలా దూరం వెళ్లినట్టు వాడు గుర్తించాడు. అక్కతో దెబ్బలాడితే అదెలా ముగుస్తుందో చెప్పలేం. అది అసాధ్యురాలు. అది తలుచుకుంటే మొత్తం ప్రయాణమే రద్దు అయినా కావచ్చు అన్న భయం వాడికి కలిగింది. సముద్రతీరానికి కాదు కదా, చివరికి ఊళ్లో ఆడుకోడానికి బయటికి పోయేందుకు కూడా దారులు మూసుకుపోవచ్చు. ఏం చెప్పగలం అనుకుంటూ గుర్రాన్ని కాస్త కట్టేయాలని నిర్ణయించాడు అల్యోష.

"సరేనమ్మా నీ యిష్టం. నీ యిష్టం అంటున్నాగా. గూడ్సు రైల్లో వెళ్లమన్న వెళ్తాను. సరేనా" అంటూ నవ్వుతూ అక్క కోపాన్ని తగ్గించే ప్రయత్నం చేస్తూ అస్త్రసన్యాసం చేశాడు.

★ ★ ★

డీలక్స్ కోచ్‌లోనే ప్రయాణించాలన్న ఊహ వాడి బుర్రలో పుట్టినది మాత్రం కాదు. అనుభవంతో పాటు ఎదిగిన కోరిక అది. అయితే ఆ వయసులో అలాంటి కోరికలు ఉండడం సరికాదని అందరికీ తెలుసు. వాడి అమ్మగారికీ తెలుసు. కానీ వాడి ధోరణిని ఎలా మార్చాలో ఆమెకు అర్థం కాలేదంతే.

మన అందరి అనుభవాలు మొత్తం సమాజం అనుభవం కానవసరం లేదు. మన కుటుంబం దేనికదే ఒక ద్వీపం కాదు. అది సమాజంలో అంతర్భాగం. సమాజం చేసే నైతిక డిమాండ్‌లకు అతీతంగా కుటుంబ సభ్యులు తమ సొంత అనుభవాలతోనే జీవితాన్ని నిర్మించదలిస్తే అది ప్రమాద కరమైన ధోరణులకు దారితీస్తుంది.

ఇక్కడ తల్లితండ్రుల అవసరాలే అల్యోష అవసరాలుగా మారాయి. అల్యోష తండ్రి డీలక్స్‌క్లాస్‌లో ప్రయాణించాడంటే దాని కోసం ఆయన శ్రమించాడు. ఒక హక్కుగా ఆ అనుభవాన్ని సొంతం చేసుకొన్నాడు. అల్యోష విషయంలో అలాంటిదేమీ లేదు. తండ్రి ఉదారస్వభావాన్ని వాడు తన విలాసాలకు వాడుకోదలిచాడు. ఆయన ఉదారత మూలంగా విలాసం వాడికి అవసరంగా మారింది.

ఇటువంటి కుటుంబాల్లో పిల్లలు అడ్డదిడ్డమైన డిమాండ్‌లతో సంతృప్తికి ప్రయత్నిస్తారు. ఆ పిల్లల విషాదకరమైన భవిష్యత్తు అందరికీ అర్థమవుతూనే ఉంటుంది. వాళ్లు పెద్దయిన తరువాత, స్వతంత్రంగా బతకడం మొదలుపెట్టాక అంతవరకూ తండ్రి సమకూర్చిన సౌఖ్యాలు అందుబాటులో ఉండవు. అంటే వారు తమ అవసరాలను తగ్గించుకోవాలి. మళ్లీ కింది స్థాయి

నుంచి జీవిత సౌఖ్యాలను అమర్చుకుంటూ ఎదగవలసి వస్తుంది. లేదా పిన్నవయసులోనే విలాసవంతమైన అలవాట్లు చేసుకొనేందుకు వీలుగా కష్టపడి సంపాదించి, హోదాను పెంచుకో వలసి ఉంటుంది. ఇది ఎవరికో కానీ సాధ్యమయే వ్యవహారం కాదు.

ఈ సమస్యని నా సహ అధ్యాపకులతో, కొందరు కమ్యూనిస్టు పార్టీ సహచరులతో ప్రస్తావించాను. వారికి నా భావన ఎంతవరకూ బోధపడిందో ఏమో కానీ చాలామంది నన్ను పిచ్చివాడిని చూసినట్టు చూశారు. "ఏం చేయాలని మీ ఉద్దేశం. కుటుంబమంతా కలిసి బయటికి వెళ్తున్నప్పుడు పిల్లలని వేరే కోచ్‌లో ఎక్కించి మేం డీలక్స్ బోగీలో............ విడివిడిగా ప్రయాణించాలంటారా?" అని నన్ను ప్రశ్నించారు.

సమస్య మూలాలను అర్థం చేసుకొని, సృజనాత్మకమైన సరికొత్త ధోరణిని అలవర్చుకోడానికి ఏం చేయాలో ఆలోచించేందుకు ఇష్టపడకపోవడం వల్లనే వారు అంత తీవ్రంగా స్పందించారని నా అభిప్రాయం. పిల్లవాడి భవిష్యత్తు కంటే డీలక్స్ క్లాస్ ప్రయాణం ముఖ్యమైనదేం కాదు. అసలది మొదటి తరగతి ప్రయాణం, డీలక్స్ తరగతి ప్రయాణాలకు సంబంధించిన సమస్య కాదు. పిల్లవాడికి కావలసింది సరైన కుటుంబ వాతావరణం.

ఎప్పుడైనా ఒకసారి తల్లితండ్రులతో కలిసి సుఖమైన ప్రయాణం చేసినా అదొక అలవాటుగా మారకుండా చూడడం పెద్దల బాధ్యత. పిల్లలతో కలసి వెళ్లడంలోని దగ్గరితనం ఇచ్చే ఆనందం కోసం తండ్రి అంత ఖర్చు చేస్తున్నాడని పిల్లలకు తెలియాలి. అలా అని పిల్లవాడిని హితబోధలతో ఊదరకొట్టనవసరం లేదు. కుటుంబ సభ్యుల వ్యవహార శైలిలోనే పిల్లలకు కొన్ని సందేశాలు కనపడతాయని గుర్తించాలి. హోదావల్లనో, సంపాదించిన ధనం కారణంగానో ఒక తండ్రికి విలాసాలు అనుభవించగలిగే స్థాయి, స్తోమత ఉన్నా కూడా ఆయన మొత్తం కుటుంబ సభ్యుల కోసం, ముఖ్యంగా పిల్లల భవిష్యత్తు కోసం ఆ విలాసాలను పరిమితం చేసుకోవాల్సిందే.



## CHAPTER - 3

# తంత్రకాదు మంచి ఫ్రెండు

1926 వేసవిలో స్టీఫాన్ డెనిసోవిచ్ వెట్కిన్‌ను తొలిసారి కలుసుకొన్నాను. ఈ సంఘటన ఇప్పటికీ నా మనసులో మెదులుతుంది. ఎటువంటి యుద్ధ ప్రకటన లేకుండా శత్రు సైన్యం విరుచుకుపడినంత అకస్మాత్తుగా, వేగంగా ఆ పరిణామం జరిగింది. నిజానికి వెట్కిన్ నా దగ్గరకు నెమ్మదిగా, ప్రశాంతంగా వచ్చాడు. నా చిన్న లైబ్రరీలో కూర్చుని ఏదో చదువు కొంటున్నపుడు అతను నిశ్శబ్దంగా లోపలికి వచ్చి, తన టోపీని తీసి, మర్యాదపూర్వకంగా తలవంచి అభివందనలు తెలిపాడు.

"మీరు పని వొత్తిడిలో ఉంటే క్షమించండి. నాదొక అతి చిన్న విన్నపం" అన్నాడు. అతని మొహంలో కొంత ఆందోళన కనిపించింది. నా ఎదురుగా కూర్చీలో కూర్చున్నాడు. తనవంక పరీక్షగా చూశాను. పెదవులు, బుగ్గలని కప్పివేసిన ఎర్రటి గడ్డం మాటున తన పెదవులు ఏదో చప్పరిస్తున్నట్టు కదులుతున్నాయి. అదేం లేదు. ఆందోళనవల్ల అతనలా పెదవులు కొరుక్కుంటున్నాడని అర్థమైంది. అతను గొంతు సవరించుకొని సంభాషణ ప్రారంభించాడు.

"ఇక్కడ దగ్గరలోనే పక్క గ్రామంలో నేను టీచర్‌గా పనిచేస్తున్నాను..." నేను అతన్ని ప్రోత్సహించదలిచాను. ఆందోళన తగ్గిస్తే అతను మాట్లాడతాడనిపించింది. నేను నవ్వి "అయితే మనం ఇద్దరం  ఒకే పనిలో ఉన్నాం అన్నమాట... బావుంది" అన్నాను.

అయితే వెట్కిన్‌లో ఆందోళన ఏమాత్రం తగ్గలేదు. "అవునవును మంచి వృత్తిలోనే ఉన్నాను. పైగా నా పని అంటే నాకు ఇష్టం కూడా. కానీ.... ఎందువల్లనో నేను సరిగ్గా పనిచేయలేక పోతున్నాను. అనుకొన్న ఫలితాలు రావడం లేదు. చదువు బాగా చెప్పలేకపోతున్నానా అంటే అదేంలేదు. అయినా నేను ఇక ఉపాధ్యాయునిగా పని చేయలేను. నేను ఇక్కడికి వచ్చినది ఉద్యోగం అడుగుదామని. కమ్మరి పనివచ్చు. బాగా చేస్తానుకూడా....." అంటూ ఆగాడు.

నాకు ఆశ్చర్యం కలిగింది. కానీ బయటపడలేదు. తనవంకే చూస్తున్నాను. అతను కొన సాగించాడు. "నేను మంచి కమ్మరిని. నిజంగా. మా నాన్న కూడా కమ్మరే. చేతివృత్తుల స్కూల్లో ఆయన పని చేశాడు. అందువల్లనే నేను ఉపాధ్యాయ వృత్తి చేపట్టాను. నాన్న దగ్గర కమ్మరిపని చేశాను. ఇక్కడ మీ ఫ్యాక్టరీలో కమ్మరిపని ఉంటుందేమో. పైగా నేను టీచర్‌ని కూడా" అన్నాడు.

"సరే" అన్నాను. "మరి మీరు, మీ కుటుంబం ఉండేందుకు వసతి కావాలేమోగా?" అడిగాను.

"అవును. కావాలి. ఏదో ఒకటో, రెండో గదులుంటే చాలు. సర్దుకొంటాం. నా కుటుంబం... పర్లేదు సరిపోతుంది" అన్నాడు. మరోసారి పెదవులు చప్పరించి టేబుల్‌పై నుంచి నా వంక

దీక్షగా చూశాడు. "టీచర్‌గా పనిచేయడం మంచిదే. కానీ, నాలాంటి పెద్ద కుటుంబీకుడికి దానివల్ల వచ్చే సంపాదన సరిపోదు. అదీకాక మేం మరీ మారుమూల పల్లెలో ఉంటున్నాం. అందుకే...." అన్నాడు. "ఎంతమంది పిల్లలు?" అడిగాను.

వెట్కిన్ నా వంకచూసి మొదటిసారి ఆహ్లాదభరితంగా నవ్వాడు. అతని పళ్లు పెదవుల వెనకనుంచి తెల్లగా మెరిసాయి. ఆ నవ్వులో నిజాయితీ కనిపించింది.

"ఇది చాలా క్లిష్టమైన ప్రశ్న. సమాధానం చెప్పేందుకు సిగ్గుగా ఉంది. కానీ చాలాసార్లు నాకు ఈ ప్రశ్న ఎదురవుతోంది." అని ఆగాడు. మరోసారి తన పెదాలు విచ్చుకున్నాయి. విశాలంగా నవ్వాడు. నా వంకే చూస్తూ "పదమూడుమంది.... పదముగ్గురు పిల్లలు" అన్నాడు.

"ఏమిటీ! పదముగ్గురా?" నిర్ఘాంతపోయాను.

వెట్కిన్ బదులు ఇవ్వలేదు. కుర్చీలో బిడియంగా ఒదిగి కూర్చున్నాడు. తన మొహంలో మళ్లీ ఆందోళన వ్యక్తమవుతోంది. నాకు బాధ అనిపించింది. ఇంత ఆహ్లాదకరమైన మనిషిని ఇబ్బంది పెట్టినందుకు విచారం కలిగింది. తనకెలాగైనా సాయపడాలనిపించింది. అదే సమయంలో అతనంటే కొంత చిరాకు కలిగింది. ఎదుటిమనిషి సవ్యంగా వ్యవహరించడంలేదని తోచినపుడు కలిగే చిరాకు అది.

అతను మాటలకోసం తడుముకున్నాడు. "అంటే... అంటే పద్దెనిమిదిమంది వరకూ పిల్లలు ఉండవచ్చని ఎక్కడో చదివాను. నాకు మాత్రం పదమూడుమందే ఉన్నారు" అన్నాడు చేతిలో టోపీ అంచుని సవరిస్తూ.

నాకు నవ్వొచ్చింది. నవ్వలేదు.



మొత్తానికి అతనితో ఒప్పందానికి వచ్చాను. మా చిన్న ఫ్యాక్టరీకి నిజంగానే మంచి కమ్మరి అవసరం ఉంది. ఉద్యోగం ఇవ్వడం సమస్య కాదు. కానీ ఇంటి వసతి ఏర్పాటు చేయడమే సమస్య. అతి కష్టంమీద ఒక గది సంపాదించగలిగాను. ఫ్యాక్టరీ ఆవరణలోనే ఉన్న కార్మికుల కాలనీలో అనేక సర్దుబాట్లు చేసిన తరువాత ఆ గది సాధించగలిగాను. మా కార్మికులు కూడా ఈ పెద్ద కుటుంబాన్ని, ఆ కుటుంబ పెద్దని గురించి ఆసక్తి కనబరిచారు. పెద్దగా నిరసనలు లేకుండానే ఎలాగో సర్దుకుని ఆ గది ఖాళీ చేసి ఇచ్చారు. కానీ మా స్టోర్‌కీపర్‌కు మాత్రం కొన్ని అభిప్రాయా లున్నాయి.

"ఎలా చేస్తారు? కొద్దిగా అయినా ఆలోచన, వివేకం ఉండాలిగా! ఎవరైనా ఏదైనా చేయచ్చు. కానీ కొంచెం ఆలోచించాలిగా. మీకు ముగ్గురో, నలుగురో పిల్లలు ఉన్నారనుకొందాం. అప్పుడు ఐదో బిడ్డపుట్టితే కొంచెం ఆలోచించవద్దూ? ఇప్పటికి ఐదుగురు పుట్టారు. మరొకరైతే ఆరుగురు అవుతారు... అని తట్టాలిగా. దీనికి తగ్గట్టు వ్యవహరించకపోతే ఎలా?" అన్నాడాయన.

అయితే ఫ్యాక్టరీ కోసం పనిముట్లు తయారుచేసే విభాగంలో ఉండే కామ్రేడ్ చబ్ అభిప్రాయం ప్రకారం ఇలా లెక్కలు వేసుకుంటూ కూర్చుంటే సమస్య అర్థమూ కాదు, అది పరిష్కారం కూడా కాదు. ఆయనకు అరుగురు పిల్లలు. ఆయన గొంతు విప్పాడు.

"అంటే జాగ్రత్తగా లెక్క పెట్టుకోవాలంటావ్. నేను పెట్టలేదనా? కానీ ఏం చేయగలం. పేదరికం... బీదతనం కారణంగా రెండు మంచాలు ఉండవు. డబ్బులున్నవారైతే భార్య భర్తలు

ఇద్దరూ చెరో మంచంమీద పడుకొంటారు. మరి నాలాంటి పేదలు ఏం చేయగలరు? ఇద్దరూ ఒకే మంచంపై సర్దుకోవాలిగా. అప్పుడు ఎన్ని లెక్కలు వేసినా లాభం ఏమిటి? జరిగేది ఎలాగూ జరుగుతుంది..." అని ముగించాడు.

"అంటే లెక్క కుదర్లేదంటావ్?" అని స్టోర్‌కీపర్ హాయిగా నవ్వాడు.

"అదేంకాదు. లెక్కలు తప్పుతుంటాయి ఒక్కొక్కసారి" అని చబ్ కూడా ఆ నవ్వును పంచుకొన్నాడు.

ఈ సంభాషణను శ్రద్ధగా వింటున్న మా ఎకౌంటెంట్ వారికి సమస్యను ఎలా అర్థం చేసుకోవాలో వివరించాడు.

"ఇటువంటి సందర్భాల్లో లెక్క తప్పడం మామూలే. అంటే... ఏముంది? ఒక్కడే పిల్లవాడు ఉన్నపుడు మరో బిడ్డ కలగడం అంటే బాధ్యత వందశాతం పెరుగుతుంది. అంటే రెట్టింపు అవుతుంది. కాస్త నిదానంగా ఆలోచించగలిగే వారికి ఈ భారం బోధపడుతుంది. బాధ్యత వందశాతం పెరగడం అంటే ఏమిటి? అని ఆలోచించగలడు. మరి అప్పటికే ఐదుగురు పిల్లలు ఉంటే మరోబిడ్డ వల్ల పెరిగే భారం కేవలం ఇరవైశాతం మాత్రమే. అప్పుడు ఎవరైనా ఏం చేస్తారు? ఓసారి నాలిక చప్పరించి భుజాలు ఎగరేసి, కానీ, ఏం చేయగలం? ఐదుగురు ఎలాగు ఉన్నారు. మరొకరు... అంతేగా అనుకుంటాడు" అన్నాడు.

అందరం నవ్వాం. ఈ వాదన చబ్‌కు ఎంతగానో నచ్చింది. ఇంతవరకూ ఎవరూ ఈ సమస్యని ఇలా విశ్లేషించి చెప్పలేదేమో. వెంటనే అతను ఈ లెక్క ఇంకా భవిష్యత్తులో తనకు ఎలా వర్తిస్తుందో తెలుసుకోగోరాడు. తనకు ఏడో పిల్లవాడు పుడితే బాధ్యత ఎంత పెరుగుతుందో చెప్పమని ఎకౌంటెంట్‌ని అడిగాడు.

మా ఎకౌంటెంట్ ఒకసారి ఉలిక్కిపడి శూన్యంలోకి చూశాడు. "ఏడో పిల్లవాడా?" అంటూ ఆగి లోపలే ఏదో గుణించుకుని, "పెరిగే భారం పదహారుశాతం" అని సమాధానం ఇచ్చాడు.

ఈ సమాధానం చబ్‌కు సంతోషం కలిగించింది. "అంతేనా? అంతేగా... పర్వాలేదు" అంటూ సంబరంగా చేతులు నులుముకొన్నాడు.

"అవును బహుశా వెట్కిన్ ఇలా లెక్కలు వేసే పదముగ్గురు పిల్లలకు తండ్రి అయ్యాడు. ఈ పదమూడో బిడ్డ వల్ల పెరిగిన బాధ్యత 8.3 శాతం" అన్నాడు ఎకౌంటెంట్.

"మరింకేం. అసలు పట్టించుకోనవసరం లేదు" అంటూ చబ్ ఆనందంగా నొసలు చిట్లించాడు.

ఇలాంటి ఆహ్లాదకరమైన వాతావరణంలో వెట్కిన్ తనకు కేటాయించిన వసతిని చూసుకునేందుకు మళ్లీ తిరిగివచ్చాడు. ఉన్న ఒక్క గదిని చూసి అతను-అసంతృప్తి చెందలేదు. అతనికి లెక్కలు బాగా తెలుసు. అవెంత అనివార్యమైనవో కూడా తెలుసు. మేం అందరం కలిసి ఆ గదిని అతనితోపాటే పరిశీలించాం. అది మరీ పెద్ద గదేం కాదు. మొత్తం కలిసి పదిహేను చదరపు మీటర్లు ఉంటుంది. వెట్కిన్ ఆ గదిని పరికించి చూశాడు. తనలో తాను గొణుకున్నాడు.

"ఇప్పుడు మాకు రెండు గదులున్నాయి. ఇక్కడికి వస్తే ఒకటే గది.... ఏం చేస్తాం? ఎలాగో సర్దుకోవాలి...." అంటూ తనలోతాను మాట్లాడుకుంటున్నాడు.

"మీకు చాలా సామాన్లు ఉన్నాయా?" అని అడిగాను నేను.

తను నా వంక అయోమయంగా చూశాడు. "సామాన్లా? నా దగ్గర ఎందుకుంటాయి? ఉన్నా ఎక్కడ పెట్టగలను" అన్నాడు అని, ఒక్కసారి విశాలంగా నవ్వాడు.

చబ్ తన వంక చూసి ఒక టక్కరి నవ్వు విసిరాడు. "మీకు కావల్సింది కుర్చీలూ, మంచాలు కాదు. ఈ గదిలో అందరూ సర్దుకోవాలంటే గోడలకి వరసగా బల్లలు అమరిస్తే అందరూ పడుకోవచ్చు" అన్నాడు.

అతనే నా వంక తిరిగి "మీరు అనుమతి ఇస్తే గోడలకి ఆ ఏర్పాటేదో చేయగలను" అన్నాడు. అతను కళ్ళతోనే గది ఎత్తుని అంచనా వేస్తున్నాడు. "మూడు వరసలు చెక్కలు అమర్చి, కింద నాలుగోది ఏర్పాటు చేయవచ్చు. మూడువైపులా పన్నెండు పక్కలు ఏర్పాటు అవుతాయి" అని తేల్చాడు.

కానీ మా స్టోర్‌కీపర్ మాత్రం ఈ లెక్కతో విభేదించాడు. నాలుగేసి వరసలా? అసాధ్యం. గాలి పీల్చుకోవద్దా? అంత స్థలం ఎక్కడిది? అన్నాడు అడ్డంగా తల ఊపుతూ.

ఈ చర్చ వెట్కిన్‌కు ఏ మాత్రం ఆందోళన కలిగించలేదు. అయితే అతను మాత్రం శ్రద్ధగా ఈ నిపుణుల అభిప్రాయలు విన్నాడు. బహుశా అతను ఈ లెక్కలన్నీ ముందే కచ్చితంగా వేసే ఉంటాడు. అందుకే ప్రశాంతంగా, స్పష్టంగా తన నిర్ణయం తెలిపాడు.

"సరే, ఈ నెల పదోతేదీన నేను నా కుటుంబంతో సహా వచ్చేస్తాను. మరి నాకు మీరొక గుర్రపు బగ్గీని ఇవ్వగలరా? ఏవో కొద్ది సామాన్లు తప్పవుగా. స్టేషన్ నుంచి పిల్లలు నడిచి రాగలరు కానీ, సామాన్లు మొయ్యడం కష్టం" అన్నాడు.

"ఒకటేం ఖర్మ. రెండు గుర్రంబళ్లు తీస్కోండి" అన్నాను.

"కృతజ్ఞతలు. రెండయితే మరీ మంచిది. ఎంతైనా ఒక కుటుంబాన్ని తరలించాలిగా..." అన్నాడు వెట్కిన్.

★ ★ ★

ఆదివారం నాడు మే పదిన వెట్కిన్ కుటుంబం మా ఫ్యాక్టరీ బయట ప్రత్యక్షం అయింది. అనుకున్న ప్రకారం ఉదయమే స్టేషన్‌కు రెండు గుర్రంబళ్లు పంపాం. మధ్యాహ్నం రెండుగంటల ప్రాంతంలో ఫ్యాక్టరీ బయట కంకరరోడ్డుపై ఒక ఊరేగింపు కనిపించింది. ఊరేగింపే. దానికి మరో మాటేలేదు మరి. మొదటి బండిపైన ఓ మూడేళ్ల కుర్రాడు ఎడంచేత్తో ఒక కాయితం జెండా పట్టుకుని కూర్చున్నాడు. ఈ జైత్రయాత్రకు పిల్లవాడి చేతిలో జెండా నిజంగా ప్రతీకలా ఉంది. రెండు బళ్లమీదా చిల్లరమల్లర సామాను ఉంది. మొదటి బండిలో మాత్రం ఒక పెద్ద వంటింటి బీరువా నిలిచి ఉంది. వారి సామాన్లలో ఠీవీగా, పెద్దగా ఉన్నది అదొక్కటే. దాని పక్కనే టీ కాచుకొనే బాయిలర్ (సమోవార్) ఒకటి. రెండు కట్టల పుస్తకాలు, కొన్ని తలగడలు, చీపుళ్లు, ఒక ఇనుపబక్కెట్టు, గిన్నెలు, కుండలు, తపాలాలూ... ఇదీ సరంజామా. రెండో బండి మీద ఇద్దరు పసిపిల్లలు ఉన్నారు. ఆ బండి పక్కనే దాదాపు పదిహేడేళ్ల వయసున్న ఒక అమ్మాయి పాతబడి, వెలసిపోయిన గౌను వేసుకుని, కాళ్లకి చెప్పులు కానీ, తలపై టోపీ కానీ లేకుండా, అలసటగా నింపాదిగా నడిచివస్తోంది. అప్పుడప్పుడే వేసవి ఆరంభమైనా ఆమె జుట్టు పూర్తిగా పొడిగా వుండి గాలికి కదులుతోంది. అందమైన పెదవులు, తళతళలాడుతున్నా

గంభీరంగా మెరుస్తున్న కళ్లు... తెలివిని సూచించే వంపైన కనుబొమ్మలు, మొత్తానికి ఆమె మొహం ప్రశాంతంగా, హాయిగా ఉంది. బళ్ల వెనకాల ఇద్దరు కుర్రవాళ్లు ఒక బాయిలర్‌ను మోసుకొస్తున్నారు. ఇద్దరూ ఒకే ఎత్తు, లావూ. ఇద్దరికీ దాదాపు పదమూడేళ్లు ఉంటాయి. వారిద్దరి వెనకా ఐదు నుంచీ పన్నెండు సంవత్సరాల మధ్య వయసు గల పిల్లలు ఉన్నారు. చివరగా బొద్దుగా, ముద్దుగా, గుండ్రటి బుగ్గలతో ఇద్దరు ఆడపిల్లలు కంకర రోడ్డుపై జాగ్రత్తగా అడుగులు వేస్తూ నడుస్తున్నారు. ఈ ఇద్దరు పసికూనలూ నెమ్మదిగా నడుస్తున్న బండితో కూడా సమంగా నడవలేక వెనకపడ్డారు.

వీళ్లలోని కాస్తంత పెద్ద పిల్లలు తలో సామానూ భుజంపైనో, చేతుల్లోనో పెట్టుకుని నడుస్తున్నారు. ఈ దృశ్యం నాకెంతో మనోహరంగా కనిపించింది. ఎంతో పరిశుభ్రంగా ఉన్న మొహాలు, కుదురుగా కత్తిరించిన తలకట్టుతో, చెప్పులు లేకున్నా మురికిగా అనిపించని పాదాలతో, అందరూ క్రమశిక్షణతో నడుస్తున్నారు. అందరి చొక్కాల కాలర్లూ శుభ్రంగా ఉన్నాయి. అందరూ కుదురుగా గుండీలు పెట్టుకున్నారు. వారిలో ఒకే ఒక పిల్లవాడి పంట్లాం మోకాలిపై అతుకు ఉంది. వాడొక గ్రామఫోన్ మైక్‌ని మోస్తున్నాడు. ఎవరి మొహంలోనూ విసుగు, చిరాకు లేకపోవడం, పిల్లలెవరికీ ఎటువంటి దెబ్బలు, కురుపులు ఉండకపోవడం నాకు బాగా నచ్చింది. అందరి కళ్లు ప్రశాంతంగా, తెలివిగా మెరుస్తున్నాయి. వాళ్లలో వాళ్లు ఏదో మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ ముందుకు కదులుతున్నారు. అలా అని అరుపులూ, గోలా లేదు.

ఈ సైన్యానికి సృష్టికర్త, నాయకుడూ కూడా అయిన డెనిసోవిచ్ వెట్కిన్ అందరికంటే వెనకగా నడుస్తున్నాడు. అతని చేతుల్లో గ్రామఫోన్ పరికరం ఉంది. అతని వెనకే అందంగా, గులాబీ రంగు చెక్కిళ్లతో, పొడవాటి నల్లటి కురులకు నల్లటి రుమాలు కట్టుకొన్న ఒకామె మా అందరివంకా తన విశాలమైన కళ్లు విప్పార్చి చూస్తూ, నవ్వుతో నడుస్తోంది. వెట్కిన్ నన్ను దాటి లోపలికి వస్తూ టోపీ తీసి అభివాదం చేశాడు. విశాలంగా నవ్వి "వచ్చేశాం. అందరూ అలా ఆశ్చర్యంగా చూస్తున్నారేం? ఇదిగో ఈమె నా భార్య అన్నా సెమ్యొయోవ్నా" అని పరిచయం చేశాడు. ఆమె తలవంచి అందరినీ పలకరించింది. నా వంక చెయ్యి చాపింది. "ఆయనకు ఎప్పుడూ ఏదో విషయం గురించి ఆందోళన తప్పనిసరి. ఆశ్చర్యంగా చూస్తున్నారా? చూడనీయండి. అందరూ అలవాటు పడతారు. పర్వాలేదు" అని నవ్వింది.

ఆమె మాటలు, రూపం, నవ్వు మా గుంపులో కదలికను సృష్టించాయి. చబ్ భార్య ముందుకువచ్చి పిల్లల వంక అపేక్షగా చూస్తూ, వాళ్ల అమ్మానాన్నలను మాత్రం మందలిస్తున్నట్టు కళ్లు ఎగరేసింది. "అయ్యయ్యో... సిగ్గు సిగ్గు... ఇంత పసిపిల్లలను స్టేషన్ నుంచి నడిపిస్తున్నారా? పాపం ఎలా నడిచారో" అంటూ ముందుకు వచ్చింది. చివరలో ఉన్న ఇద్దరు ఆడపిల్లల్లో ఒకరిని భుజానికి ఎత్తుకొంది. ఆరోగ్యంగా, బలంగా ఉన్న ఆ మహిళ మెడ పక్కనుంచి ఆ పసిపిల్ల మొహం కనిపించింది. ఆ పాప తన లేత నీలికళ్లతో పరిసరాలను ఆందోళనగా పరీక్షిస్తోంది. ఈలోగా మరెవరో ఇంకో పాపను ఎత్తుకొన్నారు. అందరం ఆ ఊరేగింపులో కలిసిపోయాం. మా ఎకౌంటెంట్ ఎదుటపడి తలవంచి చేతులు రెండూ చాపి, "స్వాగతం సుస్వాగతం ఏమీ భయపడకండి. ఇక్కడకు రావడం మంచి పనే. అంతా బానే ఉంటుంది. పర్వాలేదు" అంటూ సాదరంగా ఆహ్వానించాడు.

ఎండాకాలమే కాబట్టి వెట్కిన్ తన కుటుంబాన్ని తనకు కేటాయించిన గది బయటే వసతి ఏర్పాటు చేద్దామని నిర్ణయించుకొన్నాడు. మా ఫ్యాక్టరీ ఆవరణలో పనికిరాని చెక్కలు, రేకు ముక్కలూ విస్తారంగా ఉన్నాయి. నా అనుమతి తీసుకుని వాటన్నిటితో గది బయట ఒక వరండా ఏర్పాటు చేసే సన్నాహాలు ప్రారంభించాడతను. ఈ పనికి వెట్కిన్ కేవలం పర్యవేక్షకునిగా వ్యవహరించాడు. పెద్ద పిల్లలు వరండా నిర్మాణం బాధ్యతని చేపడితే, చిన్నపిల్లల సైన్యం వారికి కావలసిన సామాగ్రిని పోగుచేసి అందిస్తోంది.

వెట్కిన్ కుటుంబం ఇక్కడకు చేరకముందు నుంచే ఆ కుటుంబానికి సంబంధించి ఒక విద్యా పరమైన ఒక అనుమానం నన్ను పీడిస్తోంది. ఈ పెద్ద కుటుంబానికి వ్యవస్థాగతమైన రూపమేదైనా ఉన్నదా? లేక అడ్డదిడ్డంగా ఎదిగిపోయిన ఒక సంసారం మాత్రమేనా? అన్నది ఆ అనుమానం. వెట్కిన్ వచ్చిన తరువాత ఏదో అవసరంపై నన్ను కలిసినప్పుడు నేను ఈ అనుమానాన్ని వ్యక్తం చేశాను.

అతను ఏమీ ఆశ్చర్యపడలేదు. అర్థం చేసుకున్నట్టు ఓ నవ్వు నవ్వాడు. "మంచి ప్రశ్న అడిగారు. చాలా ముఖ్యమైన ప్రశ్నే. అవును. మా కుటుంబం రోజువారీ వ్యవహారాలకు సంబంధించి కట్టు దిట్టమైన ఏర్పాట్లే ఉన్నాయి" అని బదులిచ్చాడు. "అంటే ఎలాగ?" ప్రశ్నించాను.

"ఏముంది. పిల్లలను వారి వయసును బట్టి వేర్వేరు బృందాలుగా విభజించాను. పనుల వరకూ ఈ ఏర్పాటు బానే వుంది. అయితే విద్యాపరంగా చూస్తే కొన్ని చిక్కులున్నాయి. చిన్నపిల్లలు చదువు సంధ్యల్లేకుండా పరుగులు పెట్టవచ్చు. అందుకే సమస్యని వేర్వేరు కోణాలనుంచి పరిష్కరించాలి. అందుకే ఇంటిపనిని నలుగురికి అప్పచెప్పాను. పెద్ద వాన్య, విట్యా, సెమ్యోన్, ఇంకా చిన్న వాన్య. పెద్ద వాన్యకు పదిహేనేళ్లు. చిన్న వాన్యకు పదేళ్లు. కానీ వాడు బాగా తెలివైనవాడు. బోలెడంత పని చేయగలడు" అని వివరించాడు.

"ఇద్దరు వాన్యలు ఏమిటి? అదీ ఒకే ఇంట్లో?" ప్రశ్నించాను నేను.

"ఏదో అలా అయిపోయింది. వాన్య అని పేరు నాకిష్టం. పెద్దవాడికి నేనే ఆ పేరు పెట్టాను. ఆ రెండోవాడు 1916లో పుట్టాడు. నేను టీచర్ని కదా వదిలేస్తారనుకున్నాను, సరిగ్గా వీడు సమయానికి నన్ను సైన్యంలోకి లాక్కెళ్లారు. అప్పుడే ఆవిడకి పురుడు వచ్చింది. వీడు భూమ్మీద పడ్డాడు. ఆలోచించే తీరిక ఎవరికి వుంది? ఓ పక్క యుద్ధం. చర్చిఫాదర్‌కి కూడా వ్యవధి లేదు. ఏదో ముహూర్తం చూసి, కేలండర్ తిరగేసి దాని ప్రకారం పేరు పెట్టేశాడు. ఇవాన్ అని. అలా మా ఇంట్లో రెండు ఇవాన్-వాన్య తయారయారు. నిజానికి దానివల్ల ప్రస్తుతానికి ఇబ్బంది లేదు. ఒకడు పెద్ద వాన్య. ఇంకోడు చిన్న వాన్య. అదీ ఏర్పాటు. వాళ్లకీ ఆ పేర్లు అలవాటు అయిపోయాయి. వాన్య తెల్లగా ఉంటాడు. చిన్న వాన్య కొంచెం ముదురు గోధుమ వర్ణంలో ఉంటాడు. వాడిది తల్లి పోలిక".

"సరే అది మీ ఇంటి వ్యవహారాలు చక్కబెట్టే జట్టు అన్నమాట" అన్నాను. "అవును. వాళ్లు నలుగురు కలిసే బడికి వెళ్తారు. ఇంట్లో ఏ పని అయినా కలిసే చేస్తారు. నలుగురూ మగపిల్లలే. మంచి పనివాళ్లు. మధ్యలో ఎనిమిదేళ్ల వాస్య ఉన్నాడు వచ్చే గ్రీష్మంలో వాడు బడికి వెళ్తాడు.

అంతవరకూ వాడికి ప్రత్యేకంగా బాధ్యతలంటూ లేవు. అందరికీ సాయపడతాడు. ఇంకా ఏడేళ్ల ల్యూబా, ఆరేళ్ల కోల్యా ఉన్నారు. వాళ్లు చిన్నపిల్లలూ కారు. అలా అని పెద్దవాళ్లు కాదు. ప్రత్యేకంగా ఏ పనీ చేయలేరు. అయితే చెయ్యి సాయంగా పనికొస్తారు. అవీ ఇవీ అందిస్తారు. అవసరమైతే దుకాణానికి వెళ్లి ఏమన్నా తేగలరు. ఇద్దరికీ ఇరవై అంకెల వరకూ లెక్కపెట్టడం వచ్చు" అన్నాడు తృప్తిగా.

"ఇప్పుడు వరండా కట్టడంలో చెక్కముక్కలు పోగుచేసుకొస్తున్న వాళ్లేనా?" అవును. వాస్య, ల్యూబా, కోల్యా. మిగిలినవాళ్లో ఐదేళ్లకంటే తక్కువ వయసు వాళ్లు ముగ్గురు. చివరి ఇద్దరూ పసిపిల్లలు. కవలలు. రెండేళ్ల వయస్సు అని వివరించాడు.

"ఆ పిల్ల అందరికంటే పెద్దామె కదూ" అని అడిగాను వేలు చూపిస్తూ.

"ఆమెనే. ఒక్సానా. అందరికంటే పెద్దపిల్ల. వయసు వచ్చింది. అన్ని పనుల్లో అందెవేసిన చెయ్యి. తల్లిలా ఏ పనిఅయినా చేయగలదు. తెలివైన పిల్ల. రబ్‌ఫాక్ (కార్మిక శిక్షణా కేంద్రం)లో చేరాలని ఆమె కోరిక. చూడాలి మరి ఏమవుతుందో".

పెద్ద వాస్య జట్టు వరండా నిర్మాణంలో హడావుడిగా వుంది. వెట్కిన్ అప్పటికే ఫ్యాక్టరీలో పనిలో చేరడంతో అతను పిల్లలకు సాయపడడం లేదు. సాయంత్రం నాలుగు గంటలకి ఫాక్టరీ నుంచి వచ్చి అంతవరకూ పూర్తయిన కట్టడాన్ని పరిశీలించాడు. పై కప్పు ఎలా వేయాలో పిల్లలతో మాట్లాడాడు. అయితే సాయంత్రం సమయాల్లోనూ పెద్ద వాస్యదే అజమాయిషీ అంతా.

ఈ బృందానికి కావలసిన మేకులను చిన్న వాస్య పాత చెక్కలనుంచి పెకలించి తీస్తున్నాడు. ఒక పట్టకారు, సుత్తి వాడి పనిముట్లు. అతి కష్టంమీద చెక్కనుంచి మేకులు విడదీసి వాటిని సరిచేసి పెద్ద పిల్లలకు అందిస్తున్నాడు. అయినా కావలసిన మేకులు లేవు. దాంతో పెద్ద వాస్య చెక్కలను మోసుకొస్తున్న పిల్లలకు ఆదేశాలు జారీ చేశాడు. "చెక్కలన్నీ ఏరుకొచ్చి కుప్పలు పొయ్యకండి. వాటిల్లో మేకులున్న చెక్కముక్కలుంటే, వాటిని చిన్న వాస్యకు ఇవ్వండి. లేని ముక్కలను మాకివ్వండి." అని చెప్పాడు. పని ఆగకూడదనే ఉద్దేశంతో ఐదేళ్ల మరూస్యను కూడా రంగంలోకి దింపారు. గుండ్రటి, నిండు బుగ్గలతో చిన్న జడతో ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉన్న మరూస్య ప్రతి చెక్కనూ జాగ్రత్తగా పరిశీలించి "దీనికి మేకు ఉంది.... దీనికి లేదు... మేకు ఉంది.... లేదు" అంటూ వాటిని వేరు చేస్తోంది.

అతి ఉత్సాహంగా, వేగంగా పనిచేస్తున్న ఈ పిల్లలను చూసి అందరూ ఆశ్చర్యపోయారు. ఇందరు పిల్లలు ఇంత హడావుడిగా పనిచేస్తున్నా అరుపులు, కేకలు వినిపించేవే కావు. చిట్టచివర కవలలు సైతం ఒక పద్ధతి ప్రకారం  పనుల్లో సాయపడేవారు_ లేదా ఆడుకొనేవారే తప్ప అరవడం, కేకలు పెట్టడం చేసేవారు కాదు. ఇంకా చబ్ ఇంట్లోపిల్లల గోల వినిపించేది, చబ్ పిల్లలు కూడా ఉత్సహంగా పనులు చక్కబెట్టేవారు. కానీ ఎక్కువగా ఆటపాటల్లో కాలం గడిపే వారు. ఆవరణలోని పిల్లలందరినీ పోగుచేసి ఆటలు ఆడేవాళ్లు, ఎప్పుడూ వేళాకోళాలు, నవ్వులతో పొద్దు పుచ్చేవారు. ఉన్నట్టుండి పెద్దగా అరిచేవారు. వీళ్లని అదుపులో పెట్టేందుకు చబ్, అతని భార్య కూడా పెద్దగా కేకలు పెట్టేవారు. పిల్లల చెవులు మెలిపెట్టేవారు. అవసరమనుకుంటే బెత్తాలు వాడేవారు. ఆచారం ప్రకారం అమ్మా, నాన్నల వడ్డింపుల తర్వాత చబ్ పిల్లలు కాస్సేపు

ఏడ్చి, అంతలోనే కళ్లు తుడుచుకొని, కేరింతలు మొదలుపెట్టేవారు. ఆటలు మొదలయ్యేవి. జరిగిన దానికి చబ్, అతని భార్య మనసు కష్టపెట్టుకొనేవారు కారు. తల్లితండ్రులుగా తమ బాధ్యతను నిర్వర్తించామన్న సంతృప్తి ఇచ్చే కొత్త స్ఫూర్తితో ఇంటి వ్యవహారాలు చక్కబెట్టేవారు.

వెట్కిన్‌ల కుటుంబంలో మాత్రం ఇటువంటి తతంగం ఉండేదే కాదు. అందరిలోకి చిన్నవారైన కవలలు సైతం తమ నిరసన తెలియచేయాలంటే గొణుక్కునే వారేకానీ, ఏడ్పి రాగాలు పెట్టడం అన్న మాటే లేదు. పెద్దవాడైతే ఇదికూడా ఉండేది కాదు. వాళ్ల ఇంటి గొడవలు ఎప్పుడూ బయటివారి దృష్టికి రాలేదు. అసలు అటువంటి గొడవలేవీ వాళ్ల ఇంట్లో ఉండేవి కాదేమో. ఫ్యాక్టరీలోని మా వాళ్లంతా వెట్కిన్‌ల కుటుంబంలోని ఈ ప్రత్యేకతను వెంటనే గుర్తించారు. ఎవరికివారు తోచిన వ్యాఖ్యానాలు చేసేవారు. అయితే వారిలో ఒక్కరు కూడా ఆ పిల్లల తల్లితండ్రుల విద్యార్హతల గురించి ఆలోచించలేదేమో. ఏమో కానీ, ఎవరూ ఆ విషయంలో మాట్లాడేటపుడు పెద్ద వెట్కిన్ల చదువు గరించి ఎన్నడూ ప్రస్తావించలేదు.

"అది వాళ్ల వ్యక్తిత్వంలోనే ఉంది" అని తేల్చాడు చబ్. "వారి తత్వమే అంత. జాగ్రత్తగా ఆలోచిస్తే అదేమంత మంచి వ్యవహారంలా కనిపించదు. పిల్లలు ఎప్పుడు, ఏం చేయాలనిపిస్తే అది చేయగలగాలి. గట్టిగా అరవగలగాలన్నా గుండె వుండాలి. పిల్లవాడు కేకలు పెట్టినా, ఏడిచినా అది అతి సహజం. అంటే వాడు పూర్తి సజీవంగా ఎదుగుతున్నాడన్నమాట. వాడొక బొమ్మ కాదన్నమాట. నా మటుకు నేను చిన్నప్పుడు బాగా అల్లరి చేసేవాడిని. ఇప్పుడంటరా ఎవరైనా పట్టుపట్టి నాతో గొడవ పెట్టుకొంటే తప్పదు కానీ, లేకపోతే నా పనేదో నేను చేసుకొంటాను. ఇన్ని మాటలెందుకు? అరవాలంటే అదెలాగో నాకు తెలుసు. అది అతి సహజంగా అబ్బవలసిన విద్య" అని సుదీర్ఘంగా ప్రసంగించాడు.

ఎకౌంటెంట్ పైజోవ్ మాత్రం అతనితో విభేదించాడు.

"అదసలు విషయం కాదనుకుంటా కామ్రేడ్ చబ్. ఇది వ్యక్తుల తత్వానికి సంబంధించిన సమస్య కాదు. ఆర్థిక వ్యవహారానికి సంబంధించిన అంశం. పిల్లలు ఇద్దరో, ముగ్గురో ఉంటే వారికి అవకాశాలు కనిపిస్తాయి. అది కావాలి, ఇది కావాలి అని వాళ్లు అడుగుతారు. మీరు ఇవ్వగలుగుతారు కూడా. ఒక్కోసారి కాలం కలసిరాక, వాళ్లు కోరినది మీరు ఇవ్వలేకపోవచ్చు. దీన్ని పిల్లలు వొప్పుకోరు. ఒకసారి అడిగితే ఇచ్చినవాళ్లు ఇప్పుడు కాదంటున్నారనే వారికి తడుతుంది. దాంతోవాళ్లు అరుస్తారు, ఏడ్చి రాగాలు తీస్తారు. దీంతో గొడవలు మొదలు. కానీ వెట్కిన్ల విషయంలో అది కుదరదు. వాళ్లు పదముగ్గురు పిల్లలు. ఇంట్లో ఎప్పుడూ ఏదో ఒకటి కొరత తప్పదు. ఇక్కడ పిల్లలకి తెలుసు అరిచి గీపెట్టినా తాము కోరింది తండ్రి ఇవ్వలేడని వారికి కనిపిస్తూనే ఉంది. అందుకని పిల్లలకు వేరే డిమాండ్‌లు ఉండవు. అసలు డెనిసొవిచ్ వెట్కిన్ మంచి ఎకౌంటెంట్ లేకుండా ఆ కుటుంబాన్ని ఎలా పోషిస్తున్నాడా? అని ఆశ్చర్యం కలుగుతుంటుంది నాకు. చేతికందే ప్రతిపైసాను ఎలా ఖర్చు చేయాలో అతను జాగ్రత్తగా ఆలోచించుకోవాలి మరి. ఆదాయాన్ని అందరిపై సమంగా ఖర్చు చేయడం కుదరదు. పిల్లలందరిపై ఒకేలా ఖర్చవదు మరి. ఒక్కొక్కరు ఒక్కో విధంగా తినగలుగుతారు. వయసును బట్టి ఎక్కువ, తక్కువలుంటాయి. పిల్లల అవసరాల్లో తేడా ఉంటుంది. మొత్తంమీద తండ్రి ఆదాయం, అంటే కుటుంబ స్థితిగతులే పిల్లల మనస్తత్వాన్ని ప్రభావితం చేస్తాయి. లోపల

ఎంత కోరిక ఉన్నా అది తీరుతుందన్న చిరుఆశ కూడా లేనప్పుడు పిల్లలకు డిమాండ్‌లు ఏముంటాయి? అందుకే వాళ్లంతా తమ వంతు వచ్చేవరకూ మౌనంగా ఎదురు చూస్తారు. ప్రశాంతంగా ఉంటారు" అని ఎకౌంటెంట్ పైజోవ్ తన అభిప్రాయాన్ని వివరించాడు.

ఈ వాదన చబ్‌కు నచ్చలేదు. "ఓహో సమస్యకు మంచి ఆర్థిక తాత్విక రూపాన్ని ఇచ్చారే. అదేం కాదు. నాకు అరుగురు పిల్లలు. వాళ్లకి సహజంగా ఉండే కోరికలు ఉంటాయి. ఏ పద్ధతి ప్రయోగించినా ఆ డిమాండ్‌లు అణగారవు. అలా అని వాళ్లు అడిగినదల్లా నేను ఇవ్వలేను. వాళ్లు ఊరుకోరు. అరుస్తారు, గోల చేస్తారు. వాళ్ల నోరు మూయించలేం. గట్టిగా అరిచినవాడే విజేత. వాడికే మిగిలినవారికంటె ఎక్కువ దక్కుతుంది" అని తన అనుభవాన్ని తెలియచేశాడు.

ఈ వివాదాన్ని డెనిసోవిచ్ వెట్కిన్ శ్రద్ధగా, నవ్వుతూ, పెద్దరికాన్ని ప్రదర్శిస్తూ సహనంగా విన్నాడు. నెమ్మదిగా సంభాషణలో పాలుపంచుకొన్నాడు. "ఒక పిల్లవాడు మొండిగా, బండగా తనకు తోచిందే సరైనదన్నట్లు వ్యవహరిస్తున్నాడనుకొందాం. అంతే మొండిగా ఉండే మరో పిల్లవాడు నోరు కట్టుకు కూర్చోడు. ఘర్షణ మొదలు కాక తప్పదు. ఇలా కాకుండా ఉండాలంటే సరైన వాతావరణం ఉండాలి. ఒక పిల్లవాడు మొండితనంగా ఉండచ్చు. అలా వాడిపై ఓ ముద్రవేసేస్తే సమస్య పరిష్కారం కాదు. పిల్లల్లో అసహనం పెరగడంవల్లనే మొండితనం వస్తుంది. సహనానికి హద్దులనేవి మీకు మాత్రమే ఉంటాయనుకోవడం పొరపాటు. పిల్లల సహనం కూడా పరిమితమైనదే. దాన్ని మనం గమనించాలి. వాడి సహనాన్ని మనం ఎప్పటికప్పుడు పరీక్షిస్తూపోతే వాడు గొంతు చించుకోకతప్పదు. లేకపోతే ఎందుకు అరుస్తాడు?" అని తన ఉద్దేశాన్ని విశదపరిచాడు.

ఖాళీ సమయాల్లో మా వాళ్ల దృష్టి వెట్కిన్ల పిల్లలపైకి పోవడం మామూలైంది. ఈ చర్చలతో నిమిత్తం లేకుండా డెనిసోవిచ్ తన కుటుంబ పోషణ కోసం తంటాలు పడేవాడు. అతని అవసరాల దృష్ట్యా మేం ఆ కుటుంబానికి వీలైనంత పెద్ద ఖాళీ స్థలాన్ని కేటాయించాం. డెనిసోవిచ్ భార్య అన్నా, పెద్దకూతురు ఒక్సానాలు వెంటనే అక్కడ పని ప్రారంభించారు. మేం వాళ్లకి చేయగలిగిన సాయం చేశాం. ఒక గుర్రాన్ని, నాగలిని సమకూర్చాం. విత్తనాలతో పాటు, వీలైనన్ని ఎక్కువ బంగాళాదుంపలు ఇచ్చాం. వాళ్లు ఆ సామగ్రితో పెరటితోట పని మొదలుపెట్టినా, తక్షణ సమస్య ఉండనే ఉంది. దీనిపై డెనిసోవిచ్ అసంతృప్తి వ్యక్తం చేయలేదు. భయపడలేదు. అలా అని తన కష్టాలు దాచుకోలేదు.

"నేను బెంగపడడం లేదు. ప్రస్తుత సమస్య అందరికీ భోజనం ఎలా అన్నదే. రోజుకి ఒక్కొక్కరికి ఐదువందల గ్రాముల రొట్టె కావాలి. అంటే ఆరేడు కిలోల రొట్టె అవసరం. అదొక్కటే సమస్య" అన్నాడు.

ఇటువంటి పరిస్థితుల్లో మనగలగాలంటే అపారమైన సహనం, విపరీతమైన తెలివితేటలూ ఉండాలి. డెనిసోవిచ్‌లో ఈ లక్షణాలు ఉన్నాయి. అతని పనిలో ఇవి ప్రతిఫలించేవి, అతను నిజంగానే మంచి కమ్మరి. పైగా వృత్తిరీత్యా టీచర్ కావడంతో ఫ్యాక్టరీలో మిగిలిన కార్మికులకంటే ఎక్కువ ఆదాయమే లభించేది. అతనికి సాయపడే ఉద్దేశంతో, ఫ్యాక్టరీలో మరింతసేపు పనిచేస్తే మరింత ఆదాయం వస్తుందని ఒకసారి సూచించాను. అతని సమాధానం విని ఆశ్చర్యపోయాను. "ఫ్యాక్టరీకి అవసరం అయితే తప్పకుండా మరిన్ని గంటలు పనిచేస్తాను. కానీ కేవలం నాకు

సాయపడేందుకే మీరు ఈ మాట అంటే మాత్రం... క్షమించండి... నాకు అవసరం లేదు. అంటే ఇలా ఆలోచించడం వల్ల పరిస్థితులు మరింత అధ్వాన్నమవుతాయి. అంటూ నవ్వబోయి, నా వంకచూసి తమాయించుకొన్నాడు.

"ఒక మనిషి రోజుకి ఏడు గంటలు పనిచేస్తే చాలు. అంతకంటే ఎక్కువ చాకిరీ చేస్తే దండగే. ఊరికే అలసిపోతాడు. పిల్లల్ని కని పోషించినంతకాలం పోషించి చచ్చిపోతాడు. బతుకంటే అదికాదని నా ఉద్దేశం. అదేం పరుగు? సీతాకోకచిలుక ఒకేరోజు బతుకుతుంది. గుడ్లు పెట్టేసి చచ్చిపోతుంది. దానివరకూ అలా పర్వాలేదేమో. ఎందుకంటే అది అంతకు మించి ఏమీ చేయలేదు కనుక. కానీ మనిషికి అలా కాదే. నా మటుకు నేను భవిష్యత్తు ఎలా ఉంటుందో చూడాలనుకుంటున్నాను. అందువల్ల రోజుకి ఏడుగంటల పని చాలు" అన్నాడు.

"కానీ ఇప్పుడే అన్నారుగా. ఫ్యాక్టరీకి అవసరమైతే ఎక్కువ గంటలు పని చేస్తానని....?"

"అది వేరే సంగతి. ఫ్యాక్టరీకి అవసరమంటే ఇక చర్చే ఉండదు. అయితే నా పిల్లలకు నేను అవసరం కాదా? వాళ్లకి తండ్రి కావాలి. గొడ్డులా పనిచేసే యంత్రం కాదు. రోజంతా శ్రమించి అలసటతో, వాలిపోతున్న కనురెప్పలతో, విసుగ్గా, చికాకుగా, ధుమధుమలాడుతూ నేను వారితో గడపను. అటువంటి తండ్రివల్ల వాళ్లకి ఉపయోగం ఏమిటి? కేవలం తిండి పెట్టడం కోసమేనా తండ్రి ఉండేది. అలా అయితే అటువంటి తండ్రిని సరాసరి సమాధి చేసి పిల్లలను ప్రభుత్వ సంక్షేమ పథకాలకు అప్పచెబితే సరిపోతుంది. రోజులకొద్దీ పనిచేసి ఉన్నట్టుండి చచ్చిపోయిన తండ్రులు నాకు తెలుసు. ఆ పిల్లలు అనాథలుగా మిగలడం నేను చూశాను. లేదా శుద్ధ మొద్దావతారాలుగా మిగిలిపోవడం నేనెరుగుదును. పైగా పిల్లలకోసం నేనెంతో త్యాగం చేశాను. వాళ్లకి అన్నీ ఇచ్చాను. అంటూ గొప్పలు చెప్పుకోవడం ఒకటి. అలాంటివారిని మూర్ఖులని అంటాను. పిల్లలకోసం నువ్వు అన్నీ త్యాగం చేస్తావు. కానీ చివరికి వారికి దక్కేది శూన్యం మాత్రమే. మేం తినే ఆహారం అంత అద్భుతమైనది కాకపోవచ్చు. కానీ మా కుటుంబ జీవనం సమగ్రంగా ఉంటుంది. సజీవంగా కళకళలాడుతూంటుంది. అదే నాకు కావలసింది" అని సుదీర్ఘంగా ప్రసంగించాడు డెనిసోవిచ్.

అతని వాదనతో విభేదించడం కష్టం. అలా అని అతను చెప్పినదానితో పూర్తిగా ఏకీభవించలేక పోయాను. అహంకారం లేదా సోమరితనం నుంచి అతని ఆలోచనాధోరణిని వేరు చేయడం తేలిక కాదు. డెనిసోవిచ్ ఆలోచన బావున్నట్టే అనిపించినా దానిని అతనెలా అమలు చేస్తున్నాడో తెలుసు కోవాలనిపించింది. అయితే వాళ్ల ఇంటికి వెళ్లి కొంత సమయం గడిపే వ్యవధి నాకు చిక్కడం లేదు. ఈలోగా క్రమంగా వారి పరిస్థితి కూడా మెరుగవుతోంది. వాళ్లకి కేటాయించిన గదిని అనుకుని ఉన్న మరో గదిలో ఉండే ఇద్దరు యువతులు చేనేత కార్మికులు. వెట్కిన్ల ఇబ్బందిని గమనించి ఈ ఇద్దరు యువతులు తమంతతామే ఆ గదిని ఖాళీ చేసి మరో గదిలో ఉన్న స్నేహితురాళ్లతో కలిశారు. దీనితో వెట్కిన్లకు మరింత విశాలమైన జాగా లభ్యమైంది.

ఆగస్టులో ఒకరోజు నేను, మా ఫ్యాక్టరీ కార్మికుడు చబ్ కలిసి ఓక్ చెట్ల గుబురు మధ్య నుంచీ వంకరటింకరగా ఉన్న బాటపైన నడుస్తున్నాం. చబ్ ఎప్పటిలానే అందరి గురించీ మాట్లాడుతున్నాడు. "డెనిసోవిచ్ తన పెద్దకొడుకు వాన్యను పట్టణం పంపి చదివిద్దామను కుంటున్నాడు. పట్టణంలో వాడి మేనమామ దగ్గరుంచాలని డెనిసోవిచ్ ఆలోచన. అలాంటి

బంధువు ఉండాలే కాని పదమూడు మందిని ఏమిటి? ముప్పైమందిని పెంచి పోషించగలను. అయినా ఒక్కొక్కరి అదృష్టం ఒక్కోలా ఉంటుంది. ఒకరికి తెలివైన బుర్ర ఉండచ్చు. మరొకరికి సొగసైన గర్వం ఉంటుంది. మిగిలినవారికి మంచి మేనమామ ఉండవచ్చు. ఏం చెప్పగలం?" అన్నాడు చబ్.

"మేనమామ అంటే... ఏమిటి సంగతి?" అడిగాను.

"ఆయనకేం మహారాజు. పట్టణంలో సహకార సంఘం అధ్యక్షుడాయన. నాలుగు గదుల పెద్ద ఇల్లు. ఇంట్లో పియానో, సోఫాలు, మంచి తిండి... ఏం కొరత లేదనుకోండి"

"అంటే ఏమిటి? అంత డబ్బు ఆయనకు ఎక్కడిది? దొంగతనాలు కానీ చేస్తాడా ఏం?"

"ఎందుకండీ దొంగతనం. సహకార సంఘం ఆధ్వర్యంలో బోలెడన్ని దుకాణాలుంటాయి. చేతికింద అన్ని దుకాణాలు ఉన్నప్పుడు ఏం కావాలంటే దొరకదంటారు? ఆయన సంగతలా ఉంచండి. ఏం డెనిసొవిచ్ తన కొడుకుని ఫ్యాక్టరీ శిక్షణా కేంద్రంలో చదివించకూడదా? చదివించడు. ఎందుకంటే పట్టణంలో అన్ని వసతులూ ఇవ్వగల మేనమామ ఒకడున్నాడుగా; అందుకని."

చబ్ మాటలు ముగియకముందే దూరంగా ఓక్ వృక్షాల మాటునుంచీ డెవిసొవిచ్, అతని పెద్దకొడుకు వాన్య మా వైపు వస్తూ కనిపించారు. వాన్య తండ్రి వెనకగా నడుస్తూ చేతిలోని చెట్టుకొమ్మతో ఓక్ వృక్షాలని తడుముతున్నాడు. వాడి మొహంలో ఏదో ఇబ్బంది... సాధారణంగా పిల్లలు తమ అభిప్రాయం ఎలా ఉన్నా, గౌరవం కొద్దీ పెద్దవాళ్ల మాటను మన్నించవలసి వచ్చినపుడు పడే ఇబ్బందిలాంటిది కనిపిస్తోంది.

"కుర్రాడు పరీక్ష పాస్ అయ్యాడా?" అని చబ్ వారిని పలకరించాడు. డెనిసొవిచ్ నవ్వలేదు. ఆగలేదు. మా వైపే నడుస్తూ "ఆ పాస్ అయ్యాడు" అంటూ ముందుకు వచ్చాడు. హటాత్తుగా ఆగి ఏదో ఆలోచిస్తున్నట్టు నేలవంక దృష్టి సారించాడు. "మహారాజులకు ఉండే పొగరు ఎప్పుడైనా చూశారా మీరు?" అని మమ్మల్ని ప్రశ్నించాడు. మేం బదులు చెప్పేలోపే తన చేతిని వాన్య వైపు చూపిస్తూ "తెలియకపోతే చూడండి వాడిని. మంచి ఉదాహరణ" అన్నాడు.

వాన్య అనుమానంగా చూస్తూ ఆగాడు. మహారాజులకు ఉండవలసినంత పొగరు ఉన్నవాడి చేతిలో బూట్లు ఉన్నాయి. రెండో చేతిలోని చెట్టుకొమ్మతో వాడు కాళ్లు గోక్కుంటున్నాడు. వాడి మొహంలో విచారం, టక్కరితనం ఒకేసారి కనిపిస్తున్నాయి. బహుశా ఈ రెండో గుణమే వాడి తండ్రికి రాచరికపు గర్వంలా కనిపించిందేమో. డెనిసొవిచ్ కోపంగా వాడివైపు చూద్దామని ప్రయత్నించి, సాధ్యపడక మా దగ్గరగా వచ్చాడు.

"చూడండి వీడి సంగతి. వాడికి ఆపిల్ పళ్లంటే ఇష్టం. అయితే అవి తనవై ఉండాలట. అవి మరొకరి బల్లపై ఉండి, వాళ్లు తీసుకోమన్నా తీసుకోడట! ఏం చెప్తాం" అన్నాడు.

పెద్ద వాన్య నిరసనగా తల ఊపాడు. చేతిని హడావుడిగా తిప్పాడు. "ఏమిటీ? ఇదంతా ఆపిల్ పళ్ల వ్యవహారమేనంటావా నాన్నా? అదేం కాదు. అదే అయినా ఆ ఆపిల్ పళ్లు నాకు వద్దు. నేను అక్కడ ఉండను" అన్నాడు.

"అదండీ సంగతి" అన్నాడు డెనిసొవిచ్ నిస్పృహగా.

కానీ వాన్య ధోరణి మారలేదు. "అయినా ఆపిల్ పళ్లు, మిఠాయిలూ నాకెందుకు. ఆ

మాటకొస్తే స్టర్జన్ చేపలు మాత్రం దేనికి?" అంటూ పగలబడి నవ్వాడు. ఏం గుర్తొచ్చి, ఎందుకు అలా నవ్వాడో వాడికే తెలియాలి. కానీ ఆ నవ్వులో ఒక నిరసన స్పష్టంగా కనిపించింది. ఉన్నట్టుండి వాన్య మొహం గంభీరంగా మారింది. "మన ఇంట్లో అటువంటివి ఏమీ లేవు. మరొకళ్ల ఇంట్లో అలాంటి తిండి ఉన్నా అది నాకొద్దు, వద్దే వద్దు అంతే" అన్నాడు కచ్చితంగా.

ఇదేవాడి తుది నిర్ణయం అయి ఉండాలి. ఎందుకంటే ఈ మాటలు అంటూ వాడు చేతిలోని చెట్టుకొమ్మతో కాళ్లపై బలంగా చరుచుకొన్నాడు. తలఎత్తి తండ్రి వంక చూశాడు. అప్పుడు వాడి మొహంలో నిజంగా ఒక ఠీవీ, దర్పం ద్యోతకమయ్యాయి.

ఈ మాటలకూ, వాటిని వాడు అన్నతీరుకూ డెనిసోవిచ్‌కి నవ్వు వచ్చినట్టుంది. పెదవుల చివర్లు నవ్వబోయి ఆగాయి. డెనిసోవిచ్ మొహాన్ని బిగపెట్టి "అదీ సంగతి. ఎంత గర్వం!" అన్నాడు. గిరుక్కున వెనుదిరిగి ఫ్యాక్టరీ దిశగా నడిచాడు. వాన్య మా వంక, నడుస్తున్న తండ్రి వంక చూపుమార్చి చూశాడు. చివరకు ఏదో నిర్ణయానికి వచ్చినట్టు తలపంకించి తండ్రిని అనుసరించాడు.

చబ్ ఆ తండ్రికొడుకుల వంక చూస్తూ, అంతకు ముందునుంచే చేతిలో సాపు చేస్తున్న సిగరెట్ కాయితంలో పొగాకు పోసి గుండ్రంగా చుట్టాడు. కాయితం చివరన నాలికతో తడిచేసి అతికించాడు. "చూశారా... ఆ పిల్లవాడు... ఇంతకి వాడి ధోరణి సరైందేనంటారా? లేదా డెనిసోవిచ్ అన్నట్టు తలపొగరా?" అని అడిగాడు. అగ్గిపెట్టె కోసం జేబులు తడుముకొంటూ. "నా ఉద్దేశంలో వాన్య ఆలోచనే సరైనది" స్పష్టంగా చెప్పాను.

ఎందుకో నా సమాధానం చబ్‌కు నచ్చలేదు. "ఒక్కమాటలో తేల్చేశారు. వాడు అంటున్నది, ఆలోచిస్తున్నదీ సరైనదని చెప్పేశారు. చూడండి ఈ చిన్న అగ్గిపెట్టె కోసమే నేను ఇంతగా వెతక వలసి వస్తోంది. పైగా ఇది జీవితం. ఏమిటి మీరన్నది? వాన్య ఆలోచన సరిగ్గానే ఉందని. అంతేగా. డెనిసోవిచ్‌కి పదముగ్గురు పిల్లలు. వాన్య పెద్దవాడు. అలా తండ్రిని ఆపిల్ పళ్లు, చేపలూ అని హేళన చేయడం తగునా?" అన్నాడు.

"చూడు చబ్ ఇప్పటిదాకా ఆ మేనమామ దగ్గరికి పంపాలనుకుంటున్నందుకు నువ్వు డెనిసోవిచ్‌ని తప్పు పట్టావ్. ఇప్పుడు పట్టణం వెళ్ళి ఆ మామ దగ్గర ఉండనంటున్న వాన్యని తప్పంటున్నావు. ఏమిటిది?" అని అడిగాను.

అవును. పట్టణంలో అడ్డదిడ్డంగా సంపాదన మరిగిన మేనమామ దగ్గరికి కొడుకుని పంపాలను కొంటున్న డెనిసోవిచ్‌పై నాకు కోపం వచ్చిన మాట నిజమే. అయితే ఆ మేనమామ సంపాదన అన్నది డెనిసోవిచ్ నైతికతకు సంబంధించిన సమస్య. దాంతో పిల్లవాడికి సంబంధం లేదు. వాన్య ఆలోచించవలసిందల్లా తండ్రికి భారం తగ్గడం గురించే. పట్టణం వెళ్లి ఆ మేనమామ దగ్గర చదువుకొంటే తండ్రికి కొంత ఊరట కలుగుతుందని వాన్యకు అర్థం కాకపోతే ఎలా? ఇవాళ పిల్లలంతా అలానే ఉన్నారు మరి" అన్నాడు చబ్.

నేను సమాధానం చెప్పలేదు.



మొత్తానికి వాన్య పంతం నెగ్గించుకున్నాడు. పట్టణం వెళ్లకుండా మా ఫ్యాక్టరీ శిక్షణా కేంద్రంలో చేరాడు.

ఈ మొత్తం ఉదంతం నాకు అనేక కోణాలనుంచీ ఆసక్తి కలిగించింది. వాన్య వ్యక్తిత్వాన్ని మొత్తంగా అర్థం చేసుకోవాలనిపించింది. ఇటువంటి వ్యక్తిత్వం ఎలా ఏర్పడుతుంది? ఇది మా వంటి అధ్యాపకులకు అతి ముఖ్యమైనది. వెట్కిన్ల కుటుంబం వంటి అతి చిన్న వ్యవస్థ నుంచీ కూడా నేర్చుకోవలసింది ఏమైనా ఉంటే నేను సిగ్గుపడను. వాన్య వంటి వ్యక్తిత్వం, ఆ స్వభావం పుట్టుకతోనే వచ్చాయని నేననుకోలేకపోయాను. అలాగే సవ్యంగా పెంచితే ఎటువంటి పిల్లలనైనా ఆసక్తికరమైన, ఆరోగ్యకరమైన వ్యక్తిత్వంగల మనిషిగా రూపొందించవచ్చన్న సిద్ధాంతంతో కూడా నేను పూర్తిగా ఏకీభవించలేను. తల్లితండ్రుల పెంపకం మాత్రమే కాక సరైన విద్య, సానుకూలమైన సామాజిక పరిస్థితులు లేకుండా వ్యక్తిత్వ వికాసం సాధించడం కష్టమని నా అభిప్రాయం. మరి వాన్య ఇంతటి పరిపూర్ణమైన వ్యక్తిగా ఎలా అవగలిగాడు? ఈ ప్రశ్నకు సమాధానం అతని కుటుంబంలోనే ఉండి ఉండాలి.

★ ★ ★

కొద్ది రోజుల తరువాత వాన్యతో మాట్లాడే అవకాశం లభించింది. క్రితంసారి మేం ఎదురుపడిన ఓక్ వృక్షాల గుబురులోనే మేం కలిసాం మళ్లీ. ఆ రోజు సెలవు కావడంతో నేను ఒంటరిగా బయలుదేరి ఆ వంకరటింకర బాటపై నడుస్తూ ఏదో ఆలోచిస్తున్నాను. అక్కడ వాన్య పుట్ట గొడుగులు ఏరుతూ కనిపించాడు. కొంతకాలం క్రితం డెనిసోవిచ్ అన్న మాటలు గుర్తొచ్చాయి.

"ఈ పుట్టగొడుగులున్నాయి చూశారూ? శ్రేష్ఠమైనవండీ. కూరలకు డబ్బులేనప్పుడు అలా అడవిలోకి వెళ్లి ఖర్చు లేకుండా వాటిని సంపాదించగలం. మంచి రుచిగా ఉంటాయి. పైగా ఆరోగ్యం కూడా" అన్నాడాయన.

ఆ మాటలు గుర్తు తెచ్చుకుంటూ వాన్యను గమనిస్తున్నాను. వాడి భుజానికి ఉన్న పెద్ద సంచి అప్పటికే పుట్టగొడుగులతో నిండి ఉంది. ప్రస్తుతం వాడు తన చొక్కా ముందు భాగాన్ని మడిచి ముడివేసి మరో సంచిగా తయారుచేసి పుట్టగొడుగులు ఏరుతున్నాడు. నన్ను చూసి ఆనందంగా పలకరించాడు.

"నాన్నకి ఈ పుట్టగొడుగులంటే చాలా ఇష్టం. వీటిని వేయించి, ఉప్పు చల్లితే ఇష్టంగా నములుతాడు. అయితే తెల్లటి పుట్టకొక్కులుంటే బావుండేది. అవి ఇక్కడలేవు" అన్నాడు.

నేను ఒక చెట్టు మొదల్లో కూర్చుని సిగరెట్ ముట్టించాను. వాన్య నా ఎదురుగా గడ్డిలో కూర్చుని భుజాన ఉన్న సంచిని పక్కన పెట్టాడు. నేనువాడిని సూటిగా అడిగేశాను. "వాన్య. ఒక అనుమానం. నువ్వు గర్వం వల్లనే మీ మేనమామ ఇంటికి పోలేదని మీ నాన్న అన్నాడు. ఆయన అభిప్రాయం సరైనదేనా?" అని ప్రశ్నించాను.

వాన్య తన స్పష్టమైన నీలికళ్లతో నా వంక నిశ్చలంగా చూశాడు. "గర్వం? దేనికి? నాకు వెళ్లాలనిపించలేదు. అయినా మేనమామతో నాకేంటి పని?" అన్నాడు.

"భలేవాడివే వాన్య. మీ మేనమామ ఇంట్లో అంతా సౌకర్యంగా ఉంటుంది. అదీకాక ఇంట్లో ఒక్కరు తగ్గినా మీ కుటుంబానికి కొంత బరువు తగ్గినట్టే కదా?" అని అడిగాను.

అడిగానే కానీ, మరుక్షణం నాకు మనస్సు చివుక్కుమనిపించి, తప్పు చేసినట్టు ఓ వెర్రినవ్వు నవ్వాను. అయినా వాన్య హావభావాల్లో మార్పులేదు. వాడు అలానే నిశ్చలంగా నా వంక చూస్తున్నాడు.

"నిజమే నాన్నకి కష్టంగానే ఉంది. కానీ అందుకోసం నేను అందరికీ దూరమవ్వాలా? అదీకాక నేను వెళ్లిపోతే నాన్నకి మరింత కష్టం అవుతుంది" అన్నాడు వాన్య. అప్పుడు నా మొహంలో ఏ భావాలు కనిపించాయో చెప్పలేను. వాన్య మాత్రం పెద్దపెట్టున నవ్వుతూ, గడ్డిపై కాళ్లని తాటించాడు.

"ఏమనుకుంటున్నారు? నాన్న నన్ను పట్టణం ఎందుకు పంపాలనుకున్నాడో తెలుసా? నాన్న పైకి కనిపించడు కానీ టక్కరినక్క. నన్ను పంపించేస్తే నాకు సుఖంగా ఉంటుందని మాత్రం ఆలోచించాడు. అదీ సంగతి" అని మళ్లీ నవ్వాడు.

"అవును నువ్వు పట్టణం వెళితే నీకూ బావుంటుంది. నాన్నకీ భారం తగ్గుతుంది" అన్నాను మొండిగా.

"అదేం కాదు" అంటూ వాన్య చిరునవ్వుతో కొనసాగించాడు. నేను అక్కడికి వెళ్తే నాకు బానే ఉండచ్చు. కానీ ఒక్కణ్ణి తగ్గితే నాన్నకి తగ్గే బరువు ఎంత? ఆయన నా సుఖం గురించే ఆలోచించాడు. చూడండి నేనిప్పుడు ఫ్యాక్టరీ స్కూల్లో 28 రూబుళ్లు సంపాదిస్తున్నాను" అన్నాడు వాన్య.

"అంటే కావాలనే మంచి అవకాశాన్ని వదులుకొన్నావా?"

"ఏది మంచి అవకాశం? మీరు దాన్ని మంచి అవకాశం అంటారా? దానికోసం నేను ఇక్కడ నాన్నని ఈ కష్టాలకి వదిలి వెళ్లిపోవలసిందంటారా? అది మంచిపనా? అయినా పట్టణంలో మాత్రం ఏం బావుంటుందని? వాళ్లు బాగా పుష్టిగా తింటారు. నిజమే. కానీ ఇక్కడే బావుంటుంది. మా ఇంట్లో మా భోజనాల బల్ల దగ్గర కూర్చుని అందరితో కలిసి తింటేనే బావుంటుంది. నిజమే మేం ఖరీదైన స్టర్జన్ చేపలు తినలేకపోవచ్చు. అయితే వీళ్లందరినీ వదిలివెళ్లాల్సినంత శ్రేష్టమైనదా చేప?" అంటూ అల్లరిగా నవ్వి కనుబొమ్మలెగరేశాడు. ఒకసారి ఊపిరి తీసుకొని మళ్లీ మొదలుపెట్టాడు. "నాకు ఆ చేప ఇష్టం లేదు. అంతకంటే ఈ పుట్టగొడుగులు, చెర్రీపళ్లు బావుంటాయి. ఒక పెద్ద గిన్నె నిండా వేడివేడిగా పుట్టగొడుగుల కూర పెట్టుకొని, నాన్న అప్పుడప్పుడు వేళాకోళంగా అనే మాటలు వింటూ సరదాగా భోజనం చేస్తాం. తమ్ముళ్లు, చెల్లెళ్లు కూడా తక్కువ వారేం కాదు. వాళ్ల అల్లరి వాళ్లది. దీన్నంతటినీ వదిలి పట్టణం వెళ్లాలా? వెళ్లనుగాక వెళ్లను" అన్నాడు.

ఈ సంభాషణ వల్ల నేను ఏమీ తెలుసుకోలేకపోయాను. వాన్య తనకు గర్వం ఏ మాత్రం లేదని పట్టణంలో కంటే ఇంటి దగ్గరే తనకు బావుంటుందని నాకు నచ్చచెప్పే ప్రయత్నం చేశాడు. మేం విడిపోతున్నప్పుడు నన్ను వాళ్ల ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. "ఓసారి మా ఇంటికి రండి. మాతో భోజనం చెయ్యండి. మీరే చూడండి. నేను చెప్తున్నది నిజమో కాదో" అన్నాడు అపేక్షగా. తన గొంతులో అస్పష్టంగా ఓ చిన్న సవాలు కూడా ధ్వనించింది.

"సరే. వస్తాను" అన్నాను.

"నిజంగా రండి. ఏడుగంటలకి వచ్చేయండి. సరేనా?" అన్నాడు.

ఏడు గంటలకి నేను వెట్కిన్‌ల ఇంటికి వెళ్లాను. డెనిసోవిచ్ వరండాలో బల్ల ముందు కూర్చొని ప్రశాంతంగా పేపరు చదువుతున్నాడు. అతని భార్య అన్నా, కూతురు ఒక్సానాలు బయట చెట్లకిందే ఏర్పాటు-చేసిన వంటగదిలో హడావుడిగా ఉన్నారు. ఒక్సానా నా వంక పని

ఆపకుండానే చూస్తూ ఆప్యాయంగా నవ్వుతూ తల్లితో ఏదో చెప్పింది. అన్నా చుట్టూ పరికించి చూసి చేతులు తుడుచుకుంటూ నా దగ్గరికి వచ్చింది.

"రండి. రండి. చాలా సంతోషం. వాన్య చెప్పాడు మీరు వస్తారని" అంటూ వెనక్కి తిరిగి భర్తని పిలిచింది. "ఏమండీ మన అతిథి సంగతి చూడండి? ఆ పేపరు ఎప్పుడైనా చదవచ్చు".

డెనిసోవిచ్ పేపర్ పక్కనపెట్టి కళ్ల అద్దాలు తీసి నా వంక చూసి ఆందోళనగా పెదాలు చప్పరించాడు. అది అతనికి అలవాటైందనుకుంటాను. నన్ను ఆహ్వానించిన పెద్ద వాన్య గుమ్మం దగ్గర నిలబడి నవ్వుతూ నా వంక చూస్తున్నాడు. వాడి వెనకాల చిట్టి మరూస్య తన గులాబీ బుగ్గలు సొట్టపడేలా నవ్వి, లేత నీలికళ్లతో నా వంకే దీక్షగా చూసింది.

ఐదు నిమిషాల తరువాత అందరం భోజనాల బల్ల చుట్టూ పొడవాటి బెంచీలపై కూర్చున్నాం. బల్లమీద ఎటువంటి అలంకరణలూ లేవు. అయితే ఏ రంగూ వేయని బల్లపై చెక్క సహజమైన తెల్లటి రంగులో పరిశుభ్రంగా మెరుస్తోంది. అక్కడ కూర్చోగానే ఆ చెక్కని నిమరకుండా ఉండలేక పోయాను. డెనిసోవిచ్ దీన్ని గమనించాడు.

"బావుంది కదూ! నాకు బల్ల ఇలా ఉంటే ఇష్టం. ఇందులో ఎటువంటి పైమెరుగులు, ఆట్టహాసం ఉండవు. అదే దీనిపై బట్ట పరిచారనుకోండి. కొందరైతే మురికి కనిపించకూడదని ముదురురంగు బట్ట పరుస్తారు. ఏం బావుంటుంది? ఇక్కడ ఈ బల్ల నిజంగా, శుభ్రంగా లేదూ?" అని అడిగాడు.

ఇంటి వాతావరణంలో డెనిసోవిచ్ మరో మనిషిలా కనిపించాడు. మామూలుగాకంటే మరింత ఆత్మవిశ్వాసం అతనిలో తొణికిసలాడింది. మామూలుగా ప్రతి చిన్న విషయానికీఆందోళన చెందినట్టు కనిపిస్తూ, పెదవులను చప్పరించే పెద్దమనిషి ఇంటిదగ్గర ప్రశాంతంగా, హాయిగా ఉన్నాడు. తెల్ల కర్టెన్ వెనక ఉన్న పొయ్యి చుట్టూ నిలిచిన ఇంటి పనుల బృందం - నలుగురు పిల్లలూ, మా సంభాషణ వింటున్నారు. ఇంతలో ఏడేళ్ల ల్యూబా అక్కడికి దూసుకొచ్చింది. ఆమె మెడలో ఎర్ర చెర్రీ పళ్లతో చేసిన హారం ఉంది. ఆ పిల్ల అక్కడికి రావడమే ఓ దుమారం అనిపించింది. వచ్చీ రాగానే "అయ్యో ఆలస్యం అయిందే" అంటూ వాన్య వంక తిరిగింది. "కానీ.......... వాన్య ఇవ్వు" అంది చేతులు జాపి.

తదేకంగా చూడగల గోధుమ వన్నె కళ్ల చిన్న వాన్య గంభీరంగా నేలపై వంగి వంటింటి బీరువా కింది అరనుంచి ముందు శ్రద్ధగా కోసిన పెద్ద రొట్టెలతో నిండిన బుట్టను, తరువాత లోతైన పళ్లాలు, అనేక చిన్నకత్తులు, అల్యూమినియం చెంచాలు, ఉప్పు డబ్బాలు తీసి ల్యూబాకు అందించాడు. ఆ పిల్ల శ్రద్ధగా అన్నయ్య ఇస్తున్న సరంజామాను అందుకుని వేగంగా బల్లపై సర్దడం మొదలుపెట్టింది. వీళ్లిద్దరూ ఈ పనిలో ఉండగా పెద్ద వాన్య, విట్యాలు ఓ మూలనుంచి రెండు చెట్టు బెరళ్లు తెచ్చి బల్ల పక్కగా పెట్టి, దీనిపై ఒక చెక్కపలకను అమర్చడంతో బల్ల పక్కనే ఓ తాత్కాలికమైన రెండో బల్ల ఏర్పాటైంది. వెంటనే ల్యూబా దానిపై అందరికీ పళ్లాలు అమర్చింది. ఇదంతా పరిశీలిస్తున్న నేను ఈలోగా కటుంబ సభ్యులందరూ బల్ల చుట్టూ చేరి తమ స్థానాల్లో సర్దుకోవడం గమనించలేదు. ప్రతి ఒక్కరూ టేబిల్ వద్ద కూర్చోనేందుకు వీలుగా తమ పొడవును బట్టి చిన్న చిన్న పీటలు, చెట్టు మొదళ్లు తెచ్చి సర్దుకొంటున్నారు. ఈలోగా ఇద్దరు చిట్టి కవల పిల్లలూ తేలికపాటి చెక్క పీటలను అతి కష్టంమీద తీసుకొనివచ్చి తాత్కాలిక

బల్ల పక్కన వేసుకుని భయం భయంగా చూస్తూ కూర్చున్నారు. నాలుగేళ్ల వేరా కళ్లు చికిలిస్తూ నవ్వుతూ పెద్ద గరిట పట్టుకుని బల్లపై దరువు వేయడం ప్రారంభించింది. నేను ఆ పిల్లవంక చూస్తూ, పాడే పాట వింటూ మైమరిచిపోయానేమో, బల్లమీదకి వేడివేడి బంగాళాదుంపల కుండలు రావడం చూడలేదు. అన్నా తన వంటగది దుస్తులు మార్చుకొని, లేత గులాబీరంగు గౌను ధరించి భోజనం బల్ల వద్దకు చేరింది. ఒక్సానా, సెమ్యోన్‌లు బాగా వేయించిన పుట్టగొడుగులతో నిండిన రెండు పెద్ద పాత్రలను బల్లపై ఉంచారు. పెద్ద వాన్య మా పెద్దవాళ్లతో కాకుండా, చిన్నారి మరూస్య పక్కన తాత్కాలిక బల్ల పక్క కూర్చున్నాడు. ఆనందంగా కళ్లు చిట్లిస్తూ కుండమీది మూత తీయడంతో దట్టమైన పరిమళంతో కూడిన పొగలు వచ్చాయి. మరూస్య వంగి ఆసక్తిగా ఆ గిన్నెలోకి తొంగి చూసింది. ఆనందంతో కళ్లు మూసుకుని పెద్దగా పాట ప్రారంభించింది. వెరా కూడా ఆ పిల్లతో గొంతు కలిపింది. అందరూ గట్టిగా నవ్వి, ఇక ఆపమని వారిని కోరుతున్నారు. పెద్ద వాన్య గిన్నెలోంచి బంగాళాదుంపలు తీసి వెరా పళ్లెంలో పెట్టాడు. ఆ పిల్ల గభాలున పాట ఆపి ఆ బంగాళాదుంపల వైపు ఆసక్తిగా చూసింది.

అన్నా పెద్దవాళ్లమైన మా ముగ్గురికీ వడ్డించింది. మిగతా బాధ్యత ఒక్సానా స్వీకరించింది. అందరూ వేళాకోళాలు చేసుకుంటూ, వేడిగా ఉన్న దుంపలని వలుస్తూ హడావుడిగా ఉన్నారు. నేను ఇంత అహ్లాదకరమైన మనుషులతో కలిసి ఇలా భోజనం ఎన్నడూ చేయలేదు. నేను చాలా సందర్భాల్లో అనేకమంది ఇళ్లకు అతిథిగా వెళ్లాను కానీ ఇంత కలిసికట్టుగా ఉన్న కుటుంబం నాకు ఎప్పుడూ ఎదురవలేదు. సాధారణంగా బయటివారిని భోజనానికి పిలిచిన సందర్భాల్లో ఇంట్లోని పెద్దలు మాత్రమే అతిథులతో ఉండి, పిల్లలను బయటకు పంపుతారు. కానీ ఇక్కడ అంతా భిన్నంగా ఉంది. నా చుట్టూ కూర్చున్న పిల్లలు కొత్తవాడినైన నా వంక భయంగా, ఆసక్తిగా చూస్తున్నారు. అదే సమయంలో వాళ్ల ఆటలు, వేళాకోళాలు కొనసాగిస్తున్నారు. మళ్లీ తిండిపై ఆసక్తి కనబరుస్తున్నారు. వాళ్ల మాటలు నాకు ఒక్క అక్షరం కూడ బోధ పడడం లేదు. కానీ వాతావరణం మాత్రం ఎంతో ప్రశాంతంగా, అదే సమయంలో పిల్లల నవ్వుల పరిమళాలతో ఘుమఘుమలాడుతూ హాయిగా అనిపించింది. అదే సమయంలో ఇటీవలి కాలంలో ఎప్పుడూ లేనంత ఆకలి అనిపించింది. వంటకాలు ఆర్భాటంగా లేకున్నా మంచి రుచిగా, శుభ్రంగా, ఆరోగ్యకరంగా ఉన్నాయేమో తెగ తినేశాను.

భోజనాలు సాగుతుండగా డెనిసోవిచ్ కబుర్లు ప్రారంభించాడు. పాత - కొత్త జీవితం మధ్య తారతమ్యాన్ని అతను వివరించాడు. "నేను, అన్నా ఎప్పుడూ, దేనికీ భయపడలేదు. అయితే భయపడేందుకు సమస్యలు లేవని కాదు. మొదటిది పేదరికం. రెండోది పోలీసు భయం. మూడోది బతుకు నిస్సారంగా సాగడం.... అలా గడిచాయి రోజులు".

"పోనీ ఇప్పుడు కాలం సరదాగా, సంతోషంగా గడుస్తోందా?" తెలుసుకోగోరాను నేను. "సరదాగా? అంటే... ఏమో. ఒక్సానా వచ్చే ఏడాది ఈ సరికి పట్టణంలో రబ్‌ఫాక్‌లో చేరుతుంది. ఎనిమిదేళ్లలో తను భవన నిర్మాణాల ఇంజనీర్ అవుతుంది. ఇది కలే అయితే, మా నాన్న తన అరవై ఏళ్ల జీవితంలో ఎన్నో వేల కలలు కని ఉంటాడు. అయితే ఒకటి మాత్రం చెప్పగలను. ఆయన తన కూతురు ఒక ఇంజనీర్ అవుతుందని కలలో కూడా ఊహించి ఉండడు. ఎంత తాగినా సరే" అన్నాడు డెనిసోవిచ్.

"మరి మీకు మాత్రం అలాంటి కలలు వస్తున్నాయా?" అన్నా తన భర్తను అడిగింది. "అదేంమాట! నిన్నటికి నిన్న రాత్రి కలలో ఇంజనీర్ ఒక్సానా కనిపించి నాకు ఒక కోటు బహుమతి ఇచ్చింది. చాలా ఖరీదైన బొచ్చుతో చేసిన కోటు అది. నాకెందుకిది? కొలిమి దగ్గర కూర్చుని ఈ కోటు వేసుకొని పని చేయాలంటే నాకు చాలా ఉక్కగా ఉంటుందని ఒక్సానాతో చెప్పాను. అప్పుడు ఒక్సానా ఏమందో తెలుసా? ఈ కోటు కొలిమి దగ్గర వేసుకొనేందుకు కాదు. ఇది ధరించి నువ్వు నాతో రా. నేను అక్కడ ఒక రేడియో స్టేషన్ నిర్మాణ బాధ్యతలు చేపట్టాను అంది. ఒక్సానా కూడా అతి పెద్ద ఖరీదైన బొచ్చుతో చేసిన కోటు వేసుకొని ఉంది..."

నా పక్కన కూర్చొన్న ఒక్సానా బుగ్గలు సిగ్గుతో కందిపోయాయి. తండ్రి కంటున్న కలలు ఆమెను పెద్దగా ఇబ్బంది పెట్టలేదు కానీ, కాబోయే రేడియో స్టేషన్ నిర్మాతను అందరూ ఆసక్తితో చూడడంతో ఆమె కలవరంతో సిగ్గుపడుతుందని గమనించాను.

"ఒక్సానా, నీ రేడియో స్టేషన్ భవనం చూసేందుకు నేను వస్తాను, మరి నాకు మంచి బూట్లు తెచ్చిస్తావా?" అడిగాడు వాస్య.

అందరం ఘొల్లున నవ్వాం. తరువాత పిల్లలంతా గోలగోలగా మాట్లాడుతూ పెద్దక్క ఇంజనీరు అయిన తరువాత తమకు ఏ బహుమతి ఇవ్వాలో జాబితాలు విప్పారు.

పెద్ద వాన్య ఇదేమీ పట్టించుకోకుండా, "మరయితే నాన్నా, నువ్వు నా గురించి ఎలాంటి కల కనలేదా?" అని అడిగాడు.

"ఎందుకు లేదు?" అంటూ డెనిసోవిచ్ తన పెద్ద అరచేతిని టేబిల్‌పైకి చాపాడు. "ఒక కల వచ్చింది. అదంత మంచి కల కాదు మరి" అన్నాడు. అందరం ఆసక్తిగా అతనివైపు చూస్తున్నాం.

"నువ్వు నీ మేనమామగారింటికి వెళ్లి, పెద్ద ఆపిల్ తిని జబ్బు పడ్డావుట. జనం నా దగ్గరకొచ్చి ఆ సంగతి చెప్పారు" అని పెద్దకళ్లతో గంభీరంగా చెప్పాడు డెనిసోవిచ్.

అందరూ మళ్లీ నవ్వారు. వాన్య మాత్రం ఊరుకోకుండా "మరి స్టర్జన్ చేప సంగతేమిటి? నేను అదికూడా తిని ఉంటాను. అందుకే పొట్టనెప్పి వచ్చి ఉంటుంది" అన్నాడు తేలికగా. అందరూ నవ్వు మొహాలతో పెద్ద వాన్యవైపు చూస్తున్నారు. వాడు తను కూర్చున్న చోటే లేచి నిలబడి "అప్పుడేమైందిట? నేను చచ్చిపోయానా?" అని తండ్రిని అడిగాడు. "లేదు వాళ్లు నిన్ను ఆసుపత్రికి తీసుకెళ్లి బ్రతికించారు" అని బదులిచ్చాడు డెనిసోవిచ్.

తిండి పూర్తయిన తరువాత డెనిసోవిచ్ లేచి పెద్ద టీ పాత్రను (సమోవార్) తెచ్చి బల్లపై ఉంచాడు. అందరం టీ తాగుతుండగా ఒక్సానా దాదాపు అరమీటరు వ్యాసార్ధం ఉన్న రెండు పెద్ద కేకులను తెచ్చింది. ఆ అతి పెద్ద కేక్‌ని చూస్తే నాకు నా ఉక్రైన్ బాల్యం గుర్తు వచ్చింది.

★ ★ ★

ఈ అనుభవం తరువాత వెట్కిన్‌ల కుటుంబంతో నా పరిచయం పెరిగింది. సాన్నిహిత్యం ఏర్పడింది. అయితే వారితో నా స్నేహంలో నా స్వార్థ ప్రయోజనాలు ఉన్నాయి. ఆ కుటుంబం నుంచి నేనెంతో నేర్చుకొన్నాను. తెలుసుకొన్న విషయాల గురించి విపరీతంగా ఆలోచించాను.

కుటుంబాన్ని నడిపించడంలో, పిల్లల పెంపకంలో డెనిసోవిచ్ అనుసరించిన మార్గం శాస్త్రీయంగా, సాంకేతికంగా చూస్తే నూటికి నూరుపాళ్లూ సరైన పద్ధతి కాకపోవచ్చు. కానీ,

వర్తమాన సామాజిక అవసరాలు, స్థితిగతుల దృష్ట్యా ఆ కుటుంబం ఒక సమిష్టి స్ఫూర్తితో, సున్నితమైన అంశాలను నిర్లక్ష్యం చేయకుండా కొనసాగిన తీరు మాత్రం హృద్యంగా అనిపించక మానదు. సృజనాత్మక ఆశావాదం, అతి చిన్న చిన్న విషయాలకు సైతం ప్రాధాన్యం, విలువ ఇచ్చి ప్రతి అంశాన్నీ వారు పట్టించుకొన్నతీరు అద్భుతం అనిపించింది. ఇలా జీవనానికి సంబంధించిన అన్ని కోణాలనూ ఇంతలా పట్టించుకోగలగడం చిన్న విషయం కాదు. దీనికి కేవలం శ్రద్ధ మాత్రమే కాక, నిరంతర ఆలోచన కూడా అవసరం. చిన్న చిన్న అసంతృప్తులు, వివాదాలే పట్టించుకోకపోతే చివరకు మనుషుల మధ్య పెద్ద అగాధాలను సృష్టించగలవు. వాటిని ఎప్పటికప్పుడు అర్థం చేసుకోవడమే కాక, వాటి నేపథ్యం నుంచి భవిష్యత్తును ఊహించి తగినట్టు పథకాలు రూపొందించుకోవలసిన అవసరం కూడా ఉంది.

డెనిసొవిచ్ దీన్ని సాధించాడు. తన కుటుంబాన్ని చిన్న సమిష్టి వ్యవస్థగా రూపొందించి దాని సమస్యలని ఎంతో సహనంతో అర్థం చేసుకొని ఎప్పటికప్పుడు పరిష్కరించగలిగాడు. అలా అని అతని కుటుంబ జీవనం సంపూర్ణం అని అనలేం. కొన్ని కొరతలు అక్కడ లేకపోలేదు. అతను కొన్ని పొరపాట్లు చేయలేదని అనలేం. ఆయన పిల్లల్లో చివరివారు, అతి చిన్న పిల్లలు సైతం బాల్యానికి సహజమైన అల్లరి, మొండితనం వంటి లక్షణాలు లేకుండా పెరిగారు. అతి పిన్న వయస్సులోనే సమస్యల భారాన్ని ఎంతో కొంత అర్థం చేసుకొని అనుగుణంగా సహనం పాటించవలసి వచ్చింది. మా ఫ్యాక్టరీ ఆవరణలో చాలామంది పిల్లలే ఉండేవారు. వారందరిలో వెట్కిన్‌ల పిల్లలే సహనమూర్తులు, శాంతికాముకులు. ఎప్పుడూ ఆనందంగా, ఆహ్లాదంగా, సజీవమైన ఉత్సాహంతో, సరదాగా ఉండేవారు. అయితే ఘర్షణలు, వివాదాలను వాళ్లు ఏ మాత్రం సహించేవారు కాదు. వాటికి సావకాశం ఇచ్చేవారే కాదు.

ఒకరోజు వాలీబాల్ కోర్టులో ఒక సంఘటన జరిగింది. ఎప్పుడూ ఉత్సాహంగా, ఉద్రేకంగా ఉండే పద్నాల్గేళ్ల వొలోద్యా ఆట నిబంధనలను కాదని బంతిని సర్వ్ చేసే అవకాశాన్ని మరొకరికి ఇవ్వకుండా తానే కొనసాగించదలిచాడు. అతను మంచి ఆటగాడు కాబట్టి, అతని జట్టు అందుకు అభ్యంతరం వ్యక్తం చేయలేదు. కానీ అది నిబంధనలకు విరుద్ధం. ప్రత్యర్థి జట్టు నాయకుడైన సెమ్యోన్ వెట్కిన్ మాత్రం బంతిని తన చేతుల్తో అడ్డుకుని ఇంకా వొలోద్యా సర్వ్ చేయడంపై తన అభ్యంతరాన్ని తెలిపాడు. ఆ మ్యాచ్‌కి రిఫరీ లేడు.

"ఇంకా నువ్వే సర్వీస్ చేయడం కుదరదు. మీ జట్టులో మరెవరికైనా ఆ అవకాశం ఇవ్వు" అన్నాడు సెమ్యోన్.

వొలోద్యా పొగరుగా తల ఎగరేశాడు. "అది నీకు అనవసరం. మీ జట్టులో కూడా చేతనైతే ఎవరైనా ఆట మొత్తం సర్వ్ చెయ్యమను. మేం ఆపం" అన్నాడు.

ఇలాంటి సందర్భాల్లో పిల్లల మధ్య సాధారణంగా గొడవలు అనివార్యం. దెబ్బలాడుకోవడం, ఆట మానేయడం మామూలుగా జరిగేదే. అదే పిల్లలకు తెలిసిన న్యాయం. కానీ సెమ్యోన్ సహనం కోల్పోలేదు. ఓ నవ్వు నవ్వి బంతిని ప్రత్యర్థి జట్టువైపు విసిరాడు.

"సరే ఆడండి" అని తన జట్టు ఆటగాళ్ల వైపు తిరిగి "ఏం చేస్తాం. అది వాళ్ల బలహీనత. వాడు తప్ప బంతిని సరిగ్గా సర్వ్ చేయగలవాడు ఆ జట్టులో మరెవరూ లేరు. వాళ్లకి కావలసింది గెలవడం" అని ఆట ప్రారంభించాడు.

చివరకు సెమ్యోన్ జట్టే ఆట గెలిచింది. ఈ పరాభవాన్ని వొలోద్యా తట్టుకోలేకపోయాడు. గొడవ పెట్టుకోవడమే అతని లక్ష్యంగా కనిపించింది. గెలిచిన జట్టు వెళ్లిపోతుంటే వాడు సెమ్యోన్‌ను అడ్డుకున్నాడు.

"నీ ఇష్టం వచ్చినట్టు మాట్లాడావు. మా జట్టు బలహీనమైన జట్టు అన్నావు. ఆ మాటని ఉపసంహరించుకో" అన్నాడు. వాడు తన రెండుచేతులూ ప్యాంటు జేబుల్లో పెట్టుకొని, గుండెల్ని ఎగదీసి సెమ్యోన్‌కు ఎదురు నిలిచాడు. కొట్లాట్లకి వాడు సిద్ధమయ్యాడని తెలిసిపోతూనే వుంది. కానీ సెమ్యోన్ వెట్కిన్ ప్రశాంతంగా చిరునవ్వు నవ్వాడు.

"సరే నేను తప్పే మాట్లాడాను. నా మాటని వెనక్కి తీసుకుంటున్నాను. మీది బలమైన జట్టే" అన్నాడు.

అప్పటికీ వొలోద్యా బింకం సడలలేదు. "నాకు తెలుసు మాది గట్టి జట్టేనని. రండి చేతనైతే మరో ఆట ఆడదాం" అని సవాలు విసిరాడు.

సెమ్యోన్, వాడి జట్టు అందుకు అంగీకరించి మరో ఆటకు సిద్ధమయ్యారు. కానీ ఈ ఆటలో సెమ్యోన్ జట్టు ఓడిపోయింది. సెమ్యోన్ ప్రశాంతంగా కోర్టునుంచి తన జట్టుతో సహా బయటికి నడిచాడు. కానీ అంతకుముందు వాడు వొలోద్యాతో స్పష్టంగా చెప్పాడు.

"మనది సరదా ఆట. ఇక్కడ రిఫరీ ఉంటే నువ్వు అలా అదేపనిగా సర్వ్ చేయడాన్ని ఆపేవాడు. కాదంటే నిన్ను బయటికి పంపేవాడు" అన్నాడు.

కానీ వొలోద్యా ఇదేం పట్టించుకునే స్థితిలో లేడు. వాడు ఆట గెలిచిన ఉత్సాహంలో ఉన్నాడు.

"సర్లే ఎలాగైతేనేం. మేం గెలిచాంగా" అన్నాడు.

★ ★ ★

పిల్లల పెంపకం, విద్యాబోధనలకు సంబంధించి పై సంఘటన నన్ను కొంత గందరగోళ పరచింది. వొలోద్యా గెలుపుకోసం నిబంధనలను ఉల్లంఘించాడు. ప్రత్యర్థులను దూషించాడు. అయినా సెమ్యోన్ నిగ్రహం కోల్పోలేదు. పిల్లలు ఇలా ఉండడం అసహజం అనిపించింది. సెమ్యోన్ తన సహజసిద్ధమైన సంయమనాన్ని, హాస్యప్రియతను ఆ ఘర్షణ సమయంలోనూ నిలుపుకోగలగడం అంత ఆరోగ్యకరమైన విషయంలా నాకు అనిపించలేదు. ఇదే విషయాన్ని డెనిసోవిచ్ దగ్గర ప్రస్తావించాను. అతని సమాధానం నన్ను ఆశ్చర్యపరిచింది. నేను చెప్పిన విషయాన్ని అతను తేలికగా తీసుకోలేదు. శ్రద్ధగా విన్నాడు. దాని గురించి నిముషమైనా ఆలోచించి నట్టు కనిపించాడు. చివరికి నెమ్మదిగా అయినా స్పష్టంగా చెప్పాడు.

"సెమ్యోన్ సరిగ్గానే వ్యవహరించాడనుకొంటున్నాను. వాడు తెలివైనవాడు" అన్నాడు. నాకు చిరాకు పుట్టింది. "అదెలా సరి అవుతుంది? మొదటినుంచీ వొలోద్యా అహంకారం తెలిసి పోతోంది. చివరకు వాడు తను అనుకున్నది సాధించాడు కూడా. ఇక వివాదం, ఘర్షణ తలెత్తి నప్పుడు ముగింపు ఇలా వుంటుందా?" అని ప్రశ్నించాను.

దీనికి డెనిసోవిచ్ నవ్వాడు. సాలోచనగా పైకి చూస్తూ అన్నాడు. "వొలోద్య సాధించింది శూన్యం. నిబంధనలకు విరుద్ధంగా వాడు ఆడాడు. నిజం చెప్పాలంటే వొలోద్య అసంకల్పితంగా తన బలహీనతను కనబరిచాడు. దీనివల్ల సెమ్యోన్ బలమైన వ్యక్తిత్వం స్పష్టంగా తెలిసివచ్చింది.

మీకు తెలియలేదా? ఇక్కడ రెండు ఘర్షణలు, వైరుధ్యాలు ఉన్నాయి. ఒకటి ఆటలో నిబంధనలకు సంబంధించినది. రెండోది ప్రత్యర్థుల మధ్య ఒక అవగాహనకు సంబంధించినది. ఆ అవగాహన అక్కడ ఏర్పడింది. మీరే చూశారుగా. చెప్తున్నారు కూడా. అక్కడ కొట్లాట ఏమీ జరుగలేదు. పైగా వాళ్లు మరో ఆట కూడా ఆడారు. అది మంచిదే" అని తల పంకించాడు.

"నాకెందుకో అది సహజంగా అనిపించలేదు డెనిసోవిచ్. అంతగా సర్దుకుపోవడం అవసరమా?" అని ప్రశ్నించాను.

"సర్దుకుపోవడం అవసరమా అంటే నేను చెప్పలేను. అనేక విషయాలపై అది ఆధారపడి వుంటుంది. నా ఉద్దేశం ప్రకారం ఇది కొట్లాటలకు సమయం కాదు. మనం ఆ అలవాటునుంచి బయటపడాలి. మనం పశువుల్లా వ్యవహరించడం మానాలి. మన మాట నెగ్గించుకోవడం కోసం ఎదుటివాడి గొంతు పట్టుకుంటే ప్రయోజనం ఏముంది? మనం అందరం కలిసి బతకాలి. సహజీవనం అవసరం కూడా. ఎవరైనా అవధులు మీరి ప్రవర్తిస్తే, శృతి మించితే పెద్దవాళ్లం మనం ఎలాగూ ఉండనే ఉన్నాం. ఆ ఆటకు రిఫరీ లేడు. అది పద్ధతి కాదు. సరే, అలా అని కొట్టుకు చావాలా? అవసరం లేదే" అన్నాడు డెనిసోవిచ్.

"ఇక్కడ వాలోద్య కుర్రవాడు. అది ఆట కాబట్టి సరే. రేపు సెమ్యోన్‌కు నిజమైన శత్రువు ఎదురైతే పరిస్థితి ఏమిటి?" అడిగాను.

"అది వేరే సంగతి. అలా జరిగితే, నిజంగా సెమ్యోన్‌కు హాని చేసేందుకు ఓ శత్రువు తయారైతే ఎలా ఎదుర్కోవాలో వాడికి తెలుసు. నాకు వాడిపైన నమ్మకం ఉంది. నిజంగా గొంతు నొక్కగల సమర్థత వాడికుంది. అంత తేలికగా వదలడు" అన్నాడు.

డెనిసోవిచ్ చెప్పిన దాని గురించి ఆలోచించాను. ఆటలో గొడవ జరిగినప్పుడు సెమ్యోన్ మొహంలోని ప్రశాంతత, వాడి కళ్లలో నిబ్బరం గురించి యోచించాను. డెనిసోవిచ్ చెప్పింది సవ్యంగానే తోచింది. నిజంగా శత్రువు అనేవాడు ఎదురైతే సెమ్యోన్ వెనక్కి తగ్గడన్న నమ్మకం నాకు కుదిరింది.

★ ★ ★

ఇదంతా జరిగి చాలా ఏళ్లయింది. వెట్కిన్ల కుటుంబం ఇంకా అలానే జీవన చైతన్యంతో నవనవలాడుతూ ముందుకు సాగుతోంది. వారి ఆర్థికస్థితి కూడా మెరుగైంది. అయినా వారి మధ్య సంబంధాలు ఇప్పటికీ అలానే పటిష్టంగా ఉన్నాయి. వారి మొహాల్లో అలసట, విసుగూ ఇప్పటికీ కనిపించవు. ఏదీలేదనే లోపం వారి హావభావాల్లో ఎన్నడూ లేదు.

పిల్లలు పెరిగి పెద్దవాళ్లయారు. తండ్రికి అండగా నిలిచారు. మొదట్లో రబ్‌ఫాక్, ఫ్యాక్టరీ శిక్షణా కేంద్రాలనుంచి అందిన విద్యార్థి ఉపకార వేతనాలను యథాతథంగా ఇంట్లో ఇచ్చేవారు. తరువాత ఉద్యోగాల్లో చేరి తమ జీతాలనూ తండ్రి చేతికే ఇచ్చేవారు. ఒక్సానా తండ్రి కలలను నిజం చేస్తూ భవన నిర్మాణాల ఇంజనీర్ అయింది. మిగిలినవారూ వివిధ స్థాయిల్లో స్థిరపడ్డారు.

వెట్కిన్ల కుటుంబం అంటే నాకే కాక మా ఫ్యాక్టరీలో అందరికీ అభిమానం ఏర్పడింది. డెనిసోవిచ్ ఇంటి వ్యవహారాల్లోనే కాక తన పరిసరాలకు సంబంధించిన విషయాల్లో సైతం చురుకుగా తన పాత్ర నిర్వహించేవాడు. ఎవరికి ఏ సమస్య ఎదురైనా అంతే స్థిరంగా, నిశ్చలంగా

దాన్ని ఎదుర్కొనేవాడు. పరిష్కారాలు సూచించేవాడు. 1930లో మా ఫ్యాక్టరీలోని కమ్యూనిస్టు పార్టీ శాఖలోకి అతన్ని ఘనంగా ఆహ్వానించాం.

నేటికీ వెట్కిన్ల కుటుంబ వ్యవహారశైలి, పిల్లల పెంపకానికి సంబంధించి వారు అనుసరించిన మార్గం నన్ను ఆకర్షిస్తూనే ఉంది. నేనే కాదు మిగిలినవారు కూడా డెనిసోవిచ్ దంపతులనుంచి ఎంతో కొంత నేర్చుకొన్నారు. ఈ కుటుంబం ప్రభావం చబ్ సంసారంపై పడిందని నాకు కచ్చితంగా తెలుసు. అలా అని అంతకు ముందు చబ్ కుటుంబం అస్తవ్యస్థంగా ఉండేదని కాదు. కానీ, ఎప్పుడూ ఏదో గందరగోళం, గొడవలు, వైరుధ్యాలు వారిని చుట్టుముట్టేవి. చబ్ కూడా తాను కుటుంబ పెద్దననే అహంకారం ప్రదర్శించడం కానీ, తన పంతమే నెగ్గాలనే మొండి పట్టుదల కానీ కనబరిచేవాడు కాదు. మనుషుల్ని అర్థం చేసుకోవడం, ప్రేమగా చూడడం తనకి తెలుసు. దానికి డెనిసోవిచ్ సాహచర్యం కూడా తోడవడంతో అతను మరింత క్రియాశీలంగా, నిర్మాణాత్మకంగా వ్యవహరిస్తూ తన పిల్లలను మరింత బాగా పెంచగలిగాడు. అయితే వెట్కిన్ల పిల్లలు తన పిల్లలకంటే ఎక్కువమంది కావడం చబ్‌కు ఎందుకోగాని ఈర్ష్యగా అనిపించేది. చబ్ దంపతులకు కొంతకాలం తరువాత ఏడో పిల్లవాడు కలిగాక పెద్ద విజయోత్సవం జరిపాడు. సహచరులందరికీ భారీ పార్టీ ఇచ్చాడు. చివర్లో ఓ ఉపన్యాసం ఇచ్చాడు.

""ఏడో పిల్లవాడిగా పుట్టడం ఓ అదృష్టం. నిజానికి నేను మా అమ్మానాన్నలకు ఏడో కొడుకుని. చిన్నప్పుడు ఓ మంత్రగత్తె చెప్పింది. ఏడో పిల్లవాడు అసాధ్యుడు. వాడు కనుక ఒక కోడిగుడ్డును తన చేతికింద, చంకలో నలభై రోజులూ, రాత్రులు ఉంచుకోగలిగితే - అంటే పొదగడం అన్నమాట. ఆ గుడ్డులోంచి బుల్లి రాక్షసుడు బయటికి వస్తాడు. వాడు ఈ పిల్లవాడికి జీవితాంతం బానిసగా ఉంటాడు. ఏం చెబితే అది చేస్తాడు అని ఎన్నిసార్లు ప్రయత్నించానో, ఎన్ని గుడ్లు బద్దలయ్యాయో, ఎన్ని చొక్కాలు పాడయ్యాయో చెప్పలేను. ఒక్కసారి కూడా గుడ్డును రెండోరోజు వరకూ భద్రంగా ఉంచగలిగేవాడిని కాదు. మా నాన్న నా వీపు చిట్లగొట్టేవాడు. మన సొంత రాక్షసుడిని మనం పొదగడం కొంత కష్టమే. ఏమైనా అది వేరే విషయం. ఏడో కొడుకు మాత్రం అదృష్టవంతుడు" ఇదీ ఆ ఉపన్యాసం.

ఇది విని మా ఎకౌంటెంట్ మొహం చిట్లించాడు. "ఎన్ని వేల సంవత్సరాల నుంచి ఈ రాక్షసులు మనల్ని వెన్నాడుతున్నాయో! అసలు ప్రతి మనిషి వెంట ఒక దయ్యం ఉంటుందని ఎవరో ఒకసారి అన్నారు. మొత్తంగా చూస్తే ఈ దయ్యాలూ, దేవతలూ మనిషి బ్రతుకుని ఏ మాత్రం మార్చిన దాఖలాలు కనిపించవు" అని విసుకున్నాడు.



# CHAPTER - 4

## 'డబ్బు జబ్బు'కు ఎన్ని చికిత్సలు?!

డబ్బు! మనిషి కనిపెట్టిన అన్ని విషయాల్లో ఇంత దుర్మార్గమైనది ఇంకొకటి లేదు. మానవుడు అప్రయత్నంగా ఆవిష్కరించిన భూతం ఈ డబ్బు అనే పదార్థం. డబ్బు విషయానికి వచ్చేసరికి మనుషులు ఎంత దౌష్ట్యానికి, మోసానికీ పాల్పడగలరో ఊహించేందుకు కూడా వీలు లేదు. వాటికి పరిమితులే లేవు. దానివల్ల మనుషుల్లో వంచన అనే గుణం వెయ్యి ఊడల మర్రిలా విస్తరిస్తుంది.

సోషలిస్టు సమాజంలో ఇటువంటి పరిణామాలకు తావుండదని మన నమ్మకం. ఉండదని సూత్రీకరణ. కానీ ఈ సమాజంలోనూ డబ్బుకోసం, అది ఇచ్చే సుఖాల కోసం వెంపర్లాడేవాళ్లు ఉన్నారు. ఇదొక అంటువ్యాధి కూడా. వంచనా శిల్పుల నేపథ్యం, మానసిక, మేధోస్థితి ఏమిటి? అవధులు మీరిన అహంకారం, విలువలపై అవిశ్వాసం, భావవాద ఆలోచనాధోరణితో కూడిన చపలత్వం వీరి లక్షణాలు. దేవుడూ, దయ్యం కూడా మానవజీవిత వ్యవహారాల్లో కలుగచేసుకోగలిగి, బతుకులను ప్రభావితం చేయగల సమాజాలలో ఈ విపరీత ధోరణులు మరింత ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. ఇలా వంచనకు సిద్ధపడేవారి ఒక జేబులో డబ్బులుంటే, మరో జేబులో దైవస్తోత్రాల పుస్తకం ఉండవచ్చు. ఈ వంచనా శిల్పులు ఒకేసారి అటు దైవాన్నీ, ఇటు దెయ్యాన్నీ సంతృప్తిపరచగల సమర్థులు, అవసరమైతే ఇద్దరినీ మోసం చేయగల అసాధ్యులు కూడా.

డబ్బు సంపాదించి నిల్వలు పోగుచేయగలవారు తప్పనిసరిగా వంచనా శిల్పంలో ప్రావీణ్యం సంపాదించాలి. వీరిలో తెలివైనవారు అతి సులభంగా, నిరాడంబరంగా కింది వర్గాలవారితో కలిసిపోగలరు. కార్మికులతో కలిసి టీ చప్పరిస్తూ, వారి భుజాలు చరుస్తూ నవ్వుతూ నవ్వించ గలరు. సంఘసేవకులుగా, దాతలుగా అతి సులభంగా పేరు పొందగలరు. వీటన్నిటి ఫలితంగా అందరికీ ఆమోదయోగ్యునిగా ఆకర్షణీయమైన వ్యక్తిత్వం గలవారిగా గుర్తింపు సంపాదించగలరు. ఇదంతా బయటి సమాజం కోసం.

ఇంట్లో నాలుగు గోడల మధ్య పిల్లలతో వ్యవహరించవలసి వచ్చినపుడు మాత్రం నిరాడంబరంగా ఉంటూ, పిల్లలను క్రమశిక్షణలో, మంచి పౌరులుగా తీర్చిదిద్దేందుకు వారే ప్రయత్నిస్తారు. బయటి-లోపలి ప్రపంచాల మధ్య వైరుధ్యం ఉన్నప్పటికీ ఇవి ఒకే నాణేనికి ఉండే రెండు మొహాలు అందుకే పిల్లలవద్ద డబ్బు ప్రస్తావన రాకుండా ఉండేందుకు, దాని గురించి మాట్లాడకుండా ఉండేందుకు బూర్జువా వ్యవస్థలో ధనికుడైన తండ్రి ప్రయాసపడతాడు.

అందుకే తమ సంపాదన ఆస్తుల వివరాలను రహస్యంగా ఉంచేందుకు పెద్దలు తాపత్రయ పడతారు. అయినా పిల్లలకు నైతిక విలువలు బోధించేందుకు మాత్రమే ధరించే ఈ వేషం వలన ప్రయోజనం కలుగదు. ఫలితం మిగలదు.

★ ★ ★

నికొలాయ్ నికొలయ్‌విచ్ బాబిచ్ చూడ్డానికి ఆహ్లాదకరమైన మనిషిలా కనిపిస్తాడు. అలా కనిపించేందుకు గట్టి కృషి చేస్తాడు. రోజువారీ పనులకు సంబంధించిన సంభాషణలను సైతం చమత్కారంగా సాగిస్తూ, అందరినీ ఆకట్టుకొనే ప్రయత్నం చేస్తాడు. అవకాశం దొరికితేచాలు తన గతంనుంచి ఏదో ఒక వృత్తాంతాన్ని సుదీర్ఘంగా, పెద్ద గొంతుతో వివరిస్తాడు. బాబిచ్ మా ఫ్యాక్టరీ కార్యాలయ అధిపతిగా పని చేస్తున్నాడు. మేమిద్దరం పట్టణం శివారులోని ఒక బంగ్లాలో ఉండేవాళ్లం. మా భవనంలో నాలుగు వాటాల ఇళ్లున్నాయి. మా ఇద్దరి ఇళ్లు కాక మిగిలిన రెండు వాటాల్లో మా ఫ్యాక్టరీ ప్రధాన ఇంజనీర్, చీఫ్ ఎకౌంటెంట్ ఉండేవారు. ఈ ఆవరణలోనే మా నాలుగు కుటుంబాల వ్యవహారాలు నడిచేవి. అవి రహస్యం కూడా కాదు. ప్రతివారి సంగతి మిగిలినవారికి స్పష్టంగా తెలుస్తూనే ఉండేది. కుటుంబంలో డబ్బు పాత్ర గురించి ఇక్కడే నేను ఎంతో తెలుసుకోగలిగాను. ఈ సమస్యను అర్థం చేసుకోవడంలో, పరిష్కరించడంలో మా సహచరుల మధ్య ఎలాంటి పొంతన ఉండేది కాదు.

బాబిచ్ ఇంటికి మొదటిసారి వెళ్లినప్పుడే ఆ వాతావరణం చూసి ఆశ్చర్యం కలిగింది. ఆయన ఇంటిని ఎప్పుడూ అనంత విషాదమేదో ఆవరించినట్లు ఉండేది. ఇంట్లోని ప్రతి వస్తువూ మొండిగా, బండగా, నిస్తేజంగా దర్శనమిచ్చేది. కుర్చీలు, బెంచీలు, మంచాలూ అన్నీ విచారంతో నిట్టూరుస్తున్నట్టు అనిపించేవి. ఎప్పుడైనా బాబిచ్ మొహంలో చిరుదరహాసం కనిపించినా, ఆ ఇంటి గోడలు, అక్కడి వస్తువులు ఆయనను మందలిస్తున్నట్టు, మరింత బిగుసుకుపోయినట్టు అనిపించేవి. అందుకే ఆయన పొరపాటున నవ్వినా వారి ఇంటికి వచ్చిన అతిథులు పెద్దగా స్పందించేవారుకాదు. ఇక పిల్లలతో మాట్లాడవలసివస్తే బాబిచ్ మొహంలో చిరునవ్వు జాడైనా ఉండేదికాదు. ఆయన వారివంక ఏదో ఆలోచిస్తున్నట్టు పరీక్షగా చూసేవాడు. ఆ పిల్లల వయసు 13-15 ఏళ్ల మధ్య. అప్పటికే వారి మొహాల్లో గాంభీర్యం, కొంత విచారం తొణికిసలాడేవి. చాలాసార్లు వాళ్లు నిర్లిప్తంగా ఉన్నట్టు కనిపించేవారు. నేను పెద్దగా ఆ ఇంటికి వెళ్లేవాడిని కాదు. కానీ వెళ్లినప్పుడల్లా తండ్రి - పిల్లల మధ్య ఒకే రకమైన సంభాషణ నడిచేది.

"నాన్న నాకు ఇరవై *కోపెక్కులు కావాలి"

"ఎందుకు"?

"ఒక పుస్తకం కొనుక్కోవాలి"

"ఏం పుస్తకం?"

"లెక్కల నోట్సు పుస్తకం"

"ఏం, క్రితంసారి కొన్నది అయిపోయిందా?"

"కాసిని పేజీలే మిగిలాయి"

*కోపెక్ : రష్యన్ నాణెం. రూబుల్‌కు వంద కోపెక్కులు

"సరే, రేపు నేనే రెండు నోటు పుస్తకాలు తెస్తాను"

ఇది కాకపోతే ఇంకో సందర్భంలో అయినా సంభాషణ ఇలానే ఉండేది.

"నాన్న, నేనూ అక్క సినిమాకి వెళ్తాం"

"సరే వెళ్లండి"

"డబ్బులు కావాలి"

"టిక్కెట్ ఎంత?"

"ఒక్కొక్కటి ఎనభై ఐదు కోపెక్కులు"

"ఎనభై కోపెక్కులేగా?"

"కాదు. ఎనభై అయిదు"

దీంతో బాబిచ్ మెల్లగా కుర్చీలోంచి లేచి, బీరువా దగ్గరికివెళ్లి, జేబులోనుంచి ఏవో తాళాలు తీసేవాడు. తలుపు తెరిచి లోపల చేతులుపెట్టి ఒక నిముషం ఏదో సర్దేవాడు. తరువాత తలుపువేసి, తాళం బిగించి దగ్గరికి వచ్చి చిన్న బల్లపై కచ్చితంగా టిక్కెట్‌కు సరిపడే చిల్లర ఉంచేవాడు. ఆ పిల్లవాడు నిశ్శబ్దంగా ఆ చిల్లర తీసుకొని జాగ్రత్తగా లెక్కపెట్టి మెల్లగా "కృతజ్ఞతలు" అని గొణిగి వెళ్లిపోయేవాడు. ఈలోగా వాడి మొహం ఎర్రబారిపోయేది. చివరికి వాడి వేళ్ల అంచులు సైతం వేడెక్కినట్టు కనిపించేవి. ఈ తతంగం ఎప్పుడూ ఇలాగే సాగేది.

ఒకసారి ఆ పిల్లవాడు తండ్రి వద్దకు వచ్చి బడికి వెళ్లేందుకు రైలు టిక్కెట్ కోసం ఇరవై కోపెక్కులు అడిగాడు.

"టిక్కెట్‌కి పది కోపెక్కులేగా?"

"నాకూ, అక్కకి కలిపి అడుగుతున్నాను"

"ఏం ఆమెకు నోరులేదా?"

"అక్క చదువుకుంటోంది. అందుకే నేను...."

"అదేం కుదరదు. ఆమెకు కావాలంటే అడగగలదు. మధ్యలో నీ రాయబారం, డబ్బులు నీ దగ్గర పెట్టుకొని ఆమెకు పెద్దగా వ్యవహరించడం అనవసరం. అదేం కుదరదు. నీ ధోరణి చూస్తుంటే త్వరలో నీకొక డబ్బు సంచి ఇవ్వాలేమో అనిపిస్తోంది. అలా అజమాయిషీ చేద్దామనా నీ ఉద్దేశం? రేపు నువ్వు సంపాదించడం మొదలుపెట్టిన తరువాత నీ యిష్టం. ఇదిగో ఈ పది కోపెక్కులు తీసుకో. అక్కకి కావాలంటే రాగలదు, అడగగలదు."

ఐదు నిమిషాల తరువాత ఆ పిల్ల వచ్చింది. రాగానే తండ్రిని డబ్బు అడగడానికి ఇబ్బంది పడింది. ముందు ఆయనవంక చూసి నవ్వేందుకు ప్రయత్నించింది. కానీ బాబిచ్ అందుకు అవకాశం ఇవ్వలేదు. ఆమెను మందలిస్తున్నట్టు చూసి, కళ్లెగరేశాడు. దీంతో ఆ పిల్ల గందరగోళంగా మొహంపెట్టి "నాన్నా రైలు టిక్కెట్‌కి డబ్బులు కావాలి" అంది.

బాబిచ్ ఏం మాట్లాడలేదు. అప్పటికే ఆయన కొడుకు కోసం బీరువా తీసినప్పుడు కుమార్తెకు ఇవ్వవలసిన చిల్లర కూడా తీసుకొని ఉంటాడని భావించాను. కానీ నా ఊహ తప్పయింది. ఆయన మళ్లీ లేచి బీరువా దగ్గరికివెళ్లి.... ఆ తంతు కొనసాగించాడు. ఆ పాప వెళ్లినవైపే చూస్తూ బాబిచ్ నాతో మాట్లాడడం సాగించాడు.

"వాడు తోల్య చూడండి ఎలా తయారవుతున్నాడో. వాడిని అని ఏం లాభం? వాడు పెరిగే,

తిరిగే వాతావరణం అలాంటిది. పిల్లలంతా నాశనమవుతున్నారు. వీళ్లని ఎలా పెంచడమో తెలియడం లేదు. మళ్లీ నా కూతురు చూడండి. బంగారం. ఎంత చక్కగా పెరుగుతోంది! వినయం, వందనం వంటివి చిన్నప్పుడే రావాలి. మగపిల్లల్లో ఈ లక్షణాలు ఏవీ. ఎంతసేపూ జేబుల్లో డబ్బు పోసుకుని వీధుల్లో బలాదూరు తిరగడం ఒక్కటే వాళ్లకి చేతనవును" అన్నాడు.

★ ★ ★

మా బంగ్లాలోనే మరోవాటాలో ఉండే మా ఫ్యాక్టరీ చీఫ్ ఇంజనీర్ నికిటా లైసెంకో మృదు స్వభావి. ఆయన మొహంలోనే మంచితనం స్పష్టంగా కనిపిస్తుంది. ఎంత కష్టం వచ్చినా తొణకని స్వభావంగల ఇంజనీర్‌గా ఫ్యాక్టరీలో పేరు పొందాడు. ఆయన తత్వం బాబిచ్‌కు పూర్తి విరుద్ధం. మొదట్లో ఆయన స్వతహాగా నిగ్రహం, సంయమనం, మంచితనం గల వ్యక్తి అని అంచనా వేశాను. కానీ క్రమేణా స్వభావసిద్ధంగా వచ్చిన మంచితనానికి తోడు స్వయంకృషితో అలవర్చుకొన్న క్రమశిక్షణ, ఆలోచనాశైలి కూడా ఏర్పడడంతో ఆయన మరింత ఆకర్షణీయంగా కనిపించేవాడు.

కుటుంబ వ్యవహారాలు, ముఖ్యంగా పిల్లల పెంపకం వంటి విషయంలో మాత్రం లైసెంకో పెద్దగా జోక్యం చేసుకొనేవాడు కాదు. ఆ వ్యవహారాలన్నీ ఆయన భార్య ఎవదోకియా ఇవానోవ్నా పట్టించుకోవాలని ఆయన ఉద్దేశం. ఎవదోకియా బాగా చదువుకున్న మహిళ. ఇప్పటికీ ఆమెకు పుస్తకాలంటే ప్రీతి. చేతిలో పుస్తకం లేకుండా ఆమెను చూసినవారు అతి తక్కువమంది. దురదృష్ట వశాత్తు సమకాలీన సాహిత్యం ఆమెకు పట్టదు. ఎప్పుడూ గత శతాబ్దపు గ్రంథాలే చదివేది. అవికూడా కనీసం అరవై ఏళ్ల క్రితం విడుదలైనవే. ఆ పుస్తకాల్లో కాగితాలు పూర్తిగా పసుపు రంగులోకి మారి, అట్టలు చిరిగిపోతూ ఉండేవి. సమకాలీన సాహిత్యంతో పరిచయం లేకపోవడం వల్లనే సమకాలీన ఆలోచనాధోరణులు, శైలి, వాస్తవాలు పూర్తిగా వంటబట్టలేదని నా అభి ప్రాయం. అయితే ఉద్గ్రంథాల ప్రభావంతో ఆమె 'ఆలోచనాశాలి'గా మారింది. మంచి-చెడులకు నాటి రచయితలు ఇచ్చిన భాష్యాలు, నిర్వచనాలు ఆమెలో బాగా నాటుకున్నాయి. ముఖ్యంగా "మంచి"ని ఎల్లప్పుడూ ప్రోత్సహించాలని, దానిని ఉద్పోధించాలని ఆమె తహతహలాడేది.

మా చిన్నప్పటి రోజుల్లో మతపెద్దలు, చర్చి పూజారులు మాకు 'మంచి' గురించి ఇలాగే చెప్పేవారు. నాటి తత్వవేత్తలు అలాగే ఆలోచించి, అదే రాసేవారు. అయితే పిల్లలకు ఆ దశనుంచే మంచిని వంటబట్టించేందుకు అంత కృషి జరిగినా పెద్దగా ఫలితాలను ఇవ్వకపోవడం అందరికీ తెలుసు. వాళ్ల బోధనలు పూర్తి ఆచరణయోగ్యమై, సాధారణ జీవితాన్ని సౌఖ్యంగా సాగనిచ్చేమాటైతే సమాజంలో అందరూ అతిమంచి మనుషులే ఉండేవారేమో. ప్రపంచం ఇంత అస్తవ్యస్తంగా ఉండేది కాదేమో. ఏమైతేనేం చుట్టూ ఉన్న అపసవ్య ధోరణులే లైసెంకో కుటుంబంలోనే ఉండడాన్ని నేను గమనించాను. దీనిని ఎవదోకియా గుర్తించలేదు. పెద్దలంతా దేనిని 'మంచి' అని గుర్తించారో దానిని ఆమె గాఢంగా విశ్వసించేది. ఆ కొలతనే అన్ని విషయాల్లోనూ ఉపయోగించేది. ఒకసారి ఆమె తన చిన్నకొడుకుతో మాట్లాడడం విన్నాను.

"మిథ్యా, అబద్ధాలు చెప్పకూడదు. ఎప్పుడూ నిజమే చెప్పాలి. అబద్ధాలు చెప్పే మనిషి ఆత్మలో పవిత్రమైన అంశాలేవీ ఉండవు. ఈ ప్రపంచంలో అన్నిటికంటే సత్యం ఉత్కృష్టమైనది. కానీ నువ్వు నీ స్నేహితులతో అబద్ధం చెప్పావు. ఈ తగరపు కళాయి వేసిన టీ గిన్నెను చూపించి వెండిదని చెప్పావు ఎందుకలా?" అని ప్రశ్నించింది.

మిత్యా తన తల్లికి వెంటనే సమాధానం చెప్పలేదు. సన్నగా ఉండే ఆ పిల్లవాడికి కనుబొమ్మలు లేనేలేవు. గులాబీరంగు చెవులతో విచిత్రంగా ఉంటాడు. వాడు తన తల్లివంక చూస్తూ పళ్లెంలో పోసుకున్న వేడి టీని ఊదుకుంటూ తాగి పూర్తి చేసి కిందపెట్టాడు. అప్పుడు బద్ధకంగా బదులిచ్చాడు. "నువ్వు మరీ విడ్డూరంగా మాట్లాడతావమ్మా. నేను ఇది వెండిగిన్నె అని వాళ్లకి చెప్పలేదు. అది వెండిరంగులో ఉందని మాత్రం చెప్పాను. అయితే వాళ్లు వెండిరంగులో టీ గిన్నెలు ఎక్కడా ఉండవని బండగా వాదించారు. ఇది తగరపు కళాయి రంగులో ఉందన్నారు. ఏం చెప్పగలం! నిజమే ఈ టీ గిన్నెకు తగరపు కళాయి వేశారు. అది వెండిరంగులో ఉంది" అన్నాడు.

ఎవదోకియా నిశ్శబ్దంగా కొడుకు మాటలు వింది. ఈ మొత్తం వ్యవహారంలో నైతిక విలువలకు సంబంధించిన సమస్య ఏమీలేదని తేల్చుకొంది. మొత్తానికి మిత్యా విచిత్రమైన పిల్లవాడు. మంచి-చెడుల మధ్య హద్దులను వాడెలా గుర్తిస్తాడన్నది అంచనా వేయలేం. ఎవదోకియా ఆ సాయంత్రం తన భర్తతో అంది. "ఏమిటో పిల్లలు ఈ తరంలో నైతిక విలువలను పట్టించుకోవడం లేదు" అని.

వాళ్ల పెద్ద కొడుకు కాన్‌స్టాంటిన్ పదో తరగతి చదువుతున్నాడు. చూడ్డానికి నదరుగా, శుభ్రంగా ఉంటాడు. బూడిదరంగు కోటు, టై ధరిస్తాడు. ఎప్పుడూ నిశ్శబ్దంగా, వినయంగా ఉంటాడు. చూడగానే కొంత గౌరవం కలుగుతుంది కూడా. వాడు ఇంట్లో జరిగే సంభాషణల్లో ఎప్పుడూ తల దూర్చడు. తనవి కాని విషయాలను పట్టించుకోడు. ప్రతి విషయంపై వాడి సొంత అభిప్రాయాలు వాడికున్నాయి. వాటి గురించి ఇతరులతో చర్చించనవసరంలేదని వాడి విశ్వాసం.

మిత్యాకు పన్నెండేళ్లు. ఆ కుటుంబంలో వాడే ఏ విలువలూ లేని మనిషిగా కనిపిస్తాడు. దానికి కారణం అతి వాగుడు. కొంత కాలం క్రితం ఎవదోకియా వాడితో ఒక మంచి చేయించాలని తలపెట్టింది. జబ్బుతో ఉన్న మేనమామ (తన సోదరుడు)ను చూసి రమ్మని మిత్యాకు చెప్పింది. దానికి మిత్యా మెల్లగా నవ్వాడు. "అమ్మా కొద్దిగా ఆలోచించు. నేను వెళ్లి చూడడంలో అర్థం ఏమిటి? లాభం ఏముంది? ఆయనకు ఏభై ఏళ్లు. పైగా వచ్చిన జబ్బు కాన్సర్. అలాంటి జబ్బుని డాక్టర్‌అయినా కుదర్చలేడు. నేను డాక్టర్నీ కాను. ఆయన ఎలాగూ చనిపోతాడు. మధ్యలో నా జోక్యం దేనికి?" ఇదీ వాడి ధోరణి.

లెనా ఇంకా పసిపిల్ల. మరో ఏడాది దాటితేకానీ బడికి వెళ్లదు. తండ్రిలానే ప్రశాంతంగా, బద్ధకంగా ఉంటుంది. అది ఆ పిల్ల మొహంలో తెలిసిపోతుంది కూడా. ఈ గుణం ఆమె తల్లికి ఎంతగానో నచ్చేది. లెనా పెరిగి పెద్దయితే మగపిల్లలకంటే భిన్నంగా ఉంటుందని, మంచికి సరైన ప్రతినిధిగా ఎదుగుతుందని ఆమె నమ్మకం. టీ తాగిన తరువాత ఆ పిల్ల గదిలో అటూ ఇటూ తిరుగుతుంటే తల్లి ఆమె వంక అపేక్షగా చూసేది.

వారి ఇంటి మొదటి గది నానా కంగాళీగా ఉండేది. దుమ్ముపట్టిన బల్లలూ, కుర్చీలు, గదిలో నేలపై పాత పేపర్లు, వాడిపోయిన పూలు, విరిగిపోయిన ఇతర వస్తువులు, చిన్న, పెద్ద వంటసామాగ్రి, నీళ్ల పాత్రలూ, పిల్లల ఆటవస్తువులు, బొమ్మలు, సిగరెట్ బూడిద దులుపుకునే పింగాణి ఆష్ ట్రేలు ఎక్కడ పడితే అక్కడ ఉండేవి.

ఆ రోజు -

లెనా మెల్లగా నడుచుకుంటూ వచ్చి, బల్ల దగ్గర ఆగి, కాళ్లు పైకెత్తి తెరచిఉన్న సొరుగులోకి తొంగి చూసింది.

"ఇక్కడ డబ్బులన్నీ ఏమయ్యాయి?" అని అమ్మని అడిగింది. దాంతో మిత్యా గభాలున తన కుర్చీలోంచి లేచి, హడావుడిగా అక్కడకు వచ్చి, సొరుగు అంతా వెతికాడు. వాడికి కూడా అందులో డబ్బులు కనిపించలేదు. వాడు కోపంగా లెనా వైపు, తల్లివంకా చూసి "డబ్బులన్నీ అయిపోయాయేంటి? ఖర్చు చేసేశావా?" అని తల్లిని ప్రశ్నించాడు. ఆమె సమాధానం చెప్పేలోపే "అలా అయితే నేను మా బడి పిల్లలతో విహారయాత్రకు ఎలా వెళ్లేది?" అని ఆందోళనగా అడిగాడు.

వాళ్ల అమ్మ చదువుతున్న పుస్తకంలో గాఢంగా లీనమైందేమో తల కూడా తిప్పలేదు. "విహారయాత్రా? వెళ్లు. అందులోంచి డబ్బు తీసుకో" అంది పరధ్యానంగా.

"ఏవీ ఎక్కడున్నాయి. సొరుగు ఖాళీ అయింది" అని అరిచాడు మిత్యా.

"మెల్లగా మాట్లాడు అలా అరవడం తప్పు ఎందుకంటే....."

"మరి నా విహారయాత్ర సంగతేమిటి?" అన్నాడు మిత్యా మొండిగా.

ఎవదోకియా మిత్యావంక అయోమయంగా చూసింది. ఆమెకి ఏమీ అర్థమైనట్టు లేదు "ఏమిటి? డబ్బులేదా? ఎలా అయిపోతాయి? వెళ్లి అనూష్కను అడుగు" అందామె.

మిత్యా వంటగదిలోకి పరుగు తీశాడు. వాడి చెల్లెలు లెనా ఖాళీ బల్ల సొరుగును చూస్తూ ఏవో కలలు కంటోంది. తల్లి ఏమీ జరగనట్టే పుస్తకంలో పేజీ తిప్పింది. ఈలోగా వెళ్లినంత వేగంగా మిత్యా గదిలోకి దూసుకొచ్చాడు. "అమ్మా అనూష్కని అడిగాను. సొరుగులో ముప్పై రూబుళ్లు ఉండాలంటోంది. ఏమైనట్టు?" అని అడిగాడు.

ఎవదోకియా అప్పటికి ఉదయం టీ తాగినా, ఇంకా భోజనాల బల్ల వద్ద కూర్చుని శిథిలావస్థలో ఉన్న పురాతన గ్రంథం ఏదో చదువుతోంది. ఒక్కసారిగా వంద సంవత్సరాల గతం నుంచి ముప్పై రూబుళ్ల వర్తమానంలోని రావడం ఆమెకు ఇష్టంలేదు. అయితే ఆ అవసరం పెద్దగా రాలేదు. ఆమె పెద్దకొడుకు కాన్‌స్టాంటిన్ రంగంలోకి వచ్చి, "ఏంటి గొడవ? ఆ ముప్పై రూబుళ్లు నేనే తీశాను" అన్నాడు.

"మొత్తం తీసేసుకున్నావు. ఏమీ మిగల్చలేదు. అది సరైన పనా?" అడిగాడు మిత్యా క్రోధంగా చూస్తూ.

దీనికి బదులివ్వకుండా కాన్‌స్టాంటిన్ తన బల్ల వద్దకు వెళ్లి తన పనిలో పడ్డాడు. దాంతో మిత్యా గాలిలోకి చూస్తూ "మరి నా విహారయాత్ర సంగతేమిటి?" అని అడిగాడు.

ఎవరూ వాడికి సమాధానం చెప్పలేదు. ఈలోగా లెనా నిశ్శబ్దంగా మంచంవైపు నడిచి దానిమీద ఉన్న తల్లి చేతిసంచి తెరిచింది. అందులో అడుగున రెండు రూబుళ్లు కొంత చిల్లర ఉన్నాయి. ఆ పిల్లకు ఎక్కువ డబ్బు అవసరం లేదు. వీధి చివరన ఐస్‌క్రీం కొనుక్కోవడం దాని ప్రస్తుత అవసరం. అందుకు ఏభై కోపెక్కులు చాలు. లెనా తల్లి సంచీ నుంచి చిల్లర నాణేలు మాత్రం తీసుకొని కింద పెదవి కొరుక్కుంటూ బయటకు వెళ్లే ఉద్దేశంతో తలుపువైపు నడిచింది. లెనా ఆర్థిక సంక్షోభం అప్పటికి తెలిపోయినట్టే, ఆ పిల్ల మొహం ప్రశాంతంగా ఉంది. అయితే

మరుక్షణంలోనే ఆ పిల్లకు అందిన అదృష్టం చేజారింది. మిత్యా ఆమె చేతిలోని చిల్లర బలవంతంగా లాగేసుకున్నాడు. అయితే లెనా కంగారుపడలేదు. "అమ్మ బ్యాగులో ఇంకా డబ్బులున్నాయి. ఇవి ఐస్‌క్రీం కోసం తీసుకున్నాను" అంది.

మిత్యా తన చేతిలో చిల్లరను కిందపడేసి తల్లి బ్యాగు అందుకున్నాడు. లెనా, మిత్యాలిద్దరూ తమ సమస్య తేలిపోవడంతో ప్రశాంతంగా తల్లి ముందునుంచే బయటకు నడిచారు. వారి తల్లి ఇదేమీ పట్టించుకోవడం లేదు. ఆమె పుస్తక పఠనంలో లీనమై ఉంది. గదిలో తిరిగి పూర్వపు నిశ్శబ్దం అలముకొంది.

సాయంత్రం ఇల్లు చేరిన చీఫ్ ఇంజనీర్ లైసెంకో కూడా తెరచి ఉన్న బల్ల సొరుగును పరిశీలించి "ఎవదోకియా, డబ్బు అయిపోయిందా? అప్పుడే? ఇంకా జీతాలకు ఐదు రోజులుంది. ఇలా అయితే ఎలా?" అని భార్యను ప్రశ్నించాడు.

"పిల్లలకు అవసరం వచ్చింది. తీసుకున్నారు" అని బదులిచ్చిందామె.

లైసెంకో మరోసారి బల్ల సొరుగు తడిమి చివరకు జేబునుంచి పర్సుతీసి అందులో ఎంత ఉందో చూసుకున్నాడు.

"ఇలా అయితే ఎలా? డబ్బు ఖర్చు ఒక పద్ధతి ప్రకారం జరగాలిగా. ఏదో ఒక లెక్కాపత్రం ఉండాలిగా.... ఇంకా ఐదు రోజులవరకూ జీతం అందదు" అన్నాడు లైసెంకో.

ఎవదోకియా తన పాత కళ్లద్దాల పైనుంచి భర్తను పరిశీలనగా చూసి "లెక్కా? దేనికి?" అంది.

"లెక్క. డబ్బులకు ఉండాలిగా"

"డబ్బుకు మీరెందుకు అంత విలువ ఇస్తారు? దానికి ఏం విలువ ఉంది. ఎందుకంత ప్రాధాన్యం ఇవ్వాలి. డబ్బు లేకపోతే మనం పాటించే విలువలు పారిపోతాయా? లేకుండా పోతాయా?" అని ప్రశ్నించింది ఎవదోకియా.

లైసెంకో భార్యకు సమాధానం చెప్పలేదు. ఆమె వాదనకు దిగే ఉత్సాహంలో ఉందని అర్థం చేసుకొన్నాడు. భార్య చెప్పే విలువలంటే అతనికి భయంతో కూడిన విధేయత ఉంది. ఆ విషయంలో ఆమెతో వాదన చేయకూడదని అతను ఏనాడో నిర్ణయించుకొన్నాడు. పైగా ప్రస్తుతం తన సమస్య నైతిక విలువలు కాదు. జీతాలు అందేలోగా ఐదురోజుల ఖర్చుకి డబ్బు ఎక్కడ తేవాలి అన్నదే అతని ఆలోచన.

అయితే ఎవదోకియా విషయాన్ని అంతటితో వదలిపెట్టదలచలేదు. భర్తకు నైతిక విలువల గురించి మరోసారి గుర్తు చేయాలని భావించిందామె.

"ఈ చిన్న వయస్సులో పిల్లలకు డబ్బు సమస్యల గురించి అన్ని సంగతులూ చెప్పవలసిన అవసరం లేదు. మనం పెద్దవాళ్లం ఎప్పుడూ డబ్బులు లెక్కపెట్టుకోవడం తప్పడం లేదు. మన పిల్లలు కూడా మనలానే డబ్బే ప్రపంచమని భావించకూడదు. ఈ విషయంలో మన పిల్లలకు తాపత్రయం లేకపోవడం అదృష్టం. వాళ్లు ఎంత కావాలిస్తే అంతే తీసుకుంటారు. వాళ్లలో ఒక్క మిత్యాకి ఆందోళన ఎక్కువ. ఎప్పుడూ డబ్బును లెక్కపెడుతుంటాడు. ఈ తత్వమే మన సమాజం మొత్తాన్ని పాడు చేసింది. కాదంటారా?" అని భర్తని నిలదీసింది.

సమాజం గురించి, నాగరికత ధ్వంసం కావడం గురించి చర్చించే ఆసక్తి ఆమె భర్త లైసెంకోకు

లేదు ఇప్పుడు. అతని పూర్తి ధ్యాస ఎప్పుడూ ఫ్యాక్టరీపైనే. నాగరికత ఏమైపోతుంది అన్న సమస్యకు అతను ఎప్పుడూ దూరంగా ఉంటాడు. కానీ అతనికి పిల్లలంటే బాగా ప్రేమ. అందుకే భార్య మాటలు అతనికి కొంత సంతోషాన్నిచ్చాయి. అవును తన పిల్లలకు డబ్బు యావలేదు. మంచిదే కదా అనుకుంటూ ప్రశాంతంగా గాఢనిద్రలోకి జారుకున్నాడు. నిద్రపోయేముందు ఒక నిర్ణయం తీసుకొన్నాడు. రేపు చీఫ్ ఎకౌంటెంట్ పైజోవ్‌ను ఏభై రూబుళ్లు అప్పు అడగాలి అనుకుంటూ నిద్రపోయాడు.

మర్నాడు ఉదయమే లేచిన లైసెంకో అల్పాహారం ఏమీ తినకుండానే ఫ్యాక్టరీకి వెళ్లిపోయాడు. గంట తరువాత అతని భార్య ఎవదోకియా పిల్లల గదిలోకి వెళ్లి పెద్దకొడుకును అడిగింది. "నీ దగ్గర డబ్బేమైనా ఉందా?" అని. వాడు తల్లి వంక చూసి "ఎక్కువ కావాల్సి వస్తుందా?" అని గంభీరంగా ప్రశ్నించాడు.

"లేదు... ఓ ఇరవై రూబుళ్లు చాలు"

"మళ్లీ తిరిగి ఎప్పుడిస్తావు?"

"నాన్నకు జీతం రాగానే. ఐదు రోజులు...."

వాడు మాట్లాడకుండాలేచి తన ప్యాంటు జేబులోంచి పర్సు తీసి రెండు పది నోట్లు తల్లికి అందించాడు.

అవి తీసుకున్న ఎవదోకియా గదిలోంచి బయటకు వస్తూ వీడు కూడా డబ్బు మనిషి అయిపోతున్నాడు అనుకుంది విచారంగా.



చీఫ్ ఎకౌంటెంట్ ఇవాన్ పైజోవ్ అతి భారీకాయుడు. నిజంగా నా జీవితంలో ఇంతవరకూ ఇంత లావుమనిషి నాకు తారసపడలేదు. అయినా అతను తన భారీ శరీరం గురించి ఎప్పుడు బాధపడుతున్నట్టు ఉండేవాడు కాదు. ఆరోగ్యంగా, ఉత్సాహంగా, యువకునిలా అలుపే తెలియనట్టు ఉండేవాడు. పెద్దగా నవ్వేవాడు కాదు. అయితే మొహం సంతోషంగా కళకళలాడేది. నవ్వుకు బదులు అతని బలమైన, కొవ్వు పట్టిన మొహంలో ఆ సందర్భంలో పడే ముడతలు చూస్తే నవ్వాడనే అనిపించేది. మాటలు విసరడంలో, ఎదుటివారిని సరదాగా అల్లరి పెట్టడంలో అతను ఎప్పుడూ ముందు ఉండేవాడు. మంచి పదును గల నాలిక అయనకు తోడు.

పైజోవ్ కుటుంబంలో ఎవరెవరో గభాలున అర్థం కావడం కష్టం. అతను, పెద్దకళ్లతో సరదాగా ఉండే అతని భార్య, 9, 14 ఏళ్ల వయసుగల ఇద్దరు కొడుకులతో పాటు, ఒక పెంపుడు కుమార్తె (పదేళ్ల వర్వ్యాష), పదహారేళ్ల అందమైన, పొడవైన మేనకోడలు, ఇంకా అతని అమ్మగారు ఇంట్లో ఉండేవారు. మొత్తం ఏడుగురు. అతని తల్లిగారు కూడా ఆ వృద్ధాప్యంలోఎప్పుడూ నవ్వుతూ, వేళాకోళం చేస్తూ హాయిగా ఉండేది.

వాళ్ల కుటుంబంలో నవ్వుకు, సరదాకు లోటు లేదు. వారితో నాకు పన్నెండేళ్ల స్నేహం. ఆ కాలంలో ఒక్కసారైనా ఆ కుటుంబంలో చిన్నపాటి ఘర్షణ, చిన్న వైరుధ్యం, చికాకు, విచారం నాకు కనిపించలేదు. వాళ్లల్లో వారు ఒకరినొకరు వేళాకోళం చేసుకుంటూ, అల్లరిపెడుతూ సంతోషంగా ఉండేవారు. నిరంతరం ఎదుటివారిపై మాటల తూటాలు విసిరేందుకు వారంతా సిద్ధంగా ఉన్నట్టు కనిపించేవారు. పక్కవాళ్లకి ఎవరికైనా ఏదైనా ఇబ్బంది కలిగితే ఏదో మాట

విసిరేందుకు ఎదురుచూసేవారు. అయితే వారి మాటల్లో పక్కవారి ఇబ్బందిని పెంచే ధోరణి కానీ, వారిని కించపరిచే ధ్వని కానీ ఉండవు. పైగా జీవితంలో అనివార్యంగా ఎదురయే ఈతిబాధలనే జాఢ్యాన్ని పుట్టకలోనే ధ్వంసం చేయాలనే తపన వారిలో ద్యోతకమయేది. ముందే నేను వివరించిన వెట్కిన్ల కుటుంబానికీ వీరికీ పోలిక ఉండేది. ఇంకా వెట్కిన్లలో ఈ హాస్యధోరణి లేదు.

పైజోవ్‌ల కుటుంబంలో ఎప్పుడో కానీ ఎవరికీ అనారోగ్యం కూడా కలిగేది కాదు. ఒకసారి ఇవాన్ పైజోవ్‌కే చలిజ్వరం రావడం నాకు గుర్తుంది. వాళ్ల పెద్దబ్బాయి పావ్‌లూష నాకు ఈ విషయం తెలియబరిచాడు. ఆ రోజు ఫ్యాక్టరీలో నా గదిలో ఏదో పనిలో ఉన్నాను. పావ్‌లూష నా గదిలోకి తుపానులా వచ్చాడు. వాడి మొహంలో ఏదో సాధించిన గర్వం, సరదా, సంతోషం కనిపించాయి.

"మా నాన్న అర్ధం పడ్డారు. చలి జ్వరం. డాక్టరు వచ్చి చూశాడు. ప్రస్తుతం మంచం మీద పడుకొని బ్రాంది తాగుతున్నారు. ఇవాళ ఆఫీసుకు రారట. నన్ను కబురు చెప్పమన్నారు. అదీ చూశారా ఏమైందో ఎప్పుడూ గొప్పలు చెప్పేవారు, తనకు జబ్బు చేయదని ఆయన ధీమా. చూడండి మరి" అన్నాడు.

"డాక్టరుగారు చలిజ్వరమనే చెప్పారా?" అడిగాను.

"ఆఁ చెప్పారు. అయినా పెద్ద ప్రమాదం ఏం ఉండదుగా? మొత్తానికి నాన్నకీ జ్వరం వచ్చింది. సరే కానీ, సాయంత్రం ఏమన్నా అటువైపు వస్తారా?"

నేను వెళ్లేసరికి ఇవాన్ పైజోవ్ పడుకొనే ఉన్నాడు. పక్కనే చిన్న బల్లమీద బ్రాంది సీసా, కాసిని గ్లాసులు ఉన్నాయి. అతను పడుకున్న గది తలుపులను ఆనుకొని వారి చిన్న కొడుకు సెవా, పెంపుడు కూతురు వర్యూష నిలబడి ఉన్నారు. తండ్రి వంక తదేకంగా చూస్తున్నారు. అప్పుడే వాళ్ల నాన్న వారితో ఏదో సంవాదంలో గెలిచినట్లు సంతోషంగా ఉన్నాడు. పిల్లలు మాటలు దొరకనివాళ్లల్లా నిస్సహాయంగా నిలబడ్డారు. నన్ను చూడగానే సెవా నవ్వుతూ పలకరించాడు. తరువాత గంతులు వేస్తూ "చూడండి, బ్రాందీ జ్వరాన్ని తగ్గించే మందట! మొత్తానికి డాక్టర్‌గారినీ ఒప్పించారు నాన్న. డాక్టరు నాన్నతో కలిసి తెగ తాగారు. చివరికి ఆయనకి నాన్నపై కోపం వచ్చినట్టుంది. తాగించేశారు నన్ను...... ఇది జబ్బుకి మందా? అని నాన్నపై అరిచాడు" అని నాకు చెప్పాడు.

వర్యూష అందుకొంది. "మొదట జబ్బు చేసినవాళ్లు ఉత్త బలహీనులని నాన్న అనేవారు. చూడండి ఇప్పుడు జ్వరం ఎవరికి వచ్చిందో....."

ఇవాన్ పక్కపైనుంచి లేచాడు. "సిగ్గులేని పిల్లా! మొదట జబ్బు నాకా వచ్చింది... నేనా?" అన్నాడు ఛీత్కరిస్తున్నట్టు. కానీ ఆయన కళ్లు కొంటెగా నవ్వుతున్నాయి.

"మీక్కాదా? మరెవరికి వచ్చింది?"

"అలా అడుగు. జబ్బు దెబ్బకి మొదట అర్ధం పడింది వర్యూష పైజోవ్.....అని......" అని నవ్వాడు.

"ఎప్పుడు? ఎప్పుడు నాకు జబ్బు చేసింది?" అని అడిగింది వర్యూష సవాలు చేస్తున్నట్టు.

"నీకు పొట్టనెప్పి వచ్చిందే... మరచిపోయావా?" అంటూ ఇవాన్ రెండు చేతులూ పొట్టపై పెట్టుకుని, కళ్లు మూసుకుని, తల అటూ ఇటూ కదుపుతూ బాధని అభినయించాడు. వర్యూష పెద్దగా నవ్వుతూ సోఫాలో కూలబడింది. ఇవాన్ పిల్లలను మరోసారి ఏడిపించగలిగానని సంతోషంతో నవ్వుతూ బ్రాందిసీసా తీసి నా వంక తిరిగాడు.

"సెవాగాడిని బయటికి గెంటండి. వాడికి ఆ చెత్త ఆముదం తాగే పిచ్చి అలవాటుంది. నా చేత కూడా తాగిద్దామని తెగ ప్రయత్నిస్తున్నాడు" అని వినయంగా చెప్పాడు.

ఈ అనుకోని దాడికి సెవా దిగ్భ్రాంతి చెందాడు. ఇవాన్ మరింత సంతృప్తిగా కళ్లు చికిలించి, "కొంచెం తాగుదామా?" అని నన్ను అడిగాడు.

నేను ఆశ్చర్యపోయాను. "మీకు నిజంగా జ్వరం వచ్చిందా? ఊరికే కబురు చేశారా?" అని అడిగాను.

"భలేవారే, అబద్ధం దేనికి. నాకు జబ్బు చేసి ఎనిమిదేళ్లు అయిపోయింది. ఏడాదికి ఒకసారైనా జ్వరం రాకపోతే ఎలా? వచ్చిందనుకోండి. హాయిగా బ్రాందీ తాగి, పడుకుని పుస్తకాలు చదువుకోవచ్చు. కావలసినవన్నీ మంచం దగ్గరికి వస్తాయి. మిత్రులు పలుకరించేందుకు వస్తారు. ఎంత హాయి?" అన్నాడు. పైగా "జ్వరంమూలంగా సెలవు కూడా దొరికింది. ఏం? ఒక గ్లాసు పట్టిద్దామా?" అని అడిగాడు.

ఇంతలో అతని తల్లిగారు ఎక్కడినుంచో ఊడిపడింది. వచ్చి, అతని మంచం చుట్టూ పచార్లు ప్రారంభించింది. తనలో తాను మాట్లాడుకోవడం ప్రారంభించింది.

"ఎండాకాలంలో చలి జ్వరమేమిటి? ఎవరన్నా ఇలాంటిది మునుపు విన్నారా? చలి జ్వరమట. మా రోజుల్లో ఈ మాయదారి జ్వరాలు వచ్చేవే కావు. శీతాకాలంలో కొంచెం జలుబు చేయడమే పెద్ద జబ్బు. అప్పుడు కొంచెం జ్వరం వచ్చేది. కీళ్లనొప్పులు ఉండేవి. ఈ జబ్బులన్నిటికీ ఓద్కాయే దివ్య ఔషధం. ఒక్క గ్లాసు ఎక్కిస్తే జబ్బులన్నీ మటుమాయం. మా నాన్న అయితే మొత్తం జీవితంలో ఒక్క మందు కూడా వాడలేదు. ఓద్కా ఒక్క గుక్క గొంతు దిగితే ఎంత నీరసమైనా మాయమయ్యేది" అంది.

సెవా, వర్యూష సోఫాలో కూచుని బామ్మ వంక అపేక్షగా చూస్తున్నారు. ఇంతలో వంటగది నుంచి ఇవాన్ మేనకోడలు ఫెన్యా వచ్చింది. బామ్మ వంకచూసి, "అయితే ఆ ఓద్కాను ఆరోగ్యంగా ఉన్నవాళ్లు తాగవచ్చా?" అని ప్రశ్నించింది. బామ్మ మాట్లాడకుండా 'తాగచ్చు' అన్నట్టు తల ఆడించింది.

ఇది చూసి ఇవాన్ తన మేనకోడలిని ప్రోత్సహించాడు. "పెద్ద తెలివితేటలున్నదానివిగా, బామ్మకి బదులు చెప్పు" అని వెక్కిరించాడు. ఫెన్యా ఇబ్బందిపడి, వెర్రినవ్వుతో మళ్లీ వంటగదిలోకి వెళ్లింది. ఈ తతంగాన్నంతా నిశ్శబ్దంగా చూస్తున్న సెవా ఉన్నట్టుండి పెద్దగొంతుతో "ఏదో జ్వరం వచ్చింది కదా అని అందరం ఇవాళ నాన్నని వదిలేస్తున్నాం. దాంతో ఆయన రెచ్చిపోయి మాటల ఈటెలు విసురుతున్నారు. జ్వరం తగ్గనీయండి. మా తడాఖా చూపిస్తాం" అన్నాడు.

అప్పటికే, నేనూ - ఇవాన్ గ్లాసుల్లో బ్రాందీని చప్పరిస్తున్నాం. సెవా మాటలను విన్న ఇవాన్ కళ్లు సన్నగా చేసి. మెడ గోక్కున్నాడు. "ఏమంటారు? నాకు జ్వరం వచ్చిందని దయతలచి ఇవాళ నన్ను వదిలేసారట?" అన్నాడు.

జ్వరాన్ని కూడా ఇంత సంతోషంగా అనుభవించగలగడం చిన్న సంగతి కాదు. అందరూ ఇలా మాటలతో పొద్దుపుచ్చుతారని, వాళ్లకి ఎలాంటి పద్ధతి, క్రమశిక్షణ లేవనీ అనుకుంటే పొరపాటే. ఎందుకంటే ఆ కుటుంబంలో ప్రతిఒక్కరూ ఎంతో క్రమశిక్షణతో తమ బాధ్యతలు నిర్వర్తించేవారు. క్రమశిక్షణను కూడా ఆహ్లాదకరంగా ఆచరణలో పెట్టడం వాళ్ల ప్రత్యేకత. జీవంతో తొణికిసలాడే ఆ పిల్లల కళ్లు ఎప్పుడు ఏ బాధ్యతపై పడినా దానిని పూర్తి చేసేందుకు సిద్ధంగా ఉండేవారు. పరిసరాలను ఆ కళ్లు జాగ్రత్తగా పరిశీలించేవి. ఈ లక్షణాలు లేకుండా బండ క్రమశిక్షణ ఏర్పడడం అసాధ్యం.

డబ్బు వ్యవహారాల్లో ఆ కుటుంబ సభ్యుల వ్యవహారశైలి నన్ను బాగా ఆకర్షించేది. అదొక ప్రత్యేకమైన, పటిష్టమైన పద్ధతిగా కనిపించేది. పాత, కొత్త కుటుంబ సంప్రదాయాలను విలీనంచేసి, చిరకాలంగా సమాజానికి సత్ఫలితాలను ఇచ్చిన, ఇస్తున్న పద్ధతులను వారు పాటించేవారు. అయితే ఇందులో తను చేసిందేమీ లేదని ఇవాన్ వినయంగా చెప్పేవాడు.

"నేనేం చేశాను? ఏమీ లేదు. డబ్బు వ్యవహారాల్లో కుటుంబం అనేది ఒక చిన్న ప్రత్యేక వ్యవస్థ. ఆదాయం వస్తుంది, ఖర్చవుతుంది. దాన్ని నేను కనిపెట్టలేదు. డబ్బు అంటూ ఉంటే దీనికి ఒక పద్ధతి అంటూ ఉండి తీరాలి. అయాచితంగానో, దొంగతనంవల్లో, వచ్చిన డబ్బుని మాత్రమే ఎవరైనా అడ్డదిడ్డంగా ఖర్చు పెట్టగలరు. కానీ సంపాదన-ఖర్చు ఉన్నప్పుడు దానికి ఒక తీరుతెన్ను అవసరం. ఇది అందరికీ తెలియాలి. పిల్లలకి మనం కాక ఎవరు నేర్పుతారు? ఈ వయసులోనే వారికి అన్నీ అర్థం కావాలి" అనేవాడు. అయితే అలాఅని ఆయన ఇంట్లో ఆదాయ-వ్యయాలకు లెక్కలు వేసేవారే కాదు. స్వయంగా ఎకౌంటెంట్ అయి కూడా ఇవాన్ ఇంటి లెక్కలు ఒక కాగితంపై రాయడం ఎన్నడూ జరగలేదు. ఇంటి నిర్వహణలో అలాంటి లెక్కలు అనవసరమనేవాడు. పిల్లలకు ఖర్చు రాయమని ఎన్నడూ చెప్పేవాడు కాదు.

"లెక్కలు రాయడం అంటే నియంత్రించడం. మేం ఏడుగురం. ఎవరికివారు నిగ్రహం కలవారం. ఒకసారి లెక్కలు, జమలు రాయడం మొదలుపెడితే పిల్లలు యంత్రాల్లా, అధికార సిబ్బందిలా మారిపోతారు అదీ ప్రమాదమే".

ఇలా చెప్పే ఇవాన్‌కు డబ్బు లెక్కాపత్రం లేదనుకోవద్దు. ఎటువంటి కాగితం, కూడిక, తీసివేతలు లేకుండానే వచ్చిన ఆదాయాన్ని జాగ్రత్తగా అన్నిటికీ సర్దేవాడు. ప్రతివారం ఆయన పిల్లలందరికీ జేబుఖర్చుకు డబ్బు ఇచ్చేవాడు. అసలిదే ఎంతో కోలాహలంగా, పండగలా జరిగే తతంగం. ఆ రోజు రాత్రి భోజనాలు పూర్తయిన తరువాత కూడా ఎవరూ ఆ బల్ల దగ్గరనుంచి లేచేవారు కాదు. ఫెన్యా బల్లను శుభ్రం చేసి, మేనమామ దగ్గరగా కూర్చునేది. అప్పుడాయన జేబులోంచి పర్సుతీసి బల్లపై ఉంచి చిన్నవాడైన సెవాని అడిగేవాడు. "నీ దగ్గర క్రితంవారం ఇచ్చిన దాంట్లో ఏమన్నా మిగిలాయా?"

సమాధానంగా సెవా తన కాగితం పర్సు తీసి బల్లపై దులిపేవాడు. అందులోంచి కొంత చిల్లర రాలేది. దాన్ని పరిశీలించిన ఇవాన్ తృప్తిగా తల ఆడించి "మంచిది. ఇంకా నీ దగ్గర పాతిక కోపెక్కులు మిగిలాయి" అంటూ మరో పక్కకి తిరిగి "వర్యూష, నీ సంగతి ఏమిటి?" అని అడిగేవాడు.

ఆ పిల్ల పర్సు ఒక చాక్లెట్ డబ్బా. అందులోనే తన డబ్బులుండేవి. దాంట్లో ఉన్న డబ్బుల్ని చూసి సెవా ఉడుక్కునేవాడు.

"వర్యాష మళ్లీ నిధులు పోగుచేస్తోంది" అని ఈర్ష్యగా అనేవాడు.

"ఏంటీ? మళ్లీ డబ్బు పోగుచేస్తున్నావా? ఎంత ఘోరం! ఎంత పోగు చేశావు చెప్పు" అనేవాడు పైజోవ్.

"డబ్బా? ఎంత.... అఁ... ఇదో రూబులు.... ఇక్కడ మరొకటి... అరే ఇంకొకటి కూడా ఉంది" అంటూ రెండు రూబులు నోట్లు కొంత చిల్లర ప్రదర్శించేది. పెద్దపిల్లలు మాత్రం ఈ తతంగాన్ని నిశ్శబ్దంగా చూసేవారు. వాళ్లు తమ పర్సులు చూపేవారు కాదు.

"వేసవిలో సముద్రతీరం విహారానికి వర్యాష డబ్బు దాస్తోంది" అనేవాడు పావ్లూష. "అదేం కాదు, వేరే పని ఉంది. చిన్న బల్ల, టీ సామాగ్రి, నా బొమ్మకి ఒక లాంతరు కొనాలి" అనేది వర్యాష. దాంతో ఇవాన్ సంతృప్తిగా తలపంకించేవాడు.

ఆయన ఎప్పుడూ పిల్లలను డబ్బు ఎందుకు ఖర్చు చేశారని కానీ, ఇవ్వబోయే డబ్బును ఎలా ఖర్చు చేయబోతున్నారని కానీ అడిగేవాడే కాదు. అది నాకు ఆశ్చర్యం కలిగించేది. తరువాత నాకు అర్థమైంది. అడగవలసిన అవసరం ఎన్నడూ లేదు. ఎందుకంటే ఆ కుటుంబ సభ్యుల మధ్య రహస్యాలు అంటూ ఏమీ ఉండేవికాదు.

అప్పుడు ఇవాన్ పర్సు తీసి సెవా, వర్యాషలకు చెరో రూబులు ఇచ్చి, "జాగ్రత్తగా చూసుకోండి. పోతే నా బాధ్యత కాదు. ఇక్కడినుంచి వెళ్లేప్పుడే సరి చూసుకోండి" అనేవాడు.

పిల్లలిద్దరూ పది కోపెక్కుల నాణాలను జాగ్రత్తగా లెక్కపెట్టేవారు. వర్యాష తన వాటాని లెక్కపెట్టి తండ్రి వంక చూసి "ఇంకో పది కోపెక్కులు తగ్గాయి" అనేది.

ఇవాన్ తల అడ్డంగా ఊపి "అదేం లేదు. ఇటివ్వు లెక్కపెడదాం" అని ఆ నాణెలను తన వైపు లాక్కుని లెక్కపెట్టేవాడు. "ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పది సరిపోయాయిగా" అనేవాడు.

ఆ పిల్ల కంగారుపడి ఒక్కొక్క నాణేన్ని వేలితో పక్కకి పెడుతూ లెక్క ప్రారంభించేది. ఈలోగా సెవా గట్టిగా నవ్వి "నాన్నదంతా దొంగ లెక్క. ఐదు తరువాత ఏడు అన్నారు. మరి ఆరు ఏమైంది?" అనేవాడు.

"అలాగేం. అయితే జాగ్రత్తగా అందరూ లెక్కపెట్టండి" అనేవాడు ఇవాన్.

పిల్లలంతా తలలు దగ్గరికి చేర్చి శ్రద్ధగా లెక్కపెడితే చివరికి పది నాణేలూ ఉండేవి. దాంతో ఇవాన్ భారీ శరీరం నవ్వుతూ కదిలిపోయేది. ఫెన్యా మాత్రం నవ్వుతూ మెరుస్తున్న కళ్లతో ఆయన వంక చూసేది. అందరూ లెక్క మొదలుపెట్టడానికి ముందే ఆయన తన కోటు చేతికింద నుంచి ఒక నాణేన్ని ఆ చిల్లరలో ఎవరికీ కనపడకుండా కలిపేయడాన్ని ఫెన్యా గమనించేది. దాంతో చిన్నపిల్లలిద్దరూ తమ నాణేలను తిరిగి లెక్కిస్తూ అతి భద్రంగా పర్సుల్లో దాచుకొనేవారు.

ఆ తరువాత పెద్ద పిల్లల వంతు. ఇవాన్ పర్సులోంచి కొంత డబ్బు తీసి ఫెన్యా, పావ్లూషలకు ఇచ్చేవాడు. "సరిపోతుందా?"

ఇద్దరూ తల ఊపేవారు.

"కాకపోయినా సరిపెట్టుకోండి. మళ్లీ జనవరి వరకు నా జీతం పెరగదు మరి" అనేవాడు ఇవాన్. ఇవాన్‌తో పాటు ఫెన్యా, పావ్‌లూషలు కూడా నెలనెలా తమ స్కూళ్లల్లో ఇచ్చే ఉపకార వేతనాన్ని ఇంటి ఖాతాలోనే జమ చేసేవారు. అది కచ్చితమైన నిబంధన. అది తమ బాధ్యత అని పిల్లలు భావించేవారు. ఒక్కొక్కసారి ఇవాన్ మొత్తం కుటుంబ సభ్యులంతా ఉన్నప్పుడు ఆదాయం వివరాలు తెలిపేవాడు. "నా జీతం 475, పావ్‌లూషకు 40, ఫెన్యాకు 65, మొత్తం 580 రూబుళ్లు. ఇందులో ఇంటి ఖర్చుల కోసం అమ్మకి 270, పిల్లలకు జేబు ఖర్చులు 50, సరేనా, మొత్తం 320 రూబుళ్లు. మిగిలింది 260 రూబుళ్లు అని" తెలియచేసేవాడు.

"దాంతో ఏం చేస్తారో నాకు తెలుసు. రేడియో కొంటారు. పిల్లలు క్రితం నెలంతా రేడియో గురించే మాట్లాడారు. రెండొందల రూబుళ్లు. ఎందుకు ఆ దుబారా!" అని ఇవాన్ తల్లిగారు ఆశ్చర్యం వ్యక్తం చేసేది.

"అవును రేడియో ఉండాలి. అది ఇప్పటి సంస్కృతి" అని ప్రకటించేవాడు పావ్‌లూష.

బామ్మ దీనితో విభేదించేది "దాన్ని నేను సంస్కారం, సంస్కృతి అనను. ఎవరో మాట్లాడే మాటలకోసం, పెట్టే కేకల కోసం అంత ఖర్చు దండగ. మీకేం అవసరమో మీకు తెలిస్తే మంచిది. నీకు బూట్లు కావాలి. ఒక మంచి చిత్రాన్ని చూడవచ్చు. అదికూడా సంస్కృతే మరి. అదీకాక ఫెన్యా బూట్ల సంగతి ఏమిటి? అన్ని ప్రశ్నించేదామె.

ఇవాన్ కలుగ చేసుకొని "బూట్ల గురించి బెంగపడనవసరం లేదు. అందుకు డబ్బు సరిపోతుంది" అని తేల్చేవాడు.

"అదీ సంగతి, బూట్లూ, రేడియో కూడా తీసుకొందాం. బామ్మా! నీ సినిమా కూడా తప్పదు మరి" అని సెవా ఉత్సాహంగా కేకలు పెట్టేవాడు.

ఇవాన్ కుటుంబంలో ఇటువంటి చర్చలు ప్రతినెలా జరిగేవి కావు. అవసరమైనప్పుడు ఏదైనా సర్దుబాటు తప్పనిసరైనప్పుడు మాత్రం ఈ చర్చలు వచ్చేవి. అవీ క్షణాల్లో సమస్యను తేల్చేసేవి. ఆ కుటుంబంలో మంచి లక్షణం ఏమిటంటే, తీరవు అని తెలిసిన కోరికలను కూడా ఎవరూ మనసులో దాచుకని మథనపడేవారు కాదు. అందరూ కలసి కలలు కనేవారు. అవకాశం దొరికినప్పుడు ఆ కలలు ఫలించేవి. నాలుగు బ్యాండ్ల రేడియో అలానే అమిరింది. అయితే తప్పనిసరి విషయంలో ఎవరూ రాజీ పడేవారు కాదు. ఆ అవసరం ఏర్పడేదే కాదు. ఒకసారి ఫెన్యా స్కూలునుంచి బూట్లు విప్పుతో 'ఈ మేజోళ్లు ఇక పనికిరావు. ఇప్పటికే వందసార్లు అతుకులు పెట్టాను. కొత్తవి తీసుకోవాలి" అంది.

ఆ సాయంత్రం ఇవాన్ ఇంటికి వచ్చిన తరువాత ఫెన్యా అతన్ని అడిగింది.

"మేజోళ్లు కొనాలి. డబ్బులివ్వండి"

"జీతాలు అందేవరకూ ఆగలేవా?"

"కుదరదు"

"సరే తీస్కో" అంటూ ఇచ్చాడాయన.

మేజోళ్ల కోసం ఎవరూ జేబుఖర్చు డబ్బు తీయనవసరం లేదు. ఆ డబ్బు సరదాలు, విలాసాల కోసం, ఐస్‌క్రీంలు, సినిమాలు, పెన్సిళ్లు, పెన్నుల కోసం మాత్రమే.

డబ్బు వ్యవహారాల్ని ఇంత హాయిగా, హుందాగా నడిపే ఈ కుటుంబ సభ్యులను చూస్తే నాకు సంతోషం కలిగేది. ఇక్కడ డబ్బు అన్నది అందరినీ ప్రభావితం చేయగల మహోన్నతమైన శక్తి - దేవుడు కాదు. అలా అని వాతావరణాన్ని కలుషితం చేయగల దుష్టశక్తి కూడా కాదు. బతుక్కి అవసరమైన కనీస సౌఖ్యాన్ని, సంతృప్తిని అందించే సాధనంగా మాత్రమే వారి ఇంట్లో డబ్బు పాత్ర ఉండేది. రోజువారీ జీవనానికి పనికొచ్చే ఉపకరణంగా మాత్రమే వారు డబ్బుని గుర్తించేవారు. అందుకే వారి ఇంట్లో అలమారాల్లో, సొరుగుల్లో డబ్బు దొర్లేది కాదు. ఎవరూ పిసినారితనంతో డబ్బు దాచేసుకొందామని ప్రయత్నించేవారు కూడా కాదు.

డబ్బు-పిల్లల పెంపకంలో దాని పాత్ర, జీవితావసరంగా దాని స్థాయికి సంబంధించిన విషయంలో ఆ మూడు కుటుంబాల పెద్దల వ్యవహారశైలి వారి పిల్లలపై ప్రస్ఫుటంగా ప్రభావం చూపేది.



# CHAPTER - 5

## ఒక్క బిడ్డ చాలా?

పిల్లల కథల్లో, జనపదాల్లో, కల్పితగాథల్లో ఒకనాటి అద్భుతమైన నృత్యరూపకాల్లో ఇతివృత్తం అంతా అందంగా, మనోహరంగా జీవితాన్ని గడపగల రాజులు, రాణులకు సంబంధించినదే. వారికి దేముడు ఒకే ఒక కుమారుడినో, కుమార్తెనో ప్రసాదించేవాడు. ఈ రాకుమారులు, రాకుమార్తెలు తమవెంట అనంత ఆనందాన్ని, అందాన్ని ఈ భూమి మీదకు తెచ్చేవారు. ఈ కథల్లో అనివార్యంగా ఈ పిల్లలకు ఎదురయ్యే కష్టాలు, దుష్టశక్తులతో వారు జరిపే పోరాటాలు చివరకు వారికి విజయాన్ని, సౌఖ్యాన్నీ చేకూర్చేవి. పైగా ఈ కష్టాలు, తాత్కాలిక బాధలూ అన్నీకూడా నాయకుడి ధీరోదాత్తతను ప్రస్ఫుటంగా తెలియపరిచేందుకు అన్నట్లు ఉండేవి. చివరికి మనుషులందరిపై తుది విజయం సాధించగల మృత్యువు సైతం వారి విషయంలో పరాజయం ఎదుర్కోవలసి వచ్చేది. ఈ క్రమంలో దేవదూతలో, రుషులో మన నాయకులకు ఎదురై అయాచితంగా దివ్యశక్తులను, అపూర్వ వరాలను, అద్భుతమైన మూలికలను సమకూర్చేవారు. ఇంకేం కావాలి! కథలు ఆదినుంచీ తుది దాకా ఒక మంచి పాటలా సాగిపోయేవి.

పాఠకులకు, ప్రేక్షకులకు ఈ కథలు, రూపకాలు బతుకుపై కొంత ఆశను, బతకాలనే ఆకాంక్షను రగిల్చేవి. కథలోని ఈ అందానికీ, ఆనందానికీ కారణం ఏమిటి? నాయకుల సాహస కృత్యాల్లో వారి తెలివితేటలా, వారి నైపుణ్యమా అని ఆలోచిస్తే అవేమీ కాదనిపిస్తుంది. కథ ఇతివృత్తంలోనే అది ఆద్యంతం ఆశావహంగా సాగిపోయే ఏర్పాటు ఒకటి ఉంది. అదేమిటంటే ఆ రాజులు - రాణులకు ఒకే ఒక కొడుకో, కూతురో మాత్రమే ఉండటం. ఈ కథ నడపడానికి కొంత అదృష్టం, యవ్వనం లాంటి ముడిపదార్థాలు చాలు. మరే తర్కం అవసరం లేదు. రాకుమారుడు ఎప్పుడూ చివరకు అపారమైన సంపదకు, జీవిత సౌఖ్యాలకు వారసుడు. అందం అతని సొంతం. జీవిత మాధుర్యాలన్నీ అందుబాటులో ఉండటం అనే మానవ సహజమైన ఆశ ఈ నాయకునికి తీరని కల కాదు. కథాక్రమంలో ప్రదర్శించిన తెలివితేటలు, శౌర్యం అతనికి అపారమైన ప్రతిష్టను చేకూరుస్తాయి. ఈ సుఖ సంతోషాలను అతనికి అందకుండా అడ్డుకోగల ఏ శక్తి సహజంగానే కథలో ఉండదు. ముగింపే లేని ఈ కథ ఎప్పుడూ సుఖాంతంగానే కనిపిస్తుంది మరి.

ధగద్ధాయమానమైన రాకుమారుని జీవితం మొదట్లో కేవలం కల్పిత కథగానే కనిపించినా చివరికి మన సొంత జీవితాలకు అందనంత దూరంలో లేదని అర్థమవుతుంది. ఈ నాయకుడు రచయిత ఊహాప్రపంచంలోంచి పుట్టి ఉంటాడు. అయితే మనందరి కుటుంబాల్లోనూ

ఇటువంటి రాకుమారులు, రాకుమార్తెలు ఉంటారు. మన పిల్లలు కూడా ఇంత సుఖ సంతోషాలతో జీవితం గడపాలని మనం ఆశించడంలో తప్పేమిటి? ఏమీ లేదు.

కుటుంబం అనేది వ్యక్తుల సమూహం. పరిమాణం, పరిధి చిన్నవి కావచ్చు. కానీ ఇందులో సభ్యులకు కోరికలు, కలలు వాటిని సాధించాలనే తపన, ప్రయత్నం ఉండడం సహజం. అయితే ఇదంతా సమిష్టి ప్రయత్నంగానే సాగాలి. కాకుంటే ఒక కుటుంబం తన ప్రత్యేకతను, విశిష్ట వ్యక్తిత్వాన్ని, మనుగడను కోల్పోతుంది. ఈ చిన్న వ్యవస్థలో అంతర్భాగమైన పిల్లల పెరుగుదల, విద్యార్జన ఈ సమిష్టి ప్రయత్నం వల్లనే సాధ్యమవుతాయి. అయితే కుటుంబం ప్రత్యేక మనుగడను నిలుపు కోవడంపై అనేక విషయాలు ప్రభావితం చూపగలవు. నా అభిప్రాయం ప్రకారం ఇందులో "ఒకే బిడ్డ చాలు" అన్న భావన ఒకటి. కుటుంబానికి ఉండే సమిష్టి లక్షణాన్ని ఈ భావన దెబ్బ తీస్తుందని నా ఉద్దేశం. ఎంతో శ్రద్ధ, పిల్లల పట్ల మమకారంతో పాటు విద్యాధికులు, నిపుణులు అయిన తల్లితండ్రులు కూడా ఒకే ఒక బిడ్డతో సంతృప్తి చెందగలమని భావించి ఆ తరువాత ఆ బిడ్డ పెంపకం విషయంలో అనేక చిక్కులు ఎదుర్కోవడం నేను స్వయంగా ఎరుగుదును.

★ ★ ★

ప్యోటర్ అలెగ్జాండ్రోవిచ్ కెటోవ్ వ్యవసాయ విభాగంలో అధికారి. అతని జీవితం నిండు విస్తరిలా ఉండేది. ఇదంతా ప్రయత్నం లేకుండా, అతని కృషితో నిమిత్తం లేకుండా లభించిన అదృష్టం కాదు. అపారమైన తెలివితేటలు, విషయాలను అర్థం చేసుకోవడం, విశ్లేషించడంలో ప్రదర్శించే మేధస్సు, నిరంతర కృషి అతనికి జీవిత సౌఖ్యాలను అందించగలిగాయి. అతను ఎప్పుడూ భవిష్యత్తు గురించి సవివరంగా పథకాలు రూపొందించేవాడు. భవిత మరింత అందంగా, సంతోషంగా ఉండగలదన్న విశ్వాసంతో దాని గురించి పిల్లవాడిలా కలలు కంటూ, ఆ కలలను నిజం చేసుకొనేందుకు ప్రయత్నిస్తూ, ఎప్పుడూ అప్రమత్తంగా వ్యవహరిస్తూ నెమ్మదిగా, హేతుబద్ధంగా, సవివరంగా సమస్య లోతులను ఎదుటివారికి అర్థం చేసేవాడు. ఎదుటివారి స్థాయిని, సామర్థ్యాన్ని కచ్చితంగా అంచనా వేయగలిగేవాడు. పరిస్థితిని బట్టి ఎదుటివారి ఆధిక్యాన్ని మన్నించేవాడు. మరికొందరితో సమస్థాయిలో వ్యవహరించేవాడు. ఇంకొందరికి తానే మార్గదర్శకునిగా మారి, నాయకత్వం వహించేవాడు.

ప్యోటర్ కెటోవ్ ఇల్లు కూడా ఆయనలానే తీర్చిదిద్దినట్టు ఒక క్రమంలో ఇమిడినట్టు సౌఖ్యంగా ఉండేది. ఎక్కడి వస్తువులు అక్కడ శుభ్రంగా అమరి ఉండేవి. నేలపై పాతదే అయినా మంచి తివాచీ, గోడల అలమార్లలో శ్రద్ధగా సర్దిన పుస్తకాల వరుసలు, మూల పియానోపై బితోవెన్ పటం...... ఇలా చూడగానే ఆకర్షణీయంగా ఉండేది ఆ ఇల్లు.

ప్యోటర్ తన కుటుంబ జీవితాన్ని కూడా అంతే శ్రద్ధగా తీర్చిదిద్దాడు. యవ్వనపు రోజుల్లోనే అతను అందమైన యువతులను పరీక్షగా గమనించేవాడు. వారి గుణగణాలు, మనస్తత్వాలను విశ్లేషించుకునేవాడు. అలా చివరకు అతను నైనా వాసిలియేవ్నాను తన జీవిత భాగస్వామిగా ఎంచుకొన్నాడు. ఆమె బూడిద రంగు కళ్లతో, పొడవైన ముక్కు, విశాలమైన నుదురుతో యవ్వనపు కాంతులీనుతూ, సంతోషంగా ఉండే వ్యక్తి. ఒకసారి ఆమెను గమనించిన తరువాత ప్యోటర్ కొద్దికాలం పాటు తన అంచనాలు, విశ్లేషణల సంగతి మరచి ఆమెతో పూర్తిగా ప్రేమలో పడ్డాడు.

ఆమెకు తన స్నేహాన్ని పంచి, అదే సమయంలో తన ఆధిక్యతను కూడా రుజువు చేసుకోగలిగాడు. నైనా ఈ అధిక్యతను ఆమోదించి, అతని ఆహ్లాదకరమైన మేధస్సును, అపార ధైర్య సాహసాలను చూసి ముగ్ధురాలై పూర్తిగా ప్రేమలో పడింది.

ఈ యువ దంపతులకు పుట్టిన బిడ్డ విక్టర్. ఆ పసివాడిని చూసినప్పుడు ప్యోటర్ ఆనందంతో తబ్బిబ్బు అయాడు. అంతటి మంచి బిడ్డను ఇచ్చిన భార్యకు కృతజ్ఞతలు తెలియచేశాడు. "ఈ పిల్లవాడు ఇంకా ముడిపదార్థమే. వీడినుంచే మనం ఒక అద్భుతమైన వ్యక్తిని రూపొందించాలి" అని అన్నాడు. నైనా ఆపేక్షతో మనోహరంగా నవ్వి, "మీ కొడుకై ఉండి వాడు మరొకలా ఎందుకు తయారవుతాడు?" అని భర్తపై తన విశ్వాసాన్ని ప్రకటించింది.

అయితే వారసత్వంగా, వంశపారంపర్యంగా వచ్చే ఉన్నత గుణగణాలపై ప్యోటర్‌కు నమ్మకం తక్కువ. ఏ పిల్లవాడినైనా ఎలా తీర్చిదిద్దడం అనేది విద్యపైనే ఆధారపడి ఉంటుందని అతని నమ్మకం. విద్యకుగల ఆ శక్తిపై అతనికి పూర్తి విశ్వాసం ఉంది. పిల్లల పెంపకం విషయంలో జనం నిర్లక్ష్యం వహించడం వలన, సరైన పద్ధతిలో విద్యాబోధనను సాగించకపోవడం వల్లనే జనాభాలో అత్యధికులు సామాన్యులుగా మిగిలిపోతున్నారని ప్యోటర్ ఏనాడో తెల్సుకున్నాడు. తల్లితండ్రులుగా ఇప్పటినుంచీ తమపై అపారమైన సృజనాత్మక బాధ్యతలు పడ్డాయని అతను భావించాడు.

పిల్లవాడు విక్టర్ ఆరోగ్యంగా ఎదుగుతూ ఇల్లంతా సందడి సృష్టిస్తూ, వచ్చీరాని మాటలతో, బుడిబుడి నడకల పరుగులతో ఎదగడాన్ని ప్యోటర్ జాగ్రత్తగా గమనిస్తూ ఉండేవాడు. "విక్టర్ చక్కగా ఎదుగుతున్నాడు. మొదటి దశ సక్రమంగా సాగుతోంది. ఇక వీడి వ్యవహారాన్ని జాగ్రత్తగా పట్టించుకోవాలి" అన్నాడు ప్యోటర్.

విక్టర్‌కు చిన్నప్పటినుంచీ, అత్యంత భద్రతాయుతమైన బతుకు అందుబాటులో ఉందన్న సంతృప్తితో కూడిన సంతోషం కలిగేది. వాడు ఎంతో ధీమాగా, ఆరోగ్యంగా ఎదుగుతూ తండ్రికి గల ఆత్మవిశ్వాసాన్ని, విశ్లేషణాశక్తిని, తెలివితేటలను పుణికిపుచ్చుకొన్నట్టు కనిపించేవాడు. అయితే ఎదుటివారి అధిక్యాన్ని అంతగా లక్ష్యపెట్టనట్టు ఉండే అమ్మ కళ్లే వాడికి వచ్చాయి.

నైనాకు కూడా ఈ పిల్లవాడి ఎదుగుదల ఆనందం కలిగించేది. తన కళ్ల ఎదుటే ఒక భావి విజయానికి పునాదులు పడుతున్నాయన్న భావన ఆమెకు కలిగేది. పిల్లవాడు రోజురోజుకూ చురుకుగా, ఆరోగ్యంగా కనిపిస్తున్నాడు. వాడికి తొందరలోనే మాటలూ వచ్చాయి. పసి పిల్లలందరికీ సహజంగా వుండే లావణ్యం వాడి నడకలో, పరుగులో స్పష్టంగా తెలిసేది. వాడి మాటలు, నవ్వులు నిముషాల్లో ఎవరినైనా ఆకర్షించేవి. ఈ పిల్లవాడు ప్రతిక్షణం కలిగించే ఆనందంతో పరవశం చెందే నైనా వాడి అద్భుత భవిత గురించి తన భర్త రూపొందించిన పథకాల మాటే మరిచేది. వర్తమానం ఇంత మనోహరంగా ఉన్నప్పుడు భవిష్యత్తు గురించి బుర్ర పాడుచేసుకోవడం దండగ అని ఆమె అనుకొనేది. తానే సృష్టించిన ఈ చిన్నారి అద్భుతంతో సమయం గడపాలని, మాతృత్వంతో తాను సాధించిన ఈ ఫలితాన్ని సగర్వంగా ప్రదర్శించు కోవాలని ఆమె తాపత్రయపడేది.

రోజులు ఇలా గడుస్తున్నప్పుడు ఉన్నట్టుండి ఆమెకు మరో బిడ్డకు జన్మ ఇవ్వాలనే కోరిక కలిగింది. విక్టర్ పక్కనే అంత అందమైన, అద్భుతమైన చిన్నారి పాపను నైనా ఊహించుకొంది.

ఆ పాపకు లిడా అనే పేరును ఖాయం చేసుకొంది. ఆ పాప అచ్చు అన్న విక్టర్‌లానే ఉండాలనీ, అయితే ప్రత్యేక వ్యక్తిత్వంతో, ప్రపంచంలో మరెక్కడా కనిపించని విశిష్ట లక్షణాలతో పెరుగుతుందని ఆమె కలలు కనడం ప్రారంభించింది. భర్త వద్ద ఈ సంగతి ప్రస్తావించింది.

"ప్యోటర్ నాకో పాప కావాలి".

"పాపా? ఎవరు? అని ఆశ్చర్యపోయాడు ప్యోటర్.

"మనకొక పాప ఉండాలంటున్నాను".

"అంటే మరో బిడ్డను కనాలనా?"

"అవును ఆ పాప ఎలా ఎదుగుతుందో చూడాలని."

"కానీ నైనా పాపే పుడుతుందన్న నమ్మకం ఏమిటి? మళ్లీ బాబే పుట్టవచ్చుగా" తర్కం ప్రారంభించాడు ప్యోటర్.

ఈ విషయం నైనాకు తట్టలేదు. అయితే మరుక్షణంలో ఆ దృశ్యం ఆమె కళ్ల ఎదుట కదలాడింది. బాబే అయితే మాత్రం ఏం తక్కువ. ఇద్దరు అబ్బాయిలు. తరువాతైనా పాప పుడుతుంది. ముగ్గురు పిల్లలు ఎంత అద్భుతంగా ఉంటుంది అని ఆమె కలల ప్రపంచంలోకి వెళ్లి తిరిగివచ్చింది. ఇక భర్తను సాధించడం మొదలుపెట్టింది. "ఎప్పుడూ ఒక యంత్రంలా ఆలోచించడమేనా? బాబే పుట్టనివ్వు. విక్టర్‌లాంటి మరో బాబు! ఏం తక్కువ? ఆ తరువాత పాప కలుగవచ్చు. ఎలా ఉంటుంది. ఊహించు. అది ఎంత చక్కటి కుటుంబంగా మారుతుందో ఆలోచించు" అంది ఉద్వేగంతో.

ప్యోటర్ తన భార్య చేతిని ముద్దాడి, ఆమె వంక ఎప్పటిలానే ఆధిక్యతతో కూడిన అపేక్షను కనబరుస్తూ చిరునవ్వు చిందించాడు. "నైనా ఇది పెద్ద విషయం. దీని గురించి మనం బాగా ఆలోచించాలి. ఎంతో చర్చించుకోవాలి" అన్నాడు.

"సరే"నంది నైనా.

తన ఊహల్లో మెదిలే కుటుంబం గురించి వివరిస్తే ప్యోటర్ కూడా అందుకు సమ్మతిస్తాడని, ఆనందమయమైన కుటుంబ జీవనంలో ఇమిడి అనవసర ఆధిక్యతను ప్రదర్శించడం మానేస్తాడనీ నైనా భావించింది. తీరా మాట్లాడడం ప్రారంభించేసరికి ఆమె తన ఊహాచిత్రాన్ని భర్త ముందుంచడంలో పూర్తిగా విఫలమైంది. భావోద్వేగంలో మాటలు తడబడడం, మాటల మధ్య పొంతన లేకపోవడం, సరైన పదాలు దొరక్క నిస్సహాయంగా చేతులు కదుపుతూ, మాటల్లో చెప్పలేని విషయాన్ని ముఖకవళికల్లో ప్రదర్శించే ప్రయత్నం చేయడంలో చివరికామె చెప్పదలచిన విషయాన్ని చక్కగా వివరించలేకపోయింది. అంతసేపు శ్రద్ధగా ఆమె మాటలను విన్న ప్యోటర్ చివరికి నైనా వంక చూసి ఆప్యాయంగా నవ్వాడు.

"నైనా ఇదంతా సహజసిద్ధమైన జంతుస్వభావం. మాతృత్వానికి సంబంధించిన ఆకాంక్ష."

"అదేమిటి? నేను మనుషుల గురించి, భవిష్యత్తు మానవుల గురించి మాట్లాడుతున్నాను"

"నీకలా అనిపించవచ్చు. కానీ ఇదంతా అత్యంత సహజమైన కాంక్ష. ఇందులో సిగ్గు పడవలసిందేమీ లేదు. నాకూ అలానే అనిపిస్తుంది. నువ్వు చిత్రించడానికి ప్రయత్నిస్తున్న కుటుంబ దృశ్యాన్ని నేను ఊహించగలను. అయితే అంతకంటే ఉదాత్తమైన, అందమైన లక్ష్యాలు, బరువైన బాధ్యతలు మనకు ఉన్నాయి." అని ప్రారంభించాడు ప్యోటర్.

నైనా తన భర్త భుజంపై చెయ్యివేసి నిలబడింది. ప్యోటర్ పుస్తకాల అద్దాల అలమారు వంక దీక్షగా చూస్తూ మాట్లాడుతున్నాడు. ఆ అద్దాల్లోంచి అతను ఊహించిన అందమైన భవిష్యత్తు దృశ్యం అతనికి కనిపిస్తోంది. పెద్ద కుటుంబంలో ఎదిగే పిల్లలు ఎటువంటి ప్రత్యేకతలూ లేని సాధారణమైన మనుషులుగా ఎందుకు మిగిలిపోతారో అతను వివరించాడు. తల్లితండ్రులందరూ ఇలాగే సహజసిద్ధమైన ఆకాంక్షలు తీర్చుకొనేందుకు, పిల్లల పెంపకంలో ఆనందాన్ని పొందేందుకు తహతహలాడడం వల్ల, ఎటువంటి ప్రణాళిక, ముందుచూపు లేకుండా పిల్లలను కనడంవల్లనే జనాభాలో అత్యధికులు అతి సాధారణమైన మనుషుల్లా తయారవుతున్నారని విశదపరిచాడు. అందుకే మనుషుల్లో అతి కొద్దిమంది మాత్రమే అసాధారణమైన ప్రతిభాపాటవాలు కలిగి ఉండి, జీవితంలో ఉన్నతస్థాయికి రాగలుగుతున్నారని ఓపికగా బోధపరిచాడు. కుటుంబంలో ఒకే బిడ్డ ఉంటే తల్లితండ్రులు తమ పూర్తి సమయాన్ని, ఓపికను, శక్తిసామర్థ్యాలను, వనరులను వాడి పురోగతికే వెచ్చించడం సాధ్యమవుతుందని, తద్వారా సమున్నత వ్యక్తిత్వంగల మనిషిని రూపొందించవచ్చని అనునయంగా చెప్పాడు. కుటుంబం అనేసరికి దానినొక మనుషుల మందలా ఊహించుకోవడం వల్ల పిల్లలు పుట్టి గాలికి పెరుగుతారని, అలా ఎదిగే పిల్లలకు ఏదో కాస్త తిండి, బట్టా, గూడు మాత్రమే ఇవ్వడం, చవకబారు చదువులు చదివించడం సాధ్యమవుతాయని ఆమెకు ప్యోటర్ అర్థం చేశాడు. మనం అలా చేయకూడదని ఇప్పుడున్న ఒక్క పిల్లవాడిని అద్భుతంగా పెంచేందుకు సర్వశక్తులూ కేంద్రీకరించడం ద్వారా ఆశించిన ఫలితం సాధించగలమని ఆమెకు చెప్పాడు. అలా ఒక్క పిల్లవాడిపై శ్రద్ధ చూపడం ద్వారా వాడికి మరెవ్వరూ ఇవ్వలేనంత మంచి భవితను అందించగలమన్న విశ్వాసం తనకున్నదని ధీమా వ్యక్తం చేశాడు.

"మనం పెంచే విక్టర్ సాదాసీదా వ్యక్తి కాకూడదు. వాడొక వజ్రంలా రూపొందాలి. జీవన సౌందర్యానికే వాడొక ఆభరణం కావాలి" అన్నాడు ప్యోటర్ చివరగా.

అతను వివరిస్తున్న భవిష్యత్తు దృశ్యాన్ని ఆమె కళ్ల ఎదుట ఆవిష్కరించుకునే ప్రయత్నం చేస్తోంది. ముగ్గురు పిల్లల మధ్య సంతోషంగా సాగే కుటుంబ చిత్రం క్రమంగా అదృశ్యమై దాని స్థానంలో అపారమైన మేధస్సు, ధైర్యం, చొరవ, ఉన్నత విద్య కలిగిన అపూర్వమైన యువకుడు ఆమె కళ్లలో మెదిలాడు. అయితే ఈ దృశ్యంలో జీవకళ, రక్తమాంసాలు లేవు. అదొక జానపద గాథలోని ఒక సంఘటనలా సినిమా తెరపై ఒక దృశ్యంలా కనిపించింది నైనాకు. అప్పటికీ తాను ఊహించిన కుటుంబమే సహజమైనదిగా, ప్రేమాస్పదంగా ఆమెకు తోచినా, భర్త సృష్టించిన రంగు రంగుల భవితను, దాన్ని సాధించడంపై అతనికిగల విశ్వాసాన్ని ఆమె గుర్తించగలిగింది. మొత్తానికి ఆమె భర్త ఆలోచనతో విభేదించలేకపోయింది. మరో ఇద్దరు పిల్లలకు తల్లి కావాలనే ఆకాంక్షకు ఆమె వీడ్కోలు చెప్పింది.

"సరే ప్యోటర్ నువ్వు చెప్పినట్టే చేద్దాం. అంటే మనకిక పిల్లలు వద్దనేగా...." చివరి ఆశ మినుకుమినుకు మంటూండగా ఆమె ప్రశ్నించింది.

"నైనా ఇక వద్దు. విక్టర్ చాలు" అని తేల్చేశాడు ప్యోటర్.

ఆ రోజు నుంచీ నైనాలో సమూలమైన మార్పులు వచ్చాయి. ఆమె చుట్టూ వాతావరణం క్రమంగా గంభీరంగా తయారైంది. జీవితం మరింత బాధ్యతాయుతంగా మారింది. ప్రతి

విషయాన్ని మరింత శ్రద్ధగా గమనించవలసిన అవసరాన్ని ఆమె గుర్తించింది. ఈ ఒక్క నిర్ణయంతో ఆమెలో అంతకు ముందులేని పెద్దరికం కనిపించడం మొదలైంది. మాతృత్వపు ఆకాంక్ష తీరే అవకాశం లేకపోవడంతో, అమ్మగా తన పాత్రను మరింత సమర్థవంతంగా నిర్వహించేందుకు నైనా నడుం బిగించింది.

ఇప్పుడు విక్టర్ నుంచీ ఆమె మరో రకమైన సంతోషాన్ని పొందుతోంది. ఎప్పుడూ ఆ తల్లి కళ్లకు చిన్నారి విక్టర్ ఒక అద్భుతంగానే కనిపించినా, ఇప్పుడు వాడొక్కడే ఆమె లోకమైపోయాడు. ఆమె ఆలోచనలు, కలలూ, ఊహలూ అన్నీ వాడి చుట్టే పరిభ్రమిస్తున్నాయి. దానితో విక్టర్ ఆమెకు మరింత సన్నిహితుడయ్యాడు. ప్రేమతో పాటు ఆమెకు ఎప్పుడూ వాడి గురించిన ఆందోళన ఉండేది. ఇది ఎటువంటి ఆందోళన, దేని గురించి, అసలు అలా ఆందోళన చెందడం సబబేనా అన్న ప్రశ్నలు నైనాకు ఎప్పుడూ ఎదురుకాలేదు. ఎప్పుడు పిల్లవాడి వంక చూసినా ఆమెను ఏదో అనుమానం ఆవహించేది. వాడు నిస్సత్తువుగా ఉన్నాడా? నిర్లిప్తంగా ఉన్నాడా? అని ఆమె మధనపడేది. వాడి జీర్ణశక్తిని, ఆకలిని, ఆరోగ్యాన్ని ఆమె నిరంతరం శ్రద్ధగా గమనించేది. బతుకులోని ప్రతిమలుపులో ఏదో ప్రమాదం పొంచి ఉందని ఆమె భయపడేది. క్రమంగా విక్టర్ పెద్దవుతున్నకొద్దీ ఆమెలో ఈ భయం తీవ్రత తగ్గినప్పటికీ మొత్తంమీద ఆమె నిరంతరం ఆందోళనతో బతకడం మొదలైంది.

ప్యోటర్‌కు మాత్రం భార్యలో వచ్చిన ఈ మార్పు పెద్ద ఆశ్చర్యం కలిగించలేదు. ఆమె కళ్లలో అంతకుముందు కొంటెగా మెరిసే తిరస్కృతి ఇప్పుడు అదృశ్యమైంది. ఆమె బూడిదరంగు కళ్లలోనూ మునుపటి వన్నె తగ్గి అవి మరింత స్పష్టంగా, స్థిరంగా పరిసరాలను గమనిస్తున్నాయి. జీవితం ముందుకు సాగుతున్నకొద్దీ యవ్వనపు సోయగాల వన్నె తగ్గి, పెద్దరికపు హుందాతనం స్థిరపడడం మామూలేనని అతను భావించాడు. అయితే యువప్రాయంలో ఉండే తళుకుల కంటే ఈ వయసులో సమకూరే మనస్తత్వమే జీవితాన్ని అందంగా మలచగలదేమో ఎవరు చెప్పగలరు? అని ప్యోటర్ సమాధానపడ్డాడు. ఆమెలో ఆందోళనను అతను గమనించినా, ఇది మాతృత్వపు బాధ్యతలు వేసే అదనపు భారమని అతను భావించాడు, సంతృప్తి చెందాడు.

తనవరకు ప్యోటర్ ఎటువంటి ఆందోళనలకు చోటివ్వలేదు. అతను తన సమయాన్ని సొంత పనులకు, కొడుకు బాధ్యతలు నిర్వర్తించేందుకు సమంగా కేటాయించాడు. ఈ రెండు చోట్ల అతను పూర్తి నిష్ఠతో తన కర్తవ్యాన్ని నిర్వర్తించేవాడు. ఈ క్రమంలో విక్టర్‌కు ప్రతిరోజూ సరికొత్త అవకాశాలకు దారులు తెరుచుకొనేవి. పిల్లవాడి సంరక్షణలో ప్యోటర్ సైతం అమితానందాన్ని పొందేవాడు. ఆ అనుభవాలను భార్యతో పంచుకొనేవాడు. పిల్లవాడి పెంపకం బాధ్యతలను ఇద్దరం కలిసి ఎంత బాగా చేపట్టగలుగుతున్నామో గమనించు అని నైనాతో అనేవాడు. ఆమె అతనితో ఏకీభవించేది.

విక్టర్ తనకు అందిన అవకాశాలను చక్కగా వినియోగించుకుంటూ ఐదేళ్ల ప్రాయంలోనే రష్యన్‌తో పాటు జర్మన్ భాష కూడా తప్పులేకుండా మాట్లాడగలిగాడు. ఏడేళ్లు వచ్చేసరికే వాడు ప్రపంచ ప్రసిద్ధ గ్రంథాలు చదవడం ఆరంభించి రెండేళ్లలో తత్వశాస్త్రంపై కూడా ఆసక్తి పెంచుకొన్నాడు. ఈ పన్నెండేళ్ల కాలంలో ప్యోటర్ తన కుమారుడితో పాటే పయనిస్తూ వాడి ఎదుగుదలను అబ్బురంగా గమనించేవాడు. విక్టర్ పిన్నవయసులోనే అసాధారణ ప్రజ్ఞా

పాటవాలు, తెలివితేటలు ప్రదర్శిస్తూ క్లిష్ట సమస్యలను సైతం సవ్యంగా విశ్లేషిస్తూ, పెద్ద పెద్ద పదబంధాలను కూడా తేలికగా వాడగలిగే స్థాయికి చేరాడు.

ఆ తరువాత మాత్రం అతి తక్కువ కాలంలోనే విక్టర్ వైఖరిలో మార్పు కనిపించింది. పదమూడేళ్ల పిల్లల కళ్లలో కదలాడే చిలిపితనం, కొంటెదనం వాడికి దూరమయ్యాయి. ఆ కళ్లు నిశ్చలంగా, స్థిరంగా పరిసరాలను గమనించడం ప్రారంభమైంది. వాటిలో నిగ్రహం ప్రస్ఫుటంగా కనిపించేది. పిల్లవాడికి తన పోలికలే స్థిరపడుతున్నాయని ప్యాటర్ అప్పుడు సంబర పడేవాడు. విక్టర్ ప్రవర్తనలో ఎప్పుడూ తప్పు పట్టేందుకు ఏమీ ఉండేది కాదు. అందరితో అప్యాయంగా, సన్నిహితంగా మెలిగేవాడు. కానీ, అప్పుడప్పుడు వాడు 'తనలో తానే' నవ్వుకోవడం గమనించాను. పది, పన్నెండేళ్ల క్రితం వాడి అమ్మ నైనా నవ్వులోనూ ఇదే తృణీకారభావం తొణికిసలాడేది. ఇప్పుడు విక్టర్ కళ్లలో అది మరింత ప్రస్ఫుటంగా తెలుస్తోంది. ఇదే ధోరణి వాడు తల్లితండ్రుల వద్ద కూడా ప్రదర్శించేవాడు. తన పురోగతి కోసం అమ్మ, నాన్న పడే తాపత్రయం, చేసే కృషిని వాడు గుర్తించాడు. తనకు మంచి భవిష్యత్తును ఏర్పరిచేందుకు వారు పడుతున్న తపనను వాడు సరిగానే అర్థం చేసుకొన్నాడు. తల్లి తన గురించి పడుతున్న ఆందోళనను గమనించినప్పుడు విక్టర్ ఆ విలక్షణమైన నవ్వు నవ్వేవాడు. తానే ఈ కుటుంబానికి కేంద్రమని, అందరి ఆశలు, ఆకాంక్షలు, కలలూ తన చుట్టూ అల్లుకున్నాయని కూడా విక్టర్‌కి తెలుసు. అతి చిన్న వయసులోనే పరిస్థితులను విశ్లేషించగల సామర్థ్యం, పెద్దలకు ఉండే పరిశీలనాశక్తి వాడికి అలవడడంతో చుట్టూ జరిగే సంఘటనలను వాడు సహేతుకంగా అర్థం చేసుకొనేవాడు. అపారమైన ప్రేమతో అమ్మ, నాన్నలు పూర్తిగా తన చుట్టూ పరిభ్రమిస్తున్నారని గ్రహించిన విక్టర్ అతి నిగ్రహం పాటిస్తూ వారికి ఆనందం అందించేందుకు ప్రయత్నించేవాడు. వీలైనంత వరకూ వారికి ఎదురు చెప్పేవాడు కాదు. స్కూల్లో వాడు అందరికంటే ముందుండే వాడు. తెలివితేటలు, చదువులోనే కాక మొత్తం జీవితాన్ని అర్థం చేసుకోవడంలో, వాస్తవాలకు అనుగుణంగా నడుచుకోవడంలో సాటి విద్యార్థులెవరూ అతనికి సరితూగరు. వాళ్లంతా మామూలు అమాయకపు పిల్లలు. చిన్న చిన్న కోర్కెలు, బుల్లి బుల్లి సంతోషాలు వారికి తృప్తి నిచ్చేవి. ఖాళీ సమయంలో స్కూలు ఆవరణలో దొంగాటలు, ఆట యుద్ధాలూ వారికి సంతోషా న్నిచ్చేవి. విక్టర్ మాత్రం ఈ సరదాలకు అతీతంగా, వాటిపై సమయాన్ని అసలు వెచ్చించకుండా అతి సులభంగా, వేగంగా స్కూలు చదువు పూర్తిచేశాడు. ఇదంతా నైనాకు అద్భుతంగా తోచేది. భర్త ఆనాడు ఒక్క బిడ్డే చాలు అన్న నిర్ణయం తీసుకోవడంలో ఔచిత్యం ఆమెకు అర్థమవు తున్నట్టుండేది. పెద్ద కుటుంబంగా ఉండాలన్న కోరిక తీరకపోవడంతో ఆమె విక్టర్‌పైనే అన్ని ఆశలూ పెంచుకొని, వాడికోసం ఆందోళన చెందడం ఎక్కువైంది. ఈ వొత్తిడిలో నైనా తన కొడుకు క్రమంగా తనను నిరోధిస్తున్నాడని గుర్తించలేకపోయింది. అదికూడా వాడి మనోస్థైర్యంలో అంతర్భాగమని ఆమె తృప్తి చెందింది. తమ మధ్య సహజసిద్ధమైన ప్రేమానురాగాలకు బదులు క్రమబద్ధమైన, సహేతుకమైన ఏర్పాటు ఒకటి జరిగిందన్న సంగతినీ నైనా గమనించలేదు. పిల్లవాడికి విశిష్ట వ్యక్తిత్వాన్ని సమకూర్చాలని తాపత్రయపడుతున్న తల్లితండ్రులు పూర్తిగా వాడి అభిరుచులు, ఇష్టాయిష్టాలకు అనుగుణంగా తాము వ్యవహరిస్తున్నామని కూడా అర్థం చేసు కోలేకపోయారు.

వాడి తెలివితేటలు చూసి మురిసిపోయిన ఉపాధ్యాయులు ఇక స్కూల్లో సమయం వృథా చేయవద్దని పై చదువులకు వెళ్లమని ప్రోత్సహించడంతో తొమ్మిదో తరగతి పరీక్షలు కూడా రాయకుండానే సరాసరి విశ్వ విద్యాలయంలో ప్రవేశించాడు విక్టర్. ఇది తమకు లభించిన ఘన విజయమని సంబరపడిన నైనా, ఆ విజయాన్ని అందించిన విక్టర్‌కు పూర్తిగా బానిసలా అన్ని పనులూ చేసిపెట్టేది, ఇక ఇక్కడినుంచీ ఆ కుటుంబ సభ్యుల మధ్య సంబంధాల్లో మార్పులు వేగంగా సంభవించాయి. పిల్లవాడిని దగ్గరుండి చదివించాలనే ప్యోటర్ యత్నాలకు గండి పడింది. ఇప్పటికీ ఆ తండ్రి అప్పుడప్పుడు కొడుకుతో వివిధ సమస్యల గురించి, చదువుకు సంబంధించిన సంగతుల గురించీ మాట్లాడుతున్నా ఆయనలో మునుపటి విశ్వాసం ప్రస్తుతం కొరవడింది. పైగా వాడికి ఇప్పుడు తాను చెప్పగలిగే చదువు అవసరం కాదని కూడా ఆయనకు అర్థమైంది.

విక్టర్ *కొమ్సొమోల్ సభ్యత్వాన్ని పునరుద్ధరించుకోలేదని తెలిసినప్పుడు ప్యోటర్ నిర్ఘాంత పోయాడు. ఈ విషయాన్ని వాడి దగ్గర ప్రస్తావించాడు.

"నువ్వు కొమ్సొమోల్‌ను వదిలిపెట్టావట! నాకు అర్థం కావడంలేదు. ఎందుకు....." విక్టర్ తన తండ్రి తలపై నుంచి దూరంగా దేన్నో చూస్తూ తన విలక్షణమైన నవ్వును ప్రదర్శించి, "నేనేం బయటికి రాలేదు. సభ్యునిగా ఉండడం మానేశానంతే" అన్నాడు. పైగా "ఇది మామూలే" అని కూడా తేల్చాడు.

"కానీ నువ్విప్పుడు కొమ్సొమోల్‌లో లేవు కదా" అని అడిగాడు తండ్రి అయోమయంగా.

"చక్కగా అర్థం చేసుకొన్నారు నాన్నా. సభ్యునిగా ఉండటాన్ని నిలిపివేస్తే, ఆ తరువాత ఎవరూ కొమ్సొమోల్‌లో ఉండనట్టే భావించాలి" అన్నాడు విక్టర్.

"కానీ ఎందుకు?" కొనసాగించాడు ప్యోటర్.

"మీకో సంగతి తెలియాలి నాన్నా. విని మీరు ఆందోళన చెందవచ్చు, అయినా వినండి. మీ తరం వారికి కొమ్సొమోల్ చాలా ముఖ్యమైనది..."

"మరి మీ తరానికి?"

అంత ప్రధానం కాదు. మా దారిన మేం పయనిస్తాం.

అని తన ప్రత్యేకమైన నవ్వును కొనసాగిస్తూ మరో ధ్యాసలో పడిపోయాడు విక్టర్. వాడు ఇక తండ్రి అక్కడ ఉన్న సంగతినే మరచిపోయాడు. ప్యోటర్ కొద్దిసేపు ఆందోళనగా ఆఫీసు ఫైళ్లలోని కాగితాలను పరిశీలిస్తూ ఆలోచనలో పడ్డాడు. తన ఆఫీసులో సహోద్యోగి కుమారుడు ఒకరు అసలు మొదటినుంచీ కొమ్సొమోల్‌లో చేరలేదన్న సంగతి గుర్తు వచ్చి నిట్టూర్చాడు. ప్రతి కొత్త తరం పాత తరంతో విభేదించక తప్పదన్న గతి తర్క సూత్రం గుర్తు వచ్చి కొంత ఊరట చెందాడు. బహుశా కొమ్సొమోల్ వీడిని సంతృప్తిపరచలేకపోతోందేమో అనుకున్నాడు.

పదిహేడేళ్ల వయసులో అప్పటికే గణితంలో అపారమైన ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శిస్తున్నందున ప్రత్యేక అనుమతి పొందిన విక్టర్ ఏకంగా విశ్వవిద్యాలయ అధ్యాపక బృందంలో స్థానం సంపాదించగలిగాడు. గణిత శాస్త్రాన్ని ఆ కుర్రవాడు అర్థం చేసుకొనే తీరు, విశ్లేషించే విధానం, దాని

*కొమ్సొమోల్ : కమ్యూనిస్టు పార్టీ యువజన విభాగం.

లోతులను శోధించేందుకు అతను పడే తపన, కొత్త ఆవిష్కరణల కోసం చేసే కృషి చూసిన అనుభవజ్ఞులైన అధ్యాపకులే ముచ్చటపడే దశ అది. ఈ స్థితికి వచ్చేసరికి ప్యాటర్‌కు కొడుకు చదువులో జోక్యం చేసుకోగల స్థాయి లేకపోయింది. అయినా ఈ భావి గణిత శాస్త్ర మేధావిని చూసి ఆయన గర్వించేవాడు. ఈ తరం యువత కొద్దికాలంలోనే విశేష విజయాలను సాధించ గలదన్న నమ్మకం ఆయనకు కలిగింది. ఈ తరం పిల్లలకు వేగంగా పురోగమించే సామర్థ్యం కలిగేందుకు దారులు వేసింది మాతరం జనమేగా అని సంతృప్తి పడేవాడు. అలాగే విక్టర్‌ను ఒక మేధావిగా తీర్చిదిద్దేందుకుఅన్ని వనరులను, శక్తి సామర్థ్యాలను కేంద్రీకరించాలన్న తన నిర్ణయం కూడా సత్ఫలితాలను ఇచ్చిందన్న ఆనందం ఆయనకు కలిగింది. అయితే ఈ సంతృప్తి, తన నిర్ణయంపై పెరిగిన గురి ఆయన బాహ్య వర్తనలో కనిపించేవి కావు. కొడుకుని పేరు పెట్టి 'విక్టర్' అని పిలుస్తున్నప్పుడు ఆయన గొంతులో గౌరవం తొణికిసలాడేది. ఇదివరకులా ఆఫీసు నుంచి ఇంటికి రాగానే కొడుకుని పిలిచి కబుర్లు చెప్పుకోవడం, వాడితో కలిసి వేళాకోళాలు సాగించడం క్రమంగా నిలిచిపోయాయి. అదంతా గతం. ఇప్పుడాయన ఇంటికి రాగానే మూసిఉన్న కొడుకు గది తలుపులను చూసి భార్యను సైగలతో పిలిచి "విక్టర్ వచ్చాడా? ఇంట్లో ఉన్నాడా?" అని రహస్యంగా అడగడం మొదలైంది. ఆమె నింపాదిగా, క్లుప్తంగా "ఆ ఉన్నాడు, చదువు కుంటున్నాడు" అని బదులిచ్చేది. ఆయన మునివేళ్లపై నెమ్మదిగా నడుస్తూ కొడుకు గదిని సమీపించి మర్యాదగా తలుపు తట్టి "నేను రావచ్చా?" అని అనుమతి తీసుకొనేవాడు.

కొడుకుతో కొద్ది క్షణాలు గడిపి ప్యాటర్ ఆనందంగా, విజయోత్సాహంతో బయటికి వచ్చేవాడు. "మనవాడు వెలిగిపోతున్నాడు. వాడికి ఏకంగా ప్రొఫెసర్ హోదా ఇవ్వాలనే యోచన అధికారులకు ఉన్నదట" అని భార్యకు తెలియచేసేవాడు.

నైనా బిడియంగా నవ్వేది. "భలే మంచి హోదా కదూ! కానీ ఈ మధ్య వాడిని చూస్తుంటే భయం కలుగుతోంది. కొద్దిగా లావు అవుతున్నాడు. అది గుండెకి అంత మంచిది కాదు" అని ఆమె తన ఆందోళన ప్రకటించేది.

ప్యాటర్ భయంగా భార్య వంక చూసి "అది జబ్బేనంటావా?" అని అడిగేవాడు. ఆమె సంశయిస్తూ "తెలియదు కానీ నాకు భయం వేస్తోంది...." అనేది.

ఇది ఆ దంపతుల్లో కొత్త భయాలకు, అనుమానాలకు దారి తీసేది. రోజుల తరబడి వారు కొడుకుని జాగ్రత్తగా గమనిస్తూ అనారోగ్యం చేసిందా? అని రహస్యంగా చర్చించుకొనేవారు. అంతలోనే కొత్త ఆందోళన ఒకటి మొదలయేది. ఈ భయాందోళనల అలల తాకిడిలో వారు జీవితానికి సంబంధించిన చిన్న విషయాలను నిర్లక్ష్యం చేసేవారు. కొడుకు ఇదివరలోలాగ తమను ఆప్యాయంగా పలకరించడంలేదన్న సంగతి కూడా వారి దృష్టికి రాలేదు. తల్లితండ్రులతో అపేక్షగా మాట్లాడడం మానేశాడు విక్టర్. అతనికిప్పుడు రెండు కొత్త సూట్లు ఉన్నాయి. తండ్రి పాతబడి, వెలిసిపోయిన ఒకే కోటుతో కాలం గడుపుతున్నాడని కూడా ఆ కుర్రవాడు గమనించ లేదు. తల్లి ఎంతో హడావుడిపడి స్నానానికి వేడినీళ్లు, సమయానికి భోజనం సిద్ధం చేస్తుంటే విక్టర్ కనీసం మర్యాదపూర్వకంగా కృతజ్ఞతలు తెలపడం కూడా మానుకొన్నాడు. వృద్ధులవుతున్న తల్లితండ్రులు అనారోగ్యంతో ఉన్నారని కూడా విక్టర్ పట్టించుకోలేదు.

సహచరుడొకరు మరణిస్తే విక్టర్ కనీసం అంత్యక్రియలకు హాజరవ్వలేదు. ఇంట్లో కూర్చుని ఏదో చదువుతున్నాడు. తండ్రి ప్యోటర్ విషయాన్ని గమనించి విక్టర్‌ని అడిగాడు. "అంత్య క్రియలకు వెళ్ళలేదా?"

"లేదు"

తండ్రి అసమ్మతి సూచనగా తల అడ్డంగా వూపి, నిట్టూర్చి వెళ్ళిపోతుంటే కొడుకు కనీసం తలఎత్తి అటువైపు చూడలేదు.

ఇంత దీక్షగా అధ్యయనం సాగించే విక్టర్ సరదాలకు దూరంగా లేడన్న సంగతి తల్లితండ్రులు గమనించలేదు. అతను ఈ మధ్య వైన్, సెంటు వాసనలతో ఇల్లు చేరుతున్నాడు. ఈ జీవితం గురించి అతను తల్లిదండ్రులతో ఎప్పుడూ మాట్లాడలేదు. విశ్వవిద్యాలయంలో విక్టర్ నాలుగో సంవత్సరంలో ఉన్నప్పుడు ప్యోటర్‌కు పొట్టలో కురుపు ఏర్పడింది. ఆయనకు వెంటనే శస్త్ర చికిత్స అవసరమని వైద్యులు తేల్చారు. అయితే దాని తరువాత ఆయన పూర్తిగా కోలుకుంటాడని నమ్మకంగా చెప్పారు. నైనా శస్త్రచికిత్స అన్న ఆలోచనకే తట్టుకోలేకపోయింది. భర్త పొట్టకోసి అందులో కొంత భాగాన్ని వేరు చేస్తారనే ఆలోచనే ఆమెకు భయం కలిగించింది. ఆమె భయంతో స్పృహ తప్పింది. విక్టర్ మాత్రం ఎప్పటిలానే ఏ విషయమూ పట్టించుకోకుండా తన గదిలో రాసుకోవడం లేదా బయట తిరగడం సాగించాడు. దీనితో శస్త్రచికిత్స విషయంలో ఒక నిర్ణయం తీసుకోలేకపోయారు. అప్పటికే ప్యోటర్ మొహం పాలిపోయి, శరీరం బలహీనంగా మారింది.

ఒకరోజు ప్యోటర్ మంచం పక్కనే కూర్చున్న ఆయన పాత మిత్రుడు - ఆయన వైద్యుడు కూడా - చికిత్స విషయంలో జరుగుతున్న జాప్యాన్ని చూసి ఆగ్రహం చెంది నైనాను గట్టిగా మందలించాడు. బెదిరిపోయిన నైనాకు ఎవరిని సంప్రతించి నిర్ణయం తీసుకోవాలో అర్థం కాలేదు.

సరిగ్గా అప్పుడే విక్టర్ సెంటు పరిమళాలతో ఆ గదిలోకి వచ్చి అందరినీ చూసి చిరునవ్వు నవ్వాడు. "ఏం నాన్నా ఇంకా ఆ మంచమీదే ఉన్నారా? బాగవ్వలేదా?" అన్నాడు. ప్యోటర్ తన కొడుకు వంక మురిపెంగా చూస్తూ "నాకు శస్త్రచికిత్స చేయాలంటున్నారు. ఈయన డాక్టర్ నా స్నేహితుడు..." అన్నాడు. ఇంకా ఏదో చెప్పబోతుంటే విక్టర్ తన సహజ శైలిలో అడ్డు తగిలాడు. "నాన్నా, ఓ ఐదు రూబుళ్ళు ఉన్నాయా? నా దగ్గర 'స్లీపింగ్ బ్యూటీ' అనే నృత్యరూపకం టికెట్ ఉంది. జేబులో డబ్బుల్లేవు" అన్నాడు.

"ఆఁసరే, నైనా నీ దగ్గర ఉన్నాయా? విక్టర్‌కి ఇవ్వు. పోతే, శస్త్రచికిత్స చేసి తీరాలంటున్నారు డాక్టర్. అమ్మ బాగా భయపడుతోంది. నాకేం తోచడం లేదు...." అన్నాడు ప్యోటర్.

"ఆఁ డబ్బులున్నాయా. సరే ఇటివ్వు. ఆపరేషన్ అంటే భయం ఎందుకు? ఏమీ లేదు. నాటకం చూసేందుకు టిక్కెట్ ఉంది కానీ బొత్తిగా డబ్బులేకుండా వెళ్తే బాగోదు కదూ" అంటూ తల్లి ఇచ్చిన ఐదు రూబుళ్ళు అందుకుని "నేను తాళం తీసుకెళ్తున్నాను, ఆలస్యంగా రావచ్చు" అంటూ వంగి వినయంగా అందరికీ వందనం చేసి బయటకు నడిచాడు.

తల్లితండ్రులు అతనివంక అపేక్షగా చూస్తూ ఉండిపోయారు. కొద్దిరోజుల తరువాత ప్యోటర్‌కు జబ్బు మరీ ముదిరిపోయింది. ఆయన స్నేహితుడైన డాక్టర్ వచ్చి పరీక్షించి ఆగ్రహంతో రెచ్చి పోయాడు.

"ఏమిటిది? చదువు సంస్కారం ఉన్న మనుషులేనా మీరు? లేకపోతే రాక్షసులా" అని విరుచుకుపడ్డాడు. నైనా పరుగు పరుగున మందుల దుకాణానికి వెళ్లి అవసరమైన మందు తయారు చేయమని అడిగింది. ఎనిమిది గంటలకు ఆ మందు సిద్ధమవుతుంది. ఆమె అంతే వేగంగా ఇల్లు చేరింది. "ఎలా ఉంది ఆయనకు?" అని పదేపదే ప్రశ్నిస్తూ అదే పనిగా గడియారం వంక చూస్తూ ఉండిపోయింది. అంతలో విక్టర్ గదిలోంచి హాల్లోకి వచ్చాడు. నైనా అతని వద్దకు పరుగున వెళ్ల "నాన్నకి అసలు బాగోలేదు. ఒకసారి మందుల దుకాణానికి వెళ్లు. డబ్బు ముందే ఇచ్చేశాను. వెళ్లి మందుతేవాలి" అంది ప్రార్థనాపూర్వకంగా.

ప్యోటర్ కష్టంమీద దిండు నుంచి తల పైకెత్తి కొడుకు వంక చూసి ప్రయత్నపూర్వకంగా ఒక నవ్వు నవ్వాడు. విక్టర్ కూడా తల్లివంక నవ్వుతూ చూస్తూ "లేదమ్మా, నాకు కుదరదు" తొందరగా వెళ్లాలి" అంటూ బయటికి నడవబోయాడు.

ప్యోటర్ పక్కన కూర్చున్న డాక్టర్ ఇక నిగ్రహం కోల్పోయాడు. ఆయన తన కుర్చీ నుంచి లేచి వేగంగా గుమ్మం వైపు నడిచాడు. ఆయన ఏం చేయబోతున్నాడో అక్కడ ఎవరికీ అర్థం కాలేదు. చివరి క్షణంలో ఆయన సంబాళించుకొని నైనాతో అన్నాడు. "ఎందుకు దీని కోసం విక్టర్‌ను బాధిస్తారు. నేను వెళ్లి ఆ మందు తేగలను" అంటూ నైనా చేతినుంచి మందు చీటి లాక్కుని వీధిలోకి దూసుకెళ్లాడు. నిమిషాల్లో డాక్టర్ మందుతో తిరిగివచ్చాడు. ఆయన వచ్చేసరికి ప్యోటర్ అలాగే దిండునానుకుని కూర్చుని ఉన్నాడు. ఆయన కళ్లు మాత్రం విక్టర్ గదివైపు నిశ్చలంగా చూస్తున్నాయి. తన డాక్టర్ మిత్రునికి ఆయన కృతజ్ఞతలైనా చెప్పలేదు. నిజానికి ఆ సాయంత్రం ఆయన మాట్లాడలేదు.

సాయంత్రం ఆ మిత్రుడు వెళ్తున్నప్పుడు మాత్రం ప్యోటర్ గొంతు విప్పాడు. "ఆ శస్త్రచికిత్స ఏదో చేసేయండి" అని స్థిరంగా చెప్పాడు. ఆ మాటలు విన్న నైనా నిస్పృహతో కుర్చీలో కూలబడింది. తన జీవితంలో ఆనందం ఎప్పుడు అంతమైందో, విషాదం ఎక్కడ మొదలైందో ఆమెకు అర్థం కాలేదు. నిజానికి సంతోషానికీ, విషాదానికీ మధ్య అంతరాన్ని అర్థం చేసుకోగల మానసిక స్థితి కూడా లేదామెకు ఆ క్షణంలో.

చివరికి ప్యోటర్‌కు శస్త్రచికిత్స జరిగింది. ఆయన పూర్తిగా కోలుకున్నాడు.

★ ★ ★

## సోషలిస్టు సమాజానికి ఏం కావాలి?

ఒకే బిడ్డ చాలనుకొనేవారికి ఎటువంటి అనుభవాలు ఎదురుకావచ్చో వివరించేందుకే ఈ వృత్తాంతాన్ని మీ ముందుంచాను. నిజానికి ఇలాంటి సంఘటనలు, అనుభవాలు నేను ఎన్నో చూశాను. ఇది చదివి ఒక్క బిడ్డతో సంతృప్తి చెందాలనుకొనే తల్లితండ్రులు నాపై యుద్ధానికి వస్తారేమో? అటువంటి వారిని భయపెట్టేందుకు నేను ఇది రాయడం లేదు. ఒక బిడ్డ మాత్రమే ఉన్న కుటుంబాలు పూర్తి సంతోషంగా, సరదాగా ఉండడం అసాధ్యం కాదు. అయితే అది పూర్తిగా తల్లితండ్రుల మానసిక పరిణితి, వారి ఆలోచనాధోరణిపై ఆధారపడి వుంటుంది. సరైన వాతావరణంలో ఒక్క బిడ్డను పెంచితే కుటుంబ సభ్యుల మధ్య గాఢమైన మైత్రి, అనురాగాలు ఏర్పడగలవు. అటువంటి వాతావరణంలో పెరిగే పిల్లవాడు తమకు మరో బిడ్డ ఉంటే బావుండేది అని వృద్ధాప్యంలో తల్లితండ్రులు పశ్చాత్తాప పడనవసరం లేకుండా

చేయగలడు. ఇలా ఒకే బిడ్డ ఉన్న ఒంటరి మహిళలు, భార్యను కోల్పోయిన మగవారు ఆ పిల్లవాడిని అద్భుతమైన వ్యక్తిగా రూపుదిద్దడం నాకు తెలుసు. ఇటువంటి కుటుంబాల్లో అనివార్యంగా పేరుకొన్న విషాదం, వెంటాడే ఒంటరితనం పిల్లలపై గట్టి ప్రభావాన్ని చూపి, వారు తమ తల్లినో, తండ్రినో చివరివరకూ శ్రద్ధగా ఆదరించగలరు. అయితే ఇవి ప్రత్యేక సందర్భాలు. విషాదం ఆవరించిన వాతావరణం నుంచి ఈ తరహా వ్యక్తిత్వాలు ఆవిర్భవించే అవకాశం ఉంటుంది. అందువల్ల 'ఒకే బిడ్డ' వల్ల ఎదురయ్యే అన్ని సమస్యలకూ ఇది పరిష్కారం చూపలేదు.

ఎక్కువమంది పిల్లలు గల కుటుంబం నుంచి ఎదిగి, జీవితంలో ఉన్నత శిఖరాలు చేరినవారు, కుటుంబ సభ్యుల పట్ల ఆదరాభిమానాలు కోల్పోనివారు లక్షల్లో మనకు కనిపిస్తారు. కుటుంబంలో ఒకే బిడ్డగా పెరిగి ఈ స్థాయికి చేరినవారి సంఖ్య స్వల్పమే మరి. నా అనుభవాలను ఒకసారి మననం చేసుకుంటే ఒంటరి బిడ్డగా పెరిగిన పిల్లల్లో చాలామంది మితిమీరిన అహంభావులు, తల్లితండ్రులను నిర్లక్ష్యం చేసేవారే ఎక్కువమరి. అయితే ఈ సూత్రీకరణ మనలాంటి సోషలిస్టు సమాజానికే వర్తిస్తుంది.

బూర్జువా సమాజంలో ఇది పెద్ద సమస్య కాదు. ఎందుకంటే ఆ వ్యవస్థ కోరుకునే గుణగణాలకు, ఒంటరి బిడ్డకు సంక్రమించే (అవ) లక్షణాలకు మధ్య అక్కడ వైరుధ్యం ఉండదు. కఠినంగా వ్యవహరించడం, దీనికి పైపై మర్యాదలు జోడించడం, దేనిపట్లా సానుభూతి లేకపోవడం, అహంకారులుగా ఉండడం, నైతిక విలువలను పట్టించుకోకపోవడం, జీవితంలో పైకి రావడమే లక్ష్యం కావడం వంటి లక్షణాలన్నీ బూర్జువా, పెట్టుబడిదారీ సమాజాల్లో ప్రజలందరికీ అవసరమైన లక్షణాలు. కానీ ఆ విలువలు మన సోషలిస్టు వ్యవస్థ విశ్వసించే, పాటించే సిద్ధాంతాలకు హాని చేస్తాయి.

మన సోషలిస్టు సమాజంలో మొత్తం కుటుంబం దృష్టిని ఆకర్షించే ఒకే పిల్లవాడు అంత వాంఛనీయం కాదు. దీనివల్ల కలిగే హానిని నిరోధించడం తల్లితండ్రులకు సాధ్యం కాదు. ఒకవేళ తల్లితండ్రులు ఒకే బిడ్డను కలిగిఉన్నా, వాడిని పరిమితంగానే ప్రేమిస్తున్నా, లేదా వారి ఆప్యాయత తగినంత లేకపోయినా కూడా ఫలితాలు ఆనందకరంగా ఉండే అవకాశాలు స్వల్పం. ఉన్న ఒకే ఒక బిడ్డను తల్లితండ్రులు ప్రేమించలేకపోతే, తద్వారా వాడికి దూరమైతే వాడు ఎలా తయారవుతాడో ఊహించడమే అసాధ్యం.

పెద్ద కుటుంబంలో ఒక బిడ్డ మరణిస్తే అది తీవ్రమైన విషాదానికి దారితీసినా, మొత్తం కుటుంబానికి అది తట్టుకోలేనంత విఘాతం కాదు. ఎందుకంటే మిగిలిన పిల్లల సంరక్షణ, వారు కోరే అనురాగాన్ని పంచడం ఈ తల్లితండ్రుల బాధ్యత. అందుకోసమైనా ఆ కుటుంబం తన స్వరూపాన్ని కోల్పోకుండా ఆ విషాదం నుంచీ తేరుకుని ముందుకు సాగుతుంది. అంటే మన సమాజంలో ఎక్కువమంది పిల్లలే కుటుంబ వ్యవస్థ పరిరక్షణకు కవచంలా ఉంటారు. అదే ఉన్న ఒకే ఒక బిడ్డను కోల్పోయిన తల్లితండ్రులు అనుక్షణం ఒంటరి గదుల్లో సంచరిస్తూ, ప్రతిక్షణం తమకు దూరమైన తియ్యని అనుభవాలను గుర్తు చేసుకుంటూ విషాదంలో మునిగిపోవాల్సి ఉంటుంది. దూరమైన బిడ్డను మరిపించే పిల్లలెవరూ ఉండకపోవడం వారి విషాదాన్ని రెట్టింపు చేస్తుంది. ఆ తల్లితండ్రులకు మిగిలినదంతా శూన్యంగా కనిపిస్తుంది.

అదీకాక, ఒక పిల్లవాడిలో విపరీతమైన వ్యక్తిత్వవాద పోకడలను నిరోధించగల శక్తిసామర్థ్యాలు ఎక్కడో తప్ప సాధారణ పాఠశాలలకు ఉండవు. పిల్లవాడిపై ఆదినుంచీ ప్రభావం చూపేది కుటుంబ వాతావరణమే కాబట్టి కొంత ఊహ తెలిసిన తరువాత ఏర్పడే స్కూలు వాతావరణం వాడిని అంతగా ప్రభావితం చేయలేకపోవచ్చు. *కమ్యూన్లుగా నడిచే స్కూళ్లు ఈ సమస్యను పరిష్కరించగలవు కానీ, అటువంటి వాతావరణం కుటుంబంలోనే ఉండటం ముఖ్యం.

ఒకే బిడ్డగా పెరిగే పిల్లలు మన సమాజానికి పునాదివంటి సమిష్టి భావనకు దూరంగా ఉంటారు. తమ అనుభూతులు, ఆలోచనలు, ఊహలు, పనులు పంచుకొనేందుకు కావలసిన తోడు ఇంటి వాతావరణంలో లేకపోవడం వల్ల తల్లి, తండ్రి వారి ఒకే ఒక బిడ్డతో ఏర్పడేది బలహీనమైన వ్యవస్థ మాత్రమే. అభిప్రాయాల్లో భిన్నత్వం, లక్షణాల్లో వైవిధ్యం, పలురకాల వ్యక్తిత్వాల సమాహారంగా ఉండని ఈ కుటుంబాల్లో స్వల్ప వైరుధ్యాలే వ్యక్తుల మధ్య అగాధాలను సృష్టిస్తాయి. ఈ వైరుధ్యాలకు కేంద్రం అనివార్యంగా ఆ ఇంటిలో పెరిగే ఒకే ఒక బిడ్డ అవుతాడు.



## అసలైన విషాదం

మనస్తత్వాలను విశ్లేషిస్తూ రష్యన్ రచయితలే కాక, ప్రపంచ ప్రఖ్యాత రచయితలు ఇప్పటికే ఎన్నో రచనలు చేశారు. ముఖ్యంగా నేర మనస్తత్వం గలవారి గురించి విస్తారంగా గ్రంథాలు వచ్చాయి. అయితే అతి తక్కువమంది మాత్రమే సమాజంలో పిల్లలపై జరిగే నేరాలపై దృష్టి సారించారు. పిల్లల పట్ల పెద్దలు సాగించే అతి క్రూరమైన నేరం వారిని అనాధలుగా వదిలి వేయడం. తండ్రి ఎవరో తెలియని పిల్లల గురించి కొందరు రచయితలు కొంత పట్టించుకొన్న మాట నిజం. అయితే పూర్తిగా మానవతావాదులైన రచయితలు సైతం దీనిని పిల్లలకు తల్లి తండ్రులు లేకపోవడం అనే సమస్యగా కాక ఒక సామాజిక సమస్యగా మాత్రమే పరిశీలించారు. ఈ క్రమంలో వారు చరిత్రకు సంబంధించి సరైన దృశ్యాలనే చిత్రించగలిగినా అసలు సమస్యను పిల్లలు తమ అమ్మానాన్నల కోసం పడే వేదనగా పట్టించుకోలేదు. భూస్వామి తన బానిసల్లో ఎవరికైనా పిల్లలను కన్నప్పటికీ వారు ఆ పిల్లలను ఎప్పుడూ తమ బిడ్డలుగా పరిగణించలేదు. ఆ పిల్లలకు తాము తండ్రులమనే స్పృహ వారికి ఉండేది కాదు. తాము సుఖం అనుభవించిన యువతిని, దానివల్ల ఆమెకు పుట్టిన బిడ్డని తనకు గల అసంఖ్యాకమైన పశువుల్లో భాగంగానే పరిగణిస్తారు ఆ భూస్వాములు. ఈ 'కింది వర్గాల' జనంతో సన్నిహిత సంబంధాలు పెట్టుకోనవ సరం లేదని భావించే ఈ పెద్దలు తమవల్ల తల్లి అయిన యువతి పట్ల, తద్వారా పుట్టిన బిడ్డ పట్ల ఎటువంటి బాధ్యత స్వీకరించరు. ఇది ఆ రచయితలు భావించినట్టు ప్రధానంగా ఆర్థిక, సామాజిక సమస్యే.

అయితే కుటుంబాన్ని ఏర్పరుచుకుని తండ్రిగా కొంతకాలం బాధ్యతలు నిర్వర్తించిన మనిషి ఉన్నట్టుండి అదృశ్యమైతే దాని ప్రభావం ఆ కుటుంబంపై, ముఖ్యంగా పిల్లలపై ఎలా

*కమ్యూన్ స్కూళ్లు : ఇవి మన రెసిడెన్షియల్ పాఠశాలల వంటివి. అయితే ఇక్కడ పిల్లలు చదువుతో పాటు ఏదో ఒక వృత్తివిద్యలో ప్రావీణ్యం సంపాదిస్తారు.

ఉంటుందనేది నేను ప్రత్యేకంగా పట్టించుకొన్న సమస్య. ఈ సందర్భాల్లో కుటుంబం తండ్రి అనే పెద్ద లేకుండానే కాలం వెళ్లదీయాలి. ఉన్న వనరులు, శక్తిని కూడగట్టుకొని భవిష్యత్తులోకి ముందుకు సాగాల్సి ఉంటుంది. ఒక తండ్రి మరణించినప్పుడు ఆ కుటుంబం పరిస్థితికీ, ఆ తండ్రి వారిని అనాథలుగా చేసి అదృశ్యమైతే ఎదురయే పరిస్థితికీ వ్యత్యాసం ఉంది. తండ్రి కావాలనే తమను విడిచి వెళ్లాడనే విషయం తెలిసిన పిల్లలపై ఆ ప్రభావం చాలా ఉంటుంది. అదొక సంక్లిష్ట సమస్య.

★ ★ ★

## అందరూ ఉన్న అనాథలు

కొద్దికాలం క్రితం వరకూ ఎవ్‌గెనియా అలెగ్జెయేవ్నా జీవితం ఎటువంటి కుదుపులూ లేకుండా ఉల్లాసంగా నడిచింది. యవ్వనంలో ప్రవేశించేవరకూ కుటుంబ సభ్యుల ఆత్మీయతల మధ్య పెరిగిన ఎవ్‌గెనియాకు ఆ మధుర స్మృతులు మనసులో మెదలుతూనే ఉంటాయి. ఒక మంచి కుటుంబ వాతావరణంలో పెరగడం వల్ల ఆమె భావి జీవితంలో తన కుటుంబం ఎలా ఉండాలో ముందుగానే ఒక అంచనాకు రాగలిగింది. ఆమె తన కుటుంబ బాధ్యతలను భర్త జుకోవ్‌తో కలిసి పంచుకొంది. అంతకుముందే వారిద్దరి మధ్య ప్రేమ అంకురించింది. పెళ్లయిన పది, పన్నెండేళ్ల తరువాత కూడా వారి మధ్య ఆ ఆత్మీయత, అనురాగం, స్నేహభావం ఇంకా మిగిలి ఉన్నాయి. నిజానికి ఎవ్‌గెనియాతో పోలిస్తే జుకోవ్ అందగాడు కాదనే చెప్పాలి. ఆమెకు అంతకు ముందు అతనికంటే అందంగా, ఆరోగ్యంగా, ఉల్లాసంగా ఉండే యువకులు పెళ్లి ప్రతిపాదనలు చేశారు కూడా. అయితే ఆమె ఎంత ప్రయత్నించినా వారిలో ఒక్కరినీ సన్నిహితంగా పరిగణించ లేకపోయింది. జుకోవ్ వ్యవహారం వేరు. అతను భార్యను గౌరవించి, పట్టించుకొనే భర్త. ప్రేమాస్పదుడైన తండ్రి, ఒక మంచి వ్యక్తి అని ఎవ్‌గెనియా అంచనా వేసింది. ఆనాటి వరకు వారు అలాగే గడిపారు. కానీ ఆరోజు జుకోవ్ ఆఫీసు పని పూర్తయాక సాయంత్రం ఎప్పటిలా ఇంటికి తిరిగి రాలేదు. మరునాటి ఉదయం అతని నుంచి ఒక చిన్న ఉత్తరం అందింది.

"ఎవ్‌గెనియా! నిన్ను మరింతకాలం మోసం చేయడం నాకు ఇష్టం లేదు. తుదివరకూ నిజాయితీగానే ఉండాలనేది నా లక్ష్యం. నేను అన్నా నికోలయేవ్నాను ప్రేమిస్తున్నాను. ఇకపై ఆమెతోనే కలిసి జీవిస్తాను. పిల్లలకోసం ప్రతినెలా రెండు వందల రూబుల్లు పంపిస్తాను. నన్ను క్షమించు. నీకు అన్నివిధాలా కృతజ్ఞుడనై వుంటాను." - ఇదీ ఆ ఉత్తరం.

మొదటిసారి దాన్ని చదవగానే జరగకూడనిది ఏదో జరుగుతోందని మాత్రం ఎవ్‌గెనియాకు బోధపడింది. అదేమిటో ఆమెకు స్పష్టంగా తెలియరాలేదు. నెమ్మదిగా రెండోసారి, మూడోసారి ఆ చిన్న ఉత్తరాన్ని చదివిందామె. మెల్లగా చదువుతున్నపుడు అందులోని ప్రతి వాక్యం వెనుకగల రహస్యం ఆమెకు అర్థమైంది.

ఒక్కసారి నిస్సహాయత ఆవరించడంతో కణతలు నొక్కుకుంటూ కూర్చుండిపోయింది ఎవ్‌గెనియా. "తుదివరకు నిజాయితీగానే ఉండాలనేది నా లక్ష్యం" అన్న మాటలో ఏదో వేరే అర్థం స్ఫురించి, కొన్ని క్షణాలు ఏదో ఆశ మినుకు మినుకు మంది ఆమె హృదయంలో. అంతలోనే మళ్లీ ఆమెను నిర్లిప్తత, నిస్సహాయత, నిరాశ ఆవహించాయి.

ఆమె బుర్రలో అర్థంపర్థంలేని చిల్లర విషయాలు అనేకం కదం తొక్కాయి. నెలకు రెండు వందల రూబుళ్లు... ఈ ఖరీదైన ఇల్లు... రేపు స్నేహితుల పరామర్శలు... ఇంట్లోని అన్ని పుస్తకాలు... సొగసైన దుస్తులూ... ఇలా పొంతనలేని అనేక పనికిమాలిన విషయాలు ఆమె మెదడులో పరిభ్రమించాయి. ఒకసారి బలంగా తలవిదిల్చి ఆ చిల్లర పరిగణనల నుంచి బయట పడే ప్రయత్నం చేసిందామె. ఈ పరిణామంతో ఎదురయే కఠిన వాస్తవం ఆమెకు స్ఫురించింది. "తను, ఎవ్‌గెనియా ఇప్పటినుంచి భర్త వదిలిపెట్టిన మహిళ!" ఇలా ఎలా జరుగుతుంది? మరి పిల్లలు ఏమవుతారు?" ఈ ఆలోచనలతో ఆమె పరిసరాలను భయం భయంగా పరిశీలించింది. అంతా సవ్యంగా, అన్నీ మామూలుగా ఉన్నాయి. పడకగదిలో ఐదేళ్ల ఓల్యా ఏదో తన గొడవలో మునిగి ఉంది. ఆ నిశ్శబ్దం ఆమెలో కొత్త భయాలను కలిగించింది. ఎవరో తనను, తన ఇద్దరు పిల్లలు - ఇగోర్, ఓల్యాలను - పాత కాగితంలో చుట్టి చెత్తకుప్పలోకి విసిరేశారనే భావన కలిగింది.

ఆ అయోమయంలోనే కొన్ని రోజులు గడిచాయి. ఆ సమయంలో ఎవ్‌గెనియా రాతబల్ల వద్ద కూర్చుని తలపట్టుకుని ఏదో గుర్తుతెచ్చుకునే ప్రయత్నం సాగించేది. బాధ, విషాదం ఆవరించి ఆమెకు తెలియకుండానే కళ్లు వర్షించేవి. ఈ ఆలోచనలకు ఒక క్రమం, పద్ధతి ఉండేవి కావు. అకస్మాత్తుగా ఒంటరితనం కమ్ముకున్నట్టై భయం కలిగేది.

పిల్లలు మాత్రం ఎప్పటిలానే ఆడుకుంటూ, అల్లరిచేస్తూ, నవ్వులు చిందిస్తూ తల్లి చుట్టూ తిరుగుతున్నారు. ఎవ్‌గెనియా వారివంక భయంగా చూసి, వెంటనే తేరుకుని, నెమ్మదిగా నవ్వి సందర్భానికి తగినట్టు వాళ్లతో ఏదో మాట్లాడేది. అయితే ఆమె కళ్లలో భయం దాగేది కాదు. తల్లిలోని ఈ మార్పును పిల్లలు ఆశ్చర్యంతో గమనించడం ప్రారంభమైంది. మొదటిరోజు తండ్రి ఇంట్లో లేకపోవడాన్ని ఆమె అప్పటికి తట్టిన ఆలోచనతో సర్ది చెప్పింది.

"నాన్న దూరం వెళ్లారు. కొన్ని రోజుల వరకూ రారు. ఏదో ప్రత్యేకమైన పనిపై ఆయన్ని పంపించారు. చాలా దూరం. చాలా చాలా దూరం"అని పిల్లలకు వివరించింది.

ఈ "కొంతకాలం", "చాలాదూరం" లాంటి మాటలు చిన్నారి ఓల్యాకు అసలు అర్థం కాలేదు. రోజూ ఎవరు తలుపుతట్టినా ఆ పాప పరుగున వెళ్లి చూసి వచ్చేది.

"నాన్న ఎప్పుడొస్తారు?" అని అడిగేది.

సుదీర్ఘమైన పీడకలలో మునిగితేలుతున్న ఎవ్‌గెనియా, తాను ఈ విషాదం నుంచి కోలుకుంటున్నానని, దిగ్భ్రాంతి నుంచి తేరుకుంటున్నాననీ గమనించలేదు. ఉదయం నిద్ర లేచిన తరువాత బతుకు మరీ అంత భయానకంగా కనపడలేదామెకు. ఇక జీవితాన్ని దృఢంగా ఎదుర్కోవలసిందేనని అప్రయత్నంగానే ఆమె నిర్ణయించుకుంది. అనవసరమైన ఖరీదైన వస్తువులు కొన్ని అమ్మివేయాలని తేల్చుకుంది. ఈ క్రమంలో ఆమె కన్నీళ్లు పెట్టుకోవడం తగ్గింది.

ఎనిమిది రోజుల తరువాత జుకోవ్ ఆమె వద్దకు క్లుప్తమైన ఉత్తరంతో ఒక మహిళను పంపాడు. "ఈ ఉత్తరం తెచ్చినవారికి నా దుస్తులు, గడ్డం గీసుకునే రేజర్, ఆఫీసుకు సంబంధించిన ఫోటోల ఆల్బమ్, నా శీతాకాలం కోటుతోపాటు గదిలో బల్ల మీద, సొరుగులో ఉన్న ఉత్తరాల కట్ట ఇచ్చి పంపవలెను" అని ఉత్తరంలో రాశాడు.

ఎవ్గెనియా మారుమాట్లాడకుండా లేచి అలమార్లో ఉన్న జుకోవ్ సూట్లు మూడూ తీసి, సోఫాలో పరిచిన కాగితాలపై ఉంచింది. జుకోవ్ లోదుస్తులు, రేజర్ కూడా పంపాలని గుర్తువచ్చి ఒక్క నిమిషం ఆగి ఆలోచించింది. ఆమె పక్కనే నిలబడి ఈ తంతును చూస్తున్న పదేళ్ల ఇగోర్ "అమ్మా ఆ బట్టల్ని పేపర్లో చుట్టేయనా?" అని ఆత్రుతతో అడిగాడు.

ఆ మాటలు వినగానే ఎవ్గెనియాకు గుండె కలచివేసినట్టయింది. "ఓరి భగవంతుడా" అంటూ సోఫాలో కూలబడింది కంటి నీరు రాబోయినా, ఇంతలో తన ఇంటికి వచ్చిన అపరిచిత మహిళ సంగతి గుర్తొచ్చి తమాయించుకొంది. "ఇలా ఖాళీ చేతులతో వస్తే ఎలా? వీటన్నిటినీ ఎలా సర్ది ఇవ్వగలను?" అని ఆమెపై చిరచిరలాడింది.

ఆ మహిళ పరిస్థితిని అర్థం చేసుకున్నట్టు, సోఫాలో సామాను వంక చూసి సానుభూతిగా నవ్వింది. "మీరే ఏదో బుట్టకానీ, పెట్టె కానీ చూసి ఇస్తారని....." అంటూ ఆగింది.

ఆ మాటలు విన్న ఇగోర్ ఒక్కసారి ముందుకు దూకి "బుట్టా? అమ్మా ఇంట్లో వంటగది అలమారు వెనక ఉంది. బుట్ట వుంది. నేను తేనా?" అని గట్టిగా అన్నాడు.

"ఏ బుట్ట?" అంది ఎవ్గెనియా అయోమయంగా.

"అదే ఆ అలమారు వెనక... నేను తీసుకురానా?" అని ఇగోర్ అడిగాడు.

ఆమె ఆ పిల్లవాడి వంక తదేకంగా చూసింది. ఆ బుట్ట తానే తెచ్చి ఇవ్వాలనే అమాయకపు ఉత్సాహం వాడి కళ్లల్లో కనిపించింది. ఆ అమాయకత్వం చూసి ఎవ్గెనియాకు కొంత ఊరట కలిగింది. "ఆ బుట్ట అంత ఎత్తు లేవు. నువ్వెలా తేగలవు?" అని నవ్వుతూ వాడిని ప్రశ్నించింది. ఆ మాట అడుగుతునే వాడిని దగ్గరకు తీసుకుని తలపై ముద్దాడింది.

వాడు దీన్ని పట్టించుకోలేదు. తల్లి బంధం నుంచి విడిపించుకుంటూ, "నేను తేగలను. అది బాగా తేలికగా ఉంటుంది. అది ఎంత తేలికగా ఉంటుందో నీకు తెలియదు" అన్నాడు హడావుడిగా. ఈ గందరగోళం విన్న పాప ఓల్యా చేతుల్లో తన ఎలుగుబంటి బొమ్మను పట్టుకొని ఈ గదిలోకి వచ్చింది. ఇగోర్ పక్క గదిలోకి పరుగు తీశాడు. అక్కడినుంచి ఏదో బరువైన వస్తువును బలంగా ఈడుస్తున్నట్టు చప్పుడు వినిపించింది.

"అరె పిల్లవాడా?" అంటూ ఎవ్గెనియా ఈ వస్తువుల కోసం వచ్చిన మహిళ వైపు తిరిగి "ఆ బుట్ట తేవడంలో కొంచెం సాయం చేయండి దయచేసి" అని కోరింది.

వారిద్దరూ కలిసి మొత్తానికి ఆ బుట్టను ఈడ్చుకొచ్చారు. ఎవ్గెనియా మొదట జుకోవ్ దుస్తులను అందులో సర్దింది. అడ్డదిడ్డంగా సర్దితే తన పరువు పోతుందన్న విచిత్రమైన ఆలోచన తట్టి, ఆ దుస్తులు నలగకుండా జాగ్రత్తపడుతూ ఒక పద్ధతిలో సర్దింది. కోటు మడతలు, ప్యాంటు మడతలు చెరగకుండా శ్రద్ధ తీసుకుంది. పిల్లలిద్దరూ తల్లి చేస్తున్న పనిని శ్రద్ధగా గమనిస్తున్నారు.

ఉన్నట్టుండి ఇగోర్ అన్నాడు "ఆ చొక్కాలు ఎలా పెట్టావో చూడు, దానివల్ల సూట్లు నలిగి పోతాయి".

ఎందుకో హటాత్తుగా ఎవ్గెనియాకు కోపం ముంచుకు వచ్చింది. "నలిగితే నలగనీ కావాలంటే మళ్లీ చలువ చేయించుకొంటారు" అని గట్టిగా అరిచి సొరుగులో ఉన్న ఉత్తరాల

కట్టలు, గడ్డం గీసుకునే సామాగ్రిని బుట్టలోకి విసురుగా పడేసింది. దాంతో అందులోని బ్లేడులన్నీ బుట్టలోని దుస్తులపై చిందరవందరగా పడ్డాయి.

ఇగోర్ తల్లి వంక ఆశ్చర్యంగా చూశాడు."చూడు ఏం చేశావో...." అంటూ వంగి బ్లేడు లన్నింటినీ ఏరడం మొదలుపెట్టాడు.

ఎవ్గెనియా ఇక నిగ్రహం కోల్పోయింది. కొడుకు చేతిని విసురుగా వెనక్కిలాగి, "నీకు అనవసరమైన సంగతుల్లో తల దూర్చకు" అని గద్దించింది. తలతిప్పి ఆ మహిళ వంక చూసి "తీసుకెళ్లండి" అంది.

"ఏమైనా చెప్పమంటారా?" అడిగిందా మహిళ.

"ఏమిటి చెప్పేది? ఏమీలేదు. వెళ్లండి".

ఆవిడ ఆ బుట్టని జాగ్రత్తగా భుజానికి తగిలించుకొని నెమ్మదిగా ఇంట్లోంచి బయటకు నడిచింది.

ఎవ్గెనియా ఆమె వెళ్లినవైపు చూస్తూ, సోఫాలో కూర్చుని ఏడుపు ప్రారంభించింది. పిల్లలు అయోమయంగా ఆమెవంక చూస్తున్నారు. ఇగోర్ రాతబల్లని ఆనుకొని నుంచొని, బల్ల అంచుపై ఉన్న చిన్న కన్నంలో వేలు ఉంచి పరధ్యానంగా ఉన్నాడు. వాళ్ల నాన్న జుకోవ్ సిగరెట్ నుసి రాల్చేందుకు ఉపయోగించే కన్నం అది. ఓల్యా అప్పటికే తన చేతిలో బొమ్మని నేలపై పడేసి తలుపు వద్ద నిలబడి తల్లిని శ్రద్ధగా చూస్తోంది. కొన్ని నిమిషాల తరువాత తల్లి దుఃఖం నుంచి తేరుకున్న తరువాత ఆమెను ప్రశ్నించింది.

"ఎందుకామె ఆ బుట్ట తీసుకెళ్ళింది? ఎందుకు? ఎవరావిడ?"అని.

తల్లి సమాధానం ఇవ్వలేదు.

'చెప్పు. ఆ బుట్టలో నాన్న కోట్లు, చొక్కాలు పెట్టావు. దానిని ఆమె ఎందుకు తీసుకెళ్లింది' అని ఓల్యా మళ్లీ ప్రశ్నించింది.

పిల్లలకు తండ్రి గురించిన నిజం ఇంకా తెలియలేదన్న సంగతి ఎవ్గెనియాకు అప్పుడు స్ఫురించింది. ఆఖరికి పసిపిల్ల ఓల్యాకు కూడా నాన్న దుస్తులు అలా పంపడం చూసి ఏదో అనుమానం వచ్చింది. బహుశా ఇగోర్‌కు విషయం తెలుసేమో. ఇరుగుపొరుగువాళ్లు ఎవరైనా చెప్పారేమో అని తల్లికి సందేహం ఏర్పడింది. ఆమె వాడివంక పరీక్షగా చూసింది. వాడు ఒకసారి తలఎత్తి తల్లివంక చూసి, వెంటనే కళ్లు దించేశాడు. మరోపక్క ఓల్యా తల్లి సమాధానం కోసం ఎదురుచూస్తోంది. ఎవ్గెనియా ఆ పిల్లను పట్టించుకోకుండా కొడుకు భుజంపై చెయ్యివేసి, "నీకు విషయం ఏమైనా తెలుసా?" అని అడిగింది.

ఇగోర్ అదోలా నవ్వాడు.

"అమ్మా నువ్వేం అంటున్నావో నాకు తెలియడం లేదు. నాకు ఏ విషయం తెలుసని అడుగుతున్నావు?"

"నాన్న గురించి నీకు తెలుసా?"

వాడి మొహంలో నవ్వు చెరిగిపోయింది.

"నాన్న గురించా?"

కిటికీలోంచి బయటకు చూస్తూ ఆమె తల ఊపింది. ఓల్యా వచ్చి తల్లి చెయ్యి పట్టుకుని గుంజింది. "ఆవిడ ఎవరో నాన్న బట్టలు ఎందుకు పట్టుకెళ్లింది? చెప్పమ్మా" అని గట్టిగా అడిగింది. ఆ పిల్ల గొంతులో ఎంతో కోపం, ద్వేషం ప్రతిఫలించాయి.

ఎవ్‌గెనియా పిల్లలిద్దరివైపూ చూసింది. ఓల్యా అంతలోనే కోపం మరచి అన్న వంక కొంటెగా చూస్తూ వెక్కిరిస్తోంది. ఆ పిల్లకు తండ్రి ఇక తిరిగిరాడని, ముందున్నవి సమస్యలేనని అర్థం చేసుకునే జ్ఞానం లేదు. ఎవ్‌గెనియాకు తన భర్తను ఇప్పుడు ఆకర్షించిన అన్నా నికోలయేవ్నా రూపం గుర్తు వచ్చింది. అందంగా, యవ్వనపు పొంగులో, ఉల్లాసంగా మెదిలే ఆ మొహం, కుదురుగా, కురచగా ఉండే తలకట్టు, తళతళ మెరిసే కళ్లు జ్ఞాపకం వచ్చాయి. ఈ అందమైన రూపాన్ని చూసే జుకోవ్ తనను వదలి ఆమె వద్దకు వెళ్లాడు. ఈ ఆలోచన ఎవ్‌గెనియాకు దుర్భరంగా అనిపించింది.

ఆమె ఆలోచనల ప్రవాహాన్ని ఇగోర్ అడ్డుకున్నాడు. "నాన్న ఎప్పుడు వస్తారు?" అని అకస్మాత్తుగా ప్రశ్నించాడు. వాడితో పాటు, ఓల్యా కూడా తల్లి వంక సమాధానం కోసం చూసింది. ఇక పిల్లలకు నిజం చెప్పడమే మంచిదని ఎవ్‌గెనియా నిర్ణయించుకొంది.

"నాన్న ఇక రాడు....."

ఇగోర్ మొహం క్షణంలో పాలిపోయింది. ఓల్యాకు ఏమీ అర్థమైనట్టు లేదు. "సర్లే ఇంతకీ నాన్న వచ్చేది ఎప్పుడు?" అని మళ్లీ అడిగింది.

"ఆయన ఇక రాడు. ఎప్పటికీ రాడు. మీకు నాన్న లేడు. అర్థమైందా?" అంది ఎవ్‌గెనియా.

"అంటే చచ్చిపోయాడా?" ఇగోర్ మొహంలో అయోమయం, కలవరం కదలాడాయి. ఓల్యా ఆ మాటలను అర్థం చేసుకోలేక "... చచ్చిపోయాడా?" అని గొణిగొంది.

ఎవ్‌గెనియా పిల్లలిద్దరిని దగ్గరికి తీసుకొని వారితో మెల్లగా మాట్లాడింది. ఆమె కళ్ల వెంట ఎంత ప్రయత్నించినా నీరు ఆగడం లేదు. ఆమె గొంతులో వ్యధ బహుశా పిల్లలకు అర్థమైందేమో.

"నాన్న మనందరినీ వదిలేశాడు. అర్థం అయిందా? వదిలేశాడు. ఇక మనతో కలిసి ఉండటం ఆయనకు ఇష్టం లేదు. ఆయన ఇప్పుడు మరొక ఆమెతో కలిసి ఉన్నాడు. ఇక మనం ఆయన లేకుండా ఇలాగే ఉండాలి. మనం ముగ్గురం. నేనూ... నా చిన్నారి ఇగోర్... నా చిట్టితల్లి ఓల్యా... ముగ్గురం... అంతే ఇంకెవరూ ఉండరు".

"అంటే నాన్న మరొకరిని పెళ్లి చేసుకొన్నాడా?" అడిగాడు ఇగోర్.

"అవును".

"అయితే నువ్వు మళ్లీ పెళ్లి చేసుకుంటావా?" ఇగోర్ తల్లివంక పరీక్షగా చూస్తూ ప్రశ్నించాడు. పెద్దవాళ్ల సమస్యల్ని అర్థం చేసుకొనేందుకు ప్రయత్నిస్తున్నట్టు వాడి కళ్లు అమ్మ మొహంలో కదలాడే భావాలను గమనిస్తున్నాయి.

"అదేం లేదు. నేను మిమ్మల్ని వదిలి ఎక్కడికీ వెళ్లను. భయపడవద్దు. అన్నీ సక్రమంగా జరుగుతాయి" అంది ఎవ్‌గెనియా. అప్పటికే ఆమె గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. అంతలోనే తమాయించుకొని, "వెళ్లండి ఆడుకోండి. ఓల్యా నీ బొమ్మ ఏదీ...."

ఓల్యా తల్లి మోకాళ్లని పట్టుకొని యధాలాపంగా వెనక్కి ముందుకు ఊగుతుంది. చివరికి ఆ పిల్ల అమ్మను వదిలి నెమ్మదిగా లోపలి గదిలోకి నడిచింది. వెళ్తూ తలుపు దగ్గర ఆగి నేలపై

పడిఉన్న ఎలుగుబంటి బొమ్మ కాలును పట్టుకు ఈడ్చుకుంటూ మంచం మీద తను ఎప్పుడూ కూర్చునే మూలకు వెళ్లింది. అక్కడ ఆ బొమ్మను మంచం పైకి విసిరి పక్కనే ఉన్న చిన్నబల్లపై కూర్చుని తల్లి గురించి ఆలోచించింది. అమ్మ బాధపడుతోందని, గట్టిగా ఏడవబోతోందనీ అర్థం చేసుకుంది. కాబట్టి ఇకపై "నాన్న ఎప్పుడు వస్తాడు?" అని అడగకూడదని నిర్ణయించు కొంది.

★ ★ ★

అందమైన, మంచీ మర్యాద తెలిసిన గృహిణి తను. పసితనపు అమాయకత్వం ఇచ్చే అందంతో మెరిసే పిల్లలిద్దరూ చురుకైనవాళ్లు. ఇంతకాలం అందరం హాయిగా, సంతోషంగా గడిపాం. ఇంత జీవితాన్నీ ఏదో చిన్న వ్యవహారంలా నిర్లక్ష్యం చేసి ఎంత సులభంగా వెళ్లిపోయాడు! కేవలం మరో యువతి కోసం ఇంతటి జీవితాన్ని కాదనుకుని వెళ్లిపోవడం జుకోవ్‌కు ఎలా సాధ్యమైంది? ఇటువంటి ఆలోచనలతో, వేదనతో సతమతమైన ఎవ్‌గెనియా త్వరలోనే ఈ విచారం నుంచి బయటపడగలిగింది. అవసరాలు ఆమెను ఆ విషాదం నుంచి బయటకు తేగలిగాయి.

ఈ పన్నెండేళ్లలోనూ ఇంటి ఖర్చు అంతా ఎవ్‌గెనియా చేతిపైనే నడిచింది. తన భర్త ఆదాయం ఎంతో కచ్చితంగా ఏనాడూ తెలియదామెకు. అయితే ఇంటి ఖర్చు కోసం ఎప్పుడూ ఆమె వద్ద పుష్కలంగా డబ్బు ఉండేది. భర్త ఆదాయంపై తనకు, తన పిల్లలకు పూర్తి హక్కులున్నాయని ఆమె భావించేది. అయితే అదంతా భ్రమ అని తేలిపోయింది. ఇంతకాలం జుకోవ్ ఆమెకు, ఆమె పిల్లలకు ఖర్చు చేశాడంటే, అది ఆమె ప్రేమకు, అతనికి సుఖం ఇచ్చినందుకు అతను చెల్లించిన మూల్యం అని తేలిపోయింది. ఒకసారి జుకోవ్‌కు ఈ జీవితం విసుగు అనిపించి, మరో యువతితో సంసారం ప్రారంభించగానే అతనికి ఈ కుటుంబం పట్ల బాధ్యత లేకుండా పోయింది. ఇప్పుడు ఈ కుటుంబాన్ని నడిపే కర్తవ్యం ఎవ్‌గెనియాదే. దీనికోసం ఆమె తన జీవితాన్ని, యవ్వనాన్ని త్యాగం చేయాల్సిందే.

ఈ నేపథ్యంలో జుకోవ్ ఇస్తానన్న నెలవారీ భత్యం రెండు వందల రూబుళ్లు తీసుకోవడం ఆమెకు అవమానకరంగా అనిపించింది. రాత్రిళ్లు నిద్రపట్టక దొర్లుతున్నప్పుడు జుకోవ్ రాసిన ఉత్తరంలోని వాక్యం గుర్తు వచ్చేది. "ఇకపై నెలనెలా పిల్లల కోసం రెండు వందల రూబుళ్లు పంపుతాను" పిల్లలకు సంబంధించి జుకోవ్ బాధ్యత నెలకు రెండు వందల రూబుళ్లు! అనుకొనే దామె విరక్తిగా.

ఆ రెండు వందల రూబుళ్లతో అతను జీవితకాలం ఆందోళన, విచారం, బాధ్యత, ప్రేమల నుంచి తప్పించుకోగలుగుతున్నాడు.

జుకోవ్ నుంచి మొదటి నెల ఆ రెండు వందల రూబుళ్లు అందుకోవడం ఆమెకు చాలా గుర్తుండిపోయింది. ఆ డబ్బు తెచ్చిన వ్యక్తికి రసీదు సంతకం పెట్టి ఇవ్వడం, వెంటనే బజారువెళ్లి ఇంటికి కావలసిన సామగ్రి కొనడం జ్ఞాపకం వచ్చి సిగ్గుగా అనిపించేది. ఆ సాయంత్రం పిల్లలను తీసుకొని బయటకు వెళ్లి ఎటువంటి సంకోచం లేకుండా వాళ్లకి కేక్‌లు, బిస్కట్లు కొనిపెట్టడం తలచుకున్నప్పుడల్లా ఆమెకు అవమానం అనిపించేది. పిల్లలు ఆనందంగా వాటిని తింటుంటే, మానవ సహజమైన హుందాతనం, కొంచెం ఆత్మగౌరవం కూడా లేకుండా తాను వారిని చూసి పగలబడి నవ్వడం, అతి కష్టం మీద వాటిని తాను కూడా తిందామనే కోరికను అణచుకోవడం

మరచిపోలేక చిన్నతనంగా అనిపించి బాధపడేది. అయితే రోజులు గడుస్తున్నకొద్దీ ఈ రెండు వందల రూబుల్లకు ఆమె అలవాటు పడింది. పైగా తమ అవసరాలను అవి తీర్చగలుగుతున్నా యనే వాస్తవాన్ని మరుగునపరిచి, జుకోవ్‌కు మాత్రం బాధ్యతలేదా? సంపాదించిన మొత్తమంతా అతనొక్కడే సంతోషంగా ఖర్చు పెట్టుకొంటే ఇక్కడ పిల్లల అవసరాలను పట్టించుకొనేదెవరు అని ఎవ్‌గెనియా సమాధానపడేది. నెలనెలా అతను పంపవలసిందే. ఆ మేరకు అతనికి బాధ్యత ఉండాల్సిందే అని ఆమె బింకంగా అనుకునేది.

క్రమంగా జుకోవ్ అంటే గతంలో ఉన్న అభిమానం, పట్టింపులను ఆమె మరచిపోగలిగింది. సొంత మనిషిగా, భర్తగా హృదయంలో అతనికిచ్చిన స్థానాన్ని ఆమె తుడిచిపెట్టగలిగింది. ఇప్పుడు ఆమె దృష్టిలో అతను బాధ్యతలేని, ప్రేమంటే తెలియని, ఎటువంటి ఆత్మాభిమానం లేని పురుగు. అతనికోసం బాధపడవలసిందేమీలేదని ఆమె తేల్చుకొంది. అటువంటి వ్యక్తితో కలిసి ఉండవలసిన, జీవితాన్ని పంచుకోవలసిన అవసరం ఇకలేకపోవడం మంచిదే అని ఎవ్‌గెనియా తృప్తిపడే ప్రయత్నం చేసింది. దీనికితోడు ఒక పెద్ద సంస్థలో కార్యదర్శిగా ఉద్యోగం వచ్చిన తరువాత, పనుల హడావుడిలో ఎవ్‌గెనియా తన మాజీ భర్తను పూర్తిగా మరచిపోగలిగింది. అతను నెలనెలా పంపే రెండు వందల రూబుల్లు కూడా గతంలోలా ఆమెను ఇబ్బంది పెట్టడం లేదు. అది అతని బాధ్యత అని మాత్రం ఆమె తనకు తాను చెప్పుకొంది. రోజులు గడిచి, వారాలు నెలలుగా మారి గతంలో కలిసిపోతున్నాయి. ఆమె తన విచారాన్ని, తనకేదో నష్టం జరిగిందనే దుఃఖాన్ని క్రమంగా మరిచిపోతోంది. ఈ విషాదం మూలంగా, దారీతెన్నూ లేనట్టు కనిపించిన భవిష్యత్తు కలిగించిన భయం కారణంగా నిద్రాణావస్థలోకి జారుకున్న స్త్రీత్వం ఆమెలో తిరిగి అలజడి సృష్టించడం మొదలైంది. ఆమె వృద్ధురాలేం కాదు. ముప్పై మూడేళ్ల ప్రౌఢ. అయితే ఆమెలో నాటి యవ్వనం ఇప్పుడు వెలసిపోయింది. కళ్లు అందంగా, తళతళలాడినా ఆమె వయస్సును అవి దాచడం లేదు. ఆ కళ్లు ఇప్పటికీ కొంటెగా, రెచ్చగొడుతున్నట్టు నవ్వగల వేమో కానీ, వాటికింద పలచటి ముడతలను దాచడం అసాధ్యం. అయితే ఈ వయసులోనే మంచి దుస్తులు, సరైన మేకప్ ఆమె ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించగలవు. ఈ స్పృహ ఎప్పుడైతే కలిగిందో, అప్పటినుంచీ ఎవ్‌గెనియా తన గురించి, ఆహార్యం గురించి శ్రద్ధ తీసుకోవడం ఆరంభించింది. తన ముఖకవళికలను, హావభావాలను పదేపదే అద్దంలో పరీక్షించుకోవడం మొదలైంది.

దాదాపు ఇదే సమయంలో జుకోవ్ నుంచి మూడో ఉత్తరం అందింది.

"నెలనెలా రెండేసి వందలు పంపడం కష్టంగా ఉంది. ఎలాగూ సెలవులు రాబోతున్నాయి. అందువల్ల పిల్లలను ఉమాన్‌లోని మా నాన్నగారింటికి పంపితే మంచిదని నా సూచన. వాళ్లు అక్కడ సెప్టెంబర్ వరకూ ఉండవచ్చు. సెలవుల్లో సరదాగా తిరిగినట్టూ ఉంటుంది. అమ్మా నాన్న బాగా సంతోషిస్తారు కూడా. ఈ విషయం అప్పుడే వారికి తెలియపరిచాను. నీకు అంగీ కారమైతే పిల్లలను అక్కడికి పంపే అన్ని ఏర్పాట్లూ చేస్తాను" - ఇదీ ఆ ఉత్తరం.

చదవగానే ఎవ్‌గెనియా దాన్ని కోపంతో బల్లపైకి విసిరి కొట్టింది. ఉత్తరం తెచ్చిన మనిషిని పొమ్మని చెబుదామనుకొంది. ఇంతలోనే ఆమెకు 'ఏదో' స్ఫురణకు వచ్చింది. అదేమిటో స్పష్టంగా అర్థం కాకపోయినా, ముందు పిల్లలను సెలవులకు తాతగారింటికి పంపడం మంచిదేనని

ఆమెకు అనిపించింది. ఆమె లేచి బయటికి వస్తూ అద్దంలో చూచుకొంది. ఎందుకో ఆమెకు నవ్వు వచ్చింది. అద్దంలో ఆమెకు సన్నగా, పొడవుగా ఉన్న అందమైన మహిళ కనిపించింది. ఎవ్‌గెనియా బయటకు వచ్చి జుకోవ్‌కు ఆ ఉత్తరం తెచ్చిన వ్యక్తితోనే కబురు పంపింది. జుకోవ్ చేసిన సూచన గురించి ఆలోచించి మళ్లీ చెబుతాననేది ఆ సందేశం.

లోపలికి వచ్చి సోఫాలో కూర్చుంది. నిజంగానే పిల్లలకు సరదాలనేవి లేకుండా పోయాయి. కొంతకాలం సెలవులకు అలా బయటి ఊరు వెళ్లిరావడం బానే ఉంటుంది. పల్లెలో తోటల్లో ఆటలు, ఈ హడావుడి, గందరగోళం నుంచి కొద్దికాలం దూరంగా గడపడం మంచిదే అని ఆలోచన సాగించింది. ఈ మధ్యకాలంలో ఎవ్‌గెనియా పిల్లలను పెద్దగా పట్టించుకోవడం లేదు. ఇగోర్ బడికి వెళ్తున్నాడు. ఇంటి ఆవరణలో పిల్లలతో ఆడుకొంటున్నాడు. కానీ ప్రతిరోజూ దెబ్బలాటలు తప్పడం లేదు. పిల్లలకు అది మామూలే. వాడు తన తండ్రి గురించి మాట్లాడడమే లేదు. ఇదివరకు జుకోవ్ ఇచ్చిన బొమ్మలు, ఆటవస్తువులు ఇప్పుడు ఇగోర్ అలమారలో కింది అరలో ఉన్నాయి. వాటిని వాడు ముట్టుకోవడం లేదు. తల్లితో అప్యాయంగానే ఉంటున్నా మనసు విప్పి మాట్లాడడం లేదు. ఏవో గాలి కబుర్లు చెప్పడం తప్ప ఇతర విషయాలు అసలు ప్రస్తావనే ఉండటం లేదు. అయితే వాడు తల్లిని సన్నిహితంగా గమనిస్తున్నాడు. తన స్థాయిలోనే తల్లి ఆలోచనలను, ఉద్వేగాలనూ అర్థం చేసుకొనే ప్రయత్నం సాగిస్తున్నాడు. తల్లికి వచ్చే ఫోన్లు, ఆమె ఎవరితో మాట్లాడుతున్నదీ ఇగోర్ జాగ్రత్తగా గమనిస్తున్నాడు. ఆమె ఏ రోజైనా సాయంత్రం ఇంటికి ఆలస్యంగా వస్తే ఎర్రబారిన మొహంతో కోపంగా చూసేవాడు.

ఓల్యా కూడా తనంతట తాను నిశ్శబ్దంగా ఉంటోంది. తన ఆటలు తన బొమ్మలు తప్ప మిగిలిన విషయాలు పట్టించుకోనట్టే వ్యవహరిస్తోంది. ఇంట్లో గదుల్లో మౌనంగా పచార్లు చేయడం, సమయానికి బడికి వెళ్లి రావడం మినహా పెద్దగా ఎవరితో మాట్లాడడం, నవ్వడం తగ్గించింది.

ఈ పిల్లలు తనకు దూరమవుతున్నారనో, తనతో సన్నిహితంగా ఉండడంలేదనో ఎవ్‌గెనియా భావించడం లేదు. కానీ వారికి తనతో నిమిత్తంలేని, తనకు తెలియని వేరే లోకం, మరో జీవితం ఉందని ఆమె అనుమానించేది. ఏదేమైనా పిల్లలు కాస్త సంతోషంగా ఉండాలంటే, వాళ్లు కాస్త సరదాగా గడపాలంటే కొంత కాలం వేరే ఊరు వెళ్తేనే మంచిదని ఆమె తేల్చుకుంది.

అయితే పూర్తిగా పిల్లలను దృష్టిలో ఉంచుకొని మాత్రమే ఎవ్‌గెనియా ఈ నిర్ణయం తీసుకుందంటే పొరపాటే. ఇటీవల ఆమె తన గురించి కూడా ఆలోచిస్తోంది. గత ఆరు నెలల కాలంలో తనకంటూ వేరే జీవితం లేకపోయిందని ఆమె గుర్తించింది. ఎంతసేపూ పని, పిల్లలు, వంట, దుస్తులు ఉతకడం, చిరుగులు కుట్టడం, ఇల్లు సర్దడం, తుడవడంతోనే గడిచిపోతోంది. బయటి ప్రపంచంతో ఆమె సంబంధాలు ఎంతగా క్షీణించాయంటే, ఇంట్లో ఫోన్ చివరిసారి ఎప్పుడు మోగిందో ఆమెకు గుర్తులేదు! ఆరు నెలల్లో ఒక్కసారైనా తను థియేటర్‌కు వెళ్లలేదు. ఒక పార్టీకి మాత్రం హాజరైంది. అదీ ఆలస్యంగా. పిల్లలను నిద్రపుచ్చి, కాస్త కనిపెట్టి ఉండమని పొరుగువారిని అడిగి మొత్తానికి బయటపడగలిగింది.

అక్కడ పార్టీలో ఆమెకు సరటోవ్ నుంచి వచ్చిన ఒక ప్రచురణ సంస్థ డైరక్టర్ తారసపడ్డాడు. నవ్వుతూ, నవ్విస్తూ ఆయన ఆమెచే రెండు గ్లాసుల వైన్ తాగించాడు. సరదాగా కబుర్లు చెప్పాడు. ముందు పుస్తకాల గురించి, ముద్రణకు కాగితం దొరక్కపోవడం గురించి మాట్లాడినా తరువాత

ఎవ్‌గెనియా అందచందాల గురించి, సున్నితంగా వ్యాఖ్యానించాడు. ఎవ్‌గెనియా కూడా మాట కలిపి మాస్కో గురించి, ఇక్కడి సరికొత్త ఫ్యాషన్‌ల గురించి ఉల్లాసంగా కబుర్లు చెప్పింది. అంతలోనే ఆమెకు సమయం రాత్రి పన్నెండు దాటుతోందని గమనంలోకి వచ్చింది. పిల్లలు అక్కడ ఇంట్లో ఉన్నారని గుర్తు వచ్చింది. పార్టీ పూర్తికాకుండానే ఆమె ఇంటికి బయలుదేరింది. ఆ పార్టీ ఇచ్చిన కుటుంబ సభ్యులు ఆమె హడావుడికి నొచ్చుకున్నారు. పార్టీలో అంతసేపూ ఆమెతో గడిపిన అతిథి కూడా కొంచెం కోపం తెచ్చుకొన్నాడు. కానీ చివరికి ఎవ్‌గెనియా ఒంటరిగా అక్కడినుంచి బయటపడి, నిర్మానుష్యంగా ఉన్న వీధుల్లో పరుగులు పెడుతూ ఇల్లు చేరింది.

ప్రచురణ సంస్థ డైరెక్టర్ మరునాడు ఎదురుపడలేదు. ఇలా ఎంతమంది కలసి హఠాత్తుగా విడిపోతారు? జీవితం పూర్తి అయిపోతోందా? ఇది చరమదశా? అప్పుడే వృద్ధాప్యం ఆవరిస్తోందా? ఎవ్‌గెనియా మధనపడింది. బుర్ర నిండా ఆలోచనలు, మరునాటి ఉదయం ఆమె తన మాజీ భర్తకు అతని ప్రతిపాదనకు సమ్మతిస్తూ సందేశం పంపింది. సాయంత్రం భోజనాలు చేస్తున్నప్పుడు ఆమె పిల్లలకు చెప్పింది "సెలవులకు మీరు తాతగారింటికి వెళ్తున్నారు" అని. ఓల్యా పెద్దగా స్పందించలేదు. ఇగోర్ మాత్రం ఆత్రంగా అడిగాడు. "ఎలా వెళ్తాం? రైల్లోనా? అక్కడ చేపలు పట్టవచ్చా? పడవలు ఉంటాయా?" అని.

"తాతయ్య, అమ్మమ్మ అక్కడెక్కడో ఎందుకుంటారు?" అని ప్రశ్నించింది ఓల్యా. "వాళ్ల ఊరు అదే. మంచివాళ్లు అక్కడే ఉంటారు" అని బదులిచ్చింది ఎవ్‌గెనియా.

ఈ సమాధానం ఓల్యాకు నచ్చలేదు. అయితే ఆ పిల్ల మారుమాట్లాడకుండా తన ఆటల్లో పడిపోయింది.

భోజనాల తరువాత ఇగోర్ తల్లి దగ్గరకు వచ్చాడు.

"తాతయ్య అంటే నాన్నా వాళ్ళ నాన్నేనా?" అని ప్రశ్నించాడు.

"అవును".

"అయితే నేను ఆ ఊరు వెళ్లను"

"ఎందుకు?"

"తాతయ్య దగ్గర ఏదో వాసన వస్తుంది"

"పిచ్చి మాటలు వద్దు. ఏ వాసనా రాదు. నువ్వు అబద్ధాలు చెబుతున్నావు"

"అయినా సరే. నేను వెళ్లను" అని స్థిరంగా ప్రకటించి వేరే గదిలోకి వెళ్లిపోయాడు.

ఎవ్‌గెనియాకు తన మామగారు గుర్తు వచ్చారు. క్రితం వేసవిలో ఆయన ఇక్కడకు వచ్చాడు. అరవై ఏళ్ల వయసు. పెద్ద మీసాలు. వయసు పైన పడుతున్నా కులాసాగా, సంతోషంగా ఉండే తత్వం. గ్లాసుడు ఓడ్కాను ఒక్కసారిగా గొంతులో పోసుకుని మింగగలడు. తరువాత హాయిగా కూర్చుని పాతరోజుల సంగతులు చెప్పగలడు. ఆయన పేరు కుజ్మా పెట్రోవిచ్. నిజంగానే ఇగోర్ అన్నట్టు ఆయనకు శుభ్రం తక్కువ. ఓడ్కాతో పాటు కొంచెం మాసిన దుస్తులు, స్నానం చేయని శరీరం నుంచి వచ్చే వాసనలతో, ఎప్పుడు పగలబడి నవ్వుతూ, వేళాకోళం చేస్తూ, మధ్యలో పెదాలు, నాలికతో చప్పుళ్లు చేస్తూ ఎవ్‌గెనియాకు కూడా చాలాసార్లు చికాకు కలిగించాడాయన. పిల్లలను అక్కడకు పంపడమంటే వారికి ఇబ్బంది కలిగించడమేనని ఎవ్‌గెనియాకు తెలియకపోలేదు. పైగా ఆ వృద్ధుల వద్ద తగినంత డబ్బు ఉందా, లేదా అన్నది కూడా ఆమెకు

అనుమానమే. అయితే సొంత ఇల్లు, తోట వారికి ఉన్నాయి. అదీకాక జుకోవ్ తన తల్లితండ్రులకు డబ్బు పంపుతున్నాడేమో కూడా. ఏదేమైనా దాని గురించి ఆలోచించవలసింది తాను కాదు అనుకొంది ఎవ్గెనియా.

కొన్ని రోజుల తరువాత జుకోవ్ పిల్లలను ఊరికి ఎలా పంపదలచాడో వివరిస్తూ ఉత్తరం రాశాడు. పిల్లలతో పాటు ఒక మనిషిని తోడుగా పంపుతానని వివరించాడు. ఈ ఉత్తరం తెచ్చిన యువకుడే ప్రయాణంలో పిల్లలకు తోడుగా వెళ్లేది. అతనికి ఇరవై ఏళ్ల వయసు ఉంటుంది. హాయిగా, స్నేహంగా నవ్వుతూ కనిపించాడు. ఆ యువకుడి ప్రయాణం ఖర్చులు కూడా తానే పెట్టుకోవలసి ఉందని, డబ్బుకి కొంత ఇబ్బందిగా ఉంది కాబట్టి పిల్లల రైలు టికెట్ కోసం అరవై రూబుళ్లు ఇవ్వమనీ జుకోవ్ ఆ ఉత్తరంలో ఎవ్గెనియాను అర్థించాడు. జుకోవ్‌కు డబ్బు ఇబ్బంది వచ్చిందని ఆమె నమ్మలేకపోయింది. కానీ దీనికోసం రాద్ధాంతం అనవసరమని భావించింది. రెండు, మూడు నెలలు ఒంటరిగా తన బతుకేదో తాను బతకవచ్చన్న యోచనే ఆమెకు అద్భుతంగా అనిపించింది. ఇష్టం వచ్చినట్టు నిద్రపోవచ్చు, చదువుకోవచ్చు, బయటికి వెళ్లవచ్చు, పార్కులో పచార్లు చేయవచ్చు, స్నేహితుల వద్దకు వెళ్లవచ్చు... ఎంత బావుంటుందని! ఇవన్నీ కాక ఈ రెండు నెలల్లో తన జీవితాన్ని మరో మలుపు తిప్పే పెద్ద పరిణామం ఏదో జరుగుతుందన్న ఆశ కూడా ఆమెలో మినుకు మినుకు మంటోంది. అదేమిటో ఊహించేందుకు, ఆలోచించేందుకు ధైర్యం చాలనప్పటికీ ఆ అనుభవం కోసం ఆమె తహతహలాడుతోంది.

ఇంతలోనే ఇగోర్ ఈ ప్రయాణం పట్ల తన వ్యతిరేకతను మరచిపోయాడు. ఓల్యా కూడా అంటీముట్టనితనం నుంచి బయటపడి ప్రయాణం సరదాలో ఉషారుగా ఉంది. ఇద్దరు పిల్లలూ తమ వెంట ప్రయాణించే ఆ యువకుడి పక్కన చేరి ప్రయాణం గురించి ఆసక్తిగా ప్రశ్నలు వేయడం ప్రారంభించారు.

"రైలు బావుంటుందా? దానికి కిటికీలుంటాయా? రైల్లోంచి పొలాలు చూడవచ్చా?" అని ఓల్యా ప్రశ్నలతో దాడి మొదలుపెట్టింది.

"రైల్లో కిటికీలు ఇంట్లోలా ఉండవు. అవి పైకి కిందకి తెరుచుకుంటాయి" అని ఇగోర్ తన జ్ఞానాన్ని బయటపెట్టాడు. "మైళ్లకు మైళ్లు పొలాలు, అడవులు, ఇళ్లు, గడ్డిమేసే ఆవులు, గొర్రెలు... ఎంత బావుంటుందో" అని వివరించాడు. వాడు అప్పటికే చాలా ప్రయాణాలు చేసాడేమో ఈ తరహా పాండిత్యం బానే ఉంది. అందుకే చెల్లెల్ని కూర్చోబెట్టి ప్రయాణంలో ఎదురయ్యే విశేషాలను కథలు కథలుగా చెప్పాడు.

ఇంతవరకూ బానే నడిచినా, తీరా బయలుదేరాల్సిన రోజున ఇగోర్‌కు మళ్లీ ప్రయాణం అంటే వ్యతిరేకత పుట్టింది. ఆ రోజు ఉదయమే లేచి ఒక మూల కూర్చుని తల్లితో మాట్లాడాడు. "చూడమ్మా, వెళ్తున్నాం కానీ, నేను అక్కడ ఉండను. అసలు ఎందుకు వెళ్లడం? నువ్వూ రావచ్చుగా? ఏమిటీ సెలవులు? మేం లేకుండా నీకు తోస్తుందా?" అని సవాళ్లు ప్రారంభించాడు. ఓల్యా ఆ పగలంతా తన చిన్నబల్లపై మౌనంగా కూర్చుంది. ఇక స్టేషన్‌కు వెళ్లేందుకు తయారు అవుతుండగా ఆ పిల్ల తల్లివంక చేతులు చాపి, పెద్దగా ఏడుపు మొదలుపెట్టింది. తను ఏం మాట్లాడుతుందో అర్థం కాకపోయినా తల్లిని విడిచి వెళ్లేందుకు భయపడుతోందని, బెంగపడు తోందని మాత్రం తెలిసింది. అప్పటికే వారిని తీసుకువెళ్లేందుకు ఇంటికి వచ్చిన యువకుడు

ఓల్యాను సముదాయించేందుకు ప్రయత్నించాడు.

"మంచి పిల్లవుగా! ఏడుపు దేనికి?" అంటూ ఓల్యా చెయ్యి పట్టుకొన్నాడు. కానీ, ఓల్యా అతన్ని విదిలించుకొని తల్లి వంక చూస్తూ "...మ్...మా..." అని ఏడుపు మొదలుపెట్టింది.

అయితే, రైలు ప్రయాణం, అందులో కిటికీలు, దారిలో పొలాలు, గడ్డిమేసే ఆవులు, ఊళ్లో తాతగారింట్లో తోట, పెద్ద నది, అందులో తెల్ల పడవలు, చేపలు పట్టడం లాంటి సంగతులన్నీ మళ్లీ మళ్లీ చెబుతూ, పిల్లలను అతి కష్టంమీద బయలుదేరతీసింది ఎవ్గెనియా. "రండి స్టేషన్‌కు వెళ్దాం. అలా ఏడవకూడదు. సెలవుల్లో అంతా హాయిగా గడుస్తుంది. స్టేషన్‌లో నాన్న ఉంటారు".

ఈ మాట వినగానే ఓల్యా మొహంలో నవ్వు కదలాడింది. ఇగోర్ కూడా ముక్కు తుడుచుకొని, "నాన్న వస్తారా? స్టేషన్‌లో చూద్దాం. ఆయన ఏమైనా మారారేమో చూద్దాం" అంటూ ఇంట్లోంచి బయటకు నడిచాడు.

బయట జుకోవ్ ఆఫీసు కారు నిలిచి ఉంది. మునుపటి డ్రైవరే కారు తీసుకొచ్చాడు. అతన్ని చూడగానే ఇగోర్ సంబరపడ్డాడు. ఆ డ్రైవర్ కూడా సంతోషంగా నవ్వి ఇగోర్‌ని పలకరించాడు. అందరితో కరచాలనం చేశాడు.

స్టేషన్‌లో జుకోవ్ వీళ్ల కోసం ఎదురు చూస్తున్నాడు. ఎవ్గెనియాను చూసి అతను మర్యాద పూర్వకంగా అభివాదం చేశాడు. తండ్రి కనిపించగానే ఓల్యా ఒక్క ఉదుటున అతన్ని చేరి మీదకు ఎగబాకింది. జుకోవ్ పాపను ముద్దాడి వొళ్లో కూర్చోబెట్టుకున్నాడు. తండ్రిని చూడగానే ఆ పిల్ల గందరగోళపడింది. అతనితో ఏం మాట్లాడాలో తెలియక కళవెళపడింది. నిశ్శబ్దంగా నవ్వుతూ అతను ధరించిన బూడిద రంగు కోటు కాలర్‌ని నిమిరింది. ఒక క్షణం ఆగి తల పక్కకు వాల్చి, "ఇది కొత్త కోటా? ఇప్పుడు ఎక్కడ ఉంటున్నావు?" అని అమాయకంగా ప్రశ్నించింది. జుకోవ్ ఆమె వంక అపేక్షగా చూసి మౌనంగా నవ్వాడు.

ఇగోర్ ఇబ్బందిగా తండ్రి వంక చూసి తల వంచుకొన్నాడు. జుకోవ్ ఆ పిల్లవాడికి చెయ్యి అందించి "ఎలా ఉన్నావ్?" అని ప్రశ్నించాడు.

ఇగోర్ గొంతులో ఏదో అడ్డుపడ్డట్టు అయింది. సమాధానం రాలేదు. ఒకసారి దగ్గి, గుటకవేసి, ఎర్రబారిన మొహాన్ని మరోవైపు తిప్పాడు. వాడి కళ్లలో నీళ్లు కమ్ముకొన్నాయి. ఈలోగా జుకోవ్ పాపను కిందకి దింపాడు. ఓల్యా తన చిన్న అరచేతిని అతని కోటు కాలర్‌పై రుద్దింది. అంతలోనే ఆమె మొహంలో నవ్వు అదృశ్యమైంది. జుకోవ్ తన జేబులోంచి పర్సు తీసి అందులోని టికెట్‌ను వెంట వచ్చిన యువకుడికి ఇచ్చాడు. "జాగ్రత్త పారేయకు. రానూపోనూ టికెట్ అది. స్టేషన్‌కి మావాళ్లు వస్తారు. రాకపోయినా వాళ్ల ఇల్లు దూరమేం కాదు" అన్నాడు. తరువాత పిల్లల వంక తిరిగి "సరే వెళ్తాను పిల్లలూ, సెలవులు బాగా గడపండి. నాకు పని ఉంది" అన్నాడు.

ఇంటికి తిరిగివచ్చిన ఎవ్గెనియాకు నీరసం వచ్చినట్టు అయింది. ఇల్లంతా ఎక్కడి సామాను అక్కడ పడి ఉంది. సాధారణంగా ప్రయాణం హడావుడిలో ఇల్లు గందరగోళంగా తయారైనట్టే, ప్రతి గదిలో సామాను చిందరవందరగా ఉంది. ఆమె మనసు కూడా అలానే ఉంది మరి. స్టేషన్ నుంచి ముందే వెళ్లిపోయిన జుకోవ్ ఆమెను ఇంటివద్ద దింపేందుకు మళ్లీ కారు పంపుతానని చెప్పి వెళ్లాడు. రైలు వెళ్లిన అరగంటసేపు వరకు ఆమె ఎదురుచూసింది. చివరకు

కష్టంమీద బస్సు ఎక్కి ఇల్లు చేరింది. అయినా ఇప్పుడు జుకోవ్‌ను తిట్టుకొనేందుకు కూడా ఆమెకు ఓపిక లేదు.

నెమ్మదిగా లేచి ఇల్లు సర్దింది ఎవ్‌గెనియా. తరువాత వేడినీళ్లతో స్నానం చేసింది. అప్పటికి ఇంటికి మళ్లీ ఒక రూపు వచ్చింది. దానితో ఆమె కూడా కొంత కుదుటపడింది. ఇంట్లో ఎప్పుడూ లేని ఒంటరితనం, పరిశుభ్రత ఆమెకు కాస్త ఊరటనిచ్చాయి. మెల్లగా ఆమెనూ సెలవుల ఉత్సాహం ఆవరించింది. కిటికీలోంచి వస్తున్న చల్లగాలి, చిన్నగా శబ్దంచేస్తూ తన పనిలో తాను ఉన్న గడియారం, నేలపై మెత్తటి తివాచీ ఆమెకు ఆహ్లాదం కలిగించాయి. లేచి, తల దువ్వుకొని, ఎక్కడో కింద అరలో, ఏనాడో, ఒక మూలగా పెట్టిన సిల్కు గౌను తీసి ధరించిందామె. అంతకు ముందు లోదుస్తులు వేసుకొని అద్దంలో తనను తాను పరీక్షించుకొంది. నునుపుగా, చెక్కినట్టు ఉన్న బలమైన పిక్కలు, అందంగా వంపు తిరిగిన తొడలు... చూసి ముచ్చటపడిపోయిందామె. “బుద్ధిమాలిన జుకోవ్. నువ్వింకా అందంగానే ఉన్నావు ఎవ్‌గెనియా” అని తనకు తాను చెప్పుకొంది. మరోసారి అద్దంలో చూసుకొని అలమారులోంచి ఓ హెన్రీ కథల సంకలనం తీసి, సోఫాలో కాళ్లు బారచాపి కూర్చుని ఒక కథ చదివింది. పడుకొని కలలు కంది.

ఈ కలల్లోనే తెల్లవారింది. మరోరోజు గడిచింది. ఇంకో రోజు కూడా వెళ్లిపోయింది. తన కలలకు తుదీ మొదలూ లేదని, రోజువారీ జీవితం ఆ కలలతో ప్రమేయం లేకుండా సాఫీగా గడిచిపోతుందనీ ఎవ్‌గెనియాకు తట్టింది. ఆఫీసులో దినచర్యలో మార్పులేదు, అవే ఉత్తరాలు, అవే ఫోన్లు, ఆ మనుషులే, అవే పనులతో సతమతమవడం. మార్పు లేదు. ఉదయం నుంచీ సాయంత్రం నాలుగు గంటలదాకా పనిచేసి అలసిన మొహాలతో ఇళ్లుచేరే సహచరులు. వీళ్లంతా ఇంత హడావుడిగా ఇళ్లకు ఎందుకు వెళ్తున్నారు? అక్కడ ఏముంటుంది? వీళ్ల భార్యలు ఆకర్షణీయంగా ఉంటారా? ఆ భార్యలను కలుసుకునేందుకా, లేక ఆకలివేసి ఇళ్లు చేరుతున్నారా? తెగని ఆలోచనలు. ఎవ్‌గెనియా మాత్రం ఒంటరిగా ఇల్లు చేరేది. ఎవరూ ఆమెకు ఎదురుకారు, అడ్డుకోరు, ఎదురుచూడరు. ఇంట్లో యధావిధిగా ఆమె వంట చేసేది. పొయ్యి చేసే చప్పుడు, రోజూ తినే తిండి, ఆ ఇల్లూ అన్నీ ఆమెకు విసుగు పుట్టిస్తున్నాయి.

ఆఫీసులో ఆమెతో ముప్పైమంది మగవాళ్లు పనిచేస్తున్నారు. వాళ్లెవరూ దుర్మార్గులు కారు. ప్రతివారూ తమ సెక్రటరీతో ఎంతోకొంత ప్రేమలో ఉన్నవారే. అందరూ పెళ్లయినవారు. వారిని భార్యాపిల్లలకు దూరం చేయడం తగనిపని.

కానీ అనుకోకుండా లభించిన స్వేచ్ఛ, కళ్లేలులేని గుర్రాల వంటి కలలు.. వీటితో ఇంట్లో ఒక పురుషుడు లేకుండా గడపడం వెలితిగా అనిపించిందామెకు. అప్పటికే ఆఫీసులో కొన్నిసార్లు ఆమె చిన్నచిన్న సాహసాలు చేసింది. కవ్వింపు నిండిన గొంతుతో ఎదుటివారిని పరీక్షించి చూసింది. అయితే ఇందులో కృత్రిమత్వం ఆమెకే వెగటు కలిగించేది. సాయంత్రాలు ఇంట్లో ఒంటరిగా పడుకొని ఆలోచించేది. ఇలా ఎంతకాలం? నాకేమవుతోంది? నేనిప్పుడు ప్రేమలో పడలా? ఎలా? పద్దెనిమిదేళ్ల ప్రాయంలో ప్రేమకోసం వెంపర్లాడనవసరం లేదు. అది వద్దన్నా అందు బాటులో ఉంటుంది. కాదన్నా వచ్చి విరుచుకుపడుతుంది. దానికోసం ప్రయత్నం చేయనక్కర్లేదు. కానీ ఇప్పుడో, ఈ ముప్పై మూడేళ్ల వయసులో ప్రేమను సాధించాలంటే కృషి తప్పదు. ఇంతకంటే జాప్యం చేసే వీలులేదు. తొందరపడాలి. ముందున్నది మనోహరమైన, యవ్వనభరితమైన

నవజీవితం కాదు. పాత, కొత్తల అతుకుల బొంత. ఈ ఆలోచనలతో ఎవ్‌గెనియా క్రమంగా ఆత్మవిశ్వాసం కోల్పోతోంది. రెండు వారాల స్వేచ్ఛా జీవనం, ఒంటరితనం పూర్తవుతున్నా ఆమె ఆలోచనలు ఒక కొలిక్కి రాలేదు. భవిష్యత్తు ఇంకా అగమ్యంగానే కనిపిస్తోంది. ఈ బెంగతో కేవలం పదిహేను రోజుల క్రితం తనలో కనిపించిన ఆత్మవిశ్వాసం ఆవిరై పోతున్నట్టు అని పించింది. అద్దంలో అందానికి బదులు, కళ్ల కింద ముడతలు, చారలే కనిపిస్తున్నాయి.

సరిగ్గా ఈ సమయంలో ప్రేమదేవత ఎవ్‌గెనియాను దీవించింది. మామూలుగానే ఇది అనుకోకుండా సంభవించింది. కొద్దికాలం క్రితం పార్టీలో కలిసిన ప్రచురణ సంస్థ డైరక్టర్ వ్యాపారం పనిపై మళ్లీ మాస్కో వచ్చాడు. రావడం రావడమే ఒక దుమారంలా వచ్చిన ఆ డైరెక్టర్ నవ్వుతూ, వేళాకోళం చేస్తూ, మాస్కోలోని అన్ని ఆఫీసులనూ చుట్టబెట్టాడు. తన వృత్తికి సంబంధించిన డిమాండ్‌లతో రాజధానిలోని ప్రభుత్వ సిబ్బందిని గడగడలాడించాడు. తనకు కావలసిన పనులను సాధించుకునేందుకు ఎవరికీ విశ్రాంతి లేకుండా చేశాడు. అతని ఆరోగ్యం, ఉత్సాహం, పని పూర్తి చేయాలనే తపన, పట్టుదల చూసి ఎవ్‌గెనియా అబ్బురపడింది. తాను అంతే ఉత్సాహంతో అతని మాటకు మాట సమాధానం చెప్పింది. దీంతో అతను ముందు ఆశ్చర్యపోయినా, తేరుకుని "ఇంత అందమైన వారు, మీరు కూడా చివరకు అధికార యంత్రాంగంలో ఒక చిన్న మీటగా మారిపోయారా!? దారుణం. ఇలా అయితే యాంత్రికంగా తయారై చెడిపోని మనిషి అంటూ ఒక్కరు కూడ మిగలరు" అని లేని ఆందోళన కనపరిచాడు. అతని పేరు డిమిత్రీ డిమెత్రీవిచ్.

అతనికి ఆమె సూటిగానే బదులిచ్చింది. "కాగితం రాస్తారా? రాయండి డిమిత్రీవిచ్" అంది. అతను వెంటనే ఆమె బల్లపై కనిపించిన కాగితం తీసుకొని గబగబా ఏదో గిలికి ఆమె చేతికిచ్చాడు. ఆ కాగితం చదివి ఆమె ఆశ్చర్యపోయింది. ఉప్పెనలా నవ్వొచ్చింది.

"ట్రస్టు యాజమాన్యానికి, మాకు మూడు టన్నుల పేపర్ ఇవ్వండి" ఇదీ ఆ లేఖ. "ఎందుకలా నవ్వుతారు? తప్పు రాశానా?" అమాయకంగా ప్రశ్నించాడు డిమిట్రావిచ్. "తప్పా?" "అసలు ఎవరైనా ఇలా రాస్తారా? కాగితం కావాలి... ఇవ్వండి... ఇది దరఖాస్తా?" అంది ఎవ్‌గెనియా.

"ఏం. మరెలా రాయాలి? యాజమాన్యం వారి దివ్యసమ్ముఖమునకు... ఈ దృష్ట్యా.... తత్కారణంగా... దయచేసి... విన్నపం... ఇవన్నీ రాయాలా?" అని అడిగాడు పెంకిగా.

"ఇవ్వండి అంటే ఇచ్చేస్తారా? కారణం చూపవద్దూ" అని ప్రశ్నించింది ఎవ్‌గెనియా.

"ఏంటి కారణం? అంతా దయ్యాల్లా, రాక్షసుల్లా ఉన్నారే! ఇది మూడోసారి రావడం. ఇప్పటికి వంద దరఖాస్తులు రాసి పంపాం. పేపర్ కావాలి అని. ఏమైంది" అని ఆఫీసు గది మధ్య నిలిచి ఆక్రోశం వెళ్లగక్కాడు డిమిట్రావిచ్. ఉన్నట్టుండి బల్లపై నుంచీ తన 'ధరఖాస్తు' తీసుకొని ట్రస్టు మానేజర్ గదిలోకి వెళ్లాడు. రెండే నిముషాల్లో బయటికి వచ్చిన అతని మొహంలో తెచ్చి పెట్టుకొన్న విచారం కదలాడుతోంది.

"మాకు కావలసిన పేపర్ ఇవ్వరట. దానికి మళ్లీ అంచనాలు తయారు చేయాలట. అప్పుడు మా విజ్ఞప్తిని పరిశీలిస్తారట... ప్చ్.. నవలల్లో అయితే వీళ్లని హంతకులు అంటారు" అంటూ నొసలు చిట్లిస్తూ ఆమె ఎదురుగా కూర్చున్నాడు. ఎవ్‌గెనియా నవ్వింది. డిమిత్రీవిచ్ ఓ మూల నిలబడి జేబులోని చిన్న పుస్తకం తీసి ఏదో రాసి ఆమెకు చూపాడు. "రాజధాని నగరంలోనూ

మనుషులు పూర్తిగా పాడవలేదు. కానీ వారి మానేజర్ వాళ్లని చెడగొడుతున్నాడు" అన్నది ఆ కాగితంలోని నాలుగు లైన్ల సారం.

అతను ఆమె ఎదురుగా నిలిచి గుసగుసలాడాడు. "ఓ పని చేద్దామా? ఈ బుర్రలేని అధికార యంత్రాంగానికి ఓ పాఠం చెబుదామా".

"ఏమిటది?" అందామె ఉత్సుకత చూపుతూ.

"ఇద్దరం కలసి పార్కులో భోజనం చేద్దాం. అక్కడ ఎంత బావుంటుందో తెలుసా. నిన్న వెళ్లాను. పచ్చటి గడ్డి, తెలి మబ్బు ఆకాశం, అక్కడో పిట్ట.... వెళ్దామా?"

మధ్యాహ్న భోజనం సరదాగా గడిచిపోయింది. ఉన్నట్టుండి డిమిట్రీవిచ్ ఆమెను అడిగాడు. "చెప్పండి ఓ అందమైన యువతీ, మీ భర్త మిమ్మల్ని విడిచి వెళ్లాడు కదూ?" అని.

ఎవ్గెనియా మొహం ఎర్రబారింది. అంతలో అతనే ఆమె సాయానికి వచ్చాడు.

"కోపం వద్దు. బాధపడొద్దు. ఆ మాటకొస్తే నా భార్య నన్ను కాదని వెళ్లిపోయింది. ఇందులో చిన్నబుచ్చుకొనేందుకు ఏమీ లేదు" అన్నాడు అనునయంగా.

ఆమె నవ్వింది. అతను జత కలిపాడు.

"చూడండి. మనకెంత అన్యాయం జరిగిందో. అలా జరగవలసిందేనా? మీరు అందమైన యువతి, నేనూ ఉషారైనవాడినే. మరి మనవాళ్లకి మనలో లేనిది ఏమిటి కనిపించింది? నాకు తెలియదు".

ఆ తరువాత ఇద్దరూ పార్క్‌లో పచార్లు చేసి, ఐస్‌క్రీం తిని, సాయంత్రం ఫుట్‌బాల్ చూసేందుకు వెళ్లారు. అతను ఆ ఆటను మెచ్చుకొన్నాడు. అంతలోనే సినిమాకి వెళ్తే ఎలా ఉంటుందని అడిగాడు. సమాధానం వచ్చేలోపే మనసు మార్చుకొన్నాడు. "సినిమా వద్దు. ఏం వద్దు. మీ ఇంటికి వెళ్దాం. చక్కటి టీ తాగుదాం" అని ప్రతిపాదించాడు.

అలా వారి ప్రేమకథ మొదలైంది. దీనికి ఎవ్గెనియా ప్రతిఘటించలేదు. పైగా డిమిట్రీవిచ్‌తో కాలం హాయిగా, సరదాగా గడిచిపోగలదు. అలా మూడు రోజులు క్షణాల్లా గడిచిపోయాయి. అతను వెళ్లిపోవాలి. ఆమెను దగ్గరకు తీసుకుని మెల్లగా చెప్పాడు, "అద్భుతమైనదానివి, నీతో అపూర్వంగా గడిచింది. కానీ నేను పెళ్లి చేసుకోలేను".

"అదేమిటి...?"

"నాకు వివాహం అంటే భయం. నీకు ఇద్దరు పిల్లలు, ఒక కుటుంబం ఉంది. ఒకవేళ పిల్లలు లేకపోయినా నేను అంత మంచి భర్తను కాలేను. పెళ్లంటే భయం. నా భార్య నన్ను వదిలి వెళ్లినప్పటినుంచీ ఈ భయం. అదెంత బాధో నీకు తెలుసు. ఒంటరిగానే ఉండదలిచాను. పెళ్లి చేసుకోవడం, తరువాత బాధపడడం కంటే అది ఎంతో మేలు. అయితే నానుంచి నీకు ఎటువంటి సాయం కావాలన్నా తెలియచెయ్యి. తక్షణం నీముందుంటాను".

అతను వెళ్లిపోయాడు. అలా ఉన్నట్టుండి విరుచుకుపడిన ప్రేమ తుపాను వెనక్కి మళ్లింది. ఎవ్గెనియా కోలుకున్నప్పటికీ, జీవితంలో ఒక తిరిగిపోలేనంత ముందుకు వచ్చేశానేమో అనే నిస్పృహ ఆమెను కమ్ముకొంది.

రోజులు గడుస్తున్నాయి. డిమిట్రీవిచ్‌తో తన కలయిక ఏమరుపాటున జరిగింది కాదని ఆమె విశ్వసించింది. అతనంత ప్రేమాస్పదుడు కాబట్టే తన హృదయంలో స్థానం పొందగలిగాడు.

పిల్లలు, కుటుంబం అంటే భయపడ్డాడు. అయినా నా పిల్లలు అద్భుతమైన వాళ్లు. డిమిత్రీ తండ్రిగా నిన్ను ఎంతో ప్రేమించగలరు అనుకొందామె.

ఈ అనుభవంతో ఆమె మనసు పిల్లలపైకి మళ్లింది. ఇక జీవితంలో వాళ్లు నా పక్కనే ఉంటారు. వాళ్లే భవిష్యత్తు, రేపటి రోజు వారిదే. ఈ ప్రేమాయణాలు కేవలం తాత్కాలికం....

ఇగోర్ నుంచి ఉత్తరం వచ్చింది. పసిపిల్లవాడి రాతలో ఉన్న ఆ ఉత్తరం ఆమెకు ఆందోళన కలిగించింది.

అమ్మా,

*తాతయ్య, బామ్మలతో ఉన్నాం. నువ్వే గుర్తుకొస్తున్నావు. ఇంటి దగ్గరే బావుండేది. తాత అదేపనిగా మాట్లాడతారు. బామ్మ నోరు మెదపదు. ఇక్కడ నువ్వు చెప్పిన నదీ లేదు, పడవలూ లేవు. కనీసం ఆపిల్ పళ్లు కూడా లేవు. మమ్మల్ని చెట్లు ఎక్కనివ్వడం లేదు. అమ్మమ్మ మాకు కొన్ని చెర్రీపళ్లు ఇచ్చి మిగిలినవి మార్కెట్లో అమ్ముతుంది. నేనూ ఒకసారి మార్కెట్‌కి వెళ్లాను. పళ్లు అమ్మేందుకు కాదు. ఊరికే, చూడ్డానికి. నిన్ననే నాన్న వచ్చి వెళ్లారు. ఉంటాను. ముద్దులతో.*

*నీ ఇగోర్ జుకోవ్.*

ఉత్తరంలో "మాకు ఇంటి దగ్గరే బాగుండేది" అన్నమాట ఎవ్‌గెనియా గుండెల్లో హత్తుకుంది. అక్కడ ఎందుకు బాగోలేదు? అసలు జుకోవ్ అక్కడికి ఎందుకు వెళ్లాడు? అన్న ఆలోచనలో పడింది. ఈలోగా ఇగోర్ నుంచి రెండో ఉత్తరం వచ్చి ఆమె ఆందోళనను పెంచింది.

అమ్మా,

*ఇక భరించలేం. మమ్మల్ని వెంటనే తీసుకెళ్లిపో. ఇక్కడ ఇంకా ఆపిల్ పళ్లు లేవు. అమ్మమ్మ చెర్రీలే పెడుతోంది. అవి దరిద్రంగా ఉంటాయి. అమ్మా వెంటనే రా. మమ్మల్ని తీసుకెళ్లు. ఇక మేం భరించలేం.*

ఇట్లు నీ కుమారుడు

ఇగోర్ జుకోవ్

ఏంచేయాలో అమెకు తోచలేదు. జుకోవ్‌కు చెప్పాలా? తనే వెళ్లాలా? మరెవరినైనా పంపాలా? ఎవరిని పంపగలను? ఆలోచనలతో సతమతమైంది. ఇంతలో పిల్లలను అక్కడికి తీసుకెళ్లిన యువకుడు గుర్తుకొచ్చాడు. ఫోన్ దగ్గరికి పరుగెత్తింది. విడిపోయిన తరువాత భర్తతో మాట్లాడడం ఇదే తొలిసారి. అతని గొంతు మామూలుగా, స్నేహంగానే ఉంది. కానీ అతను మిగిలిన విషయాలేవీ పట్టించుకున్నట్టు కనిపించడం లేదు. ఇగోర్ రాసిన ఉత్తరం గురించి చెప్పిందామె.

"అదేం లేదు. మొన్ననే పనిమీద ఆ వూరు వెళ్లాను. అక్కడ అంతా బానే ఉంది" అన్నాడు.

"కానీ పిల్లలకు ఏమీ బాలేదు".

"ఏమిటది? తమకేం కావాలో పిల్లలకు తెలుసా? వాళ్లకి తెలియదు".

"నేను వాదించను. వాళ్లని వెనక్కి రప్పించాలి. అప్పుడు వాళ్లని అక్కడ దిగబెట్టిన కుర్రవాడు ఉన్నాడా? అతన్ని పంపగలవా?"

"లేదు. పంపలేను".

"ఏమిటీ?"

"నేను ఎవరినీ పంపలేను. పంపడం ఇష్టం కూడా లేదు" అన్నాడు జుకోవ్ కచ్చితంగా.

"అయితే సరే. నేనే వెళ్తాను. కానీ కాస్త డబ్బు సర్దుబాటు చెయ్యి" అందామె అర్థింపుగా. దానికీ జుకోవ్ సమ్మతించలేదు. "అదేం కుదరదు. నీ లేనిపోని భయాలు తీర్చేందుకు నాకు వీలుపడదు. సెప్టెంబర్ వరకూ నేను నీకు డబ్బు పంపలేను."

ఎవ్‌గెనియా ఇంకేదో మాట్లాడదామనుకుంది, కానీ అతను అవతలివైపు ఫోన్ పెట్టేశాడు.

ఇంతవరకూ ఆమె తన జీవితంలో ఎవరినీ ఇంతగా ద్వేషించలేదు. పిల్లల్ని తన తల్లితండ్రుల వద్దకు పంపడం ద్వారా లాభపడదామని జుకోవ్ ప్రయత్నించాడు. తానెలా మోసపోయింది? అతను సూచించగానే ఎందుకు వొప్పుకుంది? అయినా ఇందులో తప్పంతా అతనిది కాదు. తనే లేనిపోని ఆశలతో పిల్లలను దూరంగా పంపింది. కారణం డిమిత్రీవిచ్ అనుకోవాలా? అతను మాత్రం ఏం చేశాడు? పిల్లలంటే భయపడ్డాడు. అందరూ ఆ పిచ్చి పిల్లల్ని తమకు, తమ సుఖాలకు అడ్డుగా భావిస్తున్నారు. ప్రతి ఒక్కరూ వాళ్ళు లేకుండా ఉందామనుకుంటున్నారు. ఎవ్‌గెనియాకు నిద్ర రాలేదు.

★ ★ ★

ఎవ్‌గెనియా ఆగ్రహంతో రగిలిపోయింది. మూడు రోజుల సెలవు సంపాదించి, రెండు ముఖమల్ కర్టెన్లు, ఒక పాత బంగారు చేతి గడియారం అమ్మి ప్రయాణానికి కావలసిన డబ్బు సంపాదించింది. తాను వస్తున్నట్టు ఇగోర్‌కు టెలిగ్రాం పంపింది. మాటిమాటికీ ఫోన్ వంక చూస్తూ కోపంగా పళ్ళు నూరింది.

"పిల్లల్ని వెనక్కి తెచ్చేందుకు డబ్బు ఇవ్వవా? అదీ చూద్దాం".

మరునాటి ఉదయం ఆమె విడాకుల కోసం కోర్టులో దరఖాస్తు చేసుకొంది. కోర్టు ఆమెకు భరణం ఇవ్వాలని జుకోవ్‌ను ఆదేశించింది.

ఆ సాయంత్రమే ఎవ్‌గెనియా పిల్లల వద్దకు ఉమన్ గ్రామానికి బయలుదేరింది. ఆమె మనసులో మిశ్రమ భావాలు. ఎవరు కావాలనుకోని తన పిల్లలపై ప్రేమ, అటువంటి ప్రేమను కాదనుకొన్న డిమిత్రీవిచ్ పట్ల తిరస్కారంతో కూడిన ఆప్యాయత, జుకోవ్ అంటే ఎనలేని అసహ్యం, ద్వేషం.... తీరా ఆ ఊరు చేరిన తరువాత అక్కడి వాతావరణం ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసింది. పిల్లలకు తాతయ్య, బామ్మ అంటే అంత ద్వేషం కలుగుతుందని ఆమె ఊహించలేదు. ఆ పెద్దవారైనా పిల్లల పట్ల అంత అంటీ ముట్టనట్టు ఉంటారని ఆమె భావించలేదు. తల్లి రాగానే పిల్లలు తమ బలం పెరిగిందని అనుకొన్నారు. చిన్నారి ఓల్యా అయితే ఒక కర్రముక్క తీసుకొని కనిపించిన ప్రతి వస్తువును ధ్వంసం చేయడం ఆరంభించింది. తాతయ్య, ఆ కర్ర లాక్కుంటే మరో కర్రముక్క కోసం వెదికింది. ముసలాయన ఎవ్‌గెనియాని తిరస్కారంగా చూస్తూ, "భలే పిల్లలు, బాగా పెంచావు" అన్నాడు. "వాళ్లని పిల్లలని అనగలమా? లేదు. వాళ్ళు అంటురోగం లాంటి వాళ్ళు" అని తేల్చాడు.

ఇగోర్ తన తాత వంక తూష్ణీకారంగా చూశాడు. "మేము? కాదు మీరే అంటురోగాలు. చెట్టు కూడా ఎక్కనివ్వరు. పిసినారి, కక్కుర్తి మనుషులు" అన్నాడు.

దాంతో ఎవ్‌గెనియా జోక్యం చేసుకుంది. "ఇగోర్, పెద్దవాళ్లని అలా అనవచ్చా?" అని మందలించింది.

"అలాగేం. అంతకంటే పెద్దగా తిట్టాడు నన్ను. చెప్పరా, చెప్పు ఏమన్నావో మీ అమ్మకు చెప్పు" అన్నాడు ముసలాయన.

ఇగోర్ తగ్గలేదు. "నువ్వు మాత్రం అనలేదేం? నాన్నకి కాకమ్మ కథలు చెప్పలేదా? పిల్లలు ఏకంగా క్రీస్తు వొడిలో ఉన్నారని అబద్ధాలు ఆడలేదా? ఏదీ క్రీస్తు వొడి? పూటకి పది చెర్రీలా? పైగా మా అమ్మ ... ఆవిడ మా నాన్న కోసం ఏడిచి రాగాలు పెట్టిందా? ఎన్ని అబద్ధాలు... ఎన్ని కారుకూతలు..." అని ఎదురుదాడి ప్రారంభించాడు ఇగోర్.

మొత్తానికి ఎలాగైతేనేం ఎవ్గెనియా తన పిల్లలతో సహా కష్టపడి మూడో తరగతి బోగీలో స్థానం సంపాదించి రైలు ఎక్కింది. తగలబడి, మండిపోతున్న ఇంట్లోంచి బయటపడినట్టు అనిపించిందామెకు. రైల్లో కూడా ఓల్యా మొహంలో ఆ ఆగ్రహం, తిరస్కారం కదులుతూనే ఉన్నాయి. ఆ ఊళ్లో ఎంత చెత్తగా గడిచిందో ఇగోర్ కథలు కథలుగా చెబుతూనే ఉన్నాడు. ఆ పిల్లల వంక చూస్తున్న ఎవ్గెనియాకు భోరున ఏడవాలనిపించింది. దుఃఖంతోనా? లేక ప్రేమ వల్లనా? అన్నది ఆమెకు అర్థం కాలేదు.

★ ★ ★

ప్రస్తుతం ఎవ్గెనియా పిల్లల పట్ల ప్రేమతో, జుకోవ్ అంటే అంతులేని అసహ్యంతో, భరింపరాని ఒంటరితనంతో కుంగిపోతోంది. అన్నిటికీ మించి ఆగ్రహం ఆమెను స్థిమితం లేకుండా చేస్తోంది. జుకోవ్ ఆమె దృష్టిలో ఇప్పుడు నేరగాడు. మనుషులకు, సమాజానికీ హాని చేయగల సమర్థత ఉన్న నీచుడు. అతన్ని బాధించాలని, అవమానించాలని వీలైతే చంపేయాలనీ ఆమె భావిస్తోంది.

విడాకుల కోసం కోర్టు ఇచ్చిన తీర్పు సంగతి తెలిసిన తరువాత జుకోవ్ ఫోన్ చేసినప్పుడు ఆమె మానసిక స్థితి ఇది. జుకోవ్ ఫోన్ చేశాడు.

"ఎంతకైనా తెగించగలవని తెలుసు. కానీ ఈ స్థాయికి దిగజారతావని అనుకోలేదు." (కోర్టు నెలకు రెండు వందల ఏభై రూబుళ్ల భరణం ఇవ్వమని తీర్పు చెప్పింది మరి.)

దీనికి ఎవ్గెనియా స్పందన అతి క్లుప్తం "అలాగేం..."

జుకోవ్ తన దాడి కొనసాగించాడు. "నువ్వేమిటనుకొంటున్నావు? ఉదాత్తమైన ఏ సంగతీ తెలియని జలగలాంటి మనిషివి" అన్నాడు.

"ఉదాత్తమైన విషయాలా?" ప్రశ్నించిదామె.

"అవును. నేనెంత చేశాను. ఇంటినిండా సామాన్లు, మంచి లైబ్రరీ, ఎన్నో చిత్రపటాలు, కుర్చీలూ, బల్లలూ...."

"అవన్నీ వదిలివెళ్లావంటే కారణం నీ పిరికితనం. ఎందుకంటే నువ్వు పురుగుకంటే హీనమైన వాడివి...." కసిగా బదులిచ్చింది ఎవ్గెనియా.

అతనేం పట్టించుకోలేదు. "ఇప్పుడు నువ్వు నా పేరుని, నా కుటుంబ ప్రతిష్ఠనీ మంట గలుపుతున్నావు..." అన్నాడు.

ఎవ్గెనియా ఫోన్ పరికరాన్ని గట్టిగా పట్టుకొంది. దానినామె అతని గొంతులా భావించింది. "నీకో కుటుంబం, దానికో ప్రతిష్ఠ... పశువా" అని గట్టిగా అరిచింది.

అంతకంటే జుకోవ్‌ను ఎక్కువ అవమానించాలని ఉన్నా ఆమెకు మాటలు రాలేదు. ఆమెకు తృప్తి కలుగలేదు. ఈ సంగతి ఎవరితో అయినా మాట్లాడాలి. అప్పుడే శాంతి. జనమంతా జుకోవ్‌ను అసహ్యించుకోవాలని, అవమానించాలని భావించింది ఎవ్‌గెనియా. తనంత గట్టిగా, బలంగా బయటి జనం అతని పట్ల అసహ్యాన్ని వ్యక్తం చేయాలని ఆమె ఉద్దేశం. అయితే ఈ బాధని, ఆవేదన, ఆగ్రహాలను పంచుకోనేందుకు ఆమెకు ఎవరూ లేరు. జుకోవ్‌లాంటి మనిషితో ఎవరైనా ఎలా కలసి పనిచేయగలరు, నవ్వగలరు, కరచాలనం చేయగలరు? అన్నది ఆమె విస్మయం.

అయితే ప్రజలు, చుట్టూ జనం జుకోవ్‌ను అంతగా అసహ్యించుకోలేదు. వారెవరికీ ఎవ్‌గెనియాకు వచ్చినంత దురాగ్రహం రాలేదు. పిల్లలకు మాత్రం తల్లి మనోభావాలు అర్థం అయ్యాయి. ఆమె ప్రస్తుతం మాజీ భర్త గురించి మాట్లాడడం లేదు. మాట్లాడినా పిల్లల ముందు యథేచ్ఛగా అతన్ని అవమానిస్తోంది. ఇదే మానసిక స్థితిలో ఆమె పిల్లలకు కోర్టు జారీ చేసిన ఆదేశాల గురించి చెప్పింది.

"నెలకు రెండు వందల రూబుళ్లు ఇస్తూ మీ నాన్న తన దాతృత్వాన్ని ప్రదర్శించబోయాడు. కానీ కోర్టులున్నాయని, నాకు హక్కులున్నాయని మరిచాడు. ఇప్పుడేమైంది. కోర్టు చెప్పినంతా ఇవ్వాలి. ఇవ్వకపోతే జైలే గతి."

తల్లి అప్పుడప్పుడు నాన్నపై సాగించే ఈ వ్యాఖ్యానాలను పిల్లలు మౌనంగా వినేవారు. ఓల్యాకు ఎందుకో కోపం వచ్చేది. ఇగోర్ వేళాకోళంగా నవ్వుకొనేవాడు.

ఊరు వెళ్లి వచ్చినప్పటినుంచీ పిల్లల ధోరణిలో వచ్చిన మార్పును ఎవ్‌గెనియా పసికట్టలేదు. పిల్లల గురించి పట్టించుకునేలోపు ఏవో కొత్త సమస్యలు వచ్చిపడేవి. ఇగోర్ ముఖకవళికల్లో సైతం మార్పు వచ్చింది. ఇదివరకు వాడి మొహంలో పసితనపు అమాయకత్వం, ఎప్పుడూ మెరిసే నవ్వు, ప్రశాంతత ఉండేవి. వాటి స్థానే ప్రస్తుతం మొత్తం ప్రపంచంపైనే అవిశ్వాసం, దేన్ని చూసినా వేళాకోళం కనిపిస్తున్నాయి. ఎప్పుడూ బిగించిన పెదాలతో, పక్కచూపులు చూసే కళ్లతో వాడు ప్రతి అంశాన్నీ తిరస్కరిస్తున్నట్టు, ద్వేషిస్తున్నట్టు కనిపిస్తున్నాడు.

ఒకసారి ఇంటిపైవాటావాళ్లు మామూలుగా ఒక పార్టీ ఇచ్చారు. గ్రామఫోన్ సంగీతం, నృత్యం చేస్తున్న శబ్దాలు కిందికి వినిపిస్తున్నాయి. అప్పటికే ఇగోర్ నిద్రకు ఉపక్రమించాడు. కానీ ఈ శబ్దాలు వినగానే వాడి మొహంలో తృణీకారం ప్రత్యక్షమైంది. "ప్రభుత్వం సొమ్ము కాజేశారు. ఇక పార్టీలు చేసుకొంటున్నారు" అన్నాడు అకారణ కోపాన్ని ప్రదర్శిస్తూ.

ఎవ్‌గెనియా ఆశ్చర్యపోయింది. "డబ్బు కాజేశారని నీకెలా తెలుసు?" అని కొడుకుని ప్రశ్నించింది.

'తెలియడంలా? ఆయన పనిచేసేది షాపుమానేజర్‌గా. గల్లాపెట్టెనుంచి డబ్బు కాజేశాడు'.

"ఏమిటా పిచ్చిమాటలు!" గద్దించింది తల్లి. "ఇటువంటి కథలు అల్లడానికి సిగ్గుగా లేదూ?" అని ప్రశ్నించింది.

"డబ్బు కాజేయడానికి వాళ్లకి లేని సిగ్గు నాకెందుకు?" అన్నాడు ఇగోర్ తేలికగా. తన తల్లి కూడా ఏదో దొంగతనం చేసే ఉంటుందనే అనుమానం వాడి చూపుల్లో ఉంది. కానీ ఆ విషయాన్ని వాడు ప్రస్తావించదలచినట్టు లేదు.

గ్రీష్మం వచ్చిన తరువాత ఎవ్‌గెనియా అక్కయ్య నాదెజ్డా మాస్కో వచ్చింది. ఆమె వయసులో

ఎవ్‌గెనియా కంటే చాలా పెద్దది. భారీ శరీరంతో, పెద్ద కుటుంబాలు కలిగిన తల్లుల్లానే ప్రశాంతంగా, ధీమాగా ఉండేదామె. అక్కయ్యను చూడగానే ఎంతగానో సంతోషించిన ఎవ్‌గెనియా ఆమెను సాదరంగా ఆహ్వానించింది. ఆమెకు తన కష్టగాథను వివరించింది. వారిద్దరూ ఎక్కువగా లోపలిగదిలోనే మాట్లాడుకొనేవారు. అప్పుడప్పుడు ఎవ్‌గెనియా నిగ్రహం కోల్పోయి పిల్లల ఎదుట, భోజనాల బల్ల వద్దనే అక్కకు తన బాధను ఏకరువు పెట్టేది. ఒకసారి నాదెజ్దా తన చెల్లెల్ని గట్టిగా మందలించింది. "ఇక ఎవరినో తప్పు పట్టడం చాలు అపు. అసలు నీ బాధ దేని గురించి? మళ్లీ పెళ్లి చేస్కో. పిల్లలను చూడు. ఆ ఇగోర్‌ని గమనించు. నీకంటే వాడికే ఒక మగతోడు అవసరం. ఎంత కాలం ఎలా ఆడవాళ్ల మధ్య ఎదుగుతాడు. నా మాట విని పెళ్లి చేసుకో. నన్నడిగితే మగవారే ఇతరుల పిల్లలను బాగా చూసుకోగలరు" అని ఇగోర్ వైపు తిరిగి "బాబూ మొహం చిట్లించకు. అమ్మ ఎంతకాలం నీ చుట్టూ తిరగాలనుకుంటున్నావు" అని ప్రశ్నించింది. ఇగోర్ ఏమీ మాట్లాడలేదు. కానీ పెద్దమ్మ వెళ్లిన తరువాత మాత్రం గొంతు విప్పాడు.

"ఎవరిష్టం వచ్చినట్టు వాళ్లు ఇక్కడికి వచ్చిపోతారు. ఆవిడ ఐదురోజులుంది. పైసా ఖర్చు లేకుండా.... మరొకళ్ల నెత్తిన ఖర్చు రుద్దడం ఆవిడకి బానే వుంటుంది....." అన్నాడు.

ఎవ్‌గెనియా చికాకు పడింది. "ఇగోర్ నీ మాటలు నాకు బాధ కలిగిస్తున్నాయి" అని హెచ్చరించింది.

"అవును బాధగానే ఉంటుంది మరి. ఉన్నన్ని రోజులూ ఆవిడ మగాళ్ల గురించే మాట్లాడింది. పెళ్లి చేసుకో అంటూ నీకు నూరిపోసింది. ఆ మాటలు నీకు నచ్చుతాయి. నా మాటలు బాధే కలిగిస్తాయి మరి" అన్నాడు ఆరిందాలా.

"ఇగోర్ ఇక చాలు. నోరుముయ్యి" అని గట్టిగా అరిచిందామె. వాడేం లెక్క చేయలేదు. వాడి కళ్లలో ఏదో ఆరోపణ, అపనమ్మకం, వేళాకోళం కదలాడుతున్నాయి. ఆ తరువాత కూడా వాడి గురించి స్కూల్లో వాడి ప్రవర్తన గురించి ఆమెకు ఫిర్యాదులు అందాయి. ఒకరోజు స్కూలు డైరెక్టర్ ఆమెకు కబురు చేశాడు.

"చెప్పండి మీ పిల్లవాడు అలా ఎందుకు తయారవుతున్నాడు. మీ ప్రభావం అనుకోను" అన్నాడాయన.

"ఏమైంది?"

"చాలానే అయింది. టీచర్లని అల్లరి పెట్టడం ఇగోర్ దినచర్య. ఒకసారి అయితే ఒక టీచర్‌ని పశువులా ప్రవర్తిస్తున్నావు అని మొహంపైనే అన్నాడు. ఇన్ని మాటలెందుకు. తరగతి గదిలో టీచర్లకు వాడొక తలనెప్పి. ఎవరేం చెప్పినా వ్యతిరేకించడం వాడికి అలవాటైంది".

ఆయన అప్పుడే ఇగోర్‌ని అక్కడకు పిలిపించి వాడితో అన్నాడు. "ఇగోర్ ఇదిగో మీ అమ్మగారు వచ్చారు. ఇకనైనా సరిగా ప్రవర్తిస్తానని ఆమె ఎదుట మాట ఇవ్వు".

ఇగోర్ తల్లి వంక విసుగ్గా చూశాడు. అటూ ఇటూ కదిలాడు. బదులు చెప్పలేదు. "ఇగోర్ మాట్లాడు" గద్దించాడు డైరెక్టర్.

అయినా వాడు మౌనం వీడలేదు.

హటాత్తుగా వాడు నవ్వాడు. వెంటనే తమాయించుకొని, "నేనెవరికీ ఏమీ చెప్పేది లేదు" అన్నాడు. డైరెక్టర్ రెండు క్షణాలు వాడిని పరీక్షగా చూసి, "సరే, అయితే, వెళ్లు" అన్నాడు.

ఎవ్గెనియా అంతులేని విచారంతో ఇంటికి తిరిగి వచ్చింది. పిల్లవాడి ధోరణి ఆమెకు ఎనలేని బాధను కలుగచేసింది. చాలా కాలంగానే ఆమె మనసు సంక్షుభితంగా ఉంది. ఈ విచారంలో ఆమె ఇగోర్‌ను గమనించడం లేదు. వాడు తనకు దూరంగా చిత్రంగా మారుతున్నాడు. సొంత వ్యక్తిత్వాన్ని ఏర్పరుచుకుంటున్నాడు. అయితే అదేమిటో ఎవ్గెనియాకు అంతు చిక్కలేదు. ఇటీవలి కాలంలో చిన్న చిన్న విషయాలే ఆమె చికాకును పెంచుతున్నాయి. ఆఫీసులో సైతం తన ప్రవర్తన కారణంగా ఆమె ఇబ్బందులను ఎదుర్కొంటోంది. జుకోవ్ నుంచి భరణం సొమ్ము నెలవారీ కచ్చితంగా అందడం లేదు. దానితో ఆమె అతనిపై ఫిర్యాదులు చేయడం ప్రారంభించింది. అతను ఇప్పుడు ఫోన్ చేయడం మానుకొన్నాడు. కానీ ఎవరెవరి ద్వారానో అతనికి సంబంధించిన సమాచారం అందుతూనే ఉంది. అతని కొత్త భార్యకు ఇటీవలే ప్రసవం అయిందట. అందువల్ల మొదటి భార్యకు ఇవ్వాల్సిన భరణం మొత్తాన్ని తగ్గించాలని అతను కోర్టుకు విన్నవించుకున్నాడు.

ఈలోగా ఒకరోజు వీధిలో ఇగోర్‌కు తండ్రి తారసపడ్డాడు. జుకోవ్ తన కొడుకును కారులో ఎక్కించుకుని తిప్పి, ఇంటికి పంపించే ముందు వాడికి తన పేనాచాకును బహుమతిగా ఇచ్చాడు. ఇగోర్ ఉత్సాహంగా ఇంటికి తిరిగివచ్చి, గట్టిగా చేతులు ఊపుతూ తండ్రితో తాను చూసిన కొత్త ప్రదేశాల గురించి, ఆయన కారు గురించి, ఆయన మాటల గురించి ఉత్సాహంగా కబుర్లు చెప్పాడు. తండ్రి ఇచ్చిన చాకును బెల్టుకి తగిలించుకొని ఇల్లంతా తిరిగాడు. సాయంత్రం దానితో ఏదో ప్రయోగం చెయ్యబోయి వేలు కోసుకున్నాడు. అయితే ఈ సంగతి వాడు ఎవరికీ చెప్పలేదు. దాదాపు అరగంటసేపు ఆ గాయాన్ని కడుకున్నాడు. కానీ సాయంత్రం ఎవ్గెనియా రక్తం మరకలని పసిగట్టింది. 'ఏమిటిది ఇగోర్? ముందు ఆ రాక్షసి చాకును అవతల పారేయ్' అంది ఆందోళనగా.

ఇగోర్ ఆమె వైపు తిరిగి గట్టిగా అరిచాడు. "ఈ కత్తిని తిట్టే హక్కు నీకు లేదు. ఎంత ధైర్యం నీకు! దాన్ని నువ్వు నాకు ఇవ్వలేదు. నాన్న ఇచ్చాడు కాబట్టి అది రాక్షసి కత్తి అయిందా? నీకు ఇష్టంలేదు కాబట్టి నువ్వు తిడతావ్. అంతేగా?" అన్నాడు సవాలు చేస్తున్నట్టు.

ఆ రాత్రి ఎవ్గెనియా ఒంటరిగా పడుకుని ఏడిచింది. చివరకు ఇంట్లో కూడా తనపై కాస్త సానుభూతి చూపేవారు లేరా అని వేదన పడింది. అప్పటివరకూ ఓల్యా తల్లిపై ఎటువంటి యుద్ధం ప్రకటించలేదు. కానీ తల్లి చెప్పినమాట వినడం పూర్తిగా మానుకొంది. ఆ పిల్ల రోజుల తరబడి పెరటిలోనో, పొరుగింటిలోనో గడిపి ఎప్పుడో మురికిగా ఇల్లు చేరేది. ఎప్పుడూ ఎవరితోనూ, దేని గురించీ మాట్లాడేదే కాదు. ఇంట్లో వ్యవహారాలు పట్టించుకోవడం అసలు లేదు. ఒక్కోసారి ఆ పాప తల్లి ముందు ఆగి ఆమె వంక అదో రకంగా చూస్తూ పెదవి కొరుక్కునేది. అంతలోనే నిర్లక్ష్యంగా, నెమ్మదిగా నడుచుకుంటూ వెళ్లిపోయేది. తల్లి మందలింపులను ఆ పిల్ల కనీసం చివరి వరకూ వినడం లేదు. తనపై ఎవరికీ అధికారం లేనట్టు ప్రవర్తించడం మొదలుపెట్టింది. తల్లి తనకు దుస్తులు మారుస్తున్నప్పుడు కూడా ఓల్యా మరెటో చూస్తూ నుంచుంటోంది.

రోజులు భారంగా, విచారంగా గడుస్తున్నాయి. నిన్న మొన్నటి వరకూ తన జీవితంలో ఉన్న ఆనందం క్రమంగా ఆవిరైపోయింది. వసంత కాలం వచ్చేసరికి ఎవ్గెనియా ఈ విషాదభరిత

వాతావరణాన్ని ఓర్చుకోలేకపోయింది. చావు గురించి ఆలోచించడం మొదలుపెట్టింది. మరణం అంటే ఏమిటో ఆమెకు తెలియదు. కానీ భయం ఉంది.

డిమిత్రీవిచ్ ఉత్తరాలు రాస్తున్నాడు. వాటిల్లో అభిమానం కురిపిస్తున్నా, తప్పించుకొనే ధోరణే ఎక్కువగా ఉంటోంది. ఏప్రిల్‌లో అతను మళ్లీ మాస్కో వచ్చాడు. ఎవ్‌గెనియాను కలుసుకొన్నాడు. కానీ ఆమె అతనితో గడిపేందుకు ఇష్టపడలేదు. అతను మారుమాట్లాడకుండా మర్యాదపూర్వకంగా అభివాదం చేసి వెళ్లిపోయాడు.

మే నెల పూర్తిగా సంఘటనాభరితంగా, అతి వేగంగా గడిచిపోయింది.

ఎవ్‌గెనియా ఉండే అపార్ట్‌మెంట్ పక్కనే గొరోఖోవ్ అనే పాత్రికేయుడు, తన కుటుంబంతో ఉంటున్నాడు. పెద్ద పత్రికలో, ఒక ప్రత్యేక విషయంలో నిపుణునిగా గొరోఖోవ్‌కు గుర్తింపు ఉంది. అతను తన భార్యను ఎప్పుడూ హింసిస్తాడు. ఇది ఆ ఆవరణలో అందరికీ తెలుసు. ఎవరూ జోక్యం చేసుకోరు. పైగా ఆ కుటుంబంలో జరిగే యుద్ధాల గురించి కథలుగా చెప్పుకొని నవ్వుకుంటారు కూడా. ఆ రోజు ఆ పాత్రికేయుడు మరీ రెచ్చిపోయి భార్యను విపరీతంగా కొట్టాడు. ఎవ్‌గెనియా వచ్చేసరికి ఆవరణలో అందరూ అదే మాట్లాడుకుంటున్నారు. అతను ఎంత దారుణంగా భార్యను కొట్టాడో తెలుసుకొన్న ఎవ్‌గెనియా పూర్తిగా దిగ్భ్రాంతి చెందింది. మారు మాట్లాడకుండా తన గదిలోకి వెళ్లి కొంతసేపు అన్యమనస్కంగా అవీ ఇవీ సర్దింది. చివరికి ఒక్క ఉదుటున లేచి గొరోఖోవ్‌ల అపార్ట్‌మెంట్ వైపు దూసుకెళ్లింది. లోపలినుంచి గొరోఖోవ్ భార్య ఏడుపు, మూలుగు వినిపించాయి. ఇక ఆగలేకపోయింది.

ఆ ఇంటి తలుపు తోసుకుని లోపలికి నడిచింది ఎవ్‌గెనియా. మొదటి గదిలో మురికి నేలపై నాలుగేళ్ల పాప పాత చుట్టల పెట్టెలతో ఆడుకుంటోంది. రెండో గదిలో గొరోఖోవ్ రాత బల్ల దగ్గర కూర్చుని ఉన్నాడు. అతను సన్నగా, బలహీనంగా ఉండే మనిషి. ఆమెను చూడగానే మొదట ఆశ్చర్యపోయినా, తరువాత అలవాటు ప్రకారం చిరునవ్వు చిందించాడు అతను. కానీ ఎవ్‌గెనియా కళ్లవంక చూసి, కొంచెం జంకుతో కుర్చీలోంచి లేవబోయాడు.

తలుపు దగ్గరే ఆగిన ఎవ్‌గెనియా అతని వంక తీవ్రంగా చూస్తూ. "విను... జాగ్రత్తగా వినరా వెధవా. నీ గురించి పత్రికలకు రాస్తా" అంది.

అతను ఆమె వంక అయోమయంగా, కోపంగా చూశాడు. చేతిలో పెన్ను బల్లపై పెట్టి కుర్చీని వెనక్కి జరిపి పైకి లేవబోయాడు.

ఎవ్‌గెనియా అతనిపైకి దూసుకెళ్లింది.

"పంది వెధవా, నీ గురించి అంతా, సర్వం పత్రికలకు రాస్తాను" అని మరోసారి అంది.

అతను తనను కొడతాడేమోనని ఆమెకు అనుమానం వచ్చింది. ఆ గదిలోంచి విసురుగా బయటకు వచ్చింది. ఆమెలో ఇప్పుడు భయం లేదు. ప్రతీకారం తీర్చుకోవాలనే వాంఛ తప్ప ఆమె దేనికీ భయపడడం లేదు. తన గదిలోకి వచ్చి బల్ల సొరుగునుంచి కాగితాలు తీసింది. ఇంతలో అక్కడే ఉన్న ఇగోర్ ఆమెని హటాత్తుగా ప్రశ్నించాడు.

"అమ్మా, ఆ డబ్బులు అందాయా?"

"ఏ డబ్బులు?"

"నాన్న పంపే డబ్బులు. అవి అందాయా?"

ఎవ్‌గెనియా కొడుకు వంక ఆశ్చర్యంగా చూసింది. వాడి పెదాలు వణుకుతున్నాయి. కానీ ఆమె ఇంకా గోరోఖోవ్ గురించే ఆలోచిస్తోంది.

"డబ్బులున్నాయి. ఏం కావాలి?" అడిగిందామె.

"అడుకునేందుకు భవన నిర్మాణ బ్లాకుల సెట్టు కొనుక్కోవాలి. దాని ధర ముప్పై రూబుళ్లు". అసహనంతో వివరించాడు ఇగోర్.

"అది సరే. కొనుక్కుందువుగాని. అయితే ఇక్కడ నాన్న పంపే డబ్బు గురించి ఎందుకు అడుగుతున్నావు? ఏ డబ్బు అయినా ఒకటేగా".

"కాదు. నీ డబ్బు వేరు. నాది వేరు" మొండిగా బదులిచ్చాడు ఇగోర్.

అమెకు నోట మాట రాలేదు. కొడుకు వంక అదేపనిగా చూస్తుండిపోయింది.

"ఏమిటలా చూస్తావు? నాన్న నీకు డబ్బు పంపేది మా కోసం. అది మాదే. నేను ఇప్పుడు ఒక ఆటవస్తువు కొనాలి. ఆ డబ్బు ఇవ్వు".

ఆమె కొడుకు వంక పరీక్షగా చూసింది. వాడి మొహంలో ధిక్కారం, మూర్ఖత్వం, సిగ్గులేనితనం స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఎవ్‌గెనియా మొహం పాలిపోయింది. కుర్చీలో వెనక్కి వాలి కూర్చోబోయింది. ఇంతలో బల్లపై ఉన్న కాగితం ఆమె కంటపడింది. ఆమెకు ఏదో అర్థమైంది. ఒక నిశ్చయానికి వచ్చింది. క్షణంలో ఆమెలోని అలజడి తగ్గి ప్రశాంతంగా మారింది. వెంటనే లేచి పర్సులోంచి పది రూబుళ్ల నోట్లు తీసి బల్లపై ఉంచింది.

"ఇదిగో డబ్బు చూశావా?" అని ఇగోర్‌ని గద్దించి అడిగింది. ఆమె గొంతు గదిలో ప్రతిధ్వనించింది. ఇగోర్ కదల్లేదు. భయంతో వాడి గుండెలు వణుకుతున్నాయి. నెమ్మదిగా రహస్యం చెబుతున్నట్టు, "చూశాను" అన్నాడు.

ఎవ్‌గెనియా తన ఎదురుగా ఉన్న కాగితంపై వేగంగా ఏదో రాసింది.

"విను, ఏం రాశానో" అంటూ చదివి వినిపించింది.

*"నగర పౌరులు జుకోవ్‌కు, మీ దగ్గర నుంచి అందిన డబ్బును తిరిగి పంపుతున్నాను. ఇకపై నాకు డబ్బు పంపవద్దు. నీలాంటి మనిషి దగ్గర డబ్బు తీసుకోవడం కంటే ఆకలితో మాడి చావడం మేలు".*

కొడుకు వైపు నుంచి దృష్టి మరల్చకుండా ఆమె ఆ ఉత్తరాన్ని, పది పౌండ్ల నోట్లనూ ఒక కవర్‌లో ఉంచి జాగ్రత్తగా అతికించింది. ఇగోర్ మొహంలో ఇంకా ఆ భయం కదలాడుతోంది. అయితే భయంతో పాటు ఆ కళ్లలో కొత్త ఆసక్తి ఒకటి ప్రత్యక్షమైంది.

"ఇదిగో ఈ కవర్ తీసుకెళ్లి నిన్ను వదిలి పారిపోయాడే, రోడ్డుపై కనిపించి చాకును లంచంగా ఇచ్చాడే అతనికి దీనిని ఇవ్వు. అర్థమైందా?" అని అడిగింది ఎవ్‌గెనియా. ఇగోర్ తల ఊపాడు.

"వెళ్లు అక్కడ గది బయట పోర్టర్ ఉంటాడు. అతనికి ఇవ్వు. నాన్నతో... అదే జుకోవ్‌తో ఏమీ మాట్లాడకు" అని ఆదేశించింది.

ఇగోర్ మౌనంగా తల ఊపాడు. తల్లి వంక అద్భుతాన్ని చూస్తున్నట్టు చూశాడు. వాడి బుగ్గలు ఎరుపు రంగు పులుముకుంటున్నాయి.

అంతలోనే ఆమెకు ఏదో గుర్తుకొచ్చింది. "అవును పత్రిక కార్యాలయం ఆ పక్కనేగా, వెళ్తావా?... కాదులే... వద్దు. పోస్టులో పంపుతాను" అంది ఏదో ఆలోచిస్తూ.

"పత్రిక ఏమిటి? అంటే ఆ... జుకోవ్ గురించి పేపర్‌కి రాస్తావా?" అడిగాడు ఇగోర్.

"కాదు. గోరోఖోవ్ గురించి రాయాలి. రాస్తాను" అందామె స్థిరంగా.

"అదా, అమ్మా ఆయన ఎలా కొట్టాడో తెలుసా. ఆవిడను రూళ్ల కర్రతో కొట్టాడు. అది కూడా రాస్తావా?" అని ప్రశ్నించాడు.

పొరుగింటి ఆమెపై ఇగోర్‌కు సానుభూతి కలిగిందని ఎవ్‌గెనియా నమ్మలేకపోయింది కాని వాడు తల్లివంకే నిజాయితీగా, తదేకంగా చూస్తున్నాడు.

"సర్లే, నువ్వెళ్లు" అందామె.

ఇగోర్ కనీసం టోపీ కూడా లేకుండా గదిలోంచి బయటకు పరుగుతీశాడు. ఆమె లేచి కిటికీలోంచి కిందకు..... రోడ్డు దాటుతున్న కొడుకువైపు చూసింది. వాడి చేతుల్లో కవర్ ఉంది. ఇంతకాలం తను అనుభవించిన వేదన, ఎదుర్కొన్న అవమానాలకు చరమగీతం పాడబోతోంది ఆ చిన్న కవర్. ఆమె కిటికీ బార్లా తీసింది. ఆకాశంలో మబ్బులు హడావుడి పడుతున్నాయి. దూరంగా ఆ చివర తుపాను మేఘాలు గుమిగూడుతున్నాయి.

క్రమంగా గది చల్లబడుతోంది. ఎవ్‌గెనియా ఒకసారి నిట్టూర్చి కుర్చీలో కూర్చుని పొరుగునున్న పాత్రికేయుని గురించి సంపాదకునికి లేఖ రాసేందుకు ఉపక్రమించింది. ఆమెలో ఇప్పుడు కోపం లేదు, స్థిర నిశ్చయం తప్ప.

అరగంటలో ఇగోర్ తిరిగి వచ్చేశాడు. గుమ్మంలోంచే "అమ్మా ఇచ్చేశాను" అన్నాడు. తల్లివాడిని రమ్మని పిలిచి, భుజాలు పట్టుకుని దగ్గరకు తీసుకుంది. తల్లివంక చూడలేక కళ్లు దింపబోయిన ఇగోర్ అంతలోనే తలఎత్తి ఆమె వంకే చూస్తూ "ఏం చేశానో తెలుసా అమ్మా? ఆ చాకు కూడా తిరిగి ఇచ్చేశాను" అని చెప్పాడు ఆనందంగా.

★ ★ ★

సంపాదకునికి ఎవ్‌గెనియా రాసిన లేఖను చాలామందే చదివారు. ఉన్నట్టుండి ఆమెకు అభిమానులు తయారయారు. అనేకమంది తనను చూసేందుకు, కలుసుకొనేందుకు రావడం మొదలైంది. రోజంతా ఫోన్‌ల సందడి. ఏం జరిగిందనేది ఆమెకూ పూర్తిగా అర్థం కాలేదు. కానీ తన జీవితంలో ఏదో ముఖ్యమైన నిర్ణయాత్మకమైన మార్పు వచ్చిందని ఆమె గుర్తించింది. జుకోవ్‌నుంచి ఫోన్ వచ్చినప్పుడు ఆమెకు ఈ సంగతి మరింతగా ధృవపడింది. ఫోన్‌లో అతని గొంతు కఠినంగా వినిపించింది.

"చూడూ, నువ్వు పంపిన ఉత్తరాన్ని నేనెలా పరిగణించాలి?"

"చెప్పు దెబ్బగా పరిగణించు" అంటూ అతని సమాధానం కూడా వినకుండా ఫోన్ పెట్టేసిందామె.

ఇంతకాలం ఆమె జనం మధ్య బతకాలని తాపత్రయపడింది. ఇప్పుడు జనమే ఆమెను చుట్టుముడుతున్నారు. ఆమె మాటలను శ్రద్ధగా వింటున్నారు. ఇగోర్ అయితే క్షణం కూడా వదలకుండా తల్లి వెంటే తిరుగుతున్నాడు. ఎవరూ వాడి నాన్న గురించి అడగడం లేదు. అందరూ తల్లి గురించే మాట్లాడుతున్నారు. వాడికి గర్వంగా అనిపించింది. అయితే ప్రతి ఒక్కరూ తన తల్లిని గోరోఖోవ్ గురించి పత్రికకు ఉత్తరం రాసిన రచయిత్రిగానే గుర్తిస్తున్నారని ఇగోర్‌కు

అర్థమైంది. తల్లిని అడగాడు. "వాళ్లంతా ఆ గోరోఖోవ్ గురించే మాట్లాడుతున్నారు. మన గురించి వాళ్లకేం తెలియదా?"

"లేదు ఇగోర్. తెలియదు. పోతే నువ్వు నాకొక సాయం చేయాలి. చెల్లి ఓల్యా గురించి పట్టించుకో. అది పూర్తిగా అదుపు తప్పిపోతోంది" అని కొడుకును అర్థించిందామె.

పని ఉన్నదంటే ఇగోర్ ఇక ఆలస్యం చేయడు. వాడు వెంటనే కిటికీ దగ్గరికెళ్లి పెరట్లో ఉన్న ఓల్యాను పైకి పిలిచాడు. ఆమె రాగానే గంభీరంగా చెప్పాడు "చూడు ఓల్యా నీ సంగతేం బాగోలేదు".

"అయితే?" ఓల్యా గొంతులో నిర్లక్ష్యం.

"నువ్వు అమ్మ మాట వినాలి".

"వినకపోతే...?"

"సరే. నేనే నీ బాస్‌ని. అర్థం అయిందా?"

ఓల్యా తల ఊపింది.

"రా, వచ్చి అమ్మతో మాట్లాడు".

"నాకిష్టం లేకపోతే?"

"అదేం కుదరదన్నాగా, రా!"

ఓల్యా తల్లి వద్దకు వచ్చి నుంచుంది. ఎవ్‌గెనియా ఆ పిల్లను దారిలో పెట్టే ప్రయత్నం ప్రారంభించింది. ఓల్యా మాత్రం మనుపటి అలక్ష్యాన్నే ప్రదర్శిస్తూ తల్లి మాట్లాడే విషయాలతో తనకేం సంబంధం లేనట్టుగా నిలబడింది. కానీ ఆ పక్కనే ఉన్న అన్నయ్యను చూసి కొంచెం బెదిరింది.

ఎవ్‌గెనియాకు బతుకులో మళ్లీ పాత అందం, దానిపై ఆసక్తి కలుగుతున్నాయి. ఉన్నట్టుండి ఒకరోజు ఆమె ఇంట్లో డిమిట్రీవిచ్ ప్రత్యక్షమయ్యాడు. ఆమె అతన్ని సాదరంగా ఆహ్వానించింది. ఇటీవలి ఆనందం ఆమెకు సరికొత్త అందాన్ని సమకూర్చింది.

"ప్రతి ఒక్కరూ నీ గురించే మాట్లాడుతున్నారు. గోరోఖోవ్ గురించి నువ్వు రాసిన లేఖ అందరినీ ఆకట్టుకొంది" అని సంతోషంగా చెప్పాడతను.

ఆమె అదేం పట్టించుకోనట్టు "రండి, వచ్చి మంచి పని చేశారు. నా పిల్లల్ని పరిచయం చేస్తాను రండి" అంది నవ్వుతూ.

డిమిట్రీవిచ్ పిల్లల వంక చూశాడు. "నువ్వు ఇగోర్‌వి. నీ మొహం ఎంత కళగా ఉంది. అయితే ఈ పాప ఓల్యా... కదూ నీ మొహ కూడా బావుంది. ఇప్పుడు మీతో నేనొక ముఖ్యమైన సంగతి మాట్లాడాలి. విషయం ఏమిటంటే, నేను మీ అమ్మను వివాహమాడదలిచాను" అన్నాడు క్లుప్తంగా. అతను గది మధ్య నిలబడి అందరివంకా చూస్తున్నాడు.

ఎవ్‌గెనియా గందరగోళపడింది. "కానీ ఈ విషయం మీరు ముందు నాతో మాట్లాడాలి" అంది.

"మనిద్దరం అంగీకారానికి రావడం సులభమే. కానీ ఈ పిల్లల గురించే నా బెంగ అంతా".

"భలేవారే మీరు" అంది ఓల్యా.

"నువ్వేమనుకుంటున్నావు ఇగోర్?" ప్రశ్నించాడు డిమిట్రొవిచ్.

"మీరెలాంటి మనిషి?" ఎదురు అడిగాడు ఇగోర్?

"నేనా...? నేను విధేయంగా ఉంటాను. ఎప్పుడూ నవ్వుతూ ఉండడం, సరదాగా గడపడం నాకు ఇష్టం. మీ అమ్మంటే నాకు ప్రేమ. మీరంటే ఇష్టం. పసిపిల్లలతో మాత్రం నేను కచ్చితంగా ఉంటాను" అంటూ అతను గట్టిగా నవ్వాడు.

ఓల్యా అతనితో జత కలిపింది.

"అదీ ఇగోర్ సంగతి. ఓల్యాకు నచ్చాను. నీ సంగతేమిటి? నిన్ను ప్రత్యేకంగా అడుగుతున్నాను ఎందుకంటే నువ్వు పెద్ద మనిషివి కనుక".

"మీరు మమ్మల్ని వదిలివెళ్లిపోరుగా?"

"నేను వదలడమా? మీరే నన్ను వదలకూడదు. నేను అనాధను. నన్ను మీరెవరూ వదల కూడదు" అన్నాడు డిమిత్రొవిచ్.

ఓల్యా పగలబడి నవ్వింది. "అనాధట... భలే" అంది ఉత్సాహంగా.

అప్పటికి ఎవ్‌గెనియా దిగ్భ్రాంతి నుంచి తేరుకుంది. "కామ్రేడ్స్ ఏమిటిది? మీరంతా ఏం నిర్ణయం చేస్తున్నారు? నాకు ఇది ఇష్టం లేదేమో మీకు తెలుసా?" అని అందర్నీ ఉద్దేశించి అడిగింది.

ఇగోర్‌కు కోపం వచ్చినట్టుంది. "భలే దానివమ్మా నువ్వు. ఆయన తన గురించి అంతా చెప్పాడు. అటువంటి మనుషులతో ఇలా వ్యవహరించడం బావుందా?" అని నిలదీశాడు.

"బాగా అడిగావు" అంటూ డిమిత్రీవిచ్ ఆ పిల్లవాడికి వంత పాడాడు. "మనుషులతో ఇంకొంచెం సున్నితంగా వ్యవహరించాల్సిందే" అన్నాడు.

"అదమ్మా సంగతి. ఆయన్ని పెళ్లి చేసుకో. అయినా అదంతా ఎప్పుడో నిర్ణయం అయి పోయింది. నాకు తెలుసులే. నిన్ను చూస్తుంటేనే అర్థమైపోతోంది. భలేవాళ్లు మీరిద్దరూ"అన్నాడు ఇగోర్ సంతోషంగా.

డిమిత్రీవిచ్ అంతకంటే సంతోషంగా చిరునవ్వులు చిందిస్తూ పిల్లవాడి పక్క నిలబడ్డాడు.

"భలే అద్భుతమైన పిల్లలు. మీ గురించి భయపడ్డానంటే నేనొక చవటని" అన్నాడు.

★ ★ ★

ఎవ్‌గెనియా కథ సుఖాంతమై ఉండవచ్చు. కానీ ఇటువంటి చాలా కథలు విషాదభరితంగానే సాగుతాయి, అలాగే ముగుస్తాయి. కొందరు మగవారు తమ కుటుంబాలను గాలికి వదిలి వెళ్లడమే కాక, తల్లి నుంచి పిల్లలను వేరు చేయడానికీ వెనుదీయరు. ఏళ్ల తరబడి తామే నిర్మించిన అందమైన సంసారపు కట్టడాన్ని, తమ సొంత ప్రయోజనాల కోసం ధ్వంసం చేయడానికైనా సిద్ధపడతారు.

అయితే చాలామంది తండ్రులు కుటుంబంలో అపార్థాల వల్ల తలఎత్తే ఘర్షణల వల్ల ప్రభావితం కాకపోవచ్చు. కొత్త యువతితో ప్రేమలో పడే అవకాశాన్ని తృణీకరించవచ్చు. పెళ్లయిన తరువాత, తన భార్య రూపంలో, ఇంటికి వచ్చిన యువతిలోని కొన్ని లోపాలను సహించి, ఆమెతో సత్సంబంధాల కోసం నిరంతరం కృషి చేయవచ్చు. అటువంటి వారిని నిజంగా మెచ్చుకోవాలి.

సమస్య అంతా ఉదాత్తమైన కబుర్లు చెప్పే జల్సారాయుళ్లతోనే. వాళ్లు వినడానికే రోత కలిగించేంతటి బలహీనతలు కలిగి ఉండి, తమ ప్రేమ వ్యవహారాల కోసం పచ్చటి సంసారాల్లో నిప్పు పెడతారు. ఈ క్రమంలో అనాధ పిల్లల సంఖ్యను పెంచుతారు. అవసరం కోసం వీళ్లు ప్రేమవ్యవహారాల్లో స్వేచ్ఛను సమర్థిస్తారు. ఒక్కోసారి తామే అనాధలుగా వదిలి వెళ్లిన తమ పిల్లల పట్ల ఆసక్తి కనబరుస్తారు. కానీ ఇటువంటి వారిని భరించవలసిన అవసరం మనకిలేదు.

ఇలా వ్యవహరించే వారిని, భార్యా, పిల్లలకు భరణం చెల్లిస్తే చాలనుకొని బాధ్యతలను మరిచినవారిని పట్టించుకోనవసరం లేదు. వాళ్లని అసలు మనుషులుగా పరిగణించక్కర్లేదు. తాము వదలి వెళ్లిన పిల్లలతో అప్పుడప్పుడు సరదాగా గడపాలని కోరుకునే ఇటువంటి వారిని లెక్క చేయక్కర్లేదు. అసలు వారికి ఆ అవకాశమే ఇవ్వనక్కర్లేదు. ఇదే సమయంలో విడాకుల తరువాత అందే భరణం విషయంలో అతి జాగ్రత్త అవసరం. ఆ డబ్బు కుటుంబ జీవితంలో నైతిక విలువలు ధ్వంసం చేయకుండా చూసుకోవాలి.

మొత్తం మీద కుటుంబం అనేది సంపూర్ణంగా, ఒక సమిష్టి కూటమిగా ఉన్నప్పుడే పిల్లలను సవ్యంగా పెంచడం సాధ్యమవుతుంది. నిరంతరం కీచులాడుకొనే తల్లితండ్రులు, విచ్ఛిన్నమయ్యే కుటుంబాలు, నియంతల్లా వ్యవహరించే నాన్నలు, చిల్లర విషయాల కోసం తపనపడే తల్లులు పిల్లల మనోవికాసాన్ని ధ్వంసం చేయగల శక్తులని గుర్తించాలి. పిల్లలను సవ్యంగా పెంచాలని నిజంగా భావించేవారు కుటుంబంలో సఖ్యతకు విలువ ఇవ్వాలి, దాన్ని కాపాడుకోవాలి, ఇది పిల్లలకే కాదు పెద్దలకూ అవసరమే.



# CHAPTER - 6

# పెద్దల పెత్తనం : పిల్లలకు భారం

కుటుంబం అనేది చిన్నస్థాయిలోనే అయినా సమిష్టిభావనకు నిజరూపం. ఇందులో పిల్లల పెంపకానికి సంబంధించి అనేక సమస్యలు ఎదురవుతాయి. కుటుంబంలో పెత్తనం, క్రమశిక్షణ, స్వేచ్ఛలను విస్పష్టంగా నిర్వచించడం, అమలు చేయడం తేలిక కాదు.

పూర్వపు రోజుల్లో భగవంతుడిని చూపి పిల్లలలో విధేయత, క్రమశిక్షణ పెంపొందేందుకు పెద్దలు దారులు వేసేవారు. తల్లిని, తండ్రిని గౌరవించాలని, విధేయంగా ఉండాలనీ దేముడే శాసించినట్టు చేప్పేవారు.  అవసరమైతే భయపెట్టేవారు. తల్లిదండ్రుల పట్ల విధేయంగా లేకపోతే దేవునికి ఆగ్రహం కలుగుతుందని, ఆయన కఠినంగా శిక్షిస్తాడని వివరించి, భయం ద్వారా పిల్లలను అదుపులో పెట్టే ప్రయత్నం చేసేవారు. అయితే ఈ కాలం పిల్లలకు దేవుడంటే నమ్మకం, భక్తి ఉన్నా; తమను దారిలో పెట్టేందుకు ఆయన స్వయంగా రంగంలోకి దిగుతాడంటే నమ్మలేరు. అందువల్ల ఆ భయంతో వారు క్రమశిక్షణకు లొంగుతారనో, విధేయంగా ఉంటారనో ఆశించలేం. కానీ అమ్మానాన్నల పట్ల వినయంగా మెలగాలని పిల్లలకు తెలుసు. సాక్షాత్తు భగవంతుడే పిల్లలను అలా ఉండాలని శాసించాడా, లేదా అన్నది వేరే విషయం.

నవతరం కుటుంబాల నడవడికను దైవసూక్తులూ, పురాణాలు తక్కువగానే ప్రభావితం చేస్తున్నాయి. ఈ పిల్లలకు పెద్దల పట్ల విధేయంగా ఉండటం వల్ల లభించే ఆశీస్సులు, లేకపోవ డం వల్ల ఎదురయ్యే కష్టనష్టాల గురించి పురాణాలను నేపథ్యం చేసుకొని బోధనలు చేసేవారు తక్కువే కావచ్చు. ఈ కారణంగా పిల్లలను అదుపులో ఉంచేందుకు తండ్రి బెత్తం ప్రయోగిస్తే వారికి దెబ్బలు తప్పవేమో కానీ, భయభక్తులు పెంపొందుతాయని మాత్రం చెప్పలేం.

కుటుంబ వ్యవహారాల్లో పెత్తనం చెలాయించే హక్కు అంటే ఏమిటి? చాలా మందికి ఈ సమస్య ఎదురవచ్చు. ఈ అధికారం పెద్దలకు-తల్లిదండ్రులకు-సహజసిద్ధంగా లభించే కానుక అని ఎక్కువమంది భావిస్తారు. అయితే కుటుంబంలో అందరికీ ఎంతోకొంత స్వేచ్ఛ, పెత్తనం చెలాయించే హక్కు అవసరం కాబట్టి ఎక్కువ మంది తల్లిదండ్రులు తమ ఈ అధికారాన్ని కొంత త్యాగం చేసి, తమకు తోచిన ప్రత్యామ్నాయాలను ఆచరణలో పెడతారు. ముఖ్యంగా విద్యాసంబంధమైన విషయాల్లో పిల్లలకు ఈ హక్కు కొంతయినా ఉండాలని ఈ తల్లిదండ్రుల ఉద్దేశం. అయితే పిల్లల కోసమే ప్రత్యేకమైన హక్కులు అంటూ మనం సృష్టించినా నిజంగా వాటిని అమలు చేయడం అసాధ్యం. అసలు ఈ పెత్తనం చెలాయించే అధికారం తల్లిదండ్రుల సొత్తు అని కానీ, అవసరమైతే పిల్లల కోసం దానిని త్యాగం చేయవచ్చనే భావన కానీ పూర్తిగా

పొరపాటు. తల్లిదండ్రులైనంత మాత్రాన ఏ హక్కులూ, అధికారాలూ వాటంతట అవి చేతికి అందుతాయని అనుకోవడమే తప్పు. తల్లిదండ్రుల ప్రవర్తనే-వారి మాటలు, చేతలు, ఆలోచనలు, అలవాట్లు, విజయాలు, అనుభూతులూ - ఇవే కుటుంబ వ్యవహారాల్లో వారి నిర్ణయాత్మకశక్తిని నిర్ధారిస్తాయి. అంటే కుటుంబపెద్దలైన అమ్మానాన్నల నైతిక ప్రవర్తన, జీవన విధానాలను బట్టి పిల్లలు వారి అధికారాన్ని మన్నిస్తారు. అలా అని పిల్లల కోసం కృత్రిమంగా కొన్ని విలువలు పాటిస్తూ, వారి దృష్టిలో మాత్రం ఉన్నతులుగా ఉండేందుకు ప్రయత్నించినా లాభం ఉండదు. పిల్లలను క్రమశిక్షణలో ఉంచేందుకు, వారిలో వినయవిధేయతలు పెంపొందించేందుకు ఎటువంటి అడ్డదారులూ, కిటుకులూ ఉండవు. ఈ మార్గాల ద్వారా పిల్లలను అదుపులో ఉంచాలని ప్రయత్నించినా, ప్రయోజనం ఉండదు. పిల్లల పెంపకం అనేది నిరంతర ప్రక్రియ. ఈ బాధ్యతను సవ్యంగా నిర్వర్తించాలంటే మొత్తం మీద కుటుంబపెద్దల జీవనవిధానం ఉదాత్తంగా, ఉన్నతంగా ఉండితీరాలి. ఈ విషయంలో లోపాలు ఉన్నప్పుడు, పిల్లల పెంపకానికి సంబంధించి ఎంత ఆలోచించి, ఎంత చక్కటి మార్గాలు కనిపెట్టినా ఫలితం ఉండదు. ఇంటి పెద్దల ప్రవర్తన, వారు అనుసరించే విలువలు సరైనవైనప్పుడు పిల్లల పెంపకం, శిక్షణ, విద్యా బోధన, వారి పని, ఆటలు, స్వేచ్ఛ తదితర అంశాలను సరైన దిశలో ప్రభావితం చేయగల మార్గాలు వాటంతట అవే సమకూరగలవు.



నాన్న సాయంత్రం 5గం॥కు ఫ్యాక్టరీ నుంచి ఇల్లు చేరతాడు. ఆయన అక్కడ ఎలక్ట్రీషియన్‌గా పనిచేస్తాడు. ఇంటికి చేరి ఆయన గ్రీజు మరకలతో, మాసి ఉన్న భారీ కోటును, మట్టికొట్టుకొన్న బూట్లను విప్పుకునేలోగా నాలుగేళ్ల వాస్య హడావుడిగా తండ్రి ఇంట్లో ధరించే బూట్ల కోసం వెదికి వాటిని చివరకి సాధిస్తాడు. ఆ బూట్లను తండ్రికి అందించేందుకు తొందరపడుతూ, దారిలో అడ్డం వచ్చిన వస్తువులను పడదోస్తూ తండ్రి వద్దకు వస్తాడు. నాన్న వాటిని అందుకుని "కృతజ్ఞతలు వాస్య, కానీ అలా దారిలో అన్నీ చిందరవందర చేసావేం. ఆ బల్లని పడేశావు. దాన్ని నిలబెట్టు" అంటాడు. పిల్లవాడు మళ్ళీ వెనక్కి ప్రయాణించి, చిన్న చిన్న అడుగులతో వంటగదిలోకి వెళ్ళి ఇందాక తాను పక్కకి తోసిన చిన్న బల్లను సరిగా నిలిపి తండ్రిని చేరతాడు.

"అదీ భేష్" అని మెచ్చుకొన్న నాన్న వంటింట్లో బేసిన్ వద్ద మొహం, చేతులు శుభ్రం చేసుకొంటాడు. ఈలోగ వాస్య తండ్రి బూట్లు ఊడ్చుకుంటూ, ఈసారి ఏ వస్తువునూ ఢీ కొట్టు కోకుండా జాగ్రత్తగా నడిచి నాన్నను చేరతాడు. నాన్న నా పడవ ఇంజన్‌కు కావలసిన గరాట తెచ్చావా అని అడుగుతాడు.

"ఆఁ. తెచ్చాను. భోజనాల తరువాత ఆ సంగతి చూద్దాం" అంటాడు నాన్న.

దాదాపు అటూఇటూగా ఇది ప్రతిరోజూ సాయంత్రం నడిచే తతంగం. వాస్య నిజంగా అదృష్టవంతుడు. వాడి తండ్రి చురుకైన వ్యక్తి. అతని కళ్ళు కూడా పిల్లవాడి కళ్లలానే బూడిదరంగులో ఉంటాయి. వాస్యకు తండ్రి అంటే చాలా ఇష్టం. ఎప్పుడూ నవ్వుతున్నట్టుండే తండ్రి కళ్లలోకి చూడడం, ఆయన మీసంతో ఆడుకోవడం అంటే వాడికి మరింత ఇష్టం. వాస్య తల్లికూడా అందంగా ఉంటుంది. వాడి దృష్టిలో మిగిలిన అందరి అమ్మల కంటే ఆవిడే అందగత్తె. ఒక్కొక్క సారి ఆమె వాస్య వంక చూసి ఏదో చెప్పబోతున్నట్టు పెదాలు కదుపుతుంది. అమ్మ

నవ్వుతోందా అనేది వాడికి ఎప్పుడూ అనుమానమే. అది తేలకపోయినా వాడికి బోలెడంత సంతోషం కలుగు తుంది. నజరోవ్‌ల కుటుంబంలో నటాషా మరో సభ్యురాలు. కానీ ఆ పాపకు ఇంకా ఐదునెలల వయస్సే.

పొద్దున్న కాళ్ళకు బూట్లు వేసుకోవడం అనేది వాస్యకు పెద్ద సమస్య. వాటిని పాదాలకు బిగించుకొనేందుకు తాళ్లు ఎక్కించడం ఎలాగో వాడికి తెలుసు. కానీ నెమ్మదిగా ఒక్కొక్క రంధ్రంలోంచి తాడు ఎక్కించి చూసేసరికి ఏదో లోపం కనిపించేది. తాడు రెండు కొసలూ సమంగా ఉండేవికావు. దాంతో వాడు మళ్ళీ మొదటినుంచీ ఆ పని ప్రారంభించేవాడు. ఈసారి సరిగానే కుదిరేది. వాడికి తృప్తి కలిగేది. బూటువంక ఆప్యాయంగా చూస్తూ, తల్లిని పిలిచి తాడుముడి వేయమనేవాడు. ఆమె ఆ తాడు ఎక్కించిన తీరును జాగ్రత్తగా గమనించేది. అంతా సరిగా ఉంటే ముడి బిగించేది. లేకపోతే, "ఇలాగా తాడు ఎక్కించేది? ఏం చేతకాదా?" అని వాడిని ప్రశ్నించేది.

వాడు ఆశ్చర్యంగా బూట్ల వంక చూసి, తన తప్పు ఏమిటో గ్రహించేవాడు. ఆ తరువాత పెదాలు బిగించి, మళ్లీ పని ప్రారంభించేవాడు. తాడు సరిగ్గానే ఎక్కించానని తల్లితో వాదనకు దిగేవాడు కాదు. అసలు వాస్యకు అటువంటి వాదనల గురించి తెలియదు.

పని పూర్తి చేసి, "సరిగా ఉందా? అయితే ముడివెయ్యి" అని తల్లిని అడిగేవాడు.

వాస్యకు పళ్లు తోముకోవడం, స్నానం చేయడం కూడా చేతనవును. కానీ ఈ పనులు సక్రమంగా పూర్తి చేసేందుకు ఎంతో ఓపిక, సహనం కావాలి. మొదట వాడు పళ్లపొడిని, సబ్బుని మొహమంతా పట్టించేవాడు. తరువాత తన చిన్ని చేతులను దగ్గరకు చేర్చి, దోసిలిపట్టి తొట్టిలో నీటిని తీసుకునేవాడు. ఇంతవరకూ బానే నడిచినా, అసలు సమస్య ఇక్కడ మొదలయ్యేది. దోసిలిలో ఉన్న నీటిని మొహందాకా చేర్చడం ఆ సమస్య. కళ్ళు మూసుకొని చేతుల్లో ఉన్న నీళ్లని మొహంపై చల్లుకునేలోపే వాడు చేతులను దూరం చేసేవాడు. ఆ నీళ్లు వాడి ఛాతిపై, పొట్ట మీద పడేవి. దాంతోవాడు మొహం పూర్తిగా శుభ్రంగా కడగలేక తడి చేతులతో మొహమంతా రుద్దుకునేవాడు. అలా రుద్దుకొన్న ప్రతిసారీ అరచేతులను పరీక్షించు కునేవాడు. మళ్లీ చేతులను తొట్టిలో ముంచి తడి చేసుకొని పొట్ట రుద్దుకునేవాడు. వాడి ఉద్దేశంలో స్నానం అంటే ఇదే. కానీ తల్లికి వేరే అభిప్రాయాలుండేవి.

ఆమె స్నానాలగదిలోకి వచ్చి, మాటలతో సమయం వృధా చేయకుండా, వాస్య భుజాలు పట్టుకొని నీటి బేసిన్ వద్దకు తెచ్చేది. తరువాత వాడి తలను జాగ్రత్తగా వంచి బేసిన్‌లో నీటితో వాడి చిన్ని మొహాన్ని నిర్దాక్షిణ్యంగా తోమేది. మురికి, సబ్బు, పళ్లపొడి అన్నీ వదిలేలా నీళ్ళు చిమ్ముతూ గట్టిగా కడిగేది. మెత్తగా, వెచ్చగా, తియ్యనైన పరిమళంతో ఉండే తల్లి చేతులంటే వాస్యకు బాగా ఇష్టం. కానీ, ఈ స్నానం వ్యవహారాన్ని తనంతతాను విజయవంతంగా పూర్తి చేయలేకపోతున్నానే అని గింజుకునేవాడు. అమ్మ అలా వచ్చి స్నానం చేయించడం బానేఉన్నా, ఆ పని స్వయంగా చేయాలనే తపన వాడికి ఉండేది. ఇలాంటి సందర్భాల్లో పిల్లలు ఎలాగైనా ప్రవర్తించవచ్చు. కొందరు "నేనే స్నానం చేస్తాను. చేయగలను" అని మొండికేస్తారు. మరికొందరు తల్లి సాగించే దాడిని మౌనంగా భరిస్తారు. వాస్య మాత్రం పెద్దగా నవ్వుతూ, తల్లి చేతుల్లోంచి జారిపోయి మెరుస్తున్న తడి కళ్ళతో కొంటెగా చూస్తాడు. నజరోవ్‌ల కుటుంబంలో అందరూ

ఇలానే ప్రవర్తిస్తారు. హాయిగా, ఆహ్లాదకరంగా, నవ్వుతూ, సంతోషంగా ఉండటం వాళ్ల పద్ధతి.

స్నానం కార్యక్రమం పూర్తయిన తరువాత వాస్య తను పళ్లు తోముకున్న బ్రష్‌ను కడుగుతాడు. ఇది చాలా తేలికైన పని. కాసిని నీళ్లు పోసి బ్రష్‌పై చేత్తో రుద్దితే చాలు. దానంతట అదే శుభ్రం అవుతుంది.

★ ★ ★

భోజనాల గదిలో ఒక మూల నేలపై పరిచిన బూడిదరంగు బట్టపై వాస్య బొమ్మల సామ్రాజ్యం విస్తరించి ఉంటుంది. వాస్య స్నానం, పళ్ళు తోమడం, ఉదయం అల్పాహారం పూర్తి చేసేంతవరకు ఆ రాజ్యం కుదురుగా, ప్రశాంతంగా ఉంటుంది. రైళ్లు, కార్లు, స్టీమర్లు అన్నీ గోడవారన నిలిచి ఉంటాయి. అటూ ఇటూ పనుల మీద తిరిగే వాస్య దారిలో ఒక్కొక్కసారి ఆగి ఈ వైపు పరీక్షగా చూస్తాడు. అంతా సక్రమంగా ఉందో, లేదో తనిఖీ చేస్తాడు. రాత్రి వాడు నిద్రపోయే సమయంలో ఎవరూ ఇటువైపు రారు. వచ్చినా బొమ్మల జోలికి పోరు. ఎందుకంటే రాత్రివేళల్లో వాంక-వాస్తంక ఈ సామ్రాజ్యానికి కాపలాగా ఉంటాడు. ఎప్పుడూ నిలబడి మాత్రమే ఉండేలా కింద బరువు అమర్చిన చెక్కబొమ్మే వాంక-వాస్తంక. ఈ కాపలాదారునికి పెద్ద బుగ్గలు, విశాలమైన కళ్లు, చెరగని చిరునవ్వు సొంత ఆస్తులు. చాలా రోజులుగా ఈ సైనికుడు వాస్య సామ్రాజ్యాన్ని పరిరక్షిస్తున్నాడు. వాస్తంక తన బాధ్యతను పూర్తి విధేయతతో నిర్వర్తిస్తాడు. ఒకసారి వాస్య తండ్రిని అడిగాడు "వాస్తంక ఎప్పుడూ నిద్రపోడేమిటి?" అని.

"ఎలా నిద్రపోతాడు. కాపలా కాయడం వాడి విధి. వాడు మంచి సైనికుడైతే నిద్ర పోకుండా నీ రాజ్యాన్ని కనిపెట్టడం వాడి బాధ్యత. వాడు కనక నిద్రపోతే ఎవరైనా వచ్చి ఒక కారును ఎత్తుకుపోయారనుకో. ఎలా?" అని తండ్రి బదులిచ్చాడు.

దాంతో వాస్య ఆందోళనగా తన కార్ల వంక చూసి, అన్నీ సరిగానే ఉన్నాయని తృప్తి చెందాడు. అందుకు వాస్తంకకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకొన్నాడు. అప్పటి నుంచీ తను నిద్రపోయే ముందు తప్పనిసరిగా ఆ సైనికుడిని అక్కడ నిలబెట్టేవాడు.

ప్రస్తుతం వాస్యకు తన బొమ్మలపై కంటే తండ్రి కొత్తగా తెచ్చిన చెక్కడబ్బాలోని వస్తువులపైనే ఎక్కువ ఆసక్తి ఉంది. అందులో భవన నిర్మాణానికి పనికొచ్చే సామాగ్రి ఉంది. వీటితో తన బొమ్మల సామ్రాజ్యంలో పెద్ద భవనం కట్టాలని వాస్య తాపత్రయం. ఆ డబ్బాలో అనేక చెక్క ఇటుకలు, ఇనుప దూలాలు, పై కప్పుకు పనికివచ్చే తగరం (కాయితం), కిటికీ అద్దాలుగా అమర్చేందుకు ప్లాస్టిక్ ముక్కలు, ఒక చిన్ని మేకు, దాని సీల ఉన్నాయి. (ఈ చివరి దాంతో ఏం చేయాలో వాస్యకి తెలియదు) ఇవి కాక తీగముక్కలు, కొక్కేలు, గొట్టాలు చాలా ఉన్నాయి అందులో. వాడు అప్పటికే తల్లి సాయంతో అట్టను కత్తిరించి కిటికీ అంచులు తయారుచేశాడు కూడా.

ఇవాళ ఈ నిర్మాణ సామాగ్రిని భవనం కట్టవలసిన చోటికి తరలించడం వాస్య పని. ఆ స్థలం ఎక్కడో గదికి ఆ చివరన ఉంది మరి. నిన్న సాయంత్రం అంతా ఈ రవాణా గురించే వాడు ఆలోచించాడు, ఆందోళన చెందాడు. ఒక పడవలో రవాణా చేస్తే మంచిదని వాడికి తోచింది. కానీ, నాన్న వెంటనే అడ్డుపడ్డాడు. "పడవలో రవాణా చేయాలంటే నది ఉండాలి మరి. ఇది వరకు ఏమైందో మరిచిపోయావా?" అని ప్రశ్నించాడు.

వాస్యకు లీలగా గుర్తుంది. నిజమే పడవలు, నౌకలు ప్రయాణించాలంటే అందుకు నది ఉండాలి. ఇది వాడికి తెలుసు. అప్పట్లో వాడు ఆ భోజనాల గదిలోనే ఒక నదిని సృష్టిద్దామనుకున్నాడు. కానీ అమ్మ అసలు వొప్పుకోలేదు. అంతకు ముందొకసారి వాస్య తన స్టీమర్ కోసం ఒక రేవు కడదామనుకొన్నప్పుడు కూడా తల్లి ధోరణి వాడికి మింగుడుపడలేదు. నిజానికి రేవు నిర్మాణానికి తల్లి వాస్యకు ఒక రేకు డబ్బా ఇచ్చింది. దాన్ని వాడు నీళ్ళతో నింపినప్పుడు మాత్రం ఆమె అడ్డుపడింది.

"చూడు నీ రేవుకు చిల్లులున్నాయి. నీళ్ళు కారిపోతున్నాయి. ఇల్లంతా బురద బురద చేస్తున్నావు" అని గట్టిగా విమర్శించిందామె.

వాస్య ఆశలు నెరవేరలేదు. రేవు నిర్మాణం సగంలోనే ఆగిపోయింది. ఆ రేకు డబ్బాలో ప్రస్తుతం ఒక పార్కు ఏర్పడబోతోంది. పార్కు కోసం నాన్న అప్పుడే ఒక చెట్టు కొమ్మ తెచ్చాడు. దాంతో పార్కులో మొక్కలు ఏర్పాటు చేయవచ్చు.

ఇదంతా గుర్తు తెచ్చుకొని వాస్య హడావుడిగా భోజనాల బల్ల దగ్గరికొచ్చాడు. వాడికి కంగారుగా ఉంది. పని చూస్తే బోలెడు ఉంది. వ్యవధి తక్కువ. మధ్యలో ఈ కాఫీ ఒకటి! తాగకపోతే తల్లి ఊరుకోదు మరి. అక్కడ కూర్చుని కాఫీ చప్పరిస్తున్నాడే కానీ, వాడి దృష్టి అంతా తన బొమ్మల సామ్రాజ్యంపైనే ఉంది.

ఇంతలో తల్లి అడిగింది. "ఇవాళ ఇల్లు కడుతున్నావా?" అని.

"లేదు. ఆ సామానంతా అక్కడికి రవాణా చేయాలి. చాలా తిరగాల్సి ఉంటుంది." అన్నాడు వాస్య. మరి కొంచెం కాఫీ చప్పరించి.... "అలా అని, ఇల్లంతా చిందరవందర చేయను. నువ్వు బెంగపడకు" అని హామీ కూడా ఇచ్చాడు.

నిజానికి ఆమెకు ఏ బెంగాలేదు. అసలు ఆందోళనంతా వాస్యదే. భవన నిర్మాణం తేలికైన పనికాదు మరి.

"సరేకానీ, ఇల్లంతా చెత్త పోశావో, మళ్ళీ శుభ్రం చేయాల్సింది, ఎక్కడి వస్తువు అక్కడ సర్దాల్సిందీ నువ్వే" అంది తల్లి.

ఆ పని అంతా తలుచుకుంటే వాస్య కంగారు పెరిగింది. చటుక్కున వాడు కుర్చీ దిగి పరుగెత్తబోయాడు. తల్లివాడిని ఆపింది. "అదేమిటి? సగం కాఫీ వదిలేశావు? అలా వదలకూడదని చెప్పాగా. అయినా అంత హడావుడి ఏమిటి? కాఫీ తాగే వ్యవధి కూడా లేదా నీకు?" అని నిలదీసింది. దాంతో వాడు ఏదో గొణుక్కుంటూ కప్పులో మిగిలిన కాఫీ ఒక్క పెద్దగుక్కలో త్రాగి పరుగుతీశాడు. తన సామ్రాజ్యాన్ని చేరుకొన్నాడు. ముందు రాత్రంతా కాపలా కాసిన వాస్తంకను డ్యూటీ నుంచి విడుదల చేయాలి. విశ్రాంతినివ్వాలి.

"నీ కాపలాదారు రాత్రింబవళ్లు డ్యూటీ చేస్తున్నాడు. అది కుదరదు. వాడికి విశ్రాంతి అక్కర్లేదా? నువ్వు రోజూ రాత్రి నిద్రపోవడం లేదూ? వాడూ అంతే" అంది తల్లి ఒకసారి.

నిజమే పనిచేసేవారి హక్కులను గుర్తించకపోవడం తప్పే. అప్పటి నుంచీ పగటిపూట వాస్తంకకు పూర్తి విశ్రాంతి లభించేలా జాగ్రత్తపడుతున్నాడు వాస్య. అంటే ఆ బొమ్మను తీసి, అక్కడే ఉన్న పాత అట్ట ఇంట్లో పెట్టి, దాని తలను బలవంతంగా వంచి మీద బరువు పెట్టడం. అయినా వాస్తంక ఒక్క నిముషంలో లేచి నుంచునేవాడు. వాడికి వాస్య వారాంతరపు సెలవు

కూడా నిర్ణయించాడు. తండ్రి ఫ్యాక్టరీ సెలవురోజే వాస్తంక కూడా సెలవు ఇచ్చేవాడు వాస్య. ఆ రోజంతా కాపలాదారుడు ఆ అట్ట ఇంట్లో లేచి నిలబడేందుకు వీల్లేని పరిస్థితుల్లో (మీద బరువు) తప్పనిసరిగా విశ్రాంతి తీసుకునేవాడు. ఆ ఒక్కరోజు మాత్రం కాపలా బాధ్యతలను గులాబీరంగు టోపీ పెట్టుకొనే చైనావాడు నిర్వర్తించేవాడు. ఆ బొమ్మను వాస్యకు ఇచ్చినది అమ్మే కావచ్చు. కానీ ఆ చైనావాడు ఉత్త చవట. ఎప్పుడూ పడిపోతూంటాడు. నాన్న కూడా ఆ చైనావాడిని పనికిమాలినవాడని విమర్శించాడు. అందుకే వాస్యకు వాడంటే అయిష్టం. సాధ్యమైనంత వరకూ వాడికి ఏ బాధ్యతలూ అప్పచెప్పకుండా ఉండేందుకు ప్రయత్నిస్తాడు.

ఇంటికి సంబంధించి వాస్య చేయాల్సిన పనులు కొన్ని ఉన్నాయి. తండ్రి బూట్లు అందించడం అందులో ఒకటి. ఇది కాక అగ్గిపెట్టె తెచ్చివ్వడం, కుర్చీలు సర్దడం, బల్లపై పరచిన బట్టను ముడుతలు లేకుండా చూడటం, గదుల్లో కిందపడి ఉన్న కాయితాలను ఏరడం లాంటిపనులెన్నో వాడు చేస్తాడు. వాటన్నిటిలోకి తండ్రి బూట్లు అందించడం ముఖ్యమైన పని. ప్రతి రోజూ ఉండేది. దాన్ని మాత్రం నిర్లక్ష్యం చేయకూడదు.

ఒక్కసారి మాత్రం - అదీ వాడి బొమ్మల సామ్రాజ్యంలో పెద్ద ప్రమాదం జరిగినప్పుడు, అంటే వాడి ఆవిరియంత్రం గరాటు ఊడివచ్చినప్పుడు, వాడు ఈ ముఖ్యమైన పని మరిచి పోయాడు. విరిగిన ఆ యంత్రాన్ని తండ్రికి చూపించి దిగులుగా మొహం పెట్టాడు. నాన్న వాడి సమస్యను సానుభూతితో పరిశీలించాడు. ఆవిరి యంత్రాన్ని జాగ్రత్తగా పరీక్షించి పెదవి విరిచాడు. "లాభం లేదు. పెద్ద పనే ఉంది దీనికి" అన్నాడు.

దీంతో వాస్యకు బెంగ పెరిగిపోయింది. వాడు తండ్రి వెంట పడకగదిలోకి నడిచి ముక్కలైన ఆవిరి యంత్రాన్ని కలవరంగా చూసాడు. హటాత్తుగా గదిలో నిశ్శబ్దంగా ఉందని వాడు గుర్తించాడు. "అయితే నీ ఆవిరి యంత్రం పాడవడంతో నాకు ఇవాళ బూట్లు లేకుండా పోయాయి." అన్నాడు నాన్న మందలిస్తున్నట్టు. వాస్య తండ్రి పాదాల వంక చూశాడు. ముఖ్యమైన పని మరచిపోయానని తెలిసి, సిగ్గుపడ్డాడు. తక్షణం వంటగదిలోకి పరుగుతీశాడు. కొద్ది క్షణాల్లో పరిస్థితిని వాడు చక్కదిద్దాడు. తండ్రి బూట్లు అందుకుని, "ఈసారి నీకు సరైన, గట్టి గరాటు తెస్తాను" అని హామీ ఇచ్చాడు.

వాస్యకు ఆరేళ్ల వయస్సప్పుడు నాన్న వాడికోసం ఒక పెద్ద పెట్టె బహుమతిగా తెచ్చాడు. అందులో చిన్న చెక్క ఇటుకలు, ఇనుపకడ్డీలు, దూలాలూ వంటి భవన నిర్మాణసామాగ్రి ఉంది. అయితే ఇది కాస్త పెద్ద పిల్లల కోసం. ఈ సామాగ్రితో నిజమైన భవంతుల్లాంటివే నిర్మించవచ్చు. ఆ పెట్టెలోనే ఒక పుస్తకం కూడా ఉంది. అందులో అనేక రకాల భవనాల డిజైన్లు ఉన్నాయి. వాటిని పరిశీలించి ఈ సామాగ్రితో అటువంటివే నిర్మించవచ్చు. తన కోసం నాన్న కష్టపడి ఈ బహుమతి తెచ్చాడని గుర్తించిన వాస్య ఆయన తృప్తి కోసం వెంటనే ఆ పెట్టెతీసి పుస్తకంలోని భవనాల నమూనాలను పరిశీలించాడు. చివరకు ఒక నమూనాను ఎంపిక చేసుకొని అందుకు కావలసిన సామాగ్రిని పెట్టెలోంచి జాగ్రత్తగా ఏరి, పెదాలు బిగించి, తదేక దీక్షతో నిర్మాణం ప్రారంభించాడు. కానీ, వాడి ధోరణి చూసి తండ్రికి ఏదో అనుమానం వచ్చింది.

"ఏం వాస్య ఈ బహుమతి నీకు నచ్చలేదా?" అని ప్రశ్నించాడు.

వాస్య తండ్రి వంక, తను కడుతున్న భవనం వంక మార్చి మార్చి చూశాడు. "నచ్చకపోవడం కాదు. కానీ, ఇప్పటికే ఎన్నో ఇళ్లు, భవనాలూ కట్టాను. కానీ ఏం మిగిలింది? కష్టపడి కట్టడం చివరికి దాన్ని కూల్చడం, మళ్ళీ కట్టడం, మళ్ళీ కూల్చడం అంతేగా, చివరికి మిగిలేది తలనొప్పే గా?" అని బదులిచ్చాడు.

నాన్న పగలబడినవ్వాడు. "అవును, నీవు చేస్తున్నది నిర్మాణం కాదు, విధ్వంసం. చివరకు ఏదీ మిగలదు. నిజమే. ఇదంతా ఉత్త చెత్త... దండగే" అన్నాడు.

వాస్య తండ్రి మాటలు వింటూ తను కడుతున్న భవంతి నమూనా కంటే, కొంత క్లిష్టమైన మరో డిజైన్‌ను ఎంచుకొని ఆ పనిలో పడ్డాడు. నాన్న మాటలు ఆపి కొడుకు పనిని మౌనంగా పరిశీలించాడు. చివరకు వాస్య తయారుచేసిన భవనాన్ని చూసి "పర్వాలేదు. బానే కట్టావు. కానీ గాలిలో కట్టినట్టు ఉంది. ఒక్క తోపుతోస్తే పడిపోతుంది" అన్నాడు.

వాస్య పెద్దగా నవ్వి తను కట్టిన భవనాన్ని చేత్తో ఒక తోపుతోసి కూల్చేశాడు. క్షణంలో ఆ సుందర భవనం చిన్న చిన్న ముక్కలుగా, కుప్పగా నేలపై పడింది.

"అదేంటి? అలా కూల్చేశావు?" అడిగాడు నాన్న.

"ఇప్పుడు కాకపోతే కాసేపటి తరువాతైనా అది కూలిపోవలసిందే. ఎందుకంటే ఆ సామాగ్రితోనే మరొకటి కట్టాలి....."

"అదీ సంగతి. నువ్వెంత కష్టపడినా, చివరకు ఫలితం శూన్యం."

అవునని ఒప్పుకున్నాడు వాస్య.

నాన్న నవ్వి "ఒక్క నిముషం" అంటూ వెళ్ళి తన పరికరాల పెట్టె తీసుకొచ్చాడు. వాస్యకు సంబంధించి అది అతి విలువైన సంపద. ఆ పెట్టెలో మేకులు, మరమేకులు, వాటి సీలలు, తీగముక్కలు, ఉక్కు, రాగి చదరపుముక్కలు, ఇంకా నాన్నకు పనికివచ్చే పనిముట్లు ఉంటాయి. విడిగా ఆయన చేతిలో కొన్ని ఇనుప కడ్డీలు కూడా ఉన్నాయి.

"సరే, ఇక ఆ గాలిమేడలను వదిలేద్దాం. వీటితో కాస్త బలమైనదేమైనా నిర్మిద్దాం" అన్నాడు నాన్న.

వాస్య తండ్రి వంక ఆసక్తిగా చూశాడు. "నాన్నా, వంతెన కడదామా? కానీ....నదిలేదుగా" అన్నాడు.

నది లేదా? దాన్నీ ఏర్పాటు చేద్దాం" అన్నాడు నాన్న సాలోచనగా.

"చెయ్యగలమా?" అబ్బురంగా అడిగాడు వాస్య.

"ఇది వరకు అది అసాధ్యం. ఇప్పుడు కాదు. మన బోల్షివిక్కులు చెయ్యలేదూ? వాళ్లు ఏకంగా ఓల్గానే మాస్కో వరకు తీసుకొచ్చారు."

"ఓల్గా అంటే ఏమిటి?"

"ఓల్గా నది. అది అప్పుడు దూరంగా ఎక్కడో ఉండేది. కానీ, మనవాళ్లు దాన్ని దారి మళ్లించి బీడు భూముల మీదుగా మాస్కోకు తెచ్చారు"

"అప్పుడేమయ్యింది?" అని ప్రశ్నించాడు వాస్య. వాడు తండ్రినే తదేకంగా చూస్తున్నాడు.

"ఏమైందా? అంత నది కూడా మన వాళ్ల వెంట బుద్ధిగా ఇక్కడకు నడిచి వచ్చింది" అని నాన్న వివరించాడు.

"ఇప్పుడు మనం ఏం చేద్దాం?" వాస్యలో ఉత్సాహం.

"మన ఓల్గాను మనం సృష్టిద్దాం. సరేనా?"

"సరే!"

"దాని మీద వంతెన కడదాం."

"భలే..... కడదాం."

ఉత్సాహంగా తండ్రి చెప్పినదానికి సరేనన్నాడేకానీ, అంతలోనే వాస్యకు నది ఏర్పాటు విషయంలో అమ్మకు వేరే అభిప్రాయాలున్న సంగతి గుర్తు వచ్చింది. అబ్బ ఎన్ని కష్టాలోకదా అనుకుని తనపైతానే జాలిపడ్డాడు.

"మనం నదిని ఇక్కడ ఏర్పాటు చేయలేం నాన్న. ఎందుకంటే అమ్మ వొప్పుకోదు" అన్నాడు దిగులుగా. పెట్టెలోంచి పరికరాలు తీసి నేలపై సర్దుతోన్న నాన్న తటాలున తల ఎత్తి వాస్య వంక చూశాడు. "అమ్మా? కదా! నిజమే పెద్ద సమస్యే" అన్నాడు సాలోచనగా.

వాస్య నాన్న వంక ఆశగా చూస్తున్నాడు. అమ్మని ఎలాగైనా ఓడించి ఆయన నదిని ఏర్పాటు చేయాలన్న ఆశ వాడికి ఉంది. "ఇల్లంతా నీళ్లతో బురదగా అవుతుందని తిడుతోంది" అంటూ నాన్నకి అసలు సమస్యని వివరించాడు.

"అవును. అంటుంది. నిజంగానే మనం అలా చేస్తాం కూడా" అన్నాడు నాన్న.

వాస్య తండ్రి అమాయకత్వానికి నవ్వాడు. "లేకపోతే ఏంటి? నీళ్లు లేకుండానే నదిని ఏర్పాటు చేద్దామనా ఆలోచిస్తున్నావు?" అని ప్రశ్నించాడు.

తండ్రి మాట్లాడడం ఆరంభించాడు. "జాగ్రత్తగా విను. నది ఎలా ప్రవహిస్తుంది? అది ఎక్కడో ఒక చోటే కనిపిస్తుంది. మిగిలిన ప్రాంతమంతా పొడిగానే ఉంటుంది. దానికి అటూఇటూ వొడ్డు ఉంటుంది. ఇప్పుడు ఇక్కడ మనం నదిని ఏర్పాటు చేశామనుకో ఏమవుతుంది? అది ప్రవహించి కిందకి వెళ్తుంది. అక్కడ ఇళ్లల్లో ఉండేవాళ్లు ఈ నీరు ఎక్కడి నుంచి వస్తోంది అని ఆలోచించడం మొదలుపెడతారు. తీరా చూస్తే అది మన నిర్వాకం అని తేలుతుంది."

"మరి ఓల్గాను ఇక్కడికి, మాస్కోకి మనవాళ్లే తెచ్చారన్నావుగా" వాస్య సందేహం.

"అది వేరు వాస్య. వాళ్ళు ఆ పనిని సవ్యంగా పూర్తి చేశారు. వాళ్లు నది అటూఇటూ అడ్డదిడ్డంగా ప్రవహించకుండా దానికి రెండువైపులా గట్టు కట్టారు."

"ఎల్లా కట్టారు?"

"ఏముంది? రాళ్లు, సిమెంట్ కాంక్రీటు వేసికట్టారు."

"నాన్నా. నాన్నా. మనమూ అదే చేద్దాం. మనం కూడా మన నదిలో నీరు ఇష్టం వచ్చినట్టు పరుగుపెట్టకుండా గట్టు కడదాం" అన్నాడు వాస్య కొత్త ఉత్సాహంతో.

అలా వాస్య నజరోవ్ బృహత్తర నిర్మాణపథకం మొదలైంది. దీనిని ప్రారంభించేందుకే ముందు చాలా శ్రమపడవలసి వచ్చింది. దీనివల్ల తాత్కాలిక భవంతుల నిర్మాణం పూర్తిగా నిలిచిపోయింది. ఎలాంటి ఉపయోగం లేని ఇటువంటి పనులు చేయడం శుద్ధ దండగ అని వాస్య, వాడి నాన్న కలిసి ఒక నిర్ణయం తీసుకొన్నారు. నాన్న తను కొత్తగా తెచ్చిన భవన నిర్మాణ సామాగ్రిని నది గట్లు కట్టేందుకు వాడదాం అని చెప్పాడు. అయితే, ఆ పెట్టెలో ఉన్న భవనాల నమూనాల పుస్తకం ఏంచేయాలనే అనుమానం వాస్యకి వచ్చింది.

"దాని వల్ల మనకేం లాభం లేదు. ఎవరైనా పిల్లవాడికి ఇచ్చెయ్యి" అన్నాడు నాన్న.

"ఎవరికి మాత్రం ఏం ఉపయోగం ఉంటుంది?"

"ఊరికే చూస్తారు....." అన్నాడు నాన్న

వాస్యకి నిర్మాణసామాగ్రి లేకుండా ఎవరైనా ఈ పుస్తకాన్ని ఎందుకు చూస్తారనే సందేహం కలిగినా మర్నాటి ఉదయం దాన్ని తీసుకొని కిందకి, పెరటిలోకి వెళ్లాడు. ఈ ఇంటి ఆవరణ నగరంలో ఇళ్లకు ఉన్నట్టుగా ఉండదు. నగర శివార్లలో ఉంది కాబట్టి విశాలమైన ఆవరణలో కట్టిన రెండంతస్తుల భవనం అది. పెద్ద ఖాళీ స్థలం చుట్టూ కొయ్యలతో వేసిన కంచె ఉంటుంది. ఈ స్థలానికి వెనక నుంచీ 'కుచుగురి' ఇసక ప్రాంతం మొదలవుతుంది. స్వేచ్ఛ, నిగూఢతలకు మారుపేరైన ప్రాంతమంటే పిల్లలకు విపరీతమైన ఆకర్షణ. ఈ ఇంటి ఆవరణ, దానికి ఉండే పెద్ద గేట్లు దాటిన తరువాతే నగరంలో తొలి వీధి కనిపిస్తోంది.

ఈ భవనంలోని వారంతా రైలు బోగీల కర్మాగారం కార్మికులూ, సిబ్బందే. అందరూ కష్టించి పని చేసే గౌరవనీయులైన శ్రామికులే. అన్నీ పెద్ద కుటుంబాలే. దాంతో ఇంటి ఆవరణలో ఎప్పుడూ పిల్లలు పెద్ద సంఖ్యలో ఆడుకుంటూ కనిపిస్తారు. వాస్యకు ఇక్కడ స్నేహితులు తక్కువే. వాళ్లు కూడా అందరు మగపిల్లలు. ఆవరణలో కొద్దిమంది బాలికలున్నా వాళ్లు వీడికంటే ఐదారేళ్లు పెద్దవాళ్లు. దాంతో వాళ్లు వీడిని పట్టించుకొనేవారు కాదు.

వాస్య కిందకు తెచ్చిన పుస్తకం వాడి స్నేహితుల్లో ఉత్సుకతను రేకెత్తించింది. వాళ్లల్లో మీత్య అనే కుర్రవాడు ఒకడు. వాడి తెలివైన కళ్ళు కనిపించిన ప్రతిదాన్నీ శోధిస్తున్నట్టుగా ఉంటాయి. అందర్నీ యక్షప్రశ్నలతో విసిగించడంలో వాడు దిట్ట. అందుకే మీత్య అంటే వాస్యకి కొంత చికాకు. వాడు ఈ పుస్తకాన్ని చూడగానే "ఎక్కడిది నీకది? ఎలా దొరికింది?" అని అడిగాడు.

"నాదే" అన్నాడు వాస్య.

"అదే ఎక్కడి నుంచి వచ్చింది?"

"ఎక్కడి నుంచీ రాలేదు. నాన్న తెచ్చి ఇచ్చారు."

"అంటే నీ కోసం మీ నాన్న కొన్నారా? నీ కోసం?" అని రెట్టించాడు మీత్య.

దాంతో వాస్య ఆ పుస్తకాన్ని వెనక దాచేసి "అవును" అన్నాడు.

"ఏదీ చూద్దాం. చూపించు. ఇటివ్వు."

వాస్యకు ఆ పుస్తకాన్ని చూపించేందుకు అభ్యంతరం లేదు. అది పోయినావాడికి బెంగలేదు. కానీ మీత్య ఒత్తిడికి లొంగకూడదని వాడి ఉద్దేశం. కానీ మీత్య ఆసక్తిని తట్టుకోలేకపోయాడు. పుస్తకం కోసం చెయ్యి చాస్తూ "ఎందుకలా దాచేస్తావు. చూపిస్తే ఏమవుతుంది?" అని ప్రశ్నించాడు. నిజానికి మీత్య బలహీనుడు. అయినా పుస్తకాన్ని చూడాలనే తపనతో వాడు వాస్యతో కలబడ డానికి సిద్ధమయ్యాడు. వాడి అరుపులు విన్న ల్యోవిక్ అనే కుర్రవాడు వాళ్ళిద్దరి వంక చూసి మందహాసం చేశాడు. వాడు వీళ్ళ కంటే కొంచెం పెద్దవాడు. స్కూల్లో ఒకటో తరగతి చదువు తున్నాడు. మీత్య వంక చూసి 'ఏం వాడిని కొడతావా? కొట్టు. అంతేకానీ అరుపులు దండగ' అన్నాడు.

మీత్య వెనక్కి తగ్గాడు. ల్యోవిక్ మెల్లగా నడుచుకుంటూ వాస్య దగ్గరికొచ్చి "ఆ పుస్తకం ఇటివ్వు" అన్నాడు. వాస్య ఏ మాత్రం సందేహించకుండా దాన్ని వాడి చేతిలో పెట్టాడు.

ల్యోవిక్ నాలుగు పేజీలు తిప్పి చూసి, "భలే నాది ఇలాంటిదే ఒక పుస్తకం పోయింది. మళ్లీ అటువంటిదే కనిపించడం విచిత్రం. బావుంది. ఇది నాకిస్తావా? బదులు మరేమన్నా ఇస్తాను" అన్నాడు వాస్యతో. బయటి ప్రపంచంతో అతి తక్కువ సంబంధాలున్న వాస్యకు "బదులు" అంటే ఏమిటో అర్థం కాలేదు. కానీ ఇదేదో బావుందనుకున్నాడు. ల్యోవిక్ వాడిని తన వెంట ఇంటికి తీసుకెళ్లాడు. వస్తుమార్పిడి తతంగానికి సాక్ష్యం కూడా ఉండాలంటూ మీత్యను రమ్మన్నారు. వాళ్ల ఇల్లు చేరుతుండగా వాస్య, మీత్యలకు చిన్న హెచ్చరిక చేశాడు. "మా అక్క లాల్య ఊరికే అరుస్తుంది. మీరేం పట్టించుకోకండి" అని.

ముగ్గురూ ల్యోవిక్ ఇల్లు చేరారు. వాడు తలుపు లోపలికినెట్టి "ఇక్కడ ఉండండి. క్షణంలో వచ్చేస్తాను" అన్నాడు. మరో తలుపు తెరిచి లోపలికి వెళ్లాడు. ఆ రెండో తలుపులోంచి లోపలి వంటగది కనిపిస్తోంది. నిజానికి ఏమీ కనిపించడంలేదు. దట్టమైన పొగ, ఆవిరి ఆ గదిని కమ్మి ఉన్నాయి. ఆ పొగల మధ్య నుంచీ అందమైన కళ్లు గల ఒక యువతి మొహం ప్రత్యక్షమైంది. ఆమె వారిని చూసి గట్టిగా మాట్లాడడం మొదలుపెట్టింది.

"ల్యోవిక్ వచ్చావా నాయనా. మళ్లీ ఆ కుర్రవాళ్లని ఎందుకు వెంటపెట్టుకువచ్చావు? నీకేం కావాలి? నేనెందుకు ఇవ్వాలి?" అని రుసరుసలాడింది.

లోపలి గదినుంచి మరో పెద్దావిడ ఈ పిల్లను మందలించింది. "ఎందుకు అలా ల్యోవిక్ మీద విరుచుకుపడతావు? ఆ పిల్లలు ఏంచేశారని విసుక్కుంటావ్?"

లాల్య వీళ్లిద్దరి వంక క్రోధంగా చూసింది. తల తిప్పకుండానే బదులు చెప్పింది. "ఏం చేశారా? వాళ్ల కాళ్లు ఎలా ఉన్నాయో చూడు. మురికిగా మట్టికొట్టుకొని ఉన్నాయి. వాటితో ఇల్లంతా పాడు చేస్తారు" అంటూ మీత్య జుట్టువంక వేలు చూపించి, "ఆ తల చూడండి ఎంత అందంగా ఉందో, పిచ్చుకలు అక్కడు గుడ్లు పొదుగుతాయనుకుంటాను" అంటూ వాస్య వంక చూసి, "నువ్వెవరు బాబూ, ఆ కళ్లు చూడండి ఎలా ఉన్నాయో!" అని ఛీత్కరించింది.

ఆ పిల్లకు గట్టిగా పదిహేనేళ్లు కూడా ఉండవు. కానీ వాస్యకు బాగా భయం కలిగింది. బెదురుగా ఒక అడుగు వెనక్కి వేశాడు. ఈలోగా ల్యోవిక్ రానే వచ్చాడు. "అక్కని పట్టించుకోవద్దు. రండి" అంటూ వాళ్లని ఇవతలకి పిలిచి తలుపు మూసేశాడు. పిల్లలంతా సామాన్లతో నిండిన చిన్న గదిలోకి ప్రవేశించారు. గదినిండా కుర్చీలు, బెంచీలు, సోఫాలు, కర్టెన్లు, పుస్తకాలు ఉన్నాయి. మధ్యలో ఒక సోఫా ఎదుట నడిచేదారి మాత్రం ఉంది. ల్యోవిక్ తన మిత్రులిద్దరినీ ఆ సోఫాలో కూర్చోమన్నాడు. అంత సుఖంగా కూర్చోగల సోఫాలు, కుర్చీలు వాస్య ఇంట్లో లేవు. కానీ ఈ గదిలో అసలు స్థలం లేక పోవడంతో వాస్యకు భయమేసింది. ఆ గదిలోనే ఒక పియానో, కోలగా ఉన్న ఫ్రేముల్లో రంగురంగుల చిత్రాలు, పుసుపురంగు కొవ్వొత్తులులాంటి కొత్త వస్తువులను వాస్య అబ్బురంగా చూశాడు. ల్యోవిక్ వాళ్ల ఎదురుగా తిరిగే బల్లపై కూర్చుని విలాసంగా కాళ్లతో ఆ బల్లని గుండ్రంగా తిప్పాడు. వాస్య వంక తిరిగి "ఆ పుస్తకానికి బదులు ఏం కావాలి? నాలుగు తాళం చెవి రింగులున్నాయి, కావాలంటే పక్షిగూడు ఒకటి ఉంది, ఇంకా పర్సు కూడా..." అంటూ లేచి బల్లసొరుగు తీసి మళ్ళీ తిరిగే చిన్న బల్లపై కూర్చుని, ఆ సొరుగును వొళ్లో పెట్టుకున్నాడు. మొదట దాంట్లోంచి ఆకుపచ్చగా ఉన్న చిన్న పర్సు తీశాడు.

ఆ పర్సుకు ఉన్న చిన్న మీట నొక్కితే దానంతట అదే తెరుచుకొంటుంది. వాస్యకు ఆసక్తి కలిగించడం కోసం ల్యోవిక్ వాడి కళ్ల ముందు పర్సు ఉంచి ఐదారుసార్లు ఆ మీట నొక్కి చూపించాడు. ఈలోగా వాస్య దృష్టి బల్లపై ఉన్న ఒక చిన్న చెక్కపెట్టెపై పడింది. వాడు దానివంకే చూస్తూ "ఆ పెట్టె ఏమిటి?" అని ప్రశ్నించాడు.

ల్యోవిక్ పర్సు ప్రదర్శనను ఆపి ఆ డబ్బా వంక చూసి "అది కావాలా?" అని అడిగాడు. వాస్య ఆశగా తల ఊపాడు. ల్యోవిక్ కళ్లలో టక్కరితనం మెరిసింది. "సరే తీసుకో. అయితే దీనికి బదులు నీ పుస్తకాన్ని ఇస్తున్నట్టు సాక్షి మీత్య ముందు ఆమోదిస్తున్నావా?" అని వాస్యను గంభీరంగా అడిగాడు. వాస్య గబగబా తల ఊపాడు.

ల్యోవిక్ లేచి ఆ పెట్టెను తెచ్చి వాస్యకు ఇచ్చి "ఇక ఈ పెట్టె నీదే" అని ప్రకటించాడు. తక్షణం వాస్య ఆ పెట్టె అడుగుభాగాన్ని పరీక్షించాడు. గట్టిగా, దళసరిగా ఉంది. చిల్లులు లేవు. నీళ్లు కారిపోవు. వాడి ఆలోచనలు తాను ఏర్పాటు చేయబోయే నదివైపు మళ్లాయి.

"పిట్ట గూడు చూస్తావా?" అడిగాడు ల్యోవిక్. ఇద్దరూ కలిసి మరో గదిలోకెళ్లారు. అక్కడ అలమారులోంచి వాడు బంతిలా ఉన్న పక్షి గూడు ఒకటి తీశాడు. దానికి చిన్న రంధ్రం ఉంది. అదే పిట్ట గూట్లోకి దూరే మార్గం.

"కావాలంటే ఆ పెట్టెకు బదులు, ఈ గూడు తీసుకో" అన్నాడు ల్యోవిక్.

"నా కెందుకు ఇది. పెట్టే తీసుకుంటాను."

"పెట్టె మాత్రం దేనికి? ఏం చేస్తావు?" వాస్య సమాధానం చెప్పలేదు. అందంగా గట్టిగా ఉన్న పెట్టె గుర్తుకు వచ్చింది. వాడు లోపలే నవ్వుకుంటూ తిరిగి సామాన్లగదిలోకి వచ్చి సోఫా వంక చూశాడు. పెట్టె లేదు! ఇప్పుడే అక్కడ ఉంచిన పెట్టె మాయమైంది! వాస్య ఆందోళనగా బల్ల వంక చూశాడు. ఈలోగా ల్యోవిక్ లోపలనుంచీ ఈ గదిలోకి వచ్చాడు. వాస్య మొహం చూసి, ఏదో జరగరానిది, జరిగిందని గ్రహించాడు "ఏమిటి?" అని అడిగాడు.

"పెట్టె ఏదీ?" వాస్య అయోమయంగా ప్రశ్నించాడు.

"నీ చేతుల్లో పెట్టాగా!" అని ల్యోవిక్ ఆశ్చర్యపోయాడు.

"ఇక్కడే సోఫాలో ఉంచి నీతో ఆ గదిలోకి వచ్చాను. మళ్లీ వచ్చి చూస్తే లేదు" అన్నాడు వాస్య విచారంగా.

"ఏమోనబ్బాయ్. నేనైతే నీ చేతుల్లో పెట్టాను. నీ పుస్తకానికి బదులుగా ఆ పెట్టెను తీసుకుంటున్నట్టు సాక్షి ఎదురుగా ఒప్పుకొన్నావు. నాకేం తెలియదు" అంటూ చేతులు దులుపుకొన్నాడు ల్యోవిక్.

"సాక్షి?" అన్నాడు వాస్య అయోమయంగా.

"అవును మీత్య ఏడి?" అంటూ ల్యోవిక్ గది అంతా పరీక్షగా చూశాడు. వాడక్కడ లేనేలేడు. వాడికి విషయం అర్థమైంది. "ఆగు. మీత్య నీ పెట్టెను ఎత్తుకుపోయాడు" అని చెప్పాడు. "ఎత్తుకుపోయాడా?" ఆశ్చర్యంగా ప్రశ్నించాడు వాస్య.

ల్యోవిక్ పగలబడి నవ్వాడు. "భలే సాక్షిని తెచ్చుకొన్నావులే. వాడొట్టి దొంగ. నీపెట్టెని తీసుకు పారిపోయాడు" అని తేల్చాడు.

"పారిపోయాడా?" మరింత నిర్ఘాంతపోయాడు వాస్య.

అప్పుడే తలుపు దగ్గర అలికిడి వినిపించింది. ఇద్దరూ అటు చూశారు. ల్యోవిక్ అక్క లాల్య అక్కడ నిలిచి ఉంది. ఆమె బల్లవంక పరీక్షగా చూస్తోంది. అక్కడ బల్లపై ఆ చిన్న పర్సు ఉంది. "నా పర్సు ఎందుకు తీశావు?" లాల్య తన తమ్ముడిని తీక్షణంగా ప్రశ్నించింది.

ల్యోవిక్ మెల్లగా అవతలి తలుపువైపు జరుగుతూ 'నేనేం తియ్యలేదు. అది అక్కడే ఉంది' అన్నాడు. లాల్య వేగంగా లోపలికి వచ్చి బల్ల సొరుగు తీసి లోపలి వస్తువులను పరీక్షగా చూసింది. ఒక్కసారిగా అరిచింది. "అది ఇవ్వు. ఇచ్చేయ్ పంది వెధవా" అని తమ్ముడిని తిట్టింది. ల్యోవిక్ అప్పటికే తలుపు వద్దకు చేరుకొని, తన వైపు దూసుకువస్తున్న అక్కని తప్పించు కొనేందుకు బయటకు గెంతి, వేగంగా తలుపు మూసేశాడు. లాల్య పరుగెత్తుతూ తలుపు వద్దకు వస్తూ దారిలో నిలిచిన వాస్య ఢీకొంది. వాస్య సోఫాలో పడ్డాడు.

లాల్య తలుపు తెరిచి ల్యోవిక్ కోసం చూసింది. వాడు అప్పటికే అదృశ్యమయ్యాడు. ఆ పిల్ల లోపలికి వచ్చి, మరోసారి సొరుగు తీసి పరిశీలించి, విచారంగా వచ్చి సోఫా అంచుపై తల పెట్టుకొని ఏడవడం మొదలుపెట్టింది.

వాస్యకు అంతా గందరగోళంగా ఉంది. ఆ పిల్ల ఏడుస్తుంటే జాలిగా అనిపించింది. "పెట్టె కోసమేనా?" అని మృదువుగా ఆమెని ప్రశ్నించాడు. అంత వరకు ఆ పిల్లవాడిని గమనించనే లేదు. ఈ ప్రశ్న వినగానే గభాలున తలెత్తి "ఆహఁ పెట్టె కోసమే. అదే ఎక్కడుంది?" అని కోపంగా ప్రశ్నించింది.

వాస్య ఆమె కళ్లలో క్రోధాన్ని, అసహ్యాన్ని చూసి విలవిలలాడాడు. "పెట్టె... ఏదీ?" అని వెర్రి ప్రశ్న వేశాడు.

ఆమె వేగంగా లేచి వాడి భుజాలు గట్టిగా పట్టుకొని "చెప్పు నా పెన్సిల్ పెట్టె ఏదీ?" అని గట్టిగా అరిచింది.

వాడికి ఒక ముక్క అర్థం కాలేదు. "పెన్సిల్ పెట్టేమిటి?" అన్నాడు భయంగా. కానీ ఆ పిల్లకు చేతనైనా సాయం చేద్దామనే అనుకున్నాడు. ముందు అనుమానం తీరాలి. "పెన్సిల్ పెట్టేమిటి?" మళ్ళీ అడిగాడు.

"దొంగ వేషాలు వేయద్దు, ఆ పెట్టె మర్యాదగా ఎక్కడుందో చెప్పు" అని నిలదీసిందామె.

వాస్య భయంభయంగా తడబడుతూ మొత్తం కథంతా చెప్పడం మొదలుపెట్టాడు. "నా దగ్గరున్న బొమ్మల పుస్తకం కావాలని ల్యోవిక్ అడిగాడు. దానికి బదులు ఏమన్నా ఇస్తాను ఇంటికి రమ్మన్నాడు. వచ్చాను. పిట్టగూడు కావాలా అన్నాడు. తాళం చెవి రింగులు ఇస్తాను అన్నాడు. కావాలంటే ఈ పర్సు తీసుకోమన్నాడు. నేను ఆ పెట్టె చూపించి, అదే కావాలని చెప్పాను. వాడు సరే అని దాన్ని నా చేతిలో పెట్టాడు..."

మధ్యలోనే అడ్డుకొంది లాల్య. "అంటే నువ్వు తీసుకొన్నావన్నమాట" అంది కసిగా. వాస్యకు సమాధానం చెప్పే వ్యవధి దొరకలేదు. వాడి తల వేగంగా వెళ్లి సోఫా అంచుకు కొట్టుకుంది. మరుక్షణం వాడి చెంప చుర్రుమంది. లాల్య తనను కొట్టిందన్న సంగతి కొంచెం ఆలస్యంగా వాడికి అర్థమైంది. అంతవరకు వాడిని జీవితంలో ఎవరూ కొట్టలేదు. దెబ్బలు తినడం అవమానమని కూడా వాడికి తెలియదు. కానీ వాడి ప్రమేయం లేకుండానే కళ్లమ్మట నీళ్ళు వచ్చాయి. సోఫాలోంచి ఒక్కసారి గెంతి బల్ల దగ్గరకు వచ్చి నుంచున్నాడు.

"సరే, ఆ పెట్టె ఇచ్చెయ్" అంది లాల్య అసహనంగా. ఆమె మరోసారి కొట్టేందుకు సిద్ధంగా ఉందని వాడికి తెలిసిపోయింది. అది వాడికి ఇష్టం లేదు. కానీ అసలు సమస్య అది కాదు. పెట్టె ఇక్కడ లేదని ఆమెకు ఎందుకు తెలియడం లేదో వాస్యకు అర్థం కాలేదు. అసలు నన్ను మాట్లాడనివ్వదే అనుకొన్నాడు విచారంగా.

"ఏదీ, ఎక్కడ? ఇవ్వు?" అంటోంది లాల్య కఠినంగా.

"ఇక్కడ లేదు. నీకు తెలియడం లేదా? అది ఇక్కడ లేదు" అన్నాడు వాస్య.

"అంటే?"

"మీత్య దాన్ని తీసుకొన్నాడు."

"మీత్య? ఎవరు?"

"వాడే ఆ పెట్టెను ఎత్తుకుపోయాడు"

"అంటే ఆ పిచ్చి జుట్టువాడా? నువ్వే ఇచ్చావా?" అంటూ ముందుకు వస్తోంది. తప్పించుకుందామంటే ఒకటేదారి పియానోకు బల్లకు మధ్య సన్నని ఖాళీ నుంచీ పరుగెత్తాలి. కానీ లాల్య ఆ అవకాశం ఇవ్వలేదు. వాస్యను బలంగా కిటికీ వైపు తోసి, వాడితలపై గట్టిగా మొట్టింది. మరోసారి కొట్టేందుకు చెయ్యి ఎత్తింది. ఆ క్షణంలో ఒక చిన్ని పిడికిలి ఆమె మొహంవైపు దూసుకొచ్చింది. ఆమె చెంప పేలిపోయింది. ఆమె ఆశ్చర్యం నుంచీ తేరకునేలోపు వాస్య ఆమెను అందినచోటల్లా కొట్టేస్తున్నాడు. ఎవరినైనా కొట్టడం కూడా వాడి చిన్ని జీవితంలో అదే తొలిసారి. వారిద్దరి పోరు మరింత ముదరకముందే ఆ గదిలోకి సన్నగా, పొడవుగా ఉన్న ఒకామె ప్రవేశించింది.

"లాల్య, ఏమిటీ కొట్లాట? ఎవరా అబ్బాయి?" అని ప్రశ్నించింది. బహుశా లాల్య వాళ్ల అమ్మ అయి వుంటుంది. అనుకున్నాడు వాస్య. అయిపోయింది, తన పనైపోయింది. ఇక ఇద్దరూ కలిసి తనని బాదేయడం ఖాయం అని క్షణాల్లో తేల్చుకున్నాడు.

"చెప్పు లాల్య, ఎందుకు కొట్టుకుంటున్నారు? ఎవరీ పిల్లవాడు?" తిరిగి ప్రశ్నించిందామె.

'ఏమో, నాకేం తెలుసు ల్యోవిక్ పట్టుకొచ్చాడు. ఇద్దరూ కలిసి నా పెన్సిల్ పెట్టె కాజేశారు' అని సమాధానం చెప్పింది లాల్య. కానీ, ఆ పిల్ల కళ్ళల్లో ఇందాకటి కోపం లేదు. కొంత ప్రశాంతత కనిపించింది.

"ఈ పిల్లవాడు ఎంత బావున్నాడు! ఎందుకు వాడిని కొడుతున్నావు?" ఆ పెద్దామె లాల్యను వదల్లేదు.

"ఆ బావుంటాడు. నా పెన్సిల్ పెట్టెను తిరిగి ఇచ్చెయమను"

గుమ్మం దగ్గర మళ్లీ అలికిడి అయ్యింది. ఈసారి ఒక పొట్టి మనిషి లోపలికొచ్చాడు. ఆయన్ని చూడగానే లాల్య కళ్లలో సంతోషం కదలాడింది. "గ్రీష్కా. చూడు ఈ పిల్లవాడు నా పెన్సిల్ పెట్టె తీసేసుకున్నాడు. ఆమె ఏమో వీడిని సమర్థిస్తోంది" అని ఫిర్యాదు చేసింది.

గ్రీష్క అనే పెద్దమనిషి తన గడ్డాన్ని నిమురుకుంటూ వాస్య వంక చూశాడు. "ఆమె ఎప్పుడూ అందరినీ సమర్థిస్తుందిలే. అయినా ఈ పిల్లవాడు ఎవరూ?" అని లాల్యను అడిగాడు.

లాల్య ఇటు తిరిగి వాస్య వంక చూసి నవ్వింది. "ఇంతకీ నువ్వెవరు? ఎక్కడి నుంచి వచ్చావు? నీ పేరేమిటి?" అని ప్రశ్నించింది. వాడు గదిలో మిగిలిన ముగ్గురినీ పరీక్షగా చూశాడు. వాళ్లు ఏం మాట్లాడలేదు. చివరికి నెమ్మదిగా చెప్పాడు.

"నా పేరు వాస్య నజరోవ్."

"ఓ నజరోవ్‌ల పిల్లవాడివా?" అంటూ లాల్య అపేక్షగా దగ్గరికొచ్చి వాస్య తల నిమిరింది. "సరే. మంచిది. జరిగిన దెబ్బలాటను మరిచిపో. ఆటగా అనుకో. ఆ పెట్టెను ఎలాగైనా సాధించు. అర్థమైందా?" అంది.

వాస్యకు ఒక ముక్క కూడా బోధపడలేదు. కొట్లాటని ఆటగా భావించడం ఏమిటో.... ఈ 'సాధించడం' ఏమిటో వాడికి తెలియలేదు.

"దాన్ని మీత్య తీసుకొన్నాడు" అన్నాడు స్థిరంగా.

"నిజంగా? అయితే లాల్య వీడిని అన్యాయంగా కొట్టావు" అని మందలించింది పెద్దామె.

"కొట్టిందా? ఏం లాల్యా?" అని మందలింపు అడిగాడు ఆ పొట్టి మనిషి.

"ఓహ్! గ్రీష్కా మీరు కూడా ఈ పెద్దామెలానే మాట్లాడుతున్నారు" అని విసుక్కుంటూ లాల్య గదిలోంచి బయటికి వెళ్ళిపోయింది.

పెద్దామె వాస్య వంక చూసి, "బాబూ వెళ్లు. ఇంటికెళ్లు. ఆ పెట్టె సంగతి మరచిపో" అంది దయగా. వాస్యకు ఆమె ఎంతగానో నచ్చింది. వాడు గదిలో ఉన్న గ్రీష్కను పట్టించుకోకుండా ఆమె వంకే చూస్తూ బయటకు నడిచాడు.

బయట మెట్ల పక్కన ల్యోవిక్ నవ్వుతూ నుంచుని ఉన్నాడు. వాస్య ఓ వెర్రి నవ్వు నవ్వాడు. వాడు ఇప్పటికీ వేగంగా జరిగిన సంఘటనల ప్రభావం నుంచి కోలుకోలేదు. అయితే ఈ అనుభవాన్ని వాడు కలగాపులగం కానివ్వలేదు. దేనికదిగా ఆయా సంఘటనల సారాంశాన్ని అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. వాడి ఆలోచనల్లో ఇప్పటికీ ఆ అందమైన చిన్న పెట్టె వుంది. దాంతో ఎంతో అందమైన నదిని సృష్టించడం సాధ్యమయ్యేది. అది కాస్తా పోయింది. ఇంతకీ మీత్య ఏమయ్యాడనే ఆలోచన వాడి మెదడును దొలిచేస్తుంది. ఇంక లాల్యకు ఆ పెద్దావిడ వెర్కా, ఆ గ్రీష్కాలు ఏమవుతారో తెలుసుకోవాలనే ఆసక్తి కూడా వాడిలో పెరుగుతుంది. వాళ్లు ల్యోవిక్-లాల్యల అమ్మానాన్నలు అయి ఉండాలి. కాకపోతే ఎవరు? వాడు మెట్లు దిగాడు.

"ల్యోవిక్ మీ అమ్మా, నాన్నలు ఎవరు?" అడిగాడు.

"నువ్వు చూడలేదా?"

"లేదే"

"ఇప్పుడు లోపలికి వచ్చాడుగా గడ్డం, కళ్లజోడు..."

"ఆయన... ఆయన గ్రీష్కా కదూ!" వాస్య సందేశం.

"ఆఁ ఆయనే గ్రీష్క, మా నాన్న."

"అదేంటి నాన్నని ఎవరైనా గ్రీష్క అంటారా?"

"అంటే? నాన్న కాబట్టి ఆయనకి ఒక పేరు ఉండదా?" ల్యోవిక్ సవాలు.

"కాదా, నాన్న అని అనాలిగా?"

"అనచ్చు. మీ నాన్న పేరు ఏమిటి?"

"నాన్న పేరు? అమ్మ ఆయన్ను ఫెద్యా అని పిలుస్తుంది మరి" వాస్య వివరణ ఇచ్చాడు.

"అంటే మీ నాన్న ఫెద్య, మా నాన్న గ్రీష్క... అంతే"

"అలా అని మీ అమ్మ పిలుస్తుందా?"

"అమ్మేమిటి? ఎవరైనా అలానే పిలుస్తాం. అమ్మని వెర్కా అని అంటాం."

వాస్యకు అదేం మింగుడు పడలేదు. అప్పటికే ల్యోవిక్ మెట్లు ఎక్కి ఇంటికి బయలుదేరాడు. తను కూడా ఇంటికి వెళ్లాలి. వాస్య ఇంటి ముందుకు వెళ్లి తలుపు తోయగానే తల్లి ఎదురుపడింది. ఆమె వాడిని పరీక్షగా చూసింది.

"ఏమైంది? అలా ఉన్నావేం?" అని కొడుకుని ప్రశ్నించింది.

వాస్య కంగారుపడకుండా, ఏ వివరమూ మరచిపోకుండా, జరిగినదంతా తల్లికి చెప్పాడు.

"ఆ పిల్ల లాల్య, నన్ను ఎలా చూసిందనుకున్నావ్? గభాలున నన్ను కొట్టింది. ఇదిగో ఇక్కడ" అని తల్లికి చూపించాడు.

"ఆ తరువాత ఏమైంది?"

"ఏముంది. ఇక వచ్చేద్దామనుకున్నాను. కానీ లాల్య నాకు అడ్డం నిలిచి మళ్లీ కొట్టింది. దాంతో నేను తిరిగికొట్టాను. ఇంతలో వెర్కా వచ్చారు."

"ఆమె ఎవరు?"

"ఏమో. కళ్లజోడు పెట్టుకొంది. ఆమె తరువాత గ్రీష్క వచ్చారు. నువ్వు నాన్నని ఫెద్యా అంటావే, అలాగే వారు ఒకరినొకరు గ్రీష్క... వెర్కా అని పిలుచుకున్నారు. ఆమె నన్ను విడిపించి ఇంటికెళ్లి పొమ్మంది."

"కానీ ఇది చిన్న విషయం కాదు వాస్య" అంది తల్లి.

వాడు తల్లితో ఏకీభవించాడు.

సాయంత్రం తండ్రి ఇంటికి వచ్చాడు. వాస్యతో మాట్లాడాడు. "చూశావా ఓల్గా నది నిర్మాణం ఎంత పెద్ద పనో అర్థమైందా? ఇప్పుడేం చేస్తావు?" అని ప్రశ్నించాడు.

వాస్య బొమ్మల సామ్రాజ్యం పక్కనే చాపపై కూర్చున్నాడు. వాడు ఆలోచనలో పడ్డాడు తండ్రి ధోరణి అర్థమవుతోంది. కష్టభూయిష్టంగా మారిన తన పరిస్థితిపై జాలి కలిగింది. పైగా ఆయన తనకేం సాయపడే ఉద్దేశంలో లేడని బోధపడింది. కానీ వాస్య దృష్టిలో తండ్రి తెలివైన మనిషి. అందుకే అడిగాడు.

"నేను ఇంకా పిల్లవాడినేగా! కాస్త సాయం చేయవచ్చుగా?"

'పిల్లవాడివే. కానీ ల్యోవిక్‌తో వస్తు మార్పిడికి తయారైనప్పుడు నువ్వు నా సాయం అడగలేదు' అన్నాడు ఆయన నిందాపూర్వకంగా.

"నేనేం చేయను? ల్యోవిక్ ఆ పుస్తకం కావాలన్నాడు. బదులుగా ఆ పెట్టె ఇస్తానన్నాడు."

"సరే వెళ్లావు. ఇప్పుడు ఆ పెట్టె ఏదీ?"

వాస్య విషాదంగా మొహం పెట్టి నవ్వాడు. "నాకు అది మిగల్లేదు. మీత్య కొట్టేశాడు..."

"కొట్టేశాడా? అదేం భాష? దొంగిలించాడు అనాలిగా?"

"ల్యోవిక్ అలాగే అన్నాడు? మరి వాడు ఏ భాష మాట్లాడినట్టు?"

"అది దొంగల భాష. నువ్వు ల్యోవిక్ మాట్లాడినట్టు మాట్లాడనవసరం లేదు. వాడి అక్క హస్తకళల పాఠశాలలో చదువుతుంది. అంటే వాడు నీకు ఇచ్చిన పెట్టె ఆమెదే అయి ఉండాలి. తన పెన్సిళ్లు, కుంచెలు దాచుకునే పెట్టె అది." నాన్న వివరించాడు. "అంటే ఆమెకు కోపం రావడంలో తప్పు లేదు."

"కానీ ఆ పెట్టెని తీసింది ల్యోవిక్. దాన్ని దొంగిలించినది మీత్య" తన తప్పులేదని సమర్థించుకోబోయాడు వాస్య.

తండ్రి ఓపికగా వాస్యకు వివరించాడు. వాస్యకి ల్యోవిక్ గురించి తెలియదు. కానీ వాడు ల్యోవిక్‌ని గుడ్డిగా నమ్మాడు. ల్యోవిక్ ఇస్తానన్న పెట్టె కోసం ఆశపడి ఒప్పుకోవడం ఒక తప్పు అయితే, దాన్ని మీత్య ఎత్తుకెళితే, ఆ విషయం గమనించకపోవడం మరో తప్పు. చివరకు తన్నులు తప్పలేదు. ఇందులో తప్పు ఎవరిది? తండ్రి మాట్లాడుతున్న కొద్దీ వాస్యకు తన తప్పులు అర్థమయ్యాయి. వాడి మొహం సిగ్గుతో ఎర్రబారింది. తండ్రి తెలివితేటలపై గౌరవం పెరిగింది. ఆయన మరింత ఆత్మీయంగా కనిపించాడు. కానీ పెట్టె అనేది లేకుండా నదికి ఏర్పాటు చేయడం ఎలా? వాడు తండ్రి తనకు ఇచ్చిన సరంజామాను పరిశీలించాడు. వంతెన నిర్మాణానికి అవసరమైన సామగ్రీ ఉంది. కాని దాన్ని దేనిపై నిర్మించాలి? తండ్రికి సమస్యను వివరించాడు. "అమ్మ ఒక పెట్టెను ఇస్తానంది... కానీ మరచిపోయింది."

ఇంతలో తల్లివచ్చి వాడికి చెప్పింది. "సరే నేను ఒక పెట్టెని ఇస్తాను".

వాడు తల్లి వెంట వంట గదిలోకి వెళ్లి తిరిగి వచ్చేసరికి నాన్న పేపరు చదువుతున్నాడు. వాడికి మీత్య వాడు ఎత్తు కెళ్లిన చిన్నపెట్టె గుర్తుకు వచ్చాయి. దాన్ని తిరిగి సంపాదించాలి అనుకుంటూ హడావుడిగా కిందకి, పెరట్లోకి పరుగుతీశాడు. ఆ రోజు తండ్రికి ఫ్యాక్టరీ సెలవు. ఆయన అమ్మ కలిసి బజారు వెళ్లేందుకు సిద్ధమవుతున్నారు. మామూలుగా అయితే వాస్య తన అమ్మ, నాన్నలతో బయటికి వెళ్లడం అంటే ఇష్టపడతాడు. కానీ, ఇవాళ సంగతి వేరు. చాలా పని ఉంది. తండ్రి వాడి ఉద్దేశం గ్రహించినట్టుగా నవ్వాడు. "ఇవాళ నీకు చాలా పని ఉన్నట్టుంది?" అన్నాడు వాస్యతో.

అందరూ కలిసి ఇల్లు తాళం పెట్టి కిందకి నడిచారు. బయట మెట్ల చివర నాన్న వాడికి ఇంటి తాళం ఇచ్చాడు. "జాగ్రత్త. ఆడుకో. తాళం చెవి పారేయకు. ఎవరితోనూ, ఏ వస్తువు కోసమో దాన్ని మార్పిడి చేయకు" అని హెచ్చరించాడు. వాస్యకు సంగతి బోధపడింది. తాళంచెవి చాలా ముఖ్యమైనది. దాన్ని ఎవరికీ ఇవ్వకూడదు.

వాస్య పెరట్లో పిల్లల వద్దకు వచ్చాడు. వాళ్లంతా 'కుచుగురి' గురించి వాదులాడు కుంటున్నారు. ఇది చాలా కాలంగా వాళ్ల మధ్య నలుగుతున్న వివాదం. ఇవాళ అటుఇటు తేలిపోయేలా ఉంది. ఇంటి ఆవరణ వెనకనుంచి మొదలయే ఇసక మైదానం 'కుచుగురి' అంటే పిల్లలందరిలో ఏదో ఆసక్తి. వాస్య తండ్రితో కలిసి కొన్నిసార్లు అక్కడికి వెళ్లాడు. కానీ ఆ ప్రాంతానికి సంబంధించిన రహస్యాలన్నీ వాడికి పూర్తిగా తెలియలేదు. దాదాపు మూడు కిలోమీటర్ల పొడవు, అంతకంటే ఎక్కువ వైశాల్యం ఉండే కుచుగురిలో ఎన్నో ఇసుక దిబ్బలు, వాటి లోయలు, వాటిపై పసరు వాసన వచ్చే పొదలు ఉంటాయి. మధ్యలో ఒక పెద్ద కొండ కూడా ఉంది. దానిపై వరకు ఎవరైనా ఎక్కితే కిందనుంచి వాళ్లు చిన్నపురుగుల్లా కనిపిస్తారు.

పిల్లలు ఆ దిబ్బల్లోకి వెళ్లి పై నుంచి కిందకి జారడాన్ని వాస్య చాలాసార్లు చూశాడు. వాళ్లంతా దుమ్ము మేఘాల మధ్య అరుస్తూ, నవ్వుతూ దొర్లడాన్ని బట్టి అలా జారడం చాలా బావుంటుందనే అభిప్రాయం వాడికి కలిగింది. పిల్లలు పైనుంచి కిందకి దొర్లి, లేచి నిలబడి బట్టల ముడతల్లో, జేబుల్లో, చెవుల్లో చేరిన ఇసుకను దులుపుకోవడం వాస్య గమనించాడు.

కానీ తండ్రి పక్కన ఉండగా తను అలా చేయడం అంటే వాడు తటపటాయించేవాడు. లోపల మాత్రం అలా తను కూడా జారగలిగితే బావుంటుందనే కోరిక వాడిలో రహస్యంగా ఉంది.

ఇప్పుడు పిల్లలంతా ఆ ఇసుక మైదానంలో 'యుద్ధం' చేయడానికి సన్నాహాలు చేస్తున్నారు. వాస్య ఇంతవరకు పిల్లలో కలిసి అటువంటి ఆటలు ఆడలేదు. కానీ యుద్ధం అంటే వాడికి సరదా పుట్టింది. పిల్లలు చాలాకాలంగా ఆ మైదానంలో యుద్ధ విన్యాసాలకు తహతహలాడుతున్నారు. ఈ సైన్యానికి కమాండర్ ఐదో తరగతి చదివే సెర్యోష. వాడి తండ్రి ఫ్యాక్టరీలో తనిఖీ అధికారి. పెద్ద కుటుంబాన్ని జాగ్రత్తగా నిర్వహిస్తూ ఎప్పుడూ సరదాగా కనిపించే పెద్దమనిషి ఆయన. విప్లవం సమయంలో, ఆ తరువాత యుద్ధంలో స్వయంగా పాల్గొన్న వ్యక్తి. ఆయనకు ప్రభుత్వం పతకాలు ఇచ్చి గౌరవించింది కూడా. అయితే ఆయన యుద్ధ వ్యూహాలు, పోరాట పద్ధతుల గురించి మాట్లాడతాడే కానీ, తను సాధించిన విజయాల గురించి ప్రస్తావించడు. మొత్తానికి సెర్యోష తన తండ్రి నుంచి యుద్ధ విన్యాసాల గురించి, నిజమైన పోరాటం గురించి కావలసిన జ్ఞానం సంపాదించాడు.

విషయం ఏమిటంటే, వీధి అవతల ఉన్న మూడంతస్తుల మేడలోని పిల్లలు ఇప్పటికే మైదానంలో సగభాగం, పెద్ద కొండ అవతలి వరకు ఆక్రమించారు. ఈ మధ్య వాళ్ళు ఆ కొండని కూడా సొంతం చేసుకొనే ప్రయత్నంలో పడ్డారు. ఈ క్రమంలో వాస్య వాళ్ళు ఉండే రెండంతస్తుల భవనంలోని పిల్లలకూ, ఆ పిల్లలకూ మధ్య తరచు పోరాటాలు జరిగేవి. ఈ మధ్యే వాళ్ళు ఏకంగా కమాండర్ సెర్యోష నేతృత్వంలోని దళాన్ని దెబ్బతీసి విజయగర్వంతో వెనక్కి తిరిగి వెళ్ళారు. నిన్న సాయంత్రమే సెర్యోష ప్రతీకారం తీర్చుకున్నాడు. కుచుగురి 'తూర్పు సరిహద్దు' ప్రాంతంలో సెర్యోష నాయకత్వంలోని బెటాలియన్ 'శత్రుసేనలను' ఓడించి, కొందరు సైనికులను ఖైదీలుగా పట్టుకొంది. యుద్ధ ఖైదీల వద్ద ఈ బెటాలియన్‌కు కొన్ని మ్యాప్‌లు లభించాయి. వాటిని బట్టి ప్రత్యర్థులు మైదానంలో మరింత ముందుకు చొచ్చుకువచ్చేందుకు రహస్య పథకం పన్నారని వీళ్ళకి అర్థమైంది. ఆ విషయాన్ని సెర్యోష ఇప్పుడు తన సైన్యానికి వివరిస్తున్నాడు. "ప్రత్యర్థులు మైదానం దాటి ముందుకు వచ్చేందుకు పథకం సిద్ధం చేస్తున్నారు. చివరకు మన ఇంటి భవనంపై కూడా వాళ్ల దృష్టి పడింది. వాళ్లు దీనికి నీలిరంగు కేంద్రం అని పేరు పెట్టారు. మనం చూస్తూ ఊరుకుంటే వాళ్లు దీన్ని కూడా స్వాధీనం చేసుకుంటారు" అని వివరించాడు.

వాస్యకు విషయం పూర్తిగా బోధపడకున్నా మొత్తానికి తమకు ఏదో అవమానం జరిగిందని తెలిసింది. పిల్లలంతా శత్రువులనుంచి సంపాదించిన మ్యాప్‌ను పరిశీలిస్తుంటే, వాడూ ఆ గుంపులో జొరబడి దాని వంక చూశాడు. జరిగిన అవమానానికి ప్రతీకారం చేయాలనే మిగిలిన పిల్లల ఆవేశం వాడినీ ఆవహించింది. వాడు అందరి మొహాల వంక పరిశీలనగా చూస్తున్నాడు. మిగిలిన విషయాలు తెలియకపోయినా, పిల్లల్లో ఆగ్రహం వాడికి తెలిసివస్తోంది. అలా అందరివంకా చూస్తుంటే ఆ పక్కన మీత్య మొహం కనిపించింది. క్షణంలో వాస్యలో ఆవేశం చల్లారింది. యుద్ధానికి దిగి తమ ఆవరణ పరువును కాపాడాలనే ఉత్సాహపు పొంగు తగ్గింది. వాడిని తన పెట్టె, దానికి సంబంధించిన ఇతర సమస్యలు గుర్తు వచ్చాయి. వాడు నెమ్మదిగా అటు పక్కకు నడిచి మీత్యను తట్టాడు. "మీత్య నిన్న నువ్వు నా పెట్టెను కొట్టేశావు?" అన్నాడు.

మీత్యకు భయం వేసింది. పారిపోదామని రెండు అడుగులు వెనక్కి వేశాడు. కానీ మొండిగా వాదనకు దిగాడు. "ఆఁ తీసుకున్నాను, అయితే ఏమిటి?" అని తల ఎగరేసి ప్రశ్నించాడు.

వాస్యకు ఈ ధోరణి అర్థం కాలేదు. మీత్య భయపడుతున్నాడని, వీలైతే పారిపోయేందుకు సిద్ధంగా ఉన్నాడని తెలిసిపోతోంది. కానీ వాడు వాదనకు దిగాడు!

"సర్లే. ఆ పెట్టెను తిరిగి ఇచ్చేయ్..." అన్నాడు.

మీత్య మొండిగా తల విదిలించి, "ఇచ్చేయాలా? భలే... ధైర్యం వచ్చిందన్నమాట. ఇచ్చేయాలేం?" అన్నాడు.

"అంటే నా దగ్గర దొంగతనం చేశావు. నేను అడిగితే ఇవ్వనంటావు అంతేగా?" అని అడిగాడు కోపంగా.

"అంతే" అన్నాడు మీత్య కచ్చితంగా.

ఆ తరువాత అసలేం జరిగిందనేది ఎవరికీ కచ్చితంగా తెలియదు. వాస్య కూడా వివరించలేక పోయాడు. ప్రత్యర్థులను తరిమికొట్టేందుకు అవసరమైన వ్యూహరచనపై సమాలోచనలు జరుపు తున్న సమర సన్నాహ బృందం సభ్యులకు ఏవో అరుపులు వినిపించి, చూసేసరికి మీత్య నేలపై బోర్లాపడి ఉన్నాడు. వాస్య వాడి వీపుపై కూర్చుని "ఇస్తావా ఇవ్వవా? చెప్పు..." అని అరుస్తున్నాడు.

బోర్లాపడి ఉన్న మీత్య మొహం నిండా ఇసుక అంటి ఉంది. వాడు ఎలాగైన వాస్యను కిందకి దొర్లించి బంధవిముక్తుడయ్యేందుకు పెనుగులాడుతున్నాడు. వాస్య మాత్రం వాడి మొహంలోకి చూస్తూ అదే ప్రశ్న పదేపదే అడుగుతున్నాడు. యుద్ధ సన్నాహాల బృందం సభ్యులు ఈ అంతర్యుద్ధాన్ని వినోదంగా చూసి నవ్వుతున్నారు. వారికి అంత వినోదం కలిగించినది వాస్య మొహం. వాడు మీత్యను నేలకేసి అదుముతూ, అదే ప్రశ్న వేస్తున్నప్పటికీ ఆ మొహంలో కోపం, ఆవేశం అన్నవి మచ్చుకి కూడా లేవు. మీత్య ఆ పెట్టెను తిరిగి ఇస్తాడా? ఇవ్వడా? తెలుసుకుందామనే ఆసక్తి తప్ప నిజానికి వాస్యకి ప్రత్యేకంగా కోపం ఏమీలేదు కూడా. ఈలోగా చుట్టూ చేరిన పిల్లలు పెద్దగా నవ్వడం వాస్య దృష్టికి వచ్చింది. సరిగ్గా అప్పుడే కమాండర్ సెర్యోష జోక్యం చేసుకున్నాడు. వచ్చి వాస్యను పైకి లేపి నిలబెట్టాడు. వాస్య నవ్వుతూ లేచి, "అరె! వాడిని కొడుతున్నావు. ఎంత కొట్టినా బదులుచెప్పడేంటి?" అని ప్రశ్నించాడు.

"అసలెందుకు వాడిని కొడుతున్నావు?"

"మీత్య నా పెట్టె తీసుకున్నాడు."

"ఏ పెట్టె?"

"పెద్ద పెట్టె... నాది... పెద్ద పెట్టె" అని చెప్పాడు వాస్య.

నెమ్మదిగా పైకి లేచిన మీత్య మొహంపై నుంచి ఇసుక దులుపుకుంటున్నాడు. సెర్యోష వాడి వైపు తిరిగి "ఆ పెట్టె ఏదో తిరిగి ఇచ్చేయచ్చుగా?" అని అడిగాడు.

"ఇచ్చేద్దును. కానీ నాన్న తీసుకున్నాడు" మీత్య సమస్యను వివరించాడు.

"కానీ ఆ పెట్టె నీది కాదు. వీడిది. అంతేగా" అంటూ వాస్య వంక వేలు చూపాడు సెర్యోష. దానికి మీత్య తలవూపాడు. సెర్యోష బలంగా, ఆరోగ్యంగా ఉండే చురుకైన కుర్రవాడు. వాడు పరిస్థితిని క్షణాల్లో సమీక్షించుకున్నాడు. "సరే. మీ నాన్న ఆ పెట్టెను తిరిగి ఇవ్వాల్సిందే. ఎందుకంటే

అది ఆయనదేం కాదు." అని వాస్య వంక తిరిగి "అంటే అది నీ పెట్టె అంటావు. నీ దగ్గరనుంచి మీత్య తీసుకున్నాడంటావ్ అంతేనా?" అని ప్రశ్నించాడు.

"తీసుకోవడం కాదు... నిన్న... నిన్న వాడు దాన్ని నా దగ్గరనుంచి దొంగిలించాడు" అని చెప్పాడు వాస్య. పిల్లలంతా గట్టిగా నవ్వారు. వారితో పాటు ల్యోవిక్ కూడా జత కలిపాడు. అప్పుడే వాస్య వాడిని చూశాడు. దాంతో వాస్య గట్టిగా అరిచి చెప్పాడు. "అదిగో ల్యోవిక్. జరిగినదంతా వాడికి తెలుసు?" మరుక్షణం ల్యోవిక్ మొహంపై నవ్వు మాయమైంది. "నాకేం తెలియదు. వాడు నీ దగ్గరనుంచి ఏం దొంగిలించాడో నాకు తెలియదు" అనేశాడు ముభావంగా.

అప్పుడు సెర్యోష నిజమైన కమాండర్‌లా వ్యవహరించాడు. "మీత్య నువ్వు వాడి దగ్గరనుంచి దాన్ని దొంగిలించావా?" అని గద్దించి అడిగాడు.

"దొంగిలించలేదు. తీసుకున్నానంతే."

"సరే. ఇక వాదవివాదాలు ఇంతటితో ముగిద్దాం" అని వాస్య వంక తిరిగి, 'నీ పేరేంటి?' అన్నాడు.

"వాస్య"

"సరే, వాస్య. జాగ్రత్త. మీత్యను అరెస్టు చేస్తున్నాను. వాడిని కనిపెట్టి ఉండు" అని ఆదేశించాడు.

వాస్యకు సంతోషంగా అనిపించింది. సెర్యోష ఆదేశాలు జారీచేసే తీరు, పిల్లలంతా వాడిని మన్నించడం వాస్యకు బాగా నచ్చింది. వాడు మీత్య వంక నవ్వుతూ చూశాడు. మీత్యకు ఇప్పుడు పారిపోయే ఉద్దేశం ఉన్నట్టులేదు. అరెస్టులో ఉన్నాడాయె. పైగా స్వయంగా కమాండర్ తనను అరెస్టులో ఉంచడం వాడికి కూడా నచ్చినట్టుంది. వాస్యలానే వాడు కూడా సెర్యోష ధీమాను చూసి ముచ్చటపడుతున్నాడు. మొత్తానికి ప్రత్యర్థులిద్దరూ మౌనంగా నిలబడి తిరిగి మొదలైన సమర సన్నాహ బృందం చర్చలను వింటున్నారు. ఈ చర్చల్లో మీత్య, వాస్యలతో సహ దాదాపు పదిమంది పాల్గొన్నారు. చిన్న పిల్లలమైనందువల్ల యుద్ధంలో తమకు పెద్ద బాధ్యతలు ఇవ్వరని తెలిసినా, ముందు ముందు యుద్ధాల్లో తమ పాత్రను ఎవరూ తక్కువ చేయరని, తమను ఎవరూ నిరోధించరని వారికి బోధపడింది. అయితే యుద్ధ సన్నాహ బృందం ఆలోచనలు వేరుగా ఉన్నాయి. ఉన్నట్టుండి సెర్యోష గొంతు పెద్దగా వినిపించింది. "శత్రువుల కదలికలు కనిపెట్టేందుకు మనం మన ప్రధాన బలగాలను వాడక్కర్లేదు. ఇవాళ్టి యుద్ధంలో విజేత అయిన వాస్యకు ఆ బాధ్యత ఇద్దాం" అన్నాడు.

"కానీ అది బాధ్యతాయుతమైన పని. కొంచెం పెద్దవాళ్లకి ఆ పని అప్పగిస్తే మంచిదేమో కమాండర్" అంటూ ఎవరో అభ్యంతరపెట్టారు.

"సరే. అయితే వాస్య ఆ బృందానికి రెండవ దళపతిగా ఉంటాడు. ఏమంటారు?" అని సెర్యోష తన సేనా నాయకులను ప్రశ్నించాడు.

పిల్లలందరూ వాస్య వంక పరిశీలనగా చూస్తున్నారు. తనకు అనుకోని రీతిలో ఒక కొత్త భవిష్యత్తుకు దారులు తెరుచుకుంటున్నాయని వాస్యకు అర్థమైంది. పైగా ప్రత్యర్థుల కదలికలు కనిపెట్టడం ఎంత బాధ్యతాయుతమైన పనో తండ్రి ఇదివరకు ఇకసారి వాడికి చెప్పాడు. అంత ముఖ్యమైన బాధ్యత తనపై పడిందనుకునే సరికి వాడికి సిగ్గు ముంచుకొచ్చింది. గర్వంగా

అనిపించింది. అయితే వాడు తన ఉత్సాహాన్ని, ఉద్రేకాన్ని ప్రదర్శించదలచలేదు. మరింత బిగుసుకుపోయి మీత్య వంక పరీక్షగా చూస్తూ నిలబడ్డాడు. మీత్య మాత్ర నిరసనగా నవ్వి "భలే గూఢచారి దొరికాడులే" అని వ్యాఖ్యానించాడు.

ఇది ఈర్ష్యతో చేసిన వ్యాఖ్య అని అర్థమవడంతో ఎవరూ సమాధానమివ్వలేదు. ఇంతలో సెర్యోష ముందుకు వచ్చి గూఢచారుల బృందంలోకి ఎనిమిది మంది సభ్యుల్ని ఎంపిక చేశాడు. మొదట ఎంపిక అయింది మీత్య.

తరువాత సెర్యోష గంభీరంగా ప్రసంగించాడు. "ఇకనుంచి మీరంతా స్కౌట్లు. అందరూ క్రమశిక్షణతో పనిచేయాలి. కోస్ట్యా మీ నాయకుడు. వాస్య రెండో నాయకుడు. అర్థమైందా?" అన్నాడు. అందరూ తలలూపారు. ఈ కొత్త దళం నాయకుడు కోస్ట్యా పదమూడేళ్ల కుర్రవాడు. చురుకుగా చలించే కళ్లతో ఉత్సాహంగా ఉంటాడు. వాడు రెండు చేతులు లాగూ జేబుల్లో ఉంచుకుని హుందాగా ఆదేశాలు జారీ చేశాడు.

"స్కౌట్లు అంటే యోధులు కూడా. మనలో ఎవరైనా ద్రోహులుగా మారినా, పిరికితనం ప్రదర్శించినా తక్షణం కాల్చిపారేయడమే శిక్ష" అన్నాడు. స్కౌట్ల దళం సభ్యులకు ఆనందం కలిగింది.

"రండి అందరూ సక్రమంగా నిలబడండి" కమాండర్ సెర్యోష ఆదేశించాడు.

వాస్యకు అనుమానం వచ్చింది. "కామ్రేడ్ కమాండర్, మరి ఈ ఖైదీ సంగతేమిటి? వదిలేద్దామా?" అని అడిగాడు.

"లేదు. ఆ కేసును దర్యాప్తు చేద్దాం" అంటూ సెర్యోష కదలబోయాడు. ఇంతలో ఆవరణకు గల పెద్ద తలుపు తెరుచుకుంది. 11-13 ఏళ్ల మధ్య వయస్సు గల పిల్లలు ముగ్గురు కొత్తపిల్లలు అక్కడ నిలబడి ఉన్నారు. వారిలో ఒకడు తెల్లజెండా కట్టిన ఒక కర్ర పట్టుకొన్నాడు. మరో కుర్రవాడి చేతిలో కొమ్ముబూర ఉంది. మూడో కుర్రవాడి తలపై ఉన్న పాత ఆర్మీ టోపీకి ఒక పక్షి ఈక తగిలించి ఉంది. వాళ్లని చూసి సెర్యోష బృందం బిగుసుకుపోయింది.

'ఆహాఁ రాయబారులు వచ్చారు' అన్నాడు సెర్యోష. వాడి గొంతులో ఉద్రేకం దాచినా దాగనిది.

"వాళ్లు లొంగిపోతున్నారా?" ఓ మూలనుంచీ ఎవరో ప్రశ్నించారు.

"అటెన్షన్ ఎవరూ మాట్లాడద్దు" అన్నాడు సెర్యోష.

ప్రత్యర్థులు అంత క్రమశిక్షణతో, అన్ని సన్నాహాలతో ఏకంగా తమ కోటలోకే రావడం ఈ పిల్లలకే కాక, కమాండర్‌కు కూడా కలవరం కలిగించింది. వచ్చిన రాయబారులు క్రమశిక్షణతో వరుసగా నిలిచారు. కొమ్ము బూర పట్టుకొన్న కుర్రవాడు దాన్ని నోట్లో ఉంచుకొని వారికి అర్థంకాని సంగీతం ఏదో వినిపించాడు. సెర్యోష ప్రత్యర్థుల ఆచారాలను, పద్ధతులను చూసి కొంచెం ఉడుక్కున్నప్పటికీ వెంటనే తేరుకుని ముందుకు వచ్చి వారికి సెల్యూట్ చేశాడు. నేను ఇక్కడ కమాండర్‌ని. సెర్యోషని అని పరిచయం చేసుకున్నాడు. "మీరు వస్తున్నట్టు సమాచారం లేదు. అందుకే గౌరవ వందనం ఏర్పాటు చేయలేకపోయాం" అని వివరించాడు.

దీంతో ఇక్కడి సైనికులకు కొంత ధైర్యం వచ్చింది. తమ కమాండర్‌కు కొన్ని పద్ధతులు తెలుసు అన్న సంగతి వారి విశ్వాసాన్ని పెంచింది. ప్రత్యర్థుల నాయకుడు ముందుకు వచ్చి సెర్యోషకు అభివాదం చేశాడు.

"వ్యవధి లేనందున ముందుగా సమాచారం ఇవ్వలేదు. విషయం ఏమిటంటే మా ఎర్ర సైనికుల దళం మీ నీలి సైన్యంపై యుద్ధం చేయబోతోంది. అయితే యుద్ధానికి కొన్ని నియమ నిబంధనలు అవసరం. అవి ఏర్పాటు చేసుకొందాం. అదీకాక, మీరు మా మ్యాప్‌లను స్వాధీనం చేసుకొన్నారు. అది నియమ విరుద్ధం. వాటిని వెంటనే తిరిగి ఇవ్వాలి" అని ప్రకటించాడు.

"మేం నీలి సైన్యం కాదు. ఎర్ర సైనికులం" అంటూ గుంపులోంచి ఎవరో అరిచారు.

"నిశ్శబ్దం" అని హూంకరించాడు సెర్యోష. కానీ ఆ మాటని సమర్థించాడు. "అవును. మిమ్మల్ని మీరు ఎర్ర సైనికులని పిలిచేసుకుంటే కుదరదు. అది పద్ధతి కాదు" అన్నాడు.

"కానీ మొదట ఆ పేరు పెట్టుకొంది మేమే" అంటూ రాయబారి అభ్యంతరం తెలిపాడు.

"కాదు మేమే" అంటూ సెర్యోష సైన్యంలోంచి ఎవరో అరిచారు. సెర్యోష పరిస్థితిని గమనించాడు. నియమాలు ఏర్పడకముందే, ఇక్కడే, ఇప్పుడే యుద్ధం మొదలయ్యేలా ఉందని గుర్తించాడు. "ఎవరు అరుస్తోంది. ఆగండి. ఇప్పుడే ఆ నియమాలు ఖరారు చేసుకొందాం. మాట్లాడదాం" అని ప్రకటించాడు.

ఇరుపక్షాల మధ్య గంటసేపు చర్చలు జరిగిన తరువాత రెండు పక్షాలనూ ఎర్రసైనికులనే పిలవాలని నిర్ణయమైంది. కాకపోతే గుర్తుకోసం సెర్యోష పక్షాన్ని ఉత్తర సైన్యం అనీ, అవతలి వారిని దక్షిణ బలగాలనీ పిలవాలని అందరూ ఆమోదించారు. యుద్ధం ఉదయం పది గంటల నుంచి సాయంత్రం నాలుగు గంటల వరకూ జరపాలనీ, ఫ్యాక్టరీ మూసివేసే కూత వినిపించగానే నిలిపివేయాలని నిర్ణయించారు. తిండిపెట్టే మాట అయితేనే యుద్ధ ఖైదీలను సాయంత్రం ఖైదులో ఉంచాలనీ, లేకపోతే నాలుగు గంటలకే విడిచిపెట్టాలనీ అంగీకారం కుదిరింది. అదీకాక రెండు వైపులా సైనికుల సంఖ్య పరిమితంగానే ఉన్నందున ఖైదీల పాత్ర కోసం కొందరిని కేటాయించడం ఇరువర్గాలకూ కష్టమని అంతా గుర్తించారు. అవతలి సైనికులనుంచి స్వాధీనం చేసుకున్న మ్యాప్‌ను వీళ్లు తిరిగి ఇచ్చేశారు. మైదానంలోని పెద్ద కొండ శిఖరంపై ఏ పక్షం పతాకం వరుసగా మూడు రోజులపాటు నిలుస్తుందో ఆ పక్షం యుద్ధంలో విజయం సాధించినట్టు పరిగణించేందుకు అంతా ఒప్పుకున్నారు. రెండు పక్షాల జెండాలూ ఎర్ర రంగులో ఉండేవే అయినా, దక్షిణ బలగాలది ముదురు ఎరుపుపతాకంగా, ఉత్తర సేనలది కాస్త లేత రంగులోనూ ఉండేట్టు అంగీకారానికి వచ్చారు. దీంతో ప్రత్యర్థుల రాయబారులు ముగ్గురూ కవాతు చేసుకుంటూ నిష్క్రమించారు.

ఈ సంఘటన మన సైనికులను బాగా ఆందోళన పరిచింది. అవతలి పక్షం పూర్తి క్రమశిక్షణతో వ్యవహరించడం, వారి బలాన్ని పెంచుతుందని సెర్యోష గుర్తించాడు. వెంటనే కొందరు సైనికులను పిలిచి, ఇంటి ఆవరణలో తల్లి కొంగు పట్టుకు తిరిగే మిగిలిన పిల్లలని సైన్యంలోకి, ఆడపిల్లలను రెడ్‌క్రాస్ బృందాల్లోకి చేర్చుకునేందుకు వెంట పెట్టుకురమ్మని ఆదేశించాడు.

'తల్లి వెంట తిరిగే పిల్లలు' అనడంలోని వెక్కిరింతను వాస్య గుర్తించి విచారంగా తల పంకించాడు. అలా అమ్మ వెంట తిరగడం ఎంత బావుంటుంది? కానీ యుద్ధ సమయంలో అలాంటి బలహీనతలకు చోటివ్వరాదని వాడికి తెలుసు. వాళ్ల నాన్న చదివి వినిపించిన యుద్ధ కథలను బట్టి వాడికి ఆ సంగతి అర్థమైంది. మాట కచ్చితంగా తెలియకపోయినా బతుకులో అందంగా ఉండే రెండు విషయాల మధ్య ఘర్షణను, వైరుధ్యాన్ని వాడు గుర్తించాడు.

ఈలోగా ఒలెగ్ తన తల్లి వెంట ఆవరణలోకి వచ్చాడు. వాళ్ల అమ్మ ఈ యుద్ధ సన్నాహాలను పరిశీలించేందుకు వచ్చింది. ఒగెల్‌కు ఏడేళ్లు. వాడు ఫ్యాక్టరీలో వ్యూహరచన విభాగం అధిపతి కొడుకు. వాళ్ల నాన్నకి ఫ్యాక్టరీలో కీలక పదవి ఉంది. అయితే ఆయనకు, ఆయన అభిప్రాయాలకూ ఇంట్లోనూ అంతకుమించిన విలువ ఉండేది. ఇంటి వ్యవహారాల్లో ఆయన ప్రత్యక్షంగా జోక్యం చేసుకోనప్పటికీ అన్ని పరిణామాలకూ ఆయన ఆమోదం ఉండాలి. అన్ని పనులకూ ఆయన అనుమతి అవసరం. ఇంట్లో కూడా ఆయన గంభీరంగా పై అధికారిలా ఉంటాడు. పిల్లలతో కలిసేది తక్కువ. పిల్లల ముందు తన భార్యతోనూ మాట్లాడడు. ఫ్యాక్టరీ నుంచి రాగానే సరాసరి తన గదిలోకి వెళ్లి తలుపులు మూసుకుంటాడు. అది 'ఆయన' గది. వాళ్లింట్లో అన్నీ అలాగే ఉంటాయి. 'నాన్న కుర్చీ', 'నాన్న పెన్ను', 'నాన్న మంచం', 'నాన్న తలగడ'... ఇలా ఆయనకు అన్నీ ప్రత్యేకం. ఇంటి వ్యవహారాలను ఆయన భార్యే స్వయంగా నడుపుతుంది. కానీ ప్రతిక్షణం "ఇలా అయితే నాన్నకి నచ్చదు."

'దాన్ని నాన్న ఆమోదించరు.'

'నాన్నకు ఇష్టం ఉండదు.'

'నాన్న సరేనన్నారు.' అన్నీ వ్యాఖ్యానం జోడిస్తుంది.

ఆ 'నాన్న'కు నచ్చకపోవడమే ఇంట్లో అందరికీ పెద్ద కలవరం కలిగించే పరిణామం. ఇక ఆయనకు కోపం తెప్పించడం గురించి ఊహించే ధైర్యం కూడా ఎవరికీ ఉండదు. ఇంటి వరకూ వ్యవహారాలు ఇలా జరిగితే ఎరికీ అభ్యంతరం ఉండదు. అయితే మొత్తం ఆవరణలోని అన్ని ఇళ్ల సంగతులు తన ఇష్టానిష్టాలకు అనుగుణంగా సాగాలన్నది ఆయన అభీష్టం. ఆయన భార్య సైతం అందుకు తగినట్టు వ్యవహరిస్తుంది. ప్రస్తుతం ఇంట్లోంచి బయటకు, ఆవరణలోకి వచ్చింది ఆ పనిమీదే.

ఉత్తర సైనికులు ఎవరు? అందులో ఒలెగ్‌ను చేరవివ్వచ్చా లేదా? అన్నది తేల్చుకోవడం ఆమె తక్షణ కర్తవ్యం. వచ్చి విచారణ ప్రారంభించింది. సెర్యోషను ప్రశ్నలతో వేధించింది.

వాడు బింకంగా సమాధానాలు చెప్పాడు. "మేం దక్షిణాది బలగాలతో యుద్ధానికి సిద్ధమవుతున్నాం. మైదానంలో కొండను స్వాధీనం చేసుకోవడం ఇరుపక్షాల లక్ష్యం" అని చెప్పాడు.

'యుద్ధం అంటే ఏమిటి మీ ఉద్దేశం? అసలు ఈ సంగతి మీ అమ్మానాన్నలకు తెలుసా?' ప్రశ్నించింది సెమ్యోన్, ఒలెగ్ తల్లి పేరది.

సెర్యోష సహనంగా నవ్వాడు.

"ఎందుకు తెలియాలి? ఇదేం రహస్యం కాదు కూడా. ప్రతి ఆట గురించి అమ్మానాన్నల అనుమతి కోరడమే మా పనా?" అని ప్రశ్నించాడు.

"ప్రతి ఆట గురించీ అనడం లేదు. ఇది యుద్ధం. కేవలం ఆట కాదు" అందామె.

"అవును. యుద్ధమే. కానీ అదీ ఆటేగా."

"తేడా వుంది. యుద్ధంలో ఎవరికైనా దెబ్బలు తగిలితే ఎలా?" అడిగింది సెమ్యోన్.

"మా దగ్గర కత్తులు, తుపాకులు ఉన్నాయా?" అని ఎదురు అడిగాడు సెర్యోష.

"మరి ఆ చెక్క కత్తుల సంగతేమిటి? వాటితో దెబ్బలు తగలవా?" అంది సెమ్యోన్.

సెర్యోష మౌనం పాటించాడు. ఈవిడతో మాట్లాడుతూ పోతే పిల్లల్లో దెబ్బల భయం పెరిగి చివరికి యుద్ధమే రద్దయే ప్రమాదం కనిపించింది వాడికి. దీనంతటికీ కారణమైన ఒలెగ్ మీద కోపం వచ్చింది.

"ఒలెగ్‌కి దెబ్బలు తగులుతాయన్నదే మీ భయం అయితే వాడు యుద్ధంలోకి రానక్కర్లేదు. మేం వాడికి బాధ్యత వహించలేం. తీరా యుద్ధంలోకి దిగిన తరువాత వాడు మీ దగ్గరికి పరుగెత్తుకొచ్చి ఫిర్యాదులు చేయడం మొదలుపెడితే కష్టం కూడా. ఇక్కడ చిన్నపిల్లలు అనేక మంది ఉన్నారు. ఎవరూ భయపడడం లేదు. వాస్య నీకేమైన భయం వేస్తోందా?" అడిగాడు.

"లేదు" అని కచ్చితంగా చెప్పాడు వాస్య.

ఈలోగా గుంపులోంచి ఎవరో గట్టిగా చెప్పారు. "భయపడకు ఒలెగ్. మనకి రెడ్‌క్రాస్ బృందం ఉంది. యుద్ధంలో బాంబు పేలి నీ తలో, చెయ్యో ఎగిరిపోయిందనుకో, వాళ్లు వచ్చి కట్టు కడతారు" అని ధైర్యం చెప్పారు.

పిల్లలంతా గోలగోలగా నవ్వారు. ఒలెగ్‌కి కూడా ధైర్యం వచ్చింది. యుద్ధంలో నిజంగానే తలో, చెయ్యో ఎగిరిపోతే ఎంత అద్భుతంగా ఉంటుందో, పైగా దానికి ఒక కిట్టు కూడా ఉంటుంది!

ఈ గోల చూసి వాడి తల్లి గాభరా పడింది. "ఓరి భగవంతుడా" అంటూ విసవిసా నడుస్తూ ఇంటివైపు వెళ్లింది. ఒలెగ్ తల్లి వెంట నడిచాడు.

సెర్యోష తలతిప్పి వాస్యను అడిగాడు "నీ ఖైదీ ఏడీ?"

మీత్య ముందుకు వచ్చాడు.

"ఏమిటి? ఆ పెట్టెను వాస్యకు తిరిగి ఇస్తావా? ఇవ్వవా?" అన్నాడు సెర్యోష.

"నీకు మా నాన్న సంగతి తెలియదు. ఇవ్వడు" అని బదులిచ్చాడు మీత్య.

"సరే ఆయన్నే అడుగుదాం" అంటూ ముందుకు నడిచాడు సెర్యోష. వాడి వెంటే మీత్య, వాస్య కూడా.

మీత్య వాళ్ల ఇల్లు పరమ ఘోరంగా, మార్కెట్ కంటే అన్యాయంగా ఉంది. మెట్ల మీదే క్యాబేజి పులుసు మరకలు ఆహ్వానించాయి, మొదటి గది నిండా చిందరవందరగా సామాను ఉంది. ఆ మూల ఒక పెద్ద మనిషి కూర్చుని బూట్లు బాగు చేసుకుంటున్నాడు. ఆయన పేరు కందిబిన్. మీత్య తండ్రి. ఆయన నోట్లో చెప్పుల మేకులున్నాయి. వాటిని ఒక్కొక్కటి తీసి శ్రద్ధగా బూటు వెనక సుత్తితో కొడుతున్నాడు. పిల్లల్ని చూసి "ఏంటి సంగతి? ఇలా వచ్చారేం?" అని అడిగాడు. ఆయన ఎదురుగా బల్లపై నల్ల ప్లాస్టిక్ పెట్టె ఒకటి ఉంది. దాంట్లోనే వేర్వేరు అరల్లో రకరకాల మేకులున్నాయి. "ఆ పెట్టేనా?" రహస్యంగా అడిగాడు సెర్యోష.

"అవును అదే" అని వాస్య గుసగుసగా చెప్పాడు.

"ఏంటి రహస్యాలు?" అని ప్రశ్నించాడు మీత్య తండ్రి.

"వాళ్లు ఆ పెట్టె కోసం వచ్చారు" అని మీత్య బదులిచ్చాడు.

'పెట్టె కోసమా? లాభం లేదు. అది కావాలంటే వాళ్లు నన్ను అడగాల్సిందే' అని తేల్చేశాడాయన.

సెర్యోష తిన్నగా పెద్దాయనతోనే సంభాషణ ప్రారంభించాడు "అది వాస్య పెట్టె. దాన్ని మీ మీత్య తీసుకొన్నాడు.... కాదు దొంగిలించాడు" అని చెప్పాడు.

ఆయన మీత్య వంక తిరిగి "ఏం దొంగతనం చేశావా?" అని అడిగాడు.

"కాదు, దొంగతనం కాదు. వీళ్లు అనవసరంగా దొంగతనం అనే మాట వాడుతున్నారు. నేను దాన్ని తీసుకున్నానంతే" అని మీత్య సమర్థించుకున్నాడు. వాస్య వాడి వంక ఆశ్చర్యంతో చూశాడు. అంత ఆవేదనతో నిండిన గొంతుతో, ఇలా పచ్చి అబద్ధాలు చెప్పడం వాడు ఎప్పుడూ చూడలేదు.

మీత్య నాన్న సెర్యోషతో అన్నాడు "చూడండి మిత్రమా. ఇలా ఇళ్ల మీదకి వచ్చి, అందరినీ దొంగ అంటే కుదరదు" అని కచ్చితంగా చెప్పాడు.

"సరే మీత్య దొంగతనం చేయలేదు. ఆ మాట అన్నది నేను. కానీ ఆ పెట్టె వాస్యది. దాన్ని వాడికి ఇవ్వడమే న్యాయం" అని వాదించాడు సెర్యోష.

"ఎవరికి వాడికా? ఇవ్వను. మీరంతా ఇలా కాకుండా మర్యాదగా వచ్చి అడిగితే ఇచ్చేవాడి నేమో. ఇప్పుడు ఇవ్వను."

పిల్లలంతా చేసేదేం లేక తలుపు వైపు నడిచారు. ఆ ఇంటి బయట నిలబడిన వాస్య, సెర్యోషలకు అనేకమంది పిల్లలు పరుగెత్తుకుంటూ ఇటువైపు రావడం కనిపించింది.

"సెర్యోష... చూడు... వాళ్లు, శత్రువులు కొండని ఆక్రమించేశారు. జెండా ఎగరేశారు" అని రొప్పుకుంటూ ఆ వైపు చూపించాడు ఒక కుర్రవాడు.

నిజంగానే కొండని ప్రత్యర్థులు ఆక్రమించేశారు. దానిపై వారి ఎర్రజెండా ఎగురుతోంది. ఎండలో దూరంనుంచి అది నల్లజెండాలా కనిపిస్తోంది. సెర్యోష నీరసంగా మెట్లపై కూలబడ్డాడు.

పిల్లలు కొండవంక కోపంగా చూస్తూ సెర్యోషని నిలదీశారు. "శత్రువులు అలా దాన్ని ఆక్రమించుకుంటే మనం ఇలా చూస్తూ నిలబడాల్సిందేనా?" అని ప్రశ్నించారు. సెర్యోషకీ కోపం వచ్చింది. అందర్నీ ఆగమన్నట్టు చెయ్యి పైకెత్తాడు.

"ఎందుకట్లా అరుస్తారు? క్రమశిక్షణ ఏమైంది? యుద్ధానికి ఎలా వెళ్తాం. కనీసం పతాకం లేకుండా దాడి ఎలా ప్రారంభిస్తాం? ముందుగా శత్రువుల కదలికలు తెలుసుకోవద్దా? సరే. మా అమ్మ జెండా తయారుచేసి ఇస్తానంది. రేపు గూఢచార దళం మధ్యాహ్నం పన్నెండు గంటలకు మైదానంలోకి వెళ్లి శత్రువుల ఆచూకి కనిపెట్టాలి. ఏడీ ఆ దళం నాయకుడు కోస్ట్యా ఎక్కడ?" అని ప్రశ్నించాడు.

ఒక పిల్లవాడు చెప్పాడు. 'వాళ్లు మమ్మల్ని ఇంట్లోకి రానివ్వడం లేదు. అన్నం తింటున్నాడట.'

"మరి వాడి సహాయకుడు ఎక్కడ?" అడిగాడు కమాండర్.

వాస్య ముందుకు వచ్చాడు. గూఢచార దళంలో చేరి మైదానంలోకి వెళ్లడానికి అమ్మ నాన్న అనుమతి ఇస్తారో లేదో అనే అనుమానం వాడిని పీడిస్తోంది.

ఇంతలో కమాండర్ ఆదేశాలు వినిపించాయి. "రేపు మీ దళం మైదానంలోకి వెళ్లి శత్రువుల కదలికలు కనిపెట్టాలి" అని చెప్పాడు. వాస్య తల ఊపాడు. వాడు తన దళం వంక చూసుకున్నాడు. ఒక మీత్య తప్ప అందరూ ఉన్నారు.

ఇంతలో పైనుంచి మీత్య గొంతు వినిపించింది. "నాన్నా ఇంకెప్పుడు చెయ్యను. కొట్టద్దు నాన్న... దయచేసి కొట్టద్దు నాన్నా" అని ఏడుస్తున్నాడు.

"దొంగతనమా? మళ్లీ ఎప్పుడన్నా చేస్తావా?" అని వాళ్ల నాన్న అరుస్తున్నాడు.

ఉత్తర బలగాల్లో నిశ్శబ్దం అలముకొంది. చాలామంది పిల్లల మొహాలు పాలిపోయాయి. తమ యోధుల్లో ఒకరు కొద్దిదూరంలో చిత్రహింసల పాలవుతుంటే ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో వాళ్లు ఉన్నారు.

మళ్లీ మీత్య గొంతు హృదయవిదారకంగా వినిపించింది. వాళ్ల ఇంటి తలుపు తెరుచుకుంది. వాడు దొర్లుకుంటూ మెట్ల మీదుగా కిందకి జారాడు. వచ్చి సెర్యోష కాళ్ల ముందు పడ్డాడు. ఇంటి తలుపు గుమ్మం వద్ద వాడి నాన్న నిలిచి ఉన్నాడు. ఉగ్రంగా కనిపిస్తున్నాడు. చేతిలో బెల్టు ఉంది. రెండు క్షణాలు పై నుంచి కొడుకు వంక చూసి లోపలికి వెళ్లిపోయాడాయన. సెర్యోష మెల్లగా మీత్యను సమీపించాడు. "మరీ పట్టించుకోకు. ఇది నీ సొంత విషాదం. కానీ అక్కడ చూడు. ప్రత్యర్థులు మన కొండను ఆక్రమించారు. జెండా కూడ ఎగరేశారు" అని చెప్పాడు.

మీత్య నీళ్లు నిండిన కళ్లతో అటు చూశాడు. "నువ్వు దెబ్బలు తింటూండగా, ప్రత్యర్థులు కొండని స్వాధీనం చేసుకున్నారు" అని వివరించాడు సెర్యోష.

★ ★ ★

రాత్రి తండ్రి వాస్యతో మాట్లాడాడు.

"యుద్ధానికి ముందు గూఢచార దళంలో పనిచేయడం మంచి పనే. కాని మీత్య విషయమే బాధగా వుంది. నువ్వూ కొట్టావు. వాడి నాన్న కూడా కొట్టాడు" అన్నాడాయన.

"నేను కొట్టలేదు నాన్నా, ఊరికే తోశానంతే. పెట్టె ఇచ్చేయమంటే వాడు వినలేదు మరి."

"సరే వదిలేయ్. చిన్న పెట్టె కోసం ఇంత రాద్ధాంతం అనవసరం. మీత్యని ఇంటికి పిలు, స్నేహం కలుపుకో. వాడు కూడా గూఢచార దళం సభ్యుడేగా."

"అవును కానీ, ఆ పెట్టె సంగతి ఏంటి?"

"మీత్య తండ్రి ఆ పెట్టె ఇవ్వడు. పైగా పిల్లవాడిని కొడతాడు. ఛ అదేం మనిషో. అయితే వాళ్ల ఇల్లు ఎలా ఉందంటావ్?" ప్రశ్నించాడు నాన్న.

"పరమ మురికిగా ఉంది."

ఇంతలో తల్లి జోక్యం చేసుకుని, "స్కౌట్‌గా పనిచెయ్యి. కానీ యుద్ధఖైదీగా మాత్రం దొరకవద్దు" అని సలహా చెప్పింది.

★ ★ ★

మర్నాటి ఉదయం వాస్య లేచేసరికి తండ్రి ఫ్యాక్టరీకి తయారవుతున్నాడు. పిల్లవాడిని చూసి నవ్వి, "ఏం గూఢచారివిరా బాబూ, ఇంతసేపు నిద్ర ఏమిటి?" అన్నాడు.

తండ్రి ఫ్యాక్టరీకి వెళ్లిపోయాడు. అంటే ఏడుగంటలైనట్టు. వాస్యకు గాభరాగా అనిపించింది. బేసిన్ వద్దకు వెళ్లి హడావుడిగా మొహంపై నీళ్లు చల్లుకుంటున్నాడు. తల్లి వాడి కంగారును గమనించింది. "ముందు పళ్లు తోముకో".

"తర్వాత తోముతాను అమ్మా."

"అదేం కుదరదు. అయినా ఎక్కడకు హడావుడి. ముందు కాస్త ఏమైనా తినాలి" అంది.

"అమ్మా ఒక్కసారి వెళ్లి వచ్చేస్తానమ్మా" బతిమాలాడు వాస్య.

"చూసేందుకే అయితే కిటికీలోంచి చూడు చాలు."

నిజంగానే కిటికీలోంచి కొండ, దానిపై ప్రత్యర్థుల జెండా స్పష్టంగా కనిపిస్తున్నాయి.

పరిసరాల్లో ఒక్కరూ లేరు. ఉత్తరాది సైన్యం కూడా ఇంకా నిద్ర లేచినట్టు లేదు. ఎంత యుద్ధం అయినా రోజువారీ పనులు ఆపకూడదని వాస్యకి అర్థమైంది. బుద్ధిగా భోజనాల బల్ల వద్ద కూర్చుని కాస్త రొట్టి, పులుసు తిని కాఫీ తాగాడు. గూఢచార దళంలో పని చేయడం అంటే వాడికి స్పష్టంగా తెలియదు. దాని గురించి ఆలోచిస్తున్నాడు. పొరపాటున శత్రువులకు దొరికిపోయినా మన రహస్యాలు మాత్రం చెప్పకూడదని వాడికి తెలుసు. "ఎంత చిత్రవధ చేసినా నేను చెప్పేది లేదు" అంటాడు తను. అవును అలాగే అనాలి. నాన్న చదివే కథల్లో నాయకుడు అలాగే అంటాడు. ఇంతలో తల్లి వాడి ఆలోచనలకు అడ్డు వచ్చింది. ఇంకొంచెం తిను అంది.

"అది కాదమ్మా. వాళ్లు నన్ను ఖైదీగా పట్టుకొన్నారనుకో. మన సైన్యం ఎక్కడుంది? అని అడిగితే ఏంచేయాలి? చెప్పడం తప్పు. కానీ చెప్పకపోయినా మనం ఎక్కడున్నదీ వాళ్లకి తెలుసు. మరేం చేయాలి?" అని ప్రశ్నించాడు.

"వాళ్లకి తెలిసిపోతే ఆ ప్రశ్న అడగరు. మిగిలిన వివరాలు అడుగుతారు. మీ సైన్యంలో ఎంత మంది ఉన్నారు? ఎంతమంది గూఢచారులు? తుపాకులెన్ని ఉన్నాయి? లాంటివి" అని తల్లి వివరించింది.

వాడికి నవ్వొచ్చింది. "మా దగ్గర తుపాకులేం ఉన్నాయి. కత్తులున్నాయి. వాటి గురించి అడుగుతారా?"

"అడగవచ్చు. అయినా నువ్వు పట్టుబడితే కదా! దొరికిపోతావా?" ప్రశ్నించింది తల్లి. "లేదు పరుగెడతాను" అని ఉత్సాహంగా చెప్పాడు.

★ ★ ★

వాస్య కిందకి వచ్చేసరికి సైన్యమంతా సిద్ధంగా ఉంది. వారి మధ్యలో ఎర్రజెండా నిలిచి ఉంది. సెర్యోష, కోసాల్య, ల్యోవిక్ వంటి పెద్దలు దాడి ఎలా జరపాలనే ముఖ్యమైన విషయం చర్చిస్తున్నారు. మీత్య పక్కన దుంగలపై కూర్చుని ఉన్నాడు. వాడితో జత కలువు అన్న తండ్రి సూచన గుర్తు వచ్చింది. వాస్య వెళ్లి మీత్య పక్కన కూర్చున్నాడు. మీత్య మొహం మురికిగా ఉంది. వాడి తల నిజంగానే పిచ్చికగూడులా ఉంది. మొహంలో విచారం కదలాడుతోంది.

"మీత్య. దెబ్బలాడుకోవద్దు. కలిసిపోదాం" అన్నాడు వాస్య.

"సరే"

"మనం కలిసి ఉందాం. కలిసి ఆడుకుందాం. కలిసే యుద్ధానికి వెళదాం. సరేనా?"

తల వూపాడు మీత్య.

"నిన్న మీ నాన్న బాగా కొట్టాడా?" అడిగాడు వాస్య.

మీత్య కొద్దిగా నవ్వాడు. "లేదు. ఆయన బెల్టు జాడిస్తాడు. మనం అది తగలకుండా తప్పించుకుంటూ గావుకేకలు పెట్టాలి. అది నాకు వచ్చు" అని చెప్పాడు. "అవునూ మీ అమ్మ నిన్ను కొట్టిందా?" అనుమానం వచ్చింది వాడికి.

"మా అమ్మా? ఎందుకు కొడుతుంది?"

ఇంతలో కోస్ట్యా వచ్చి మొత్తం గూఢచార దళాన్ని లెక్కపెట్టాడు. పిల్లలకు ఓపికగా దాడి వ్యూహాన్ని వివరించాడు.

"మనం ఇలా నడిచి కొండవైపు వెళ్దాం. బహుశా దక్షిణాది సైన్యం అక్కడే ఉంటుంది. మనం వారికి ఎదురుపడదాం. సెర్యోష వేరే బలగాలతో చుట్టూ తిరిగి వారి వెనక చేరి దాడి సాగిస్తాడు. వాళ్లు ప్రత్యర్థులకు కనిపించరు. దక్షిణాది బలగాలు ఎదురుపడిన మనను చూసి మొత్తం సైన్యం ఇదే అనుకుంటారు. ఈలోగా మన వాళ్లు వెనకనుంచి దాడి ప్రారంభిస్తారు."

స్కౌట్లకు ఈ వ్యూహం బోధపడింది.

"కానీ, వాళ్లు మనల్ని చూస్తారుగా? ఎలాగ?" అని ఒక పిల్లవాడు అనుమానించాడు.

"చూడనీ, మనం మరీ ఎదురుపడిపోం. కాస్త కనిపిస్తాం. పొదల వెనక నక్కినక్కి ముందుకు కదులుతాం" వివరించాడు కోసల్య.

మీత్యకు ఈ వ్యూహంపై నమ్మకం కలుగలేదు. "వాళ్లు క్షణంలో మన పథకాన్ని గ్రహిస్తారు. మరీ అంత చవటలు కారు" అన్నాడు.

కోస్ట్యా పట్టించుకోలేదు. గూఢచార దళాన్ని రెండుగా విభజించాడు. ఒక బృందాన్ని వాస్యకు అప్పగించాడు. మరో బృందానికి తానే మార్గదర్శి. కానీ, వాస్య తన ఆదేశాలు ఇవ్వగానే వాడి దళంలో వ్యతిరేక గళం వినిపించింది.

"గూఢచారులం అంటే, రహస్యంగా నక్కి నక్కి ముందుకు సాగాలి. పొట్టలపై పాకుతూ ముందుకు సాగాలి" అని ఒక కుర్రవాడు తన జ్ఞానాన్ని ప్రదర్శించాడు.

నిజానికి వాస్యకు ఇదే తొలి యుద్ధ అనుభవం. సైనిక పరిజ్ఞానం స్వల్పం. కానీ దళంలో వ్యతిరేకతను అణిచివేయాలని వాడు నిర్ణయించుకున్నాడు. "మనం ఇప్పుడు గూఢచారులం కాదు. దాడిలో పాల్గోబోతున్నాం. అందువల్ల దాక్కోనవసరం లేదు" అని స్పష్టంగా చెప్పాడు,

"అలా అని వాస్య ఇష్టం వచ్చినట్టు ఆదేశాలు జారీచేస్తే కుదరదు" అంటూ మరో పిల్లవాడు అభ్యంతరం తెలిపాడు. అనుకోని రీతిలో వాస్యకు మద్దతు లభించింది. అది మీత్య, వాడు పెద్దగా అరిచి చెప్పాడు. "వాస్య మన నాయకుడు. ఆయన ఆదేశాలను అందరు మన్నించాల్సిందే."

పిల్లలంతా ఒకరి వెనుక నిలిచి వాస్య నేతృత్వంలో ముందుకు కదిలారు. వాస్య సగర్వంగా తల ఎత్తి తన దళాన్ని ప్రధాన బలగాల పక్కగా నడిపిస్తూ ముందుకు బయలుదేరాడు. ఈ కవాతును పరిశీలిస్తున్న కమాండర్ సెర్యోష తృప్తిగా తల పంకించి "అదీ అలాగ నడవాలి, బావుంది" అన్నాడు.

వాస్య తన దళంతో మైదానంలో ప్రవేశించి కొండకి ఇవతల ఒక పొద వెనక ఆ బృందాన్ని సమీకరించాడు. కుడివైపుగా మరోపొద వెనక కోస్ట్యా బృందం నక్కింది. అందరూ కొండ శిఖరం వైపు చూశారు. శత్రు పక్షం పతాకం రెపరెపలాడుతోంది. అక్కడ ఒక సైనికుడు వీళ్ల వైపు వీపు పెట్టి అటువైపు చూస్తూ నుంచుని ఉన్నాడు.

"అడుగో వాళ్ల సెంట్రీ. పతాకానికి కాపలా కాస్తున్నాడు. వాడి దగ్గరే దుర్భిణీ ఉంటే మనల్ని కనిపెట్టేసేవాడు" అన్నాడు వాస్య బృందంలోని ఒక సైనికుడు.

వాస్య తనకి ఈ ఆలోచన రానందుకు తిట్టుకున్నాడు. నాన్నని అడిగి దుర్భిణీ తేవలసింది. ఎంత గొప్పగా ఉండేది అందరిముందూ! అందరూ తన సైనిక పరిజ్ఞానాన్ని ఎంత మెచ్చుకొనేవారు అనుకొని బాధపడ్డాడు.

ఇంతలో కొండ మధ్యలో అవతలివైపు శత్రుసైన్యం కనిపించింది. దాన్ని గమనించేందుకు ఎటువంటి భూతద్దం అక్కర్లేదు. పెద్ద సంఖ్యలో ఉన్న ఆ బలగం బద్ధకంగా కదులుతూ, విలాసంగా కొండ శిఖరం చేరింది. ఉన్నట్టుండి ఆ పక్షంలోని కొందరు పైకి దూసుకెళ్లి అక్కడున్న సైనికుడిని బలవంతంగా కిందకి ఈడ్చుకెళుతున్నారు. ఆ సైనికుడు భయంతో పెద్దగా ఏడుపు ప్రారంభించాడు. ఏం జరుగుతోందో ఎవరికీ అర్థం కాలేదు.

"అదేంటి? వాళ్ల మనిషిని వాళ్లే అలా ఈడుస్తున్నారు?" అని ఎవరో అడిగారు.

"బహుశా ద్రోహి అయి ఉంటాడు" అని మరెవరో బదులిచ్చారు.

ఈ వ్యవహారాన్ని పరీక్షగా చూస్తున్న మీత్య మాత్రం గట్టిగా నవ్వాడు. "ఆహాఁ వాడు వాళ్ల సైనికుడు కాదు. మన ఒలెగ్" అని తేల్చి చెప్పాడు.

అందరూ నివ్వెరపోయారు. యుద్ధానికి రానన్నవాడు, శత్రువుల అధీనంలోని ప్రాంతానికి ఎందుకు వెళ్ళినట్టు? ఎవరికీ అర్థం కాలేదు. మొత్తానికి దక్షిణాది సైన్యం ఒలెగ్‌ని ఖైదీగా పట్టుకుంది. వాడు బిత్తరపోయి ఏడుపు లంకించుకున్నాడు.

ఈలోగా కోస్త్య దళం పొదలమాటు నుంచి బయటకు వచ్చి కొండ దిశగా ముందుకు కదిలింది. వాస్య కంగారుగా తన బలగానికి ఆదేశాలు ఇచ్చాడు 'పదండి, ముందుకు కదలండి' అంటూ. ఇంతలో విచిత్రంగా దక్షిణాది సైన్యం వేగంగా వెనక్కు మళ్లింది. ఎందుకో ఎవరికీ తెలియలేదు. క్రమంగా వారంతా అదృశ్యమయ్యారు.

ఇంతలో వాస్య బృందానికి ఒక కుర్రవాడు పరుగు పరుగున వచ్చి ఎదురుపడ్డాడు. "నేను వార్తాహరుడిని. కోస్త్య మిమ్మల్నీ కూడా త్వరగా ముందుకు రమ్మన్నాడు" అని చెప్పాడు. "మనం వెళ్లి ఆ పతాకాన్ని స్వాధీనం చేసుకోవాలి" అని వివరించాడు.

"సరే" అంటూ మీత్య పర్వత శిఖరంవైపు పరుగు పెట్టబోయాడు. వాస్య వాడిని అనుసరించాడు. కొండపై ఇసుక తిన్నెలు అప్పటికే ప్రత్యర్థుల కవాతుతో దుమ్ము రేగి ఉండడంతో వారికి నడవడమే అసాధ్యంగా మారింది. వాస్య వెంట అతని బృందంలోని మిగిలిన సభ్యులు పరుగులు తీసే ప్రయత్నం చేస్తున్నారు. కానీ దాదాపుగా అందరూ చేస్తున్నది పాకడమే. ఇసుక వారి తలలపైకి జారిపడుతోంది. మొత్తానికి మీత్య, వాస్యలు ప్రత్యర్థుల జెండా ఎగురుతున్న చోటికి చేరుకోగలిగారు. అక్కడ కాపలా ఉన్న ప్రత్యర్థి సెంట్రీ వాళ్లని చూసి భయపడి గంతులు మొదలుపెట్టాడు. "త్వరగా, తొందరగా..." అంటూ కోస్త్య మరో వైపు నుంచి పైకి చేరుకున్నాడు.

అక్కడ కాపలా కాస్తున్న సైనికుడికి వాస్య వయస్సు ఉంటుంది. అయితే కొంచెం బలహీనంగా ఉన్నాడు. సమీపిస్తున్న శత్రువులను చూసి వాడు కంగారు పడ్డాడు. తన పతాకాన్ని ఊడబెరికి దాంతో సహా అక్కడి నుంచి పారిపోయేందుకు వాడు జెండా కర్రను పట్టుకొని గుంజడం ప్రారంభించాడు. కానీ అది చాలా పెద్ద జెండా. బరువుకి పక్కకు వొరిగి పైకి పాకుతున్న వాస్యతలపై పడింది. వాస్య దాన్ని చేజిక్కించుకున్నాడు. ఈలోగా వాడి బృందం అంతా అక్కడకు చేరింది. మరుక్షణంలో వాళ్లు తమకు కొంత దిగువుగా కొండపైకి వస్తున్న శత్రువుల బెటాలియన్

చూశారు. వారికి విషయం అర్థమైంది. శత్రు సైనికులు వెనక్కిమళ్ళీ వెనక నుంచి దాడి చేస్తారు. సెర్యోష బలగాలను తరిమికొట్టి తిరిగి వస్తున్నారు. వాళ్ల చేతుల్లో ఉన్న తమ పక్షం పతాకం చూడగానే ఓడిపోయామని వారికి అర్థం అయింది. వాస్య, మీత్యలను భయం అవహించింది. ఏం చేయాలో తేల్చుకొనేలోగా శత్రు బలగాలు ఈ బృందాన్ని చుట్టుముట్టాయి. ల్యోవిక్, వాస్య, మీత్యలతోపాటు ఒలెగ్ కూడా వాళ్లకి బందీగా దొరికాడు. శత్రు సైనికులు ఆనందంతో కేరింతలు కొడుతున్నారు. వారి మాటలను బట్టి తమ దాడి పథకం వారికి ముందే తెలిసిపోయిందని, ఒలెగ్ ద్రోహిగా మారి తమ వ్యూహాన్ని తెలియచెప్పాడని అర్థమైంది.

మొన్న రాయబారిగా వచ్చినవాడే శత్రుపక్షం కమాండర్ అని వారికి తెలిసింది. వాడు పెద్దగా గొంతు ఎత్తి "ఖైదీలంతా ఇక్కడ కూర్చోవాలి" అని ఆదేశించాడు. ఆ మాట విని, ఆ ఆదేశాలను పాటిస్తున్నట్టు నటిస్తూ ల్యోవిక్ పక్కకు నడుస్తూ హటాత్తుగా పరుగు ప్రారంభించి, కొండవాలు వైపు వేగంగా జారిపోయాడు. ఎవరూ వాడిని వెంటాడలేదు. అంతా కళ్ల ఎదుటే జరుగుతున్న వాస్యకు మాత్రం అది కలలా తోస్తోంది. తాము ఇంత తేలికగా పరాజయం పాలవుతామని వాడు ఊహించలేదు. పైగా యుద్ధ ఖైదీలుగా దొరికిపోయాం కూడా. వాళ్లు పెట్టే హింసలను తట్టుకుని నిలబడాలి అనుకున్నాడు విచారంగా.

ల్యోవిక్ పారిపోవడంతో మిగిలిన యుద్ధఖైదీలను తాళ్లతో బంధిద్దామని శత్రుదళాల సభ్యులు తమ కమాండర్‌కు సూచించారు. ఒలెగ్‌ను వదిలేయమని, మిగిలిన ఇద్దరినీ - వాస్య, మీత్యలను కట్టేయమనీ ఆ కమాండర్ ఆదేశించాడు. ఉన్నట్టుండి ఒలెగ్ బాధతో అరిచాడు. మీత్య వంక కోపంగా చూస్తూ "ఎందుకు గిచ్చావ్" అని అడిగాడు.

శత్రు సైనికులు ఘొల్లున నవ్వారు. ఆ కమాండర్ మాత్రం మీత్యను గద్దించాడు. "నువ్వు ఒక ఖైదీవి. మరొకరిన్ని శిక్షించే అధికారం నీకు లేదు" అన్నాడు. మీత్య నిర్లక్ష్యంగా నాలిక చప్పరించాడు. దాంతో కమాండర్‌కి కోపం వచ్చింది. "వీళ్లని కట్టిపడేయండి" అని తన సైనికులను ఆదేశించాడు. కానీ వాళ్ల దగ్గర తాడులేదు. ఒక సైనికుడికి బెల్టు ఉంది. కానీ, దాన్ని ఇస్తే అమ్మ తనని తంతుందని దాపరికం లేకుండా చెప్పేశాడు.

వాస్య మొహం బిగించి ఒలెగ్ వైపు ఉగ్రంగా చూశాడు. వాడి వల్లే ఉత్తరాది బలగాలు పరాజయం పాలయ్యాయి అనుకున్నాడు. ఈలోగా శత్రుసేనల గుంపులో చివరన ఉన్నవారు అరుపులు ప్రారంభించారు. "వస్తున్నారు, వాళ్లు మళ్లీ వస్తున్నారు" అని.

నిజంగానే సెర్యోష, కోస్త్యల నాయకత్వంలో ఉత్తరాది బలగాలు మళ్లీ సమీకృతమై దాడికి కొండపైకి ఎగబాకుతున్నాయి. క్షణంలో దక్షిణాది సేనలు ఎదురుదాడికి దిగాయి. యుద్ధ ఖైదీలు, వారితోపాటు ఒలెగ్ కూడా కొండపై మిగిలిపోయారు. ఇదే అదనుగా భావించి వాస్య, మీత్యలిద్దరూ కలిసి ఒలెగ్‌పైకి లంఘించారు. వాడు భయంతో అరుపులు అందుకున్నాడు. "నా దగ్గరికొస్తే మా నాన్నకి చెబుతా" అని బెదిరించబోయాడు. అయినా వాస్య, మీత్య వెనక్కి తగ్గకుండా వాణ్ణి కిందకు ఈడ్చుకుంటూ పారిపోయే ప్రయత్నంలో పడ్డారు. అటు పక్క దాడి మరోసారి ముగిసింది. దక్షిణదళాలు మరోసారి విజయం సాధించి వెనక్కి వచ్చాయి. ఆ కమాండర్ యుద్ధఖైదీలను చూసి, "సరే, ఇక మీరు ఇళ్లకు పొండి. నిబంధనల ప్రకారం ఇవాళ దాడుల్లో మీరు మళ్లీ పాల్గొకూడదు" అన్నాడు.

"రేపటి సంగతేమిటి?" వాస్యకు అనుమానం కలిగింది.

"రేపు కావాలంటే మళ్లీ యుద్ధరంగంలోకి రావడం మీ ఇష్టం" అని ప్రకటించాడు కమాండర్.

ఒలెగ్ భయంభయంగా వాస్య, మీత్యవంక చూశాడు. "నేను వాళ్లతో వెళ్లను" అన్నాడు. పరిస్థితిని గమనించిన శత్రు కమాండర్ ఒలెగ్‌ను వాళ్లతో పంపితే, దార్లోనే వాళ్లు వాడిని చితగ్గొట్టేస్తారని అర్థమైంది. "నువ్వు ఇక్కడే ఉండు. వాళ్లు వెళతారు" అన్నాడు ఒలెగ్‌తో.

ఇంతలో మళ్లీ కిందనుంచి కేకలు వినిపించాయి. శత్రువులు మళ్లీ వస్తున్నారని దక్షిణాది బలగాలకు అర్థమైంది. వారు మరోసారి రంగంలోకి దిగారు. దూరంగా కదిలారు. మళ్లీ కొండపై ఒలెగ్‌తో వాస్య, మీత్యలే మిగిలారు.

"నువ్వు వాళ్ల జెండా సంగతి చూడు. నేను ఒలెగ్ సంగతి చూస్తా" అన్నాడు మీత్య వాస్యతో. పరిస్థితి అర్థం చేసుకున్న ఒలెగ్ వేగంగా దొర్లుకుంటూ కిందకి జారిపోయాడు. చేసేది లేక వాస్య, మీత్యలు శత్రువుల జెండాను చేజిక్కించుకొని అతికష్టం మీద కిందకి చేరారు. అక్కడ కమాండర్ సెర్యోష నేతృత్వంలో ఉత్తర బలగాలు వారికి ఘనస్వాగతమిచ్చాయి. "సాహసవీరుడు వాస్యకు జై కొట్టండ"ని సెర్యోష బలగాలను ఆదేశించాడు.

"మీత్యకు కూడా" అన్నాడు వాస్య కంగారుగా.

'మన పరువు దక్కించి, ప్రతిష్టను కాపాడిన వాస్య, మీత్యలకు మనం కృతజ్ఞులమై ఉండాలి' అన్నాడు సెర్యోష. సైనికులు జయజయధ్వానాలు చేశారు.

"ఇప్పుడు మన సాహసవీరులు మన పతాకాన్ని కొండపై ప్రతిష్టిస్తారు" ప్రకటించాడు సెర్యోష. సైనికులు కేరింతలు కొట్టారు.

వాస్యకు అది అద్భుతమైన రోజు.

★ ★ ★

సైన్యం అంతా ఇంటికి తిరిగి వచ్చినప్పుడు, ఆవరణలోకి ప్రవేశించగానే వాస్య తన వెంట ఉన్న మీత్యతో చెప్పాడు. "నువ్వు మా ఇంటికి వస్తున్నావు. నాతో కలసి భోజనం చేస్తున్నావు"

మీత్య తటపటాయించాడు "వద్దులే" అన్నాడు. వాడి దురుసుతనం, తలపొగరు ఆ క్షణంలో ఏమైందో? బలవంతం మీద చివరకు మీత్య ఒప్పుకున్నాడు. ఇద్దరూ కలిసి మెట్లు ఎక్కుతున్నప్పుడు మీత్య ఆగి "ఒక్క నిముషం" అంటూ తన ఇంట్లోకి పరుగుతీశాడు. క్షణాల్లో తిరిగివచ్చాడు. వాడి చేతుల్లో 'ఆ పెట్టె' ఉంది. "తీస్కో" అన్నాడు వాస్యతో నవ్వుతూ.

వాస్య జంకాడు. "మీ నాన్న మళ్లీ తంతారేమో నిన్ను" అన్నాడు సందేహంగా. "నేను తీసినట్టు తెలిస్తేగా" అంటూ మీత్య మళ్లీ నవ్వాడు. ఇది వాస్యకు కొత్త సమస్య. దాన్ని నాన్నే పరిష్కరిస్తాడులే అనుకుంటూ పెట్టెని అందుకుని మీత్యతో కలసి ఇంటివైపు నడిచాడు.

అమ్మ వాళ్లకి ఎదురు వచ్చింది. "వచ్చావా? ఎవరూ నీ వెంట? అతిథా? అంటే మీత్యేగా.. రండి, చూడండి ఎలా ఉన్నారో లాంతర్లు తుడిచే వాళ్లలా ఎంత మురికిగా ఉన్నారు" అంటూ లోపలికి ఆహ్వానించింది.

"మేం యుద్ధం చేసి వచ్చాం" అన్నాడు వాస్య.

తల్లి అదేం పట్టించుకోకుండా "ఫెద్యా ఒకసారి ఇటురండి. వీళ్లని చూడండి ఎలా ఉన్నారో

మట్టి కొట్టుకొని" అని భర్తని పిలిచింది. వాస్య నాన్న పక్క గదిలోంచి బయటికి వచ్చి, వీళ్లని చూసి పెద్దగా నవ్వాడు. "భలే వీరజవాన్లు బురదకొట్టుకు వచ్చారు" అన్నాడు అపేక్షగా.

వాస్యకు రోషం వచ్చింది. "మేం యుద్ధం గెలిచాం. నేనూ, మీత్య ఇద్దరమే. శత్రువుల పతాకాన్ని.... అంటూ వివరించబోయాడు. నాన్న అదేం వినలేదు. "నేనేం వినను సైనికులైనా ముందు శుభ్రంగా స్నానం చేసి తరువాతే మాట్లాడాలి. అదేమిటి చేతిలో? ఆ పెట్టేనా?" అంటూ భార్య వంక తిరిగి "మరూస్యా, ముందు వీళ్లిద్దర్నీ స్నానాల తొట్టెలో ముంచై. వాళ్ల వొంటిని శుభ్రంగా తోము. ఇలా పిచ్చికాయితాలు ఏరుకునే వాళ్లతో నేను మాట్లాడను" అన్నాడు.

మీత్య భయంభయంగా చూస్తూ, నెమ్మదిగా తలుపు వైపు అడుగులు వేస్తున్నాడు. వాస్య తల్లి వాడిని దారిలోనే భుజం పట్టుకు ఆపింది. "భయపడద్దు. మామూలు స్నానమే చేద్దువుగాని, రా" అంటూ లోపలికి నడిపించింది. ఇద్దరినీ స్నానాల గదిలోకి తీసుకెళ్లింది. కొద్ది క్షణాల్లోనే బయటకు వచ్చి, భర్తతో అంది "నువ్వు మీత్య జుత్తు కత్తిరిస్తే బావుంటుంది. దాన్ని శుభ్రం చేయడం అసాధ్యం."

"అలా చేస్తే వాడి అమ్మానాన్న గోల చేస్తారేమో"

"చేస్తే, చెయ్యనీ, పిల్లవాడని కూడా చూడకుండా గొడ్డుని బాదినట్టు బాదారు. వాడి వంటి నిండా దెబ్బలే" అంది సానుభూతితో.

"సరే కానీ" అంటూ వాస్య నాన్న కత్తెర తీసుకుని స్నానాల గదిలోకి వెళ్లాడు. పావుగంట తరువాత పిల్లలిద్దరూ శుభ్రంగా, గులాబిరంగుకు తిరిగిన బుగ్గలతో, అలసిపోయి భోజనాల వద్ద కూర్చున్నారు. కానీ వాళ్లకి ఆకలి లేదు. ఇద్దరూ విజయోత్సాహంలో ఉన్నారు.

పిల్లలు చెబుతున్న యుద్ధసమాచారాన్ని ఆది నుంచీ తుదికంటూ శ్రద్ధగావిన్న వాస్య తండ్రి వారితో పాటు నవ్వుతూ, కేరింతలు కొడుతూ అవసరమైనచోట ఆశ్చర్యపోతూ, మరికొన్నిసార్లు భుజాలు తడుతూ, ఇంకోసారి సానుభూతి ప్రకటిస్తూ సైనికుల అనుభవాన్ని తానూ పంచుకున్నాడు.

వాళ్ల భోజనం పూర్తవుతుండగా సెర్యోష హడావుడిగా అక్కడికి వచ్చాడు. "త్వరగా రండి. శత్రుపక్షం మళ్లీ రాయబారులను పంపుతోంది" అని వాస్య, మీత్యలకు చెప్పాడు.

"రాయబారులా?" అన్నాడు వాస్య తండ్రి. "నేనూ వచ్చి జరిగేదేమిటో చూస్తాను" అని వారి వెంట నడిచాడు.

కింద అప్పటికే పెరటిలో పిల్లలంతా సిద్ధంగా ఉన్నారు. అందరూ రాయబారుల కోసం ఎదురుచూస్తున్నారు. ఇంతలో ఒలెగ్ తల్లి మెట్లు దిగి పిల్లలను సమీపించింది.

"మా ఒలెగ్ ఏడి? ఎక్కడ ఉన్నాడు?" అని ప్రశ్నించింది.

సెర్యోష సూటిగా సమాధానమివ్వలేదు. "మీరు వాడిని మాతో ఆడనివ్వలేదు.." అన్నాడు

"అవును, వాళ్ల నాన్నకి ఇలాంటి ఆటలు ఇష్టం లేదు."

"సరే, వాడు మాతో రాలేదు."

"పోనీ, ఎక్కడన్నా కనిపించాడా?"

"వాడు, అక్కడ తిరుగుతున్నాడు. వాళ్లు వాడిని ఖైదీగా పట్టుకున్నారు" ల్యోవిక్.

"ఎవరు వాడిని ఖైదీగా పట్టుకొన్నది?" ఒలెగ్ తల్లి ఆందోళనగా అడిగింది.

"వాళ్లే..... దక్షిణాదివాళ్లు"

"అంటే ఎక్కడ? వాడెక్కడ ఉన్నాడు?"

"వాడొక ద్రోహి. వాడు మా వ్యూహాన్ని శత్రువులకు చెప్పేశాడు. మేం గెలిచాం. దాంతో వాడు భయపడి ఇక్కడికి రాలేదు" వివరించాడు మీత్య.

ఒలెగ్ తల్లి మీత్య వంక కలవరంతో చూసింది. వాడి తల ఇప్పుడు క్షవరం చేసి, శుభ్రంగా ఉంది. వాడి కళ్లు సూటిగా, నిశ్చలంగా, సజీవంగా మెరుస్తున్నాయి. వాస్య తండ్రి జరుగుతున్న తతంగాన్ని శ్రద్ధగా గమనిస్తున్నాడు. కొద్దిసేపటి తరువాత మీత్య తండ్రి వచ్చి ఈ జనంతో చేరాడు. రావడంతోనే కొడుకు తల శుభ్రంగా ఉండటాన్ని గమనించాడు. తనకి చెప్పకుండా తన కొడుకుపై తన హక్కును ఇలా అతిక్రమించినది ఎవరని కోపం వచ్చింది. కానీ ఆ సంగతి తరువాత చూసుకోవచ్చని ఆగి, అక్కడ జరుగుతున్న గొడవని గమనించాడు.

ఒలెగ్ తల్లి ఇక పిల్లలతో లాభంలేదని తేల్చుకుని వాస్య తండ్రి దగ్గరికి వచ్చింది. తన గోడు చెప్పుకుంది. "కామ్రేడ్ నజరోవ్, నేనేం చేయాలో చెప్పండి. ఒలెగ్ కనిపించడం లేదు. నాకు భయమేస్తోంది. వాళ్ల నాన్న పావ్‌లోవిచ్‌కు తెలిస్తే కోపంచేస్తారు" అంది ప్రాధేయపూర్వకంగా.

"కంగారుపడకండి. శత్రుసైనికులు వాడిని ఖైదీగా పట్టుకున్నారు" అన్నాడు నవ్వుతూ.

"అలా అంటారేంటి? ఎంత ఘోరం. ఆటలపేరుతో యుద్ధాలు... వాళ్లు ఖైదీగా పట్టుకోవడం, దొరికిన వాళ్లని హింసించడం... ఇదంతా చాలా ఘోరం" అందామె.

"అదేంకాదు. వాడు ఆటలో పాల్గొనదలచినప్పుడు అడ్డుకోకూడదు. వాడిని ఆపడమే మీరు చేసిన తప్పు" అన్నాడు నజరోవ్.

"కానీ వాడి నాన్న పావోలోవిచ్‌కి అలాంటివి ఇష్టం ఉండదు. పైగా ఇటువంటి చెత్త ఆటలంటే ఇంకా కోపం తెచ్చుకొంటారు" అంది కలవరంగా.

"ఆ ఆటలో లోపం లేదు. మీ వైఖరిలోనే లోపం ఉంది. పిల్లవాడిని అలా అడ్డుకోవడం తప్పు."

"అంటే కామ్రేడ్ నజరోవ్, పిల్లలు కోరి సమస్యలు తెచ్చుకొంటుంటే మనం పెద్దవాళ్లం గుడ్డివాళ్లలా వ్యవహరించాలా?" కోపంగా ప్రశ్నించింది మీత్య తల్లి.

"అదేం అవసరం లేదు. కళ్లు మూసుకోనవసరం లేదు. పిల్లల్ని వాళ్ల బతుకేదో బతకనిస్తే మంచిది."

ఇంతలో గేటు తెరుచుకొని దక్షిణాది బలగాల ప్రతినిధులు ముగ్గురూ లోపలికి వచ్చారు. వాళ్లతో వీళ్లు చర్చలు ప్రారంభించారు. వాళ్ల డిమాండ్‌లు మరీ అన్యాయంగా ఉన్నాయి. "మా పతాకం మాకు ఇచ్చేయాలి. ఉత్తరాది వాళ్లు ఓడినట్టు ఒప్పుకోవాలి. ఎందుకంటే వాస్య, మీత్యలను వాళ్లు వదిలిపెట్టింది ఇంటికి వెళ్లిపోతామనే హామీ ఇవ్వబట్టేనట. దీనికి వాస్య, మీత్య అసలు అంగీకరించలేదు. తాము అటువంటి హామీ ఇవ్వలేదని వాళ్లు వాదించారు. దీంతో పిల్లలంతా గోలగోలగా అరిచారు. దక్షిణాది రాయబారులు ఎర్రబారిన మొహాలతో వెనక్కి మళ్లారు. తాము కావాలంటే అటువంటి పతాకాలు డజను సంపాదించగలమని, రేపు మధ్యాహ్నం యుద్ధానికి సిద్ధంగా ఉండాలనీ హెచ్చరించి వాళ్లు వెళ్లిపోయారు. ఇంతలో ఒలెగ్

తండ్రి పావ్‌లోవిచ్ భారీ శరీరం మెట్ల మీద ప్రత్యక్షమైంది. ఆయన ఉగ్రంగా ఉన్నాడు. కోపంగా, వేగంగా మెట్లు దిగాడాయన. "పిల్లలూ... ఆగండి... ఒక్క నిముషం" అంటూ పిల్లలని ఆపాడు.

గుంపులోంచి ఎవరో అడిగారు. "ఎవరు అరుస్తున్నది? ఎవరాయన?" అని అడిగారు.

మరెవరో సమాధానం చెప్పారు. "ఆయన ఒలెగ్ తండ్రి"

పావ్‌లోవిచ్ కిందకి వచ్చి "ఏమిటీ ఘోరం. ఇలా కొట్టడం, హింసించడం ఏమిటి? ఏమన్నా అర్థం ఉందా?" అని గట్టిగా అరిచాడు. గబగబా కిందకి వచ్చి "మీలో నజరోవ్ ఎవరు?" అని అడిగాడు ఎవరూ మాట్లాడలేదు.

"ఎవరు? నజరోవ్ ఎవరో చెప్పండి" అని నిలదీశాడు.

వాస్య భయంగా తండ్రి వంక చూశాడు. కానీ ఆయన ఇదంతా తనకు పట్టనట్టు, తనకు సంబంధం లేనట్టు ఏటో చూస్తున్నాడు. వాస్యకు సిగ్గు, భయం కలిగాయి. వణుకుతున్న గొంతుతో నజరోవ్, "నేనే నజరోవ్‌ని" అన్నాడు.

"ఆహాఁ నువ్వేనన్నమాట" పెడబొబ్బ పెట్టాడు పావోలోవిచ్. "అంటే మా వాడిని కొట్టింది, హింసించిందీ నువ్వన్నమాట. ఆ రెండోవాడేడి మీత్య?" అని అడిగాడు.

మీత్య తండ్రి వంక ఒకసారి చూసి, "ఎందుకలా అరుస్తారు? నేనే మీత్యను" అని ప్రకటించాడు. పావ్‌లోవిచ్ ముందుకు వచ్చి వాడి భుజం పట్టుకొని ఒక్కసారి బలంగా గుంజాడు. దాంతో మీత్య తూలి సెర్యోషపై పడ్డాడు. సెర్యోష వాడిని పడిపోకుండా ఆపి, తన వెనక్కి పంపి రక్షణగా నిలిచాడు.

దాంతో పావ్‌లోవిచ్ ఆగ్రహం రెట్టింపయ్యింది. "ఏడీవీడు? ఎందుకలా దాచేశావ్" అని సెర్యోషని అడిగాడు. మీత్య, వాస్యలిద్దరూ సెర్యోష వెనకదాగి దొంగచూపులు చూస్తున్నారు. ఆ దృశ్యం చూసి పిల్లలంతా ఘొల్లున నవ్వారు. దాంతో పావ్‌లోవిచ్ స్పృహలోకి వచ్చాడు. వీలైనంత త్వరగా తాను అక్కడి నుంచి నిష్క్రమిస్తే మంచిదని గుర్తించాడు. మరో నిముషం ఉంటే అలా పారిపోయేవాడేమో కూడా. కానీ ఇంతలో మీత్య తండ్రి ఆయన ఎదుటికి వచ్చి, "నా కొడుకుతో మీకేం పని?" అని గంభీరంగా ప్రశ్నించాడు. అతని వ్యవహారం చూస్తే భయంగా అక్కడ దొమ్మీ జరుగుతుందని అందరికీ అనిపించింది. పావ్‌లోవిచ్ బదులివ్వలేదు. "చెప్పండి. వాడితో మీకేం పని? వాడిని కొడదామని మీ ఉద్దేశమా? నేనే వాడి తండ్రిని" అన్నాడు.

"అంటే ఆ పిల్లవాడు మీ అబ్బాయా?" అయోమాయంగా అడిగాడు పావ్‌లోవిచ్.

చూడు మా నాన్న ఆయన్ను కొడతాడు అని మీత్య గట్టిగా అన్నాడు.

ఇంతలో వాస్య తండ్రి నజరోవ్ వేగంగా వాళ్లని సమీపించి పెద్ద గొంతుతో "ఇక్కడ ఏం జరుగుతోంది? ఆపండి ఈ వివాదం. రండి మనం పెద్దవాళ్లం అటువెళ్లి మాట్లాడుకుందాం" అన్నాడు. తండ్రి అంత కోపంగా ఉండటం, అంత గట్టిగా మాట్లాడడం వాస్య ఎన్నడూ చూడలేదు.

ఈ గొడవ నుంచి బయటపడి పరువు దక్కించుకొనేందుకు ఇదే మంచి అవకాశమని భావించాడు పావ్‌లోవిచ్.

"సరే రండి మా ఇంట్లో కూర్చొందాం" అంటూ నడిచాడు.

మీత్య నాన్న సంకోచంగా అటూఇటూ చూశాడు.

పదండి అన్నాడు నజరోవ్. ముగ్గురూ కలిసి పావ్‌లోవిచ్ ఇంటిలోకి వెళ్లారు.

పిల్లలంతా ఈ దృశ్యాన్ని మౌనంగా పరిశీలించారు. పిల్లల్లో ఎవరో కానీ, "భలే వాస్య నాన్న భలే చేశాడు" అని మెచ్చుకున్నాడు.

★ ★ ★

ఇంట్లో పావ్‌లోవిచ్ ధోరణి పూర్తిగా భిన్నంగా ఉంది. ఒక్క ఒలెగ్ కోసం ఆయన ఇన్నేళ్లు శ్రమించి సంపాదించిన గౌరవాన్ని పోగొట్టుకోదలచుకోలేదు. అందువల్ల ఆయన తనతోపాటు వచ్చిన ఇద్దరినీ అతిథులుగా గౌరవించదలచాడు. వారికి మర్యాదపూర్వకంగా కుర్చీలు చూపించి, తాను మాత్రం తన రాతిబల్ల వద్ద కూర్చున్నాడు.

"ఈ పిల్లలతో ఎవరైనా యాతన పడాల్సిందే" అని మాటలు ప్రారంభించబోయాడు.

కానీ ఆయన సామరస్య ధోరణి అతిథులను ఆకట్టుకోలేకపోయింది. మీత్య నాన్న ఇంకా కోపంగానే ఉన్నాడు. వాస్య నాన్న మాత్రం కళ్లు చిట్లించి పావ్‌లోవిచ్ వంక సూటిగా చూశాడు. "యాతన పడ్డారా? వాళ్లు మిమ్మల్ని హతాశులను చేశారా? మీరు మాట్లాడే మాటలకు ఏమన్నా అర్థం ఉందా?" అని కటువుగా ప్రశ్నించాడు.

"మీ ఉద్దేశం ఏమిటి?" అంటూ పావ్‌లోవిచ్ తన గాంభీర్యాన్ని నటించబోయాడు.

"మీరు పిల్లల మీద అరుస్తారు. వాళ్లని భయపెడతారు. దాని అర్థం ఏమిటి? మీ గురించి మీరేం అనుకుంటున్నారు అసలు?"

"అంటే నా బిడ్డకు అపకారం జరుగుతుంటే వాడిని కాపాడే హక్కు నాకు లేదా?" పావ్‌లోవిచ్ ధైర్యం కూడగట్టుకొని నజరోవ్‌ని ప్రశ్నించాడు.

నజరోవ్ లేచి నిలబడి ఆవేశంగా చేతులు కదుపుతూ మాట్లాడాడు: "కాపాడతారా? ఎవరి నుంచి? ఎంతకాలం వాడిని మీరు ఇలా కాపాడగలరు? జీవితాంతం రక్షించగలరా?" అని అడిగాడు.

"మీరేం అంటున్నారో నాకు బోధపడటం లేదు."

"వాడిష్టమైన ఆటలు ఆడుకోనివ్వరెందుకు?"

దీంతో పావ్‌లోవిచ్ కూడా లేచి నిలబడ్డాడు. "కామ్రేడ్ నజరోవ్, నా కొడుకు అంటే నా సొంత వ్యవహారం. వాడు ఏ ఆట ఆడాలో నేను నిర్ణయిస్తాను. ఈ విషయంలో నా పెత్తనమే నడుస్తుంది.... అందుకు అవకాశం ఉందనుకుంటాను" అన్నాడు హేళనగా.

నజరోవ్ తలుపువైపు నడిచాడు. బయటికి వెళ్లిపోతూ ఒకసారి వెనక్కి తిరిగాడు. 'సరే మీ ఇష్టం. కానీ మీరు చెప్పే ఈ అధికారం మీ పిల్లవాడిని ఒక పిరికిపందగా తయారుచేస్తుంది' అన్నాడు.

"మీరు కొంచెం అతిగా చెబుతున్నారేమో" వ్యాఖ్యానించాడు పావ్‌లోవిచ్.

"అదే నా మాటతీరు" అని తేల్చేశాడు నజరోవ్.

ఈ సంభాషణ జరుగుతున్నంత సేపు మీత్య నాన్న మౌనంగానే ఉన్నాడు. పిల్లల పెంపకం, శిక్షణల విషయంలోని లోతుపాతుల గురించి చర్చించే ఉద్దేశం ఆయనకు లేదు. అయితే తన కొడుకుని పావ్‌లోవిచ్ కొట్టబోవడం ఆయనకు ఏ మాత్రం మింగుడు పడలేదు. అదే సమయంలో పిల్లలపై పెద్దలకు గల నియంత్రణ అధికారం గురించి పావ్‌లోవిచ్ చెప్పింది

ఆయనకు బాగా నచ్చింది. ఇప్పుడు నజరోవ్ బయటికి నడవడంతో ఆయనకూడా వెళ్లిపోక తప్పలేదు. మెట్లు దిగుతుండగా నజరోవ్ వెనక్కి తిరిగి కటువుగా చెప్పాడు "చూడండి స్టీఫాన్ మీరు గౌరవనీయులు. మంచి కార్మికులు. మీరంటే నాకు గౌరవం ఉంది. కానీ మీరు మరోసారి మీ పిల్లవాడిని కొట్టారో నేను మిమ్మల్ని జైలుకి పంపిస్తాను. ఒక బోల్షివిక్‌గా ఈమాట చెబుతున్నాను!"

మీత్య నాన్నకు కోపం వచ్చింది. "కానీండి. ఎవరిని భయపెడుతున్నారు?"

"బెదిరించడం కాదు. మరోసారి మీత్యను కొట్టారంటే ఖాయంగా మిమ్మల్ని జైలుకి పంపుతాను"

"ఏమిటీ గొడవ. నేను వాడిని కొట్టానంటారా?"

"అనడం కాదు. చూశాను. ఇవాళ వాడు మా ఇంట్లో స్నానం చేశాడు. వాడి శరీరమంతా వాతలే"

"అంటే..?"

'మీత్య మంచి పిల్లవాడు. మీరు ఇలానే మోటుగా వ్యవహరిస్తే వాడు నాశనమైపోతాడు'

"పిల్లలను అదుపులో పెట్టాలంటే కొన్నిసార్లు తప్పదు మరి" మీత్య నాన్న సమర్థించుకోబోయాడు.

"పెత్తనం; పిల్లలపై అధికారం చలాయించడం.... ఇది మూర్ఖుల దారి"

"పేర్లు పెట్టడంలో మీకు మీరే సరి. పిల్లల్ని కొట్టకుండా, తిట్టకుండా అదుపులో ఉంచడం ఎలా? మీరేం చేస్తున్నారో?"

"మా ఇంటికి రండి. నా భార్య మంచి చేపలు వండుతోంది. చెరో గ్లాసు తాగుదాం" అని ఆహ్వానించాడు నజరోవ్.

"ఇది సందర్భం కాదేమో" మీత్య నాన్నకు అనుమానం.

"పర్వాలేదు. రండి"



గోలోవిన్‌ల (ల్యోవిక్ - లాల్య) కుటుంబంలో పెద్దల పెత్తనం, వారి అధికారాల స్థానాన్ని స్నేహం ఆక్రమించింది. తల్లిదండ్రులు, పిల్లలతో స్నేహంగా ఉండాలనే సిద్ధాంతాన్ని అక్కడి పెద్దలు పాటిస్తున్నారు.

నిజానికిది చెడ్డ పద్ధతి కాదు. తండ్రీ-కొడుకులు స్నేహంగానే ఉండాలి. అయినా కూడా కుటుంబంలో ఎవరి స్థానం వారిదే అవ్వాలి. అంటే పిల్లవాడు ఎదగవలసి ఉంది. తండ్రివాడిని పెంచవలసి ఉంది. ఈ ఏర్పాటులో మాత్రం మార్పు రాకూడదు. స్నేహం ఈ ఏర్పాటుకు హాని కలిగించకూడదు. అంటే తండ్రి తన కొడుక్కి స్నేహితుడిగానే కాక మరో కీలక బాధ్యత కూడా నిర్వర్తించాలనే సంగతిని విస్మరించలేడు. అలాగే తల్లీ-కూతుళ్ల స్నేహమైనా కూడా. పెద్దలకు-పిల్లలకు మధ్య ఉండే స్నేహం ఒక స్థాయిదాటితే కుటుంబంలో వారి స్థానాలు దెబ్బతింటాయి. బాధ్యతల నిర్వహణకు స్నేహం ఆటంకం కూడా అయ్యే ప్రమాదం ఉంది.

గోలోవిన్‌ల కుటుంబంలో జరిగింది ఇదే. ఇక్కడ ఎవరు ఎవరిని పెంచుతున్నారనేది అర్థం చేసుకోవడం కూడా కష్టమే. ఎంత స్నేహమైనా అది ఒక ఆటగానే ఉండాలి. పిల్లల్లో జ్ఞానతృష్ణను

తీర్చే తొలి ఉపాధ్యాయులు తల్లిదండ్రులే. ఒకసారి వారు ఈ హోదాను కోల్పోతే తిరిగి సంపాదించడం అసాధ్యం.

ఆ కుటుంబంలో పెద్ద బిడ్డ అయిన లాల్య తొలిసారి తండ్రిని పేరు పెట్టి గ్రీష్క అని పిలిచినప్పుడు పెద్దలకు అదొక అద్భుతంలా కనిపించింది. తల్లిదండ్రులు తమ బిడ్డలకు నిజమైన స్నేహితులనేందుకు ఇంతకంటే మంచి రుజువు ఏముంటుందని వారు సంబరపడ్డారు. గ్రీష్క స్వయానా ఒక ఉపాధ్యాయుడు. ఆయనకు కూడా కూతురు తనను పేరుతో పిలవడం నచ్చింది. ప్రపంచానికి కొత్తగా కనిపించేవన్నీ మొదట్లో కొంత అసందర్భంగా, అనుచితంగా కనిపిస్తాయనీ అంత మాత్రాన నూతన ఆవిష్కరణల ప్రాధాన్యాన్ని తక్కువ చేయలేమనీ గ్రీష్క వాదిస్తాడు. అయితే ఈ ఆనందం ఆయనకు అట్టే కాలం మిగలలేదు. ఒక స్నేహితుడు నీకు విధేయంగా ఉండాలని ఎలా డిమాండ్ చేయగలవు?

పదిహేనేళ్ల వయసులో ఒకసారి లాల్య తండ్రిని తీవ్రంగా మందలించింది. "ఒక పార్టీలో ఆయన అసందర్భంగా మాట్లాడాడని ఆమె ఆరోపణ. అలా వదరుబోతుదనం ప్రదర్శిస్తే అవతలి వాళ్లు ఏమనుకుంటారు? పరువు ఏమవుతుంది? అన్నది ఆమె ఆగ్రహానికి కారణం. కూతురు తనను అలా విమర్శ పేరుతో తిడుతుంటే సంతోషించాలో, కోపం తెచ్చుకోవాలో కూడా గ్రీష్కకు అర్థం కాలేదు. క్రితం సంవత్సరం లాల్య మామూలు స్కూలు వదిలి అర్ట్స్ స్కూల్లో చేరింది. నిజానికి తలకిందులుగా తపస్సు చేసినా లాల్య ఒక పెయింటర్ కాలేదు. ఆమెలో ఆ లక్షణాలేవీ లేవు. కానీ ఆర్టిస్ట్ అనిపించుకోవాలనే తహతహ ఆ పిల్లకు ఉంది. ఇదంతా గ్రీష్కకు తెలుసు. తల్లి వెర్కాకూ తెలుసు. ఇద్దరూ కలిసి లాల్యకు ఆ విషయం చెప్పి, స్కూలు చదువు వదిలే ప్రయత్నాన్ని మాన్పిద్దామని మాట్లాడి చూశారు. కానీ, లాల్య వారిపై చిరాకు పడింది.

"మీ వ్యవహారాల్లో నేను జోక్యం చేసుకోవడం లేదు. నా విషయంలో మాత్రం మీ జోక్యం దేనికి? అయినా కళ గురించి మీకేం తెలుసు?" అని ఎదురు అడిగింది.

ల్యోవిక్ కూడా అక్కదారిలోనే అమ్మానాన్నలతో 'స్నేహం' చేస్తున్నాడు. తామే ప్రారంభించిన ఈ ఆటలను ఆపలేని నిస్సహాయులు గ్రీష్క దంపతులు. గ్రీష్క ఈ విచారాన్ని వేళాకోళంగా తీసేయబోతాడు. కానీ వెర్కా అలా చేయదు. ఆమె ప్రస్తుతం పెద్దలు-పిల్లల మధ్య ఉండవలసిన గొప్ప స్నేహం గురించి మాట్లాడడం లేదు. పైగా అమ్మానాన్నల మాట వింటూ విధేయంగా వ్యవహరిస్తే, క్రమశిక్షణలో పెరిగే పిల్లలను చూసి ఆమె ఈర్ష్యపడుతోంది కూడా.

☆ ☆ ☆

మీత్య నాన్నను ఇంటికి ఆహ్వానించిన వాస్య తండ్రి ఆయన్ని బాగా గౌరవించాడు. ముందు నజరోవ్‌తో గట్టిగా మాట్లాడి తన పిల్లవాడి విషయంలో జోక్యం చేసుకోవద్దని కచ్చితంగా చెబుదామనుకున్న మీత్య తండ్రి అక్కడి అతిథ్యానికి మురిసిపోయి, అసలు సంగతి మరిచాడు.

వాస్య తల్లి ఆయన్ని సాదరంగా ఆహ్వానించి, భోజనాల బల్ల దగ్గర కూర్చోబెట్టింది. బల్లపై ఘుమఘుమలాడుతున్న తిండి, పొగలుగక్కుతున్న మాంసం పులుసు, పెద్ద పాత్ర నిండా వెన్న, వోద్కా సీసా చూసి మీత్య తండ్రికి మాటే రాలేదు. పైగా "మీత్య అద్భుతమైన కుర్రవాడు. మీరు గర్వపడవచ్చు. అటువంటి పిల్లవాడితో మా అబ్బాయి స్నేహం చేయడం మాకు సంతోషం కలిగిస్తోంది" అని ఆమె అనడంతో ఆయనకు మతిపోయింది. దాంతో ఆయన అత్యంత మర్యాద

పూర్వకమైన అతిథిగా వ్యవహరిస్తూ, సున్నితంగా ప్రవర్తించాడు. అయితే నజరోవ్ ఇటువంటి మొహమాటానికి అవకాశం ఇవ్వలేదు.

"నేను మీ కంటే ఎక్కువ చదువుకొన్నాను. అనుభవమూ ఎక్కువే. మరి నా దగ్గర కాక మరెవరి వద్ద మీరు మంచి సలహా పొందగలరు? కాబట్టి వినండి. చెప్పేది పూర్తిగా వినండి. ఇక నుంచీ మీరు మీ అబ్బాయితో మరో పద్ధతిలో వ్యవహరించాలి. ఇంటి వ్యవహారాల్లో కూడా మీ ధోరణి మారాలి. మీలాంటి విజ్ఞులు బోల్షివిక్కుల మర్యాద కాపాడాల్సిందే. అసలు మీత్య వంటి పసిపిల్లవాడిని కొట్టడం ఏమిటి? అది పద్ధతా? అది రోడ్డు మీదకు లాగు లేకుండా వెళ్లడంలాంటి సిగ్గుమాలిన పని. ఇంకాస్త వర్ధించుకోండి. బాగా తినాలి. అందుచేత ఇకపై వాడిని కొట్టకండి. మీ భార్య కూడా వచ్చి ఉంటే బావుండేది. వంట బావుంది కదా! ఈసారి ఆవిడని కూడా తీసుకురండి మరి" అన్నాడు.

అతిథి మారుమాట్లాడకుండా భోజనం చేసి సెలవు పుచ్చుకున్నాడు. నజరోవ్ దంపతులను తన ఇంటికి ఆహ్వానించాడు.

★ ★ ★

ఇంతటితో వాస్య కథ పూర్తి అయిందా? లేదు ఇంకా ఉంది. 'కుచుగురి' మైదానంలో పిల్లలు యుద్ధాలు చాలాకాలమే కొనసాగాయి. ప్రతిసారీ విజేతలు మారిపోయేవారు. అలా కొంత కాలం తరువాత పిల్లలకే విసుగు వచ్చి ఆ ఆటమానేసారు. తరువాత వారికి ఆ మైదానం అవతల కోరుగి అనే అందమైన గ్రామం కనిపించింది. అక్కడ చల్లటినీటితో పారే ఏరు, ఎన్నెన్నో పళ్ల తోటలూ ఉన్నాయి.

కాలం గడుస్తోంది. ఇప్పుడు కూడా వంటగదిలో ఓ మూల పరచిన దుప్పటిపైన వాస్య బొమ్మల సామ్రాజ్యం అలానేఉంది. ఆ రైళ్లు, బస్సులూ, పడవలు ప్రస్తుతం నడవడం లేదు. వాటన్నిటి కాపలాదారు వయసుపైబడినా విశ్రాంతి లేకుండా రాత్రింబగళ్ళు నిద్రపోకుండా కాపలా కాస్తూనే ఉన్నాడు.

అప్పుడప్పుడు వాస్య ఆ సామ్రాజ్యం ముందు నిలిచి పాత రోజులను గుర్తు తెచ్చుకుంటాడు. కానీ అప్పటి కలలు ఇప్పుడు రావడం లేదు. ఆనాడు ప్రారంభించిన వంతెన నిర్మాణం అక్కడే నిలిచిపోయింది. "ఇక నువ్వు నిజమైన వంతెన కట్టడం కోసం ప్రయత్నం చేయాలి" అన్నాడు వాస్య నాన్న.

"అవును, అందుకు బాగా కష్టపడి చదవాలి" అన్నది వాస్య సమాధానం.

★ ★ ★

ఏవేవో నీతులు బోధించాలనే ఉద్దేశంతో ఈ కథ చెప్పలేదు నేను. ఇది జీవితం తాలూకు వేలాది పార్శ్వాలలో ఒక కోణాన్ని చూపే కథ. అయితే వాస్య అతి వెచ్చటి కుటుంబజీవితం నుంచి సంఘజీవిగా మారే కీలక తరుణంలో జరిగిన కథ. వాస్య జీవితగమనాన్ని నిర్దేశించిన ముఖ్యమైన సందర్భం ఇది. పసిపిల్లవాడు క్రమంగా పౌరుడిగా మారే క్రమాన్ని ఎవరూ ఆపలేరు. తల్లిదండ్రులందరికీ ఈ సంగతి తెలుసు. కానీ చాలామంది ఈ కీలక సమయంలో పిల్లలకు అందించవలసిన సాయం గురించి పట్టించుకోరు. పట్టించుకొంటున్నామనుకొనేవారిలో అత్యధి కులు పెంపకం అంటే పిల్లలపై పెత్తనం చలాయించడంగా భావిస్తారు.

పిల్లవాడు సజీవమైన వ్యక్తి. బిడ్డ మన జీవితాలకు కేవలం అందం చేకూర్చే ఆభరణం కాదు. మరొక ప్రత్యేకమైన వ్యక్తిత్వం, రక్తమాంసాలతో కూడిన జీవన చైతన్యం ఉన్న వ్యక్తి. ఆ బిడ్డ ఉద్వేగాలు, జ్ఞానతృష్ణ, ఎదుటివారిపై కలిగించే ప్రభావం, నిర్మలత, తెలియని సంగతులు తెలుసుకొనేందుకు చేసే కృషి సౌందర్యం వంటి లక్షణాలు పూర్తిగా ఎదిగినవారిలోని ఈ లక్షణాల కంటే సంపన్నమైనవి. పిల్లలు ఈ వయసులో ఎదుర్కొనే నాటకీయమైన అనుభవాలు, అనుభవించే ఆనందం, దుఃఖం ఆ తరువాత దశలో వాడి ఎదుగుదలపై గణనీయమైన ప్రభావాన్ని చూపగలవు. ఈ సంగతిని గ్రహించి పసితనపు అనుభవాలు బిడ్డపై కలిగించే ప్రభావాన్ని అంచనావేసి, వాడికి తోడుగా నిలవగలిగితే తల్లితండ్రులుగా ఎవరైనా తమ నియంత్రణ అధికారాన్ని నిర్మాణాత్మకతతో ఉపయోగించుకోగలుగుతారు. తల్లిదండ్రులకు లభించే ఈ అధికారం గాలిలోంచి ఊడిపడేది కాదు. వ్యక్తిగా, సంఘజీవిగా వారు నిర్వహించే పాత్రను బట్టి ఈ అధికారం ఖరారవుతుంది. ఆచరణలో ఈ అధికారం సజీవమైన ఉపకరణం కాకపోతే, అంటే అది పిల్లవాడి జీవితం శివార్లలోనే నిలిచిపోతే - వాడి నవ్వులు, ఆలోచనలు, కన్నీళ్లు, కష్టాలను - పట్టించు కోకుండా కేవలం వాడిని నియంత్రించే పనిముట్టుగానే మిగిలితే దాని వలన ప్రయోజనం శూన్యం. మంచి కోసమే అయినా పిల్లలపై చెయ్యి చేసుకోవడం రెండు రకాలుగా విషాదం మిగిల్చే ప్రమాదం ఉంది. అది పిల్లవాడికి బాధను, ఆత్మన్యూనతా భావాన్ని పెంచవచ్చు. అదే సమయంలో వాడిని పరమ మొండివాడిగా తయారు చేయవచ్చు. ఈ విషాదం పెద్దలది కాదు. పూర్తిగా బిడ్డదే. ఒక్కసారి ఆలోచిద్దాం. తల్లి అయినా, తండ్రి అయినా పూర్తిగా ఎదిగిన, ఆలోచించ గల, బలమైన శరీరం గల మనిషి. ఈ వ్యక్తి ఎదుగుతున్న లేతపిల్లల శరీరాలను హింసించడం గురించి ఆలోచిద్దాం. నిస్సహాయుడైన పసివాడిని కొట్టడం చూసి పిల్లవానిపై జాలి కలగడం సంగతి అటుంచితే, మీరు చేస్తున్నది ఎదుటివారి కడుపుబ్బ నవ్వించగల విషాదం. పిల్లల పెంపకం, శిక్షణకు సంబంధించి అతి అనాగరికమైన పద్ధతి ఇది.

అసలు పిల్లలను కొట్టడం వాళ్లని క్రమశిక్షణలో ఉంచేందుకు అవసరమా? దెబ్బలతో క్రమశిక్షణ సాధ్యమని భావించే అమ్మానాన్నలు ఈ లక్ష్యాన్ని సాధించలేరు. అటువంటి వారి వద్ద పెరిగే పిల్లల్లో ఏర్పడేది క్రమశిక్షణ కానేకాదు. కేవలం భయం. వాళ్లు అమ్మానాన్నల అధికార పరిధి వెలుపల బతకాలని వాంఛిస్తారు. ఇది పెద్దలకూ - పిల్లలకూ మధ్య దూరం పెంచుతుంది.

సవ్యమైన సమిష్టి వ్యవస్థగా ముందుకు సాగే కుటుంబంలో పెద్దలకు గల నిర్దిష్ట అధికారాలను ఏ ప్రత్యామ్నాయాలూ సంతృప్తి పరచవు. పిల్లలను క్రమశిక్షణలో ఉంచేందుకు అడ్డదారులు, గారడీలు అవసరం లేదు. ఇటువంటి నమ్మకంగల పెద్దలున్న కుటుంబంలో ఎప్పుడూ పరిస్థితి అదుపులో ఉంటుంది. పిల్లలు విధేయంగా, క్రమశిక్షణతో ఉండగలుగుతారు.

రోజూవారీ వ్యవహారాలను ప్రశాంతంగా, క్రమబద్ధమైన ఆదేశాలతో అంటే పనికిమాలిన అధికార ప్రదర్శన, అనవసరమైన ఆగ్రహం, వొత్తిడి తేవడం వంటివి లేకుండా ప్రశాంతంగా నిర్వర్తించగలిగితే చాలు. కుటుంబ నిర్వహణకు ఇవన్నీ అవసరమైన, అనవసరమైన భావ వ్యక్తీకరణలు. ఇటువంటి ఆదేశాలు జారీ చేసే హక్కు కుటుంబ పెద్దగా మీకు ఉన్నదా, లేదా అనే అనుమానం మీకు గానీ, పిల్లలకు గానీ రాకపోతే చాలు. పెద్దలు తాము ఇచ్చే

ఆదేశాలు సహేతుకంగా, ఆలోచనాత్మకంగా ఉండేలా చూడగలిగితే చాలు. పిల్లలపై మితిమీరిన ప్రేమ, లేదా పిల్లలను ఇలానే పెంచాలనే భ్రమలు ఈ ఆదేశాలను నిర్వీర్యం చేయకుండా ఉండేలా జాగ్రత్త పడటం అత్యవసరం. మీ ఆదేశాలు సైతం ఇటువంటి అనుమానాలకు తావిచ్చేవిగా ఉండకూడదు. అప్పుడే ఇటువంటి ఆదేశాలపై ఎవరికీ సందేహాలు కలగవు. అప్పుడు పిల్లలు వాటిని తమ బాధ్యతగా పరిగణించి నిర్వర్తిస్తారు. అవసరమైన మార్గదర్శకత్వాన్ని, సలహాలు-సూచనలను తల్లిదండ్రులు నిస్సంకోచంగా ఇవ్వగలుగుతారు. పిల్లల నిజ అవసరాలు-ఊహాజనితమైన అవసరాల మధ్య తేడాని కూడా గుర్తించగలిగితే, మీకు-పిల్లలకు మధ్య పటిష్టమైన స్నేహం, బాంధవ్యం ఏర్పడగలవు.



# CHAPTER - 7

# ప్రేమ ఓ అందమైన అనుభవం

ల్యూబా గొరెలోవాను తొలిసారిగా నేను మా కార్యాలయంలోనే కలిశాను. ఏదో చిన్న పనిపై ఆమె నా వద్దకు వచ్చింది. ఆమెకు కావలసిన కాగితం ఏదో రాస్తూ ఆమె వంక చూశాను. తను మౌనంగా ఆ కుర్చీలో కూర్చుని అప్పుడప్పుడు గాఢంగా నిట్టూరుస్తోంది. ఆమె కళ్లు దూరంగా ఎటో చూస్తున్నాయి. ఆమెకు పందొమ్మిదేళ్ల వయసుంటుంది. ఎంతటి విషాదంలోనైనా పరిశుభ్రంగా ఉంటూ, సొగసైన దుస్తులు ధరించగల యువతుల్లో ఆమె ఒకరు.

"ఏమిటీ నిట్టూర్పులు? ఎందుకంత విచారం? ఏమైనా సమస్యా?" అని ఆమెని అడిగాను. ల్యూబా ఒకసారి తల విదిల్చి, జాలిగా నవ్వింది.

"లేదు... పెద్ద విషయం కాదు. మొన్నటివరకూ నేనో సమస్యలో ఉన్నాను. ఇప్పుడు అదేం లేదు" అంది.

ఈ వయసు ఆడపిల్లల సమస్యలను గురించి నాకు బాగా తెలుసు. వారితో వాటి గురించి అనేకసార్లు చర్చించాను కూడా.

"సమస్య తీరిపోయిందంటావ్, మరోవైపు విచారంగా నిట్టూరుస్తావ్, ఎందుకు?" అని ప్రశ్నించాను. ఆమె గోధుమవన్నె కళ్లలో ఆసక్తి మెరిసింది. నా వంక తదేకంగా చూసింది.

"అదంతా చెప్పమంటారా?"

"చెప్పు."

"అదో పెద్ద గాథ.."

"పర్వాలేదు చెప్పు."

"నా భర్త నన్ను వదిలేశాడు...."

ఆమె వంక ఆశ్చర్యంగా చూశాను. ఆమె చెప్పదలిచిన అతి పెద్ద గాథ ఈ చిన్న వాక్యంతో పూర్తయిపోయింది. మిగిలిన వివరాలు కావలిస్తే ఆమె మొహంలోకి చూస్తే చాలు. చిన్న గులాబీ పెదాలు నవ్వుతో వణుకుతున్నాయి. కళ్లలో నీళ్లు మెరుస్తున్నాయి.

"వదిలేశాడా?" అడగాలి కాబట్టి అడిగాను.

'ఆహా' అందామె రహస్యం చెబుతున్నట్టు, పసిపిల్లలా తల వూపింది.

"అతను మంచివాడేనా.. అదే నీ భర్త?"

"ఆ. మంచివాడు. చాలా మంచివాడు."

"నువ్వతన్ని ప్రేమించావా?"

"అదేం ప్రశ్న. ప్రేమించాను. ఇంకా ప్రేమిస్తున్నాను కూడా."

"అతను నిన్ను వదిలి వెళ్లడం నీకు బాధ కలిగిస్తోందా?"

"చాలా. తట్టుకోలేకపోతున్నాను."

"అంటే నీ సమస్యలు ఇంకా తీరలేదన్నమాట."

ల్యూబా నా వంక అనుమానంగా చూసింది. కానీ నా మొహంలో నిజాయితీ ఆమెకు కొంత నమ్మకం కలిగించి ఉండాలి.

"అవును సమస్యే... కానీ నేనేం చేయగలను?" అంటూ నిస్సహాయంగా చూసింది. నిజమే ఆమె మాత్రం ఏం చేయగలదు?

నెమ్మదిగా చెప్పాను. "గతం గురించి నువ్వేం చేయగలవు? మరచిపోవడం తప్ప. అతన్ని, నీ భర్తని మరచిపోయి, మళ్లీ జీవనం ప్రారంభించు. కొనసాగించు. మళ్లీ నీకు పెళ్లవుతుంది. హాయిగా...."

ల్యూబా నన్ను మధ్యలోనే అడ్డుకొంది. 'మళ్లీ పెళ్లి? ఎవర్ని? వాళ్లంతా ఒకేలా ఉంటారు.....'

"ఎలా ఉంటారనే విషయానికొస్తే నీ భర్త ఏమంత గొప్పవాడు కాదు. అతను నిన్ను వదలి పెట్టాడు. కాదా? నిజం చెప్పాలంటే అతను బతికేందుకు కూడా అనర్హుడు" అన్నాను.

"అతను మీకు తెలియనే తెలియదు. ఈ మాటలు ఎలా అంటున్నారు?" ఆమె సవాలు చేసింది.

"సరే, ఇంతకీ నిన్ను అతను ఎందుకు విడిచివెళ్లాడు?"

"మరొకరితో ప్రేమలో పడ్డాడు కనుక.." ఆమె ఎంతో తృప్తిగా, సంతోషంగా, ప్రశాంతంగా ఈ మాట అంది.

"ల్యూబా, మీ అమ్మానాన్న ఉన్నారా?"

"ఉన్నారు. అమ్మా... నాన్న... నేను పెళ్లి చేసుకొన్నందుకు వాళ్లు తిట్టారు."

"మంచి పనిచేశారు."

"ఏం కాదు. అందులో మంచేం ఉంది?"

"వారి మందలింపు సరైనదే. నువ్వింకా పసిపిల్లవు. అప్పుడే పెళ్లి, విడిపోవడం అన్నీ పూర్తయ్యాయి."

"అయితే ఏం? దాంతో వారికేం సంబంధం?"

"నువ్వు వాళ్లతో కలిసి ఉండటం లేదా?"

"నాకు సొంతంగా ఒక గది ఉంది. నా భర్త నన్ను వదిలి మరొకరితో.. వెళ్లాడు. అది ఇప్పుడు నా గదే. నేను రెండు వందల రూబుళ్లు సంపాదిస్తాను. నేనేం పసిపిల్లను కాదు" అందామె ధిక్కార స్వరంతో. ఆమె మొహంలో ఆగ్రహం, ఆశ్చర్యం స్పష్టంగా కనిపిస్తున్నాయి. జీవితంతో తాను ఆటాడుతున్నాననే సంగతి ల్యూబాకు తెలిసినట్టు లేదు.

★ ★ ★

దాదాపు ఏడాది తరువాత ల్యూబా మరోసారి నా ఆఫీసుకు వచ్చింది. ఎదురుగా కూర్చుంది. ఆమెకిప్పుడు ఇరవై ఏళ్లు.

"బావున్నావా? నీ సంసార జీవితం ఎలా ఉంది?" అని ప్రశ్నించాను.

"మాటల్లో చెప్పలేనంత బావుంది."

"అంటే... అతనికంటే మంచివాణ్ణి వెదుక్కోగలిగావన్నమాట?"

"అదేం కాదు. అతన్నే.. మరోసారి పెళ్లాడాను."

"అదెలా జరిగింది?"

'అలా జరిగిపోయిందంతే. నా దగ్గరకు వచ్చి తనివితీరా ఏడ్చాడు. ఎవరికంటే కూడా నేనే మంచిదాన్నట. ఇది మాత్రం అబద్ధం. కదూ? ఎవరికంటేనో నేనెందుకు మంచి భార్యనవగలను?'

"సర్లే. అభిరుచుల్లో మార్పు. అయినా నీకేం తక్కువని? అని ప్రశ్నించాను.

"అదీ సంగతి. ఎక్కువ, తక్కువల సమస్య కాదిది. దీనర్థం అతను నన్ను ప్రేమిస్తున్నాడని. కానీ నాన్న మాత్రం బుద్ధిలేని దాన్నని తిడుతున్నారు." అని నవ్వింది. "అతనేమో జరిగిందంతా ఒక పీడకలగా భావించి మరచిపోదాం అన్నాడు."

"అంటే జరిగిందంతా మరిచిపోయావా?"

"ఆహా" అంది గుసగుసగా. మళ్లీ పసిపిల్లలా తల వూపింది.

★ ★ ★

మూడోసారి ల్యూబాను అనుకోకుండా ఒక వీధి మలుపులో కలుసుకొన్నాను. నన్ను చూడగానే సంతోషంగా పలుకరించింది. "భలే కలవగలిగాను మిమ్మల్ని" అంది.

ఆమె ఇదివరకున్నట్టే యవ్వనంతో మెరిసిపోతోంది. దుస్తులూ, తలకట్టూ గతంలో లాగే శుభ్రంగా ఉన్నాయి. నన్ను చూసే క్షణానికి ముందు ఆమె చేతిలోని పుస్తకాలను మరోచేతిలోకి మార్చుకొని అటుగా వస్తున్న ఏదో వాహనంలోకి ఎక్కే ప్రయత్నంలో వుంది. నన్ను చూసి ఆగింది. ఆమె వయసిప్పుడు ఇరవై ఒక్క సంవత్సరాలు. మనిషి కులాసాగా, పరిశుభ్రంగా ఉన్నా తన కళ్లలో మాత్రం కొంత అలసట కనిపిస్తోంది. ఆమె నా పక్కనే నడుస్తూ "మిమ్మల్ని భలే కలవ గలిగాను" అంది మరోసారి.

"నన్ను చూసినందుకు ఎందుకంత ఆనందం? ఏమైనా పని పడిందా?"

"పనేం కాదు. మాట్లాడేందుకు ఓ మనిషి అవసరం. మీరు కనిపించారు" అని నిట్టూర్చింది.

"మళ్లీ సమస్యలా?" అన్నాను.

ఆమె తదేకంగా రోడ్డుని పరిశీలిస్తూ మాట్లాడింది." అవును సమస్యలో పడ్డాను. ఎంత పెద్ద సమస్యంటే భోరున ఏడిచాను. ఆమె కోర్టుకు పిటిషన్ పంపింది. నెలకు నూటయాభై రూబుళ్ల భరణం కావాలని. అదో పెద్ద మొత్తం కాకపోవచ్చు. నా భర్తకు నెలకు ఐదు వందల రూబుళ్లు వస్తాయి. నాకు మరో రెండు వందలు. దీంట్లోంచే ఇవ్వాలి. ఎందుకో అవమానంగా, తప్పు చేసినట్టుగా అనిపిస్తుంది. అయినా అలా తీర్పు ఇవ్వడం అన్యాయం. ఆమె చెబుతున్నట్టు ఆ - బిడ్డ అతని బిడ్డ కాదు" అంటూ వివరించబోయింది.

అంటే ఈమె భర్త అనే ప్రబుద్ధుడు ఆ రెండో ఆమెకు బిడ్డను కూడా కని, ఇప్పుడు ఈమె గదిలో ఉంటూ, ఇద్దరి సంపాదనలోంచి రెండో భార్యకు భరణం ఇచ్చే కులాసా ఏర్పాటులో ఉన్నాడు. నాకు చిరాకు పుట్టింది.

"ల్యూబా నా మాట విని అతన్ని గెంటేయ్."

"ఎవరిని?"

"అదే ఆ మొగుడిని."

"ఆ మాట ఎలా అనగలుగుతున్నారు? అతనెన్ని చిక్కుల్లో ఉన్నాడు! పైగా అతనికి ఉండేందుకు ఇల్లు కూడా లేదు. ఇప్పుడు ఈ భరణం గొడవ వొకటి...." అందామె తన భర్తను సమర్థించుకొంటూ.

"కానీ నువ్వతన్ని ప్రేమించడం లేదుగా."

"ఎందుకు లేదు. ఎంతో ప్రేమిస్తున్నాను. ఎంత బావుందో మీకేం తెలుసు. నాన్న కూడా అతన్ని తిడుతున్నారు. మీ పెళ్లి నమోదు కాలేదుగా. అతన్ని వదిలేయ్ అంటోంది అమ్మ."

"అంటే మీ పెళ్లి నమోదు కాలేదా?"

"లేదు ఆ మాటకొస్తే మొదటిసారి కూడా రిజిస్టర్ చేయించలేదు. తిరిగి వచ్చినప్పుడు ఇప్పుడూ చేయించలేదు."

"జరిగిందేదో జరిగింది. పోనీ ఇప్పుడు ఆ పెళ్లిని నమోదు చేయించవచ్చుగా?"

'నాకు తెలుసు. అలా చేయాలంటే ముందు విడాకులు తీసుకోవాలి.. ఎంత పెద్ద తలనొప్పి.'

"అంటే, అతను విడాకులు తీసుకోవాలి. ఆ భరణం పొందుతున్నామెకు అతను విడాకులు ఇవ్వాలి. అంతేగా ఇందులో సమస్య ఏముంది?" నాకు అర్థం కాక అడిగాను. "మీరు పొరబడ్డారు. ఆమెతో అతనెప్పుడూ పెళ్లిని నమోదు చేయించలేదు. అందువల్ల విడాకుల ప్రశ్నే లేదు. మరొకరితో జరిగిన పెళ్లి గురించి నేను చెబుతున్నాను..." వివరించింది ల్యూబా.

నాకు నిజంగానే అర్థం కాలేదు. "మరొకరా? అంటే మీ ఇద్దరి కంటే ముందు అతనికి ఇంకొకరితో వివాహం జరిగిందా?"

"మీకు అర్థం కాదా ఏం? ఈమె మూడవ ఆమె.. నాతో కలుపుకొంటే. ఈమెని అతను ఈ మధ్యే పెళ్లాడాడు."

నాకు బుర్ర తిరిగింది. "మొదట నీతో ఉన్నాడు. కాదని మరొకరితో కాపరం పెట్టాడు. తప్పంటూ మళ్లీ నీ దగ్గరికొచ్చాడు. ఈ మధ్యలో మూడో ఆమె ఎవరు? పెళ్లెప్పుడు జరిగింది? అంత వ్యవధి ఎక్కడుంది?" ప్రశ్నలు గుప్పించాను.

"అబ్బ! రెండవ ఆమెతో అతను ఎక్కువ కాలం కలిసి ఉండలేదు. ఈ మూడో ఆవిడ కలిసే వరకూ మాత్రం ఆమెతో ఉన్నాడు. కొత్తావిడకు సొంతంగా గది ఉంది. దానితో అతను ఆవిడతో సంసారం మొదలుపెట్టాడు. కానీ ఈమె వివాహాన్ని రిజిష్టర్ చేయించాల్సిందేనని పట్టు పట్టింది. దాంతో తానామె భర్తనంటూ ఇతను రిజిష్టర్ చేయించాడు. కానీ ఆ తరువాత వీళ్లు కలిసి ఉంది కేవలం పది రోజులు...."

అంత పెద్దకథను ల్యూబా పిల్లవాడికి చెప్పినట్టు సహనంగా చెప్పింది.

"తరువాత ఏమయింది?" ప్రశ్నించాను.

"ఏమయింది? ఓ రోజు అతను మెట్రో రైల్లో నన్ను చూశాడు. ఎంతగానో విచారించాడు. నా దగ్గరకొచ్చి బాధపడ్డాడు. విపరీతంగా ఏడ్చాడు" జరిగిందేమిటో చెప్పింది ల్యూబా.

"బహుశా అతను మొదటినుంచీ అన్నీ అబద్ధాలే చెబుతున్నాడేమో! అసలు అతనికి ఎవరితో రిజిస్టర్ కాలేదేమో..." నా అనుమానం ఆమెకు వివరించబోయాను.

"అదేం కాదు. అసలు మూడో పెళ్లి... నమోదు చేయించడం గురించి అతను నాకేం చెప్పలేదు. ఆమే స్వయంగా వచ్చి ఈ కథంతా చెప్పింది."

"బాగా ఏడ్చిందేమో కూడానా?" అడిగాను.

"ఆహా" అంది ల్యూబా గుసగుసగా, పసిపిల్లలానే తల ఆడించింది.

ఇక సహనం కోల్పోయాను. ఆమెకేకాదు మొత్తం వీధంతటికీ వినిపించేలా గట్టిగా అరిచాను. "వాణ్ణి మెడ పట్టుకు బయటకు గెంటు. ఇంకా వాణ్ణి పట్టుకు వేలాడుతున్నందుకు సిగ్గులేదూ?' ' అని.

ల్యూబా వెంటనే మరోపక్కకు మొహం తిప్పింది. బహుశా కంట తడి పెడుతోందేమో తెలియదు. "అతన్ని ఎలా గెంటగలను? నేను అతన్ని ప్రేమిస్తున్నాను" అంది.



నాలుగోసారి ఆమెను సినిమా థియేటర్‌లో చూశాను. హాల్లో ఒక మూల సోఫాలో, అందమైన, ఉంగరాల జుట్టుగల యువకుడిని అనుకొని కూర్చునుందామె. అతనామె చెవిలో గుసగుస లాడుతూ పెద్దగా నవ్వుతున్నాడు. ల్యూబా అతని మాటలని శ్రద్ధగా వింటూ చిరునవ్వులు చిందిస్తోంది. ఎప్పటిలానే ఆమె అందమైన దుస్తుల్లో తళతళలాడుతోంది. గోధుమవన్నె కళ్లలో ఆనందం తొణికిసలాడుతుంది. ఆమెకిప్పుడు ఇరవై రెండేళ్లు.

నన్ను చూడగానే ల్యూబా సోఫాలోంచి ఒక్క ఉదుటున లేచి పరుగు పరుగున నా వద్దకు వచ్చింది. నా కోటు చేతులను పట్టుకొని గుంజుతూ, "రండి నా భర్తను పరిచయం చేస్తాను" అంది పసిపిల్లలా గారం చేస్తూ.

ఆ యువకుడు చిరునవ్వుతో నాకు కరచాలనం చేశాడు. అతని మొహం అందంగా, ఆహ్లాద కరంగా ఉంది. వాళ్లు తమ ఇద్దరి మధ్య నన్ను కూర్చోబెట్టుకున్నారు. సినిమా ఇంకా మొదలు కానందున జనం అటూ ఇటూ తిరుగుతున్నారు. ల్యూబా నన్ను చూసి నిజంగానే ఎంతో సంతోషించింది. నా కోటు చెయ్యి పట్టుకుని లాగుతూ, పసిపిల్లలా నవ్వుతోంది.

"నేను మీ గురించి చాలా విన్నాను. ల్యూబా చెప్పింది. మిమ్మల్ని చూడగానే ఆనందంతో తల మునకలైంది" అన్నాడు ఆ యువకుడు.

"మరేంటనుకున్నావు?" అని గట్టిగా అంది ల్యూబా. గొంతులో లేని కోపం తెచ్చుకుని అతన్ని ఆదేశించింది. "పో, బయటికెళ్లి ఏమన్నా తాగిరా. నాకెంత మంచి మొగుడు దొరికాడో ఈయనకి చెప్పాలి. వెళ్లు" అంది.అతను కదలకపోవడం చూసి నా వీపు వెనకనుంచి చెయ్యి చాపి అతన్ని తోసింది. "వెళ్లవేం" అంది. అతను మొహమాటంగా నవ్వుతూ లేచి నిలబడి బయటికి నడిచాడు. అతనలా వెళ్లగానే ల్యూబా నా రెండు చేతులూ గట్టిగా పట్టుకొని, "చెప్పండి అతను బావున్నాడా? మంచివాడేగా?" అంది.

'ల్యూబా ఆ సంగతి నేనెలా చెప్పగలను? మంచివాడా, కాదా అన్నది నాకెలా తెలుస్తుంది?'

"మీరాయన్ని చూశారుగా, అంచనా వేయలేరా?" అంది.

"చూడ్డానికి బానే ఉన్నాడు. కానీ అతనితో నీ అనుభవాలు... అతను చేసిన నిర్వాకం.... నీకే తెలుసు... నేనేం చెప్పగలను?" అన్నాను.

"ఛఛ! అతనూ-ఇతనూ ఒకరే అనుకుంటున్నారా? అదేం కాదు. ఇతను వేరే వ్యక్తి. ఇతనే నిజమైన మనిషి.... నా మనిషి."

ఆశ్చర్యంతో నోటమాట రాలేదు. కష్టంమీద గొంతు విప్పాను" ఇతను వేరే మనిషా? మరి నీ 'నిజమైన' ప్రేమికుడు... అతను ఏమయ్యాడు" అని వెర్రి ప్రశ్న వేశాను.

"ఛీఛీ! అతనితో నిజమైన ప్రేమ ఏమిటి? వాడొక పనికిమాలిన వెధవ. నేనిప్పుడు నిజంగా సంతోషంగా ఉన్నాను."

"పోనీ ఇతన్నైనా నువ్వు ప్రేమిస్తున్నావా? ఏమన్నా పొరబడి ఉంటావా?" నా అనుమానం.

ఆమె ఒక్కసారి మౌనంగా అయిపోయింది. ఆమెలోని ఉత్సాహం ఒక్క క్షణంలో చల్లారింది.

"చెప్పు. ఇతన్ని నువ్వు ప్రేమిస్తున్నావా?" రెట్టించాను.

మళ్లీ ఎప్పటిలా గుసగుసగా "ఆహా" అని, పసిపిల్లలా తల ఆడిస్తుందని అనుకొన్నాను. కానీ ఆమె మౌనం మరి కొన్ని క్షణాలపాటు కొనసాగింది. చివరికి కళ్లు ఎత్తి నా వంక చూసి, నెమ్మదిగా చెప్పింది. "ఏం చెప్పాలో తెలియడం లేదు. నేను ప్రేమిస్తున్నాను. కాని ఇది నిజమైన గట్టి ప్రేమా? అని అడిగితే నాకు తెలియదు" అంది నిస్సహాయంగా. కానీ ఆమె కళ్లు చెబుతున్నాయి. అవి ప్రేమలో పడిన యువతి కళ్లు.



యువతీ యువకులకు ప్రేమించడం గురించి చెప్పడం, నేర్పడం, దాన్ని గురించి వివరించడం, ప్రేమిస్తూ దానివల్ల సంతోషంగా ఉండమనడం అంటే ఆత్మవిశ్వాసంతో, హుందాగా ఉండమని బోధించడమే. పూర్తిగా సర్వసత్తాకమైన ప్రేమ సామ్రాజ్యంలోకి ప్రవేశించడం ఎలాగో చెప్పేందుకు నిర్దిష్టమైన బోధనా పద్ధతులేం లేవు. మానవ సమాజంలో ముఖ్యంగా సోషలిస్టు సమాజంలో లైంగిక విద్య అంటే పూర్తిగా శరీర శాస్త్రం కాదు. మానవ సంస్కృతి సాధించిన విజయాలు, సమాజంలో మనిషి స్థితిగతులు, చరిత్రకు సంబంధించి మానవతా పథం, సౌందర్య శాస్త్రం.... వీటికి అతీతంగా శృంగారం సాధ్యం కాదు. ఒక స్త్రీ అయినా, పురుషుడైనా తాము ఈ సమాజంలో అంతర్భాగమని భావించకపోతే, బతుకునకు సంబంధించి ఏ బాధ్యత, ఏ అనుభూతి లేనప్పుడు, అందాన్ని, దాని హేతుబద్ధతను గుర్తించకపోతే వారికి నిజమైన ప్రేమ ఎలా అనుభవంలోకి వస్తుంది? కేవలం స్త్రీ, పురుషులనే కారణం ఒక్కటే ప్రేమలో పడేందుకు కావలసిన అర్హత అయితే వారికి ఆత్మగౌరవం, విశ్వాసం కలిగే అవకాశాలు ఏముంటాయి? సామాజిక వ్యక్తిత్వ వికాసానికి అవసరమయే సాంస్కృతిక విద్యలో లైంగిక విద్య కీలకమైంది. వ్యక్తుల మధ్య సంబంధాలను, కుటుంబ నిర్మాణాన్ని తద్వారా మొత్తం సమాజం పాటించే సాంస్కృతిక, నైతిక విలువలను ఇది ప్రభావితం చేయగలదు.

పిల్లలకు లైంగిక విద్య అవసరం అని చెప్పే కొందరు (ఉదారవాద ముసుగులో) "మౌలిక ప్రశ్నలకు సమాధానాలు వివరించడమే కష్టమ"ని తేల్చారు. పిల్లలు పుట్టడం వెనుక రహస్యాలను విద్యార్థులకు ఎలా చెప్పగలమన్నది వీరి ప్రశ్న. వీరిలోనే మరికొంత తీవ్రవాదులు పిల్లలకు అన్ని రహస్యాలూ దాపరికం లేకుండా వివరించాలని వాదిస్తారు. ఈ వాదనల సంగతెలా ఉన్నా పిల్లలు దీనికి సంబంధించిన అనుమానాలు లేవనెత్తితే ఎలా సమాధానం చెప్పాలన్నది చాలా

మంది తల్లితండ్రుల సమస్య. పిల్లలను కూర్చోబెట్టి ఎన్ని పాఠాలు చెప్పినా ప్రయోజనం ఉండదని భావించిన ఒక తండ్రి తన ఐదేళ్ల కుమారుడికి అన్నీ సజీవంగా తెలియచెప్పాలని భావించిన సంగతి నేనెరుగుదును. ఆ పిల్లవాడి తల్లి మరోబిడ్డకు జన్మ నిస్తున్నప్పుడు తండ్రి ఆ పిల్లవాడిని నిలబెట్టి ఆ తతంగమంతా చూపించి, వివరించాడు. ఇది కేవలం బుద్ధి హీనత మాత్రమే కాదు. ఇటువంటి పెద్దలను తక్షణం మానసిక వైద్యులకు చూపించాలి. ఇటువంటివారు అతి స్వల్ప సంఖ్యలోనే ఉంటారు. అయితే పూర్తిగా నిజాయితీగా పిల్లలకు లైంగిక విద్యాబోధన అవసరమని భావించే తల్లితండ్రులు సైతం తీరా ఆచరణలోకి దిగేసరికి ఎలా వివరించాలో, ఏం బోధించాలో తెలియక తికమకపడవలసిందే.

తల్లితండ్రులుగా పాటించవలసిన ఆదర్శాలకూ, లైంగిక విద్యాబోధనకు సన్నద్ధమయేందుకు అవసరమైన ఉదారవాద పోకడలకూ మధ్య వైరుధ్యాలు తలెత్తడం ఇందులో మొదటి సమస్య. పిల్లలకు శరీర నిర్మాణం, సృష్టి రహస్యాలు, లైంగిక విద్య గురించి తెలియాలంటే దాపరికానికి తావుండదు. విషయం అటువంటిది మరి. ఎంత ఉదారవాదులైనప్పటికీ ఈ వివరాలు చెప్పవలసి వస్తే కొంత సంకోచపడక తప్పదు. ఎంతటి తెలివితేటలు, ధైర్యం గల పెద్దలైనా ఈ వివరాల జోలికి వెళ్తే ఇబ్బందిపడవలసిందే. కొన్ని ఆదర్శాలను పాటిస్తూ కొన్ని నిర్దిష్ట విలువలను సాధించాలని తహతహలాడే తల్లితండ్రులు లైంగిక విజ్ఞానమంటే అవయవాలకు సంబంధించిన విషయంగా కాక, అందుకు అతీతమైన ఉదాత్త, పవిత్ర వ్యవహారంగా పరిగణించి భంగపడతారు. తోటివారి నుంచి పిల్లలు సంపాదించే అరకొర జ్ఞానం వల్ల ప్రమాదం అని భావించి, పూర్తిగా శాస్త్రీయంగా పిల్లలకు ఈ సంగీతాలు వివరించదలచినా తల్లితండ్రులకు ఇబ్బంది తప్పదు. వివరణ, భాష వేరైనా పిల్లల పుట్టుక అనేది రెండు రకాలుగా జరగదు. అది సంభవించే, సాధ్యమయ్యే పద్ధతిపై ఎవరికీ సందేహం, అనుమానం, భిన్నాభిప్రాయాలు ఉండేందుకు తావు లేదు.



అలెగ్జాండర్ వోల్జిన్ ఇల్లు కొత్తగా కట్టిన భవన సముదాయంలో నాలుగో అంతస్తులో గల కొత్త అపార్ట్‌మెంట్. అలెగ్జాండర్ తండ్రి టిమోఫీ పెట్రోవిచ్ అంతరంగిక భద్రతాశాఖ అధికారి. ఆయన యూనిఫారం భుజానికి రెండు వెండి పతకాలుంటాయి. చొక్కా గుండీల వద్ద మరో రెండు నక్షత్రాల పతకాలుంటాయి. అలెగ్జాండర్‌కు ఇవి ఎంతో ముఖ్యమైనవి. వాటికంటే తండ్రి వద్ద ఉండే బ్రౌనింగ్ తుపాకి మరింత ముఖ్యమైంది. ఈ బ్రౌనింగ్ రివాల్వర్ పాత నాగంట్ రివాల్వర్ కంటే మంచి ఆయుధం. అయినా తండ్రి టిమోఫీ ఆ పాత తుపాకిని అత్యంత ఆప్యాయంగా తన బల్ల సొరుగులో దాచుకుంటాడు. ఆ తుపాకితోనే తాను చేసిన యుద్ధం గురించి కథలు కథలుగా వివరిస్తాడు. ఆయన ఆ పోరాటంలో ఉండేనాటికి ఈ ఇల్లు కానీ, ఈ కుటుంబం కానీ లేదు. అలెగ్జాండర్ పుట్టనే లేదు. ఆ రోజుల గురించి స్కూల్లో ఉపాధ్యాయులు వివరిస్తారు. కానీ వారెవరికీ ఆ అనుభవాలు లేవు. పుస్తకాల్లో ఆ పోరాటానికి సంబంధించిన గాథలు ఎన్నో ఉంటాయి.

సోషలిస్టు విప్లవం అనంతరం విప్లవ ప్రతీఘాత శక్తులను ఎదుర్కొనేందుకు ఏర్పడిన రహస్య పోలీసు విభాగం 'చెకా' సాగించిన పోరాటం గురించి విన్నప్పుడు నాగంట్ రివాల్వర్ ప్రాధాన్యం

అర్థం అవుతుంది. కేవలం ఇరవైమంది 'చెకా' సిబ్బంది అర్ధరాత్రి వేళ నడి శీతాకాలంలో మంచు కుప్పల మధ్యనుంచి దూసుకుపోతూ, పట్టణం శివార్లలో పెద్ద సంఖ్యలో ఉన్న బందిపోటు ముఠాను ఎదుర్కొన్న వైనం, చీకటిలో పొదలమాటునుంచి మొదటి రైఫిళ్లతో, తరువాత నాగంట్ రివాల్వర్లతో వారు సాగించిన పోరాటం, తూటాలు అయిపోతున్నప్పుడు చివరిగా ఒకే ఒక తూటాను తమకోసం దాచుకున్న వీరుల శౌర్యం గురించి తెలిసినప్పుడు మాత్రమే నాగంట్ రివాల్వర్ పాత్ర బోధపడుతుంది. అంత గొప్ప తుపాకి ప్రస్తుతం నాన్న బల్లసొరుగులో భద్రంగా ఉంది. పుస్తకాల నుంచి కథలు చదివి చెప్పే టీచర్లెవరూ దాన్ని చూసి ఉండరు. పోనీ ఆ టీచర్‌కు దాన్ని చూపిద్దామని ప్రయత్నించినా, వాళ్లు భయంతో అరిచి, క్లాసు గదినుంచి పారిపోతారని అలెగ్జాండర్‌కు తెలుసు. అటువంటి పోరాట జీవితంలో తండ్రికి కొన్ని ప్రత్యేక హక్కులు, నిబంధనలూ ఉండేవని కూడా వాడికి తెలుసు. తండ్రి వద్ద గల తుపాకులు, ఆయన దుస్తులపై గల పతకాలు చూసి అలెగ్జాండర్ గర్వంతో ఉప్పొంగేవాడు. కానీ, తండ్రి టిమోఫీ మాత్రం హుందాగా, ఆరోగ్యంగా, బలంగా, ప్రశాంతంగా ఉండేవాడు.

ఇక అమ్మ గురించి - ఆమె తన టీచర్లలా తుపాకి చూపిస్తే పరుగులెత్తే రకం కాదు. ఎందుకంటే తండ్రి పోరాటంలో ఉన్నప్పుడు, ఆమె కూడా స్వయంగా వేరే ప్రాంతంలో అదే పనిలో నిమగ్నమై ఉంది. అప్పటికే అక్క నాద్య ఉంది. కానీ ఆమె వయసు కేవలం ఏడాది. అందువల్ల ఆమె నాటి పోరాట గాథల్లో కనిపించదు. ఆమెకిప్పుడు పదిహేడేళ్లు. అక్క అంటే అలెగ్జాండర్‌కు తగని ప్రేమ. అదసలు విషయం కాదు. అమ్మ, అవును అమ్మ ఎప్పుడూ యోధురాలే. ప్రస్తుతం ఆమె విద్యా విభాగంలో పని చేస్తోంది. ఆమె వద్ద ప్రస్తుతం తుపాకులూ, పతకాలూ లేవు. ఇవన్నీ కాక ఆమె ఎంతో మనోహరంగా ఉంటుంది. ఆమె వద్ద నిజంగా రివాల్వర్, పతకాలూ ఉంటే ఎలా ఉండేదో అలెగ్జాండర్ ఊహకి అందదు. తల్లి చేసిన ఏదో పోరాటం, సేవ అలెగ్జాండర్‌కు ముఖ్యం కాదు. ఆమె వాడి తల్లి అంతే. వీడామెని అపరిమితంగా ప్రేమిస్తున్నాడు.

★ ★ ★

దర్జీ పనివారి కొత్త డిజైన్లను ధరించే బొమ్మల్లా ఉండే అలెగ్జాండర్ స్నేహితులను వాడి తల్లి ఆమోదించదు. ఆ స్నేహితులు తమ తల్లితండ్రులను ఎంత ప్రేమిస్తున్నారనేది తెలుసుకోవడం కష్టం. వారు ఆ విషయాన్ని బయట మాట్లాడరు, ప్రదర్శించరు. అయినా అందుకు వ్యవధి ఏదీ. తీరిక ఎక్కడ? వాళ్లకు ఎన్ని సమస్యలో..! స్థానికంగా జరిగే ఆటల పోటీలు, కొత్త స్నేహాలు, కొంటె పనులు, పక్కనే వేస్తున్న కొత్త రోడ్లు, రేడియో, స్కూలు ఇన్ని వ్యవహారాలు చక్కబెట్టాలి. ఎంతమందితో కలవాలి! ఎంత మాట్లాడాలి! ఎన్ని సంబంధాలు కొనసాగించాలి! ఎంత కష్టం! చివరకు వోలోద్యా యువరోవ్ సైతం ఒక్కొక్కసారి చికాకు పడతాడు.

ఈ వోలోద్యా యువరోవ్ ఎప్పుడూ నవ్వడు. అంతా ఇంగ్లీషు వాళ్ల ధోరణి. అందరికీ ఈ విషయాలు తెలుసు. కొందరు పిల్లలు వోలోద్యాను అనుకరిస్తూ గంభీరంగా ఉందామని ప్రయత్నించినా, ఒక్కరోజు మించి అది సాధ్యపడేది కాదు. మర్నాడే వాళ్లు కోతుల్లాగా ఇకిలిస్తూ పళ్లు బయటపెట్టే వాళ్లు. ఎప్పుడో ఒకసారి వోలోద్య తన పెదాలు వంకర్లు తిప్పి నవ్వుతున్నట్టు కనిపించేవాడు. కానీ అది నవ్వే అని తేల్చుకోవడం అంత తేలిక కాదు. అలెగ్జాండర్‌కు అతని ధోరణి చూసి గౌరవం కలిగేది. కానీ ఎన్నడూ అతన్ని అనుకరించేందుకు ప్రయత్నించడు.

వాడు ఎప్పుడూ నవ్వుతూ, వేళాకోళం చేస్తూ సరదాగా ఉంటాడు. వాడి నాలుకకు పదును ఎక్కువ. వాడిని రెచ్చగొట్టడం అంటే పిల్లలందరికీ భయం. చివరకు టీచర్లు కూడా ఆ నాలుక పదునేమిటో అనుభవపూర్వకంగా తెలుసుకున్నారు.

అయితే కొంతమంది టీచర్లకు అలెగ్జాండర్ వంటి కుర్రవాళ్ల సంగతి తెలియక సమస్యలని కొనితెచ్చుకుంటారు. కొద్దిరోజుల క్రితం రష్యన్ భాష అధ్యాపకుడు ఇవాన్ కిరిలోవిచ్ త్వరలో తాను పుష్కిన్ సాహిత్యాన్ని బోధించనున్నట్టు ప్రకటించాడు. ఆయన అది మొదలుపెట్టేలోపే వోలోద్యా పుష్కిన్ సాహిత్యాన్ని బడికి తెచ్చి పిల్లలకు దాని రుచి చూపించాడు. ఇది తెలియని టీచర్ కరిలోవిచ్ తాను పుష్కిన్‌ను 'సరైన రీతి'లో పిల్లలకు పరిచయం చేస్తానని ప్రకటిస్తూ పాఠం ప్రారంభించాడు. అయితే ఆయన మగపిల్లలకు అత్యంత ఆసక్తిదాయకమైన భాగాల్ని కావాలనే విస్మరించాడు. పాఠం సాగుతూండగా అలెగ్జాండర్ లేచి నిలిచి "ఇక్కడ కనిపిస్తున్న దాన్ని బట్టి (ప్రయత్నిస్తే) మంచి ఫలమే దొరికే అవకాశం ఉన్నట్టు తోస్తోంది." అన్న వాక్యం చదివి దీనర్థం ఏమిటని టీచర్‌ని ప్రశ్నించాడు.

వాక్యంలోకి "ఇక్కడ కనిపిస్తున్న"వేమిటో పిల్లలకు తెలుసు. పుష్కిన్ అక్కడ, ఆ వాక్యంలో ఒక స్త్రీ పాదాలని వర్ణించాడు. చాలా వివరంగా రాశాడు. మగపిల్లలందరికీ అది బాగా నచ్చింది. తరగతిలోని బాలికలకు ఈ వాక్యాలు చూపించి, దాని ప్రభావం వారిపై ఎలా ఉంటుందోనని మగపిల్లలు గమనించారు. కానీ బాలికలు అదేం పట్టించుకోలేదు. వోల్యా స్ట్రాగోవా అనే అమ్మాయి మాత్రం చదివి ఫకాలున నవ్వింది. ఆ తరువాత ఆమె ఏమన్నదో గుర్తు వస్తేనే మగ పిల్లలు సిగ్గు పడతారు.

"పసికూనలు, పాలు తాగే పిల్లలు, మీకేం తెలుసు?" అందా పిల్ల.

మిగిలిన విద్యార్థినులు పెద్ద పెట్టున నవ్వారు. అలెగ్జాండర్ మొహం అవమానంతో కందింది. అతను వోలోద్యా వంక సాభిప్రాయంగా చూశాడు. కానీ వోలోద్యా మొహంలో ఏ భావమూ లేదు.

"మాకు తెలుసో లేదో ఇప్పుడు చర్చ ఎందుకు? దానర్థం ఏమిటో చెప్పరాదూ?" అని అన్నాడు వోలోద్యా పళ్లబిగువున.

ఈ ప్రశ్నతో వోలోద్యాను ఇబ్బంది పెడదామని వాడి ఉద్దేశం. కానీ వోల్యా అంతకంటే తెలివైనది. ఆమె వోలోద్యా వంక జాలిగా, అల్లరి పిల్లవాడి వంక చూస్తున్నట్టు చూసి, "ఇవేం పెద్ద అర్థంకాని వాక్యాలు కాదు. కానీ నువ్వు ఇంకా పసికందువి. కొంచెం పెరిగి పెద్దయితే నీకే తెలుస్తుంది" అంది.

ఇటువంటి సందర్భాలను అందరూ తేలికగా తీసుకోలేరు. ఇటువంటి పరీక్షా సమయంలో పరాజయం పాలైతే, ప్రతిష్ట దెబ్బ తింటుంది. పరపతి అదృశ్యమవుతుంది. హోదా మిగలదు. ఏళ్ల తరబడి అతి కష్టంపై నిర్మించుకున్న సంబంధాలన్నీ క్షణంలో మాయమవుతాయి. ఈ విషయం తెలియబట్టే వోలోద్యా స్నేహితులంతా వాడేం సమాధానం చెబుతాడా అని ఊపిరి బిగపట్టి ఎదురుచూశారు. కానీ, వోలోద్యా సమాధానం ఇవ్వలేదు. మౌనం పాటించాడు. వోల్యా, ఆమె స్నేహితురాళ్లు గర్వంగా తలలెగరేసి అక్కడినుంచి వెళ్లిపోయారు. ఆమె స్నేహితురాళ్లు ఇద్దరూ ఆమె చెరో చెయ్యి పట్టుకుని హుందాగా నడిచి వెళ్లారు. మగపిల్లలు ఎవరూ మాట్లాడ

లేదు. వోలోద్య పెదాలు వంకర్లు తిప్పి తన అసహనాన్ని ప్రదర్శించాడు. చివరికి కోసాల్య నోరు విప్పాడు. "దెబ్బ తిన్నావు. ఇప్పుడేం చేస్తావు? ఏమన్నా చేయాలి కదా?" అన్నాడు.

అందరూ దీనితో ఏకీభవించారు. వోలోద్యాకు అవమానం జరిగింది. ప్రతిగా ఏమైనా చేయాలి. ఆలస్యం కాకూడదు. ఈ అవమానాన్ని మరచిపోయేలా చేసేందుకు అలెగ్జాండర్ సాగించిన ప్రయత్నాలు ఏవీ వోలోద్యాను ఊరటపరచలేదు. "ఏమైనా చేయాలి" అంతే. పైగా క్లాసు గదిలో వోల్యా ఆమె స్నేహ బృందం ప్రదర్శిస్తున్న నిర్లక్ష్యం, ఆ గదిలో తాము తప్ప మరెవరూ లేనట్టు తలబిరుసుగా వ్యవహరిస్తున్న ధోరణి వోలోద్యాను కించపరిచాయి. అలెగ్జాండర్ సైతం ప్రతీకార వాంఛతో రగులుతున్నాడు. అందుకే వినయం నటిస్తూ టీచర్ కెరిలోవిచ్‌ని ఆ ప్రశ్న అడిగాడు. ఆయన ఇచ్చే సమాధానాన్ని బట్టి ఆడపిల్లలను ఇబ్బంది పెట్టడం, గేలి చేయడం లాంటి అవకాశాల కోసం అలెగ్జాండర్ ఎదురు చూస్తున్నాడు. గదిలో అందరికీ ఆడ పిల్లలకు, మగపిల్లలకీ, టీచర్‌కీ ఈ విషయం అర్థమైంది. కానీ కెరిలోవిచ్ అర్థం కానట్టు నటించాడు. "నేను చెబుతున్నది ఏమిటి? నువ్వు అడిగేదేమిటీ. రెండు వేర్వేరు విషయాలపై ఒకేసారి చర్చ ఎందుకు?" అన్నాడు.

టీచర్ కూడా వివరించడానికి ఇబ్బంది పడుతున్నాడనే సంగతి గ్రహించాడు అలెగ్జాండర్. వాడి ఉత్సాహం ఇనుమడించింది. " అది కాదండీ, దొరకబోయే మంచి ఫలం గురించి రచయిత అస్పష్టంగా చెప్పాడు. అది నాకు అర్థం కాలేదు. మీకూ అర్థం కాలేదా?" అని విజయగర్వంతో ప్రశ్నించాడు.

అంతవరకూ ఇబ్బందితో తికమకపడిన టీచర్ కిరిలోవిచ్ క్షణంలో దాన్నుంచి తేరుకున్నాడు.

"మనం ప్రస్తుతం పాఠంలోని వేరే విషయం గురించి తెలుసుకుంటున్నాం. ఇప్పుడు పక్కదారి పట్టాల్సిన పనిలేదు. ఏదేమైనా ఒకటి రెండు రోజుల్లో నేనే స్వయంగా మీ ఇంటికి వస్తాను. మీ తల్లితండ్రుల సమక్షంలోనే నువ్వడిగిన అనుమానం తీరుస్తాను. సరేనా?" అన్నాడు.

దీంతో అలెగ్జాండర్ మొహం పాలిపోయింది. నిస్సహాయ స్థితిలో పడ్డాడు. బిడియంగా, మర్యాద పూర్వకంగా "సరేనండీ" అని గొణుగుతూ కూర్చుండిపోయాడు.

"తరగతి గదిలో అడిగిన అనుమానాన్ని ఇంటి దగ్గర తీర్చడమేంటి?" అన్నాడు వొలోద్యా పళ్లబిగువున. వాడు అలెగ్జాండర్ వంక తినేసేట్టు చూశాడు.

కానీ టీచర్ కిరిలోవిచ్ ఈ మాటలు వినపడనట్టు నటిస్తూ పాఠం కొనసాగించాడు.

మూడు రోజులు గడిచాయి. కానీ ఆ రోజు క్లాసురూంలో జరిగిన సంఘటనను అలెగ్జాండర్ మరచిపోలేదు. వాడికి ఆందోళనగా ఉంది. ఇంటి దగ్గర ఎవరెప్పుడు తలుపు తట్టినా వాడే భయం భయంగా తలుపు తీసేవాడు. అయినా టీచర్ ఇంకా రాలేదు. ప్రస్తుతం అలెగ్జాండర్ బాగా చదివేస్తున్నాడు. హోంవర్క్ అతి శ్రద్ధగా పూర్తి చేస్తున్నాడు. తరగతి గదిలో నిశ్శబ్దంగా ఉంటున్నాడు. వోలోద్యా వంక చూడడం మానుకున్నాడు. కిరిలోవిచ్ కనుక ఇంటికి వచ్చి జరిగినది చెప్తే ఏమవుతుందో వాడి ఊహకి అందడం లేదు. ఇంతవరకూ అలెగ్జాండర్ స్కూలు విషయంలో తండ్రికి ఎప్పుడూ అసంతృప్తి, కోపం కలిగించలేదు. మంచి మార్కులే తెచ్చుకుంటూ బడి విషయం ఇంట్లో చర్చ కాకుండా జాగ్రత్తపడుతున్నాడు. తనంత తాను బడి సంగతులు ఎప్పుడూ ఇంట్లో చెప్పేవాడు కాదు. ఆ నేపథ్యంలో ఇప్పుడు ఈ ఆపద విరుచుకుపడింది.

బళ్లో టీచర్ చెబుతున్న పాఠం వింటూ వేరే ప్రశ్నలు వేయడం పాపం కాదు. అంతవరకూ తండ్రి ఏమీ అనడు. కానీ స్త్రీ పాదాల గురించి వర్ణించిన రచయిత దొరకబోయే మంచి ఫలం గురించి రాసినప్పుడు - అసలాయన ఎందుకు రాయాలి? - దాన్ని గురించి ప్రశ్న అడగడం తండ్రికి సైతం చికాకు అనిపించవచ్చు. ఇదీ అలెగ్జాండర్ అనుమానం. తండ్రి స్పందన ఎలా ఉంటుందనేది వాడు అంచనా వేయలేకపోతున్నాడు. స్త్రీల పాదాలు.. వాటిని బట్టి దొరకబోయే అనుభవం గురించి తండ్రితో ఎలా మాట్లాడడం. వాడికి నిద్రపట్టేది కాదు.

ఓ రోజు వోలోద్యా అడిగాడు. "టీచర్ మీ ఇంటికి వచ్చాడా?" అని

"రాలేదు."

"వస్తే ఏం చేస్తావు?"

"తెలియదు."

"నాకేం అర్థం కాలేదు కనుక అడిగానని చెప్పు."

"అబ్బే ఏం కుదరదు. మా నాన్నని మోసం చేయలేం. మనం అల్లరికే అడిగినట్టు తెలిసిపోతుంది" అలెగ్జాండర్‌కు తండ్రి అవగాహనపై నమ్మకం.

"ఏముంది, బుకాయించు, తెలియకే అడిగానని చెప్పు" వోలోద్యా సలహా. మిత్రుడికి సాయపడదామన్నదే వోలోద్య ఉద్దేశం. కానీ తండ్రిని మోసం చేయడం అలెగ్జాండర్‌కు ఇష్టం లేదు.

చివరికి ఈ విషయం అనుకోని రీతిలో అలెగ్జాండర్‌ను నిలదీసింది. ఉన్నట్టుండి నాన్న అన్నాడు "నాద్యా చెప్పింది...."

అక్క... నాద్య... ఆమెవల్ల ఈ విషయం ఇంట్లో చర్చగా మారుతుందని అలెగ్జాండర్ వూహించలేదు.

నాన్న కొనసాగించాడు. సవివరంగా మాట్లాడాడు. అలెగ్జాండర్ మొహం కందిపోయింది. అవమానంతో తల ఎక్కడైనా దాచేసుకోవాలనిపించింది. "నాద్యాకేం తెలియదని" బుకాయించబోయి, మధ్యలోనే మాట మింగేశాడు. నాన్న వాడి వంక ఒకసారి చురుగ్గా చూశాడు. మాట్లాడడం కొనసాగించాడు. తండ్రి వంక కన్నెత్తి చూడకుండా తలవంచుకు కూర్చున్న అలెగ్జాండర్‌కు ఆయన యూనిఫారం చేతుల చివరన గల పతకాలు మాత్రం కనిపిస్తున్నాయి. తండ్రి మాటలు వింటుంటే తనెంత అసందర్భంగా ప్రవర్తించాడో, అదెంత తప్పో అలెగ్జాండర్‌కు అర్థమవుతోంది. తలఎత్తి ఆయన వంక చూశాడు. ఆయన వాడి వంకే పరీక్షగా చూస్తున్నాడు.

అలెగ్జాండర్ ఒకసారి కుర్చీలోంచి లేచి, మళ్లీ కూర్చున్నాడు. వాడికి తెలియకుండానే కళ్లమ్మట నీళ్లు వస్తున్నాయి. అందుకు కూడా వాడు సిగ్గుపడ్డాడు.

"నాకు అర్థమైంది నాన్నా. నువ్వు చెప్పినట్టే చేస్తాను" అన్నాడు.

"పర్వాలేదు. ముందు కుదుటపడు. నీ మాట నమ్ముతాను. నీ జోలికి రాను. నువ్వు అన్నీ తెలిసిన, తెలుసుకున్న వ్యక్తివని భావిస్తాను."

★ ★ ★

మొత్తానికి క్లాసులో జరిగిన సంఘటన ఇంటిదాకా చేరిందని, నాన్న దాని గురించి తనతో మాట్లాడాడనీ అలెగ్జాండర్ తన మిత్రుడు వోలోద్యాకు చెప్పాడు.

వాడు మొహం చిట్లించి "మీ నాన్న ఏమన్నాడు?" అని అడిగాడు.

"ఏముందీ ఆయన నాతో మాట్లాడారు."

"అప్పుడు నువ్వు ఏడ్చి ఉంటావ్. కదూ?" వోలోద్యా వెక్కిరింత.

అలెగ్జాండర్ ఏమీ మాట్లాడలేదు.

వోలోద్యా వాడిని హేళన చేయడం ఆపలేదు. "నానన కాబట్టి ఆయన చెప్పినదంతా సరైన దనుకుంటున్నావేమో. అలాగేం ఉండదు. పెద్దవాళ్లకూ కొన్ని విషయాలు తెలియకపోవచ్చు. వాళ్లూ ఎన్నో తప్పులు చేసి ఉండవచ్చు. కానీ అవేం చెప్పరు. ఎంతసేపూ మన తప్పులే వెదుకుతారు" అన్నాడు.

అలెగ్జాండర్ వాడికి ఓపికగా వివరించాడు. 'అదేం కాదు. నాన్న నన్ను తప్పు పట్టలేదు. ఆ పాఠంలోని ఆ వాక్యాల గురించి టీచర్‌ని సవాలు చేయడం మంచి సంస్కారం కాదన్నాడంతే.'

"అంటే మంచి సంస్కారం ఏమిటో?" వోలోద్య హేళన.

అలెగ్జాండర్ వాడిని లెక్క చేయలేదు. తనలో తాను ఆలోచించుకుంటున్నట్టుగా తండ్రి మాటలని గుర్తు తెచ్చుకున్నాడు. "బతుకుల్లో కొంత నిగూఢమైనదీ, రహస్యమైనదీ ఉంటుంది. అయితే నిజంగా అది రహస్యమా అంటే కాదు కూడా. ఆ రహస్యం అందరికీ తెలుసు. లేదా తెలుస్తుంది. రహస్యమైనంత మాత్రాన అది పనికిమాలిన విషయం అనుకోవద్దు. అది రహస్యం అంతే. ఆ సంగతి అందరికీ తెలుసు. తెలుసని అందరూ తమ శృంగార జీవితాలను గురించి బహిరంగంగా చర్చించరు. అది సంస్కృతి. మీరంతా కుర్రవాళ్లు. శృంగారానికి సంబంధించిన నాలుగు వాక్యాలు కనిపించగానే ఉత్సాహపడిపోయి నాలుకలు వేలాడేసి, చొంగ కారుస్తారు. తెలిసీ తెలియని విషయాల గురించి, అందులో బహిరంగ రహస్యమైన ఇటువంటి విషయాల గురించి వదరడం కంటే ముఖ్యమైన సంగతులెన్నో చర్చించుకోవచ్చు. కానీ మీరు మీ నాలుకలను ఆవు తోకలా ఉపయోగిస్తున్నారు. ఈగలని తోలడం కంటే ఆవుకి తోకతో వేరే పనిలేదు. కానీ మనుషులకు నాలుక అంతకంటే ముఖ్యమైన పనికి వినియోగపడుతుంది." ఇదీ నాన్న అన్నది. ఈ సంగతే వాడు వోలోద్యాకు చెప్పాడు.

"మీ నాన్న చాలా తెలివైనవాడు కదూ?" అన్నాడు వోలోద్యా అదే ధోరణిలో.

"నీ ఉద్దేశం ఏమిటి?"

"సరే, అంత చర్చించకూడని విషయమైతే పుష్కిన్ దాని గురించి అంత రాశాడేం? మీ నాన్నని అడగలేకపోయావా?"

"ఆయనే చెప్పాడు. పుష్కిన్ గొప్ప కవి. అద్భుతమైన రీతిలో కవితాత్మకంగా ఆయన స్త్రీ పాదాల గురించి వర్ణించాడు. అదీ అందమంటే. అందం గురించి మీకేం తెలియదు. అర్థం చేసుకోకుండా దాని గురించి వెకిలిగా, అసభ్యంగా మాట్లాడడం గొప్ప సంగతేం కాదు అన్నాడాయన" అని అలెగ్జాండర్ వివరించాడు.

వోలోద్యా నవ్వబోయి ఆగాడు. "ఇంకేమన్నాడేం?" అని ప్రశ్నించాడు.

అలెగ్జాండర్ గుర్తు చేసుకున్నాడు. "ఆయన నీ గురించి కూడా వ్యాఖ్యానించాడు."

"నా గురించా? ఏమన్నాడు?"

"మీ వోలోద్య ఇంగ్లీషువాడిలా లేని గాంభీర్యాన్ని నటిస్తాడు కాని నిజానికి వాడు కుసంస్కారి - ఇదీ మా నాన్న వ్యాఖ్య" అలెగ్జాండర్ చెప్పాడు.

"ఆహాఁ నీకు సంతోషం కలిగి ఉంటుంది. నువ్వు మంచి సంస్కారం గల మేధావివి. నేనేమో అదేమిటో తెలియని అనాగరికుడిని. అంతేకదా నీ ఉద్దేశం."

"నేను, మా నాన్న నీ గురించి అన్న మాటలు చెప్పాను. నేను సంతోషించానా, లేక ఆయనతో ఏకీభవించానా అన్నది చర్చనీయాంశం కాదు."

"అలాగేం..... అహఁ..... అలాగన్నమాట. మొత్తానికి మీ నాన్న నిన్ను భలే చవటని చేశాడు. బావుంది. చాలా బావుంది. నీలాంటి వాళ్లతో స్నేహం ప్రమాదకరమే. నువ్వు గొప్ప సంస్కార వంతుడివి. నీ అక్కేమో స్కూల్లో జరిగే సంగతులన్నీ ఇంటికి మోసేస్తుంది. ఏంటంటే, క్లాసులో జరిగే సంగతులను ఆడపిల్లలు మీ అక్కకి చెపుతారు. ఆవిడ ఇంట్లో ఆ విషయాలన్నీ వివరిస్తుంది. బావుంది. మరీ నీ అక్క నాద్యా ఎలాంటిదో నీకు తెలుసా?" ప్రశ్నించాడు వోలోద్య.

"ఎలాంటిదంటావు?"

వోలోద్య వెంటనే బదులివ్వలేదు. వాడి కళ్లు నిప్పులు చెరుగుతున్నాయి. వాడి అహం దెబ్బతిన్నదని అర్థమవుతూనే ఉంది. వాడు అక్క గురించి ఎటువంటి ఆరోపణ చేయగలడు అన్నది అలెగ్జాండర్‌కు అర్థం కాలేదు. అక్క నాద్యపై వాడికెలాంటి అనుమానం లేదు. ఇంట్లో తన ఘనకార్యాన్ని వివరించింది ఆమే అయినా తనకి ఎందుకో కోపం రాలేదు. పైగా తనని తాను నిందించుకున్నాడు. ఆ అక్క గురించి వోలోద్యకు ఏదో తెలుసు. కానీ వాడు మాట్లాడడం లేదు. చివరికి అలెగ్జాండర్ మళ్లీ అడిగాడు.

"చెప్పు అక్క గురించి ఏదో అన్నావు. ఏమిటి?"

"తప్పక చెబుతాను. కానీ ఇప్పుడు కాదు. ఇంకా కొన్ని వివరాలు తెలుసుకున్నాక నీతో చెబుతాను" అన్నాడు.

అప్పటికి అలా వివాదం సర్దుబాటైంది. కానీ అలెగ్జాండర్ మాత్రం వోలోద్యా చెప్పబోయి, ఆగిన సంగతేమిటని గాఢంగా ఆలోచించాడు. అక్క కూడా అదే స్కూల్లో పదో తరగతి చదువుతోంది. అలెగ్జాండర్ ఐదో క్లాసు. తరగతి గదిలో పుష్కిన్ రాసిన వాక్యాల గురించి తను చేసిన అల్లరికి బానే ప్రచారం లభించినట్టుంది. ఈ ఆడపిల్లలకు ఓ గుణం ఉంది. వాళ్లు మనముందు తలఎత్తి ఠీవిగా నడుస్తూ మనలను పట్టించుకోనట్టే వ్యవహరించినా వాళ్లలో వాళ్లు మన గురించి మాట్లాడుకుంటారు. కాబట్టే అక్క వరకూ ఈ సంగతి వెళ్లింది.

క్లాసులో గర్వంగా తల ఎగరేసి తిరుగుతూ మగపిల్లలని పురుగుల్లా చూసే వోల్యా స్త్రాగోవా ప్రతిరోజూ కోల్యా అనే కుర్రవాడితో కలిసి ఇంటికి వెళ్తుంది. తమ ఇద్దరి ఇళ్లు పక్కపక్కనే ఉన్నాయి కాబట్టి కోల్యాతో కలిసి వెళ్తున్నట్టు ఎవరూ అడగక పోయినా వివరణ ఇచ్చింది. దారిలో ఇద్దరూ కలిసి ఐస్‌క్రీం పార్లర్‌కు వెళ్తారు కూడా. ఆ పిల్ల తమను హీనంగా చూడడం, పైగా క్లాస్‌రూంలో జరిగిన సంగతులను పెద్ద క్లాసుల్లో ఉన్న పిల్లలకు చెప్పడంపై వోలోద్యకు ఆగ్రహం తగ్గలేదు. ఒకరోజు వాడు వోల్యకు ఒక చిన్న లేఖ పంపాడు.

"వోల్యా స్త్రాగోవాకు, మాకేం తెలియదని, అర్థం కాదనీ నీ ఉద్దేశం. కానీ మాకన్నీ తెలుసు. కోల్యా..... షికార్లు బానే ఉంది. తెలివైన కుర్రవాడే. కాని దాని గురించి చెప్పుకోనేందుకు ఏముంది, ఏమీలేదు" ఇదీ ఆ ఉత్తరం. క్లాసు గదిలోనే వోల్యా దాన్ని అందుకోవడం, చదువుతూ ఆగ్రహంతో కళ్లు చిట్లించడం వీళ్లు గమనిస్తూనే ఉన్నారు.

తరువాత, అదేరోజు వోల్యా ప్రత్యుత్తరం పంపింది.

"వోలోద్యా యువరోవ్‌కు, నువ్వుత్త బడుద్దాయివి. నీ బుర్ర కొంచెం ఎదిగినప్పుడు ఆ సంగతి తెలియచేయగలవు."

ఈ అవమానం నుంచి తేరుకునేందుకు వోలోద్యకు మూడు రోజులు పట్టింది. అప్పుడు వోల్యాకు మరో సూటైన ఉత్తరం రాసి పంపాడు. కానీ ఆమె దాన్ని చదవకుండానే తిప్పి పంపింది. దానిపై "ఈ ఉత్తరం రాసినది యువరోవ్. కాబట్టి చదవనవసరం లేదు" అని రాసింది.

ఆమె ఇంకా రోజూ కోల్యతో తిరుగుతూనే ఉంది. ఆడపిల్ల కాబట్టి టీచర్లు ఏమీ అనరు. అలెగ్జాండర్ దృష్టిలో ఆడపిల్లలంతా ఇంతే. వారికేవేవో రహస్యాలుంటాయి. ఐదో తరగతిలో ఉన్న ఆడపిల్లలకు క్లాసులోని మగపిల్లలంటే చిన్నచూపు. వాళ్లు ఎప్పుడూ పై తరగతివైపే దృష్టి సారిస్తారు. ఎనిమిది, తొమ్మిది, పదో తరగతి పిల్లలతోనే కబుర్లు, నవ్వులూ... వాళ్ల రహస్యాలేమిటో అలెగ్జాండర్‌కు అర్థం కావు.

వోలోద్యకు ఈ తతంగమంటే బాగా చిన్నచూపు. వాడెప్పుడూ ఆడపిల్లల గురించి, ముఖ్యంగా పై తరగతులు చదివే పెద్ద పిల్లల గురించి నమ్మశక్యం కాని విషయాలు చెబుతాడు. తాను చెబుతున్న అసభ్యకరమైన కబుర్లను తోటివాళ్లు నమ్ముతున్నారా, లేదా అన్నది కూడా వాడు పట్టించుకోడు. అసలు తను చెబుతున్న కథల్లో ఏమైనా నిజం ఉందా అని తెలుసుకొనే ఆసక్తి వాడికే లేదు. ఎంతసేపూ అలా జరిగేందుకు గల అవకాశాలు, సాధ్యాసాధ్యాలు, వాటి వివరాల గురించే వాడు ఆలోచిస్తాడు. వోలోద్యా కథలను ఎవరూ నమ్మరు. కానీ అందరూ చెవులు అప్పగించి వాటిని వింటారు.

పై తరగతుల్లోని ఆడపిల్లలంటే అలెగ్జాండర్ క్లాసులోని మగపిల్లలందరికీ అంతులేని ఆకర్షణ. చెప్పలేని భయం. చివరకు వోలోద్యా సైతం భయపడతాడు. ఆ ఆడపిల్లలకు ఓ ఉత్తరం రాసే ధైర్యం ఎవరికీ లేదు. అసలేం రాస్తారు? ఆ పెద్ద పిల్లల వ్యవహారం వీళ్లకి ఎన్నటికీ అర్థం కాదు. వాళ్ల వంక దొంగచూపులు చూద్దామన్నా బెదురే, మనం చూస్తున్నప్పుడే వాళ్లు మనల్ని చూస్తే ఏం చేయాలి? అయినా ఒక్కొక్కసారి ఈ మగప్లిలు ఎక్కడలేని ధైర్యం కూడదీసుకుని బడి ఆవరణలో తలవంచుకుని పరుగుతీస్తూ, ఎదురుగా వస్తున్న ఆడపిల్లలను చూడనట్టే వారిని రాసుకుంటూ ముందుకు వెళ్తారు. ఆమె రొమ్ము, తొడ.... ఏ భాగం తమకు తగిలినా జన్మ ధన్యమైనట్టు భావిస్తారు. కానీ ఇది చాలా చవకబారు వినోదం అని అలెగ్జాండర్ అభి ప్రాయం. అదీకాక అటువంటప్పుడు దొరికిపోతే ఎంత ప్రమాదం! క్రితం ఏడాది వాళ్ల క్లాసుల్లోనే ఇల్యా అనే ఇటువంటి దుందుడుకు కుర్రవాడు ఒకడు ఉండేవాడు. వాడు తరచు ఆడపిల్లలను ఇలా ఢీకొని సరదాపడేవాడు. పైగా క్లాసులో టీచర్ లేనప్పుడు పై తరగతుల అమ్మాయిల గురించి నానా చెత్త వాగేవాడు. ఆ మాటలు వింటేనే మిగిలిన పిల్లల బుగ్గలు సిగ్గుతో ఎర్రబారేవి. వాడి కబుర్లు ఇంకెవరైనా వింటున్నారా అనే అనుమానంతో చుట్టూ ఉన్నవాళ్లు పరిసరాలను జాగ్రత్తగా పరిశీలించేవారు. అమ్మాయిలను వేధించేందుకు ఒక ప్రయత్నం చేసిన ఇల్యాకు విచిత్రమైన అనుభవం ఎదురైంది. అతను ఎవరినైతే ఏడిపించబోయాడో ఆ పిల్ల ఆగి, వాడి వంక సూటిగా చూసింది. ఇల్యా ఏమీ తెలియనట్టు అమాయకంగా నవ్వాడు. ఆ పిల్ల మాత్రం

"ముందు ముక్కు తుడుచుకో, రుమాలు ఉందా?" అంది. ఈ పనికిమాలిన పనులు టీచర్ల దృష్టికి వచ్చాయో లేదో తెలియదు కానీ, చివరకు బాగా మార్కులు రానందుకు, చదవనందుకు శిక్షగా వాడిని బడినుంచి పంపేశారు.

ఇక అలెగ్జాండర్ విషయానికి వస్తే వాడికి పై క్లాసుల అమ్మాయిలంటే ఏమీ వ్యతిరేకత లేదు. ఎటువంటి అభిప్రాయం ఉందో రహస్యం. ఆ రహస్యం వాడికే అంతు పట్టదు. అయితే మిగిలిన అబ్బాయిల కంటే అలెగ్జాండర్ పరిస్థితి కాస్త మెరుగు. ఇంట్లోనే అక్క నాద్య ఉంది. ఆమె వాడికెప్పుడూ అర్థం కాదు. కానీ అక్క అంటే వాడికి తగని ప్రేమ. అక్క స్నేహితురాళ్లు తరచు వాళ్ల ఇంటికి వచ్చేవారు. అద్భుతమైన కళ్లు, మృదువైన చెంపలు, చక్కటి జుత్తు గల ఈ పిల్లలంతా హుందాగా వ్యవహరించేవారు. వాళ్ల వంక అలా చూస్తుండిపోవడం అలెగ్జాండర్‌కు ఎంతో ఇష్టం. కానీ భయం. తనలో రహస్యంగా మెదిలే ఆలోచనల గురించి కలలు కనడమన్నా వాడికి భయమే.

అక్క, ఆమె స్నేహితురాళ్లు ఒక్కోసారి అలెగ్జాండర్‌ను తమతో చేరనిచ్చేవారు. అలా అని పిల్లవాడనే దయతో ఏం కాదు. వాళ్లతో వాడు చక్కగా వ్యవహరించేవాడు. గట్టిగా మాట్లాడుతూ, అందరినీ నవ్విస్తూ సరదాగా ఉండేవాడు. వాళ్లకి ఐస్‌క్రీం కావాలన్నా, సినిమా టికెట్లు కావాలన్నా పరుగులు పెట్టి తెచ్చేవాడు. అయితే ఇదంతా పైపై మర్యాదే. లోపల మాత్రం వాడు తెగ గింజుకునేవాడు. ఆ అమ్మాయిల ధీమా ఏమిటో వాడికి బోధపడేది కాదు. శారీరకంగా, బల హీనంగా ఉన్నప్పటికీ, అనేక విషయాల్లో మగపిల్లలకు ఉండే ప్రావీణ్యం లేనప్పటికీ వాళ్ల తెలివితేటలు మాత్రం వాడిని అబ్బురపరిచేవి. అంతెందుకు వాళ్లలో ఒక్కరైనా గురిచూసి ఒక రాయిని తిన్నగా విసరలేరు. అయినా ఒకసారి అక్క స్నేహితురాలు క్లావా అనే అమ్మాయి, అలెగ్జాండర్ చెంపల్ని తన మృదువైన, వెచ్చటి చేతుల్లోకి తీసుకుని "ఈ పిల్లవాడు సొగసైన యువకుడుగా ఎదుగుతాడు చూడండి" అంది. అలెగ్జాండర్ శరీరంలో రక్తం ఒక్కసారిగా వేడెక్కి పరుగులు ప్రారంభించింది. వాడసలు తిన్నగా ఊపిరి తీసుకోలేకపోయాడు. ఆ ఉద్వేగం నుంచి తేరుకుని పరిశీలించేసరికి అమ్మాయిలంతా అప్పటికే వాడి గురించి మరచిపోయి, వేరే విషయాలు మాట్లాడుకుంటున్నారు. ఆ రాత్రి నిద్రపట్టక దొర్లాడు. కలలో అమ్మాయిలంతా వాడికి తెల్లటి మబ్బు తునకల్లా కనిపించారు.

వాళ్ల గురించి ఎలా ఆలోచించాలో, ఏం ఆలోచించాలో అలెగ్జాండర్‌కు స్పష్టంగా తెలిసేది కాదు. కానీ వాళ్లకీ బతుకులో సంతోషానికీ మధ్య ఏదో సంబంధం ఉందని మాత్రం వాడికి అర్థమయ్యేది. అందువల్లనే తన స్నేహితులు ఆ అమ్మాయిల గురించి చెప్పే చెత్తకథలను వాడెప్పుడూ నమ్మేవాడు కాదు. అందుకే వోలోద్య ఇప్పుడు అక్క నాద్య గురించి చేస్తున్న వ్యాఖ్యలను వాడు నమ్మదలచలేదు. ఒకసారి వోలోద్య అడిగాడు.

"మీ అక్క ఇంటికి వెళ్లడం నువ్వు ఎప్పుడైనా గమనించావా?" అని.

"ఏమిటి అందులో విశేషం?"

"మీ అక్క వెంట ఎందరు కుర్రవాళ్లు నడుస్తారో చూడు."

"అయితే ఏమిటి?"

"వాళ్లంతా ఊరికే, పనిలేకే ఆమె వెంట తిరుగుతున్నారని నమ్ముతున్నావా?"

వోలోద్య మాటలను వాడు పెద్దగా పట్టించుకోలేదు కానీ, అక్క బడినుంచి ఇంటికి తిరిగి వెళ్తున్నప్పుడు వాడు జాగ్రత్తగా గమనించాడు. నిజంగానే ఆమె ఐదుగురు అబ్బాయిలతో కలిసి నడుస్తోంది. వాళ్లంతా నవ్వుతూ, కబుర్లు చెప్పుకుంటూ ముందుకు వెళ్తున్నారు. ఆ దృశ్యం చూసిన అలెగ్జాండర్ మనసులో ఎక్కడో సన్నగా ఈర్ష మెదిలిందే తప్ప, వాళ్లలా వెళ్లడం వాడికి తప్పనిపించలేదు.

ఇంతలో వసంతం వచ్చింది. ఆకాశంలో ఇప్పుడు సూర్యుడు చాలాసేపు డ్యూటీ చేస్తున్నాడు. పిల్లలంతా పనిలో నిమగ్నమయ్యారు. పడవ షికార్లు, ఈత, పరీక్షలకు చదువు.... తీరికే ఉండడం లేదు. అక్క నాద్య మరింత కష్టపడి పరీక్షలకు తయారవుతోంది. సాయంత్రం వేళల్లో ఆమె సహాధ్యాయినులు ఇంటికి వచ్చి చదువు గురించి మాట్లాడుకునేవారు. కొందరు అబ్బాయిలు కూడా వచ్చేవారు. వాళ్లలో తప్పు పట్టేందుకు చివరకు వోలోద్యకు కూడా ఏమీ కనిపించలేదు.

ఇలా అందరూ పరీక్షలకు సిద్ధమవుతున్నప్పుడు ఒకరోజు రాత్రి భోజనాల తరువాత, చాలా సేపటికి నాన్న పేపరు పక్కన పెట్టి, "నాద్య ఇంకా ఇంటికి రాలేదు?" అన్నాడు అమ్మతో.

అమ్మ గడియారం వంక చూసి, "నేనూ అదే ఆలోచిస్తున్నాను. సాయంత్రం నాలుగుగంటలకు చదువుకునేందుకు స్నేహితుల దగ్గరకు వెళ్తున్నానని చెప్పి బయలుదేరింది" అని చెప్పింది.

"సరే, కానీ ప్రస్తుతం రాత్రి ఒంటి గంట అవుతోంది" అన్నాడు నాన్న అసహనంగా.

"నాకూ కంగారుగానే ఉంది" అంది అమ్మ.

ఆయన అసహనంగా మొహం చిట్లించి పేపరు అందుకున్నాడు. కానీ చదివే ఉద్దేశంలో లేడని తెలుస్తూనే ఉంది. గదిలో ఒక మూల ఏదో పుస్తకంలో తల దాచుకున్న కొడుకుని చూశాడాయన.

"అలెగ్జాండర్. ఇంత పొద్దుపోయింది. ఇంకా పడుకోలేదేం?" అని ప్రశ్నించాడు.

"రేపు సెలవే నాన్న" నసిగాడు అలెగ్జాండర్.

"చాల్లే పడుకో"

వాడు వెంటనే భోజనాల గదిలో సోఫాలో పడుకునేందుకు తయారయాడు. కానీ నిద్ర పట్టడంలేదు కళ్లు మూసుకునే జరగబోయే పరిణామాల కోసం ఆసక్తిగా ఎదురుచూశాడు.

రాత్రి రెండవుతుండగా నాద్య ఇంటికి వచ్చింది. మెల్లగా, భయంభయంగా తలుపు తట్టింది. తలుపు తోసి లోపలికి వచ్చింది. అక్కడ పరిస్థితి చూడగానే తానేదో తప్పు చేసిన సంగతి ఆమెకు అర్థమైంది. బయట హాల్లో అమ్మానాన్నలు నాద్యతో చిన్న గొంతుతో ఏదో మాట్లాడారు. "సంజాయిషీ చెప్పవలసిన సంగతిగా నీకు అనిపించడంలేదూ?" అని అమ్మ అక్కను నిలదీయడం వాడికి వినిపించింది. వాళ్లు ముగ్గురూ లోపల పడక గదిలోకి వెళ్లారు. వాళ్ల సంభాషణ కొనసాగింది. అలెగ్జాండర్‌కు ఒక్క ముక్క వినిపించలేదు. వినిపించినదేమో కొరుకున పడలేదు. అయినా చెవులు అప్పగించి వినేందుకు వాడు తాపత్రయపడ్డాడు. వాడికి నిద్ర పట్టడం లేదు. ఆసక్తి నిలవనివ్వడం లేదు. కానీ నాన్న అంటే భయం. తనకు తెలియకుండా ఏదో జరిగిపోతోంది. ఏమై ఉంటుంది. తెగని ఆలోచన. ఇంతలో మెల్లగా నిద్ర కమ్ముకుంది. అక్క నాద్య, ఆమె స్నేహితురాలు క్లావాల మొహాలు వాడికి కలలో కనిపించాయి. ఏవేవో ఆలోచనలు.....

మరునాడు వాడు అక్క మొహంలోకి ఆసక్తిగా చూశాడు. రాత్రి సంఘటన తాలూకా ఛాయల కోసం. అదేమీ తెలియలేదు కానీ, ఆమె కళ్ల కింద నల్లటి చారలున్నాయి. మొహం పాలిపోయి, విచారంగా, ఏదో ఆలోచిస్తున్నట్టు కనిపించింది. వాడికి అక్క అంటే సానుభూతి కలిగింది. అంతకంటే రాత్రి అసలు ఏం జరిగిందో తెలుసుకోవాలని ఆసక్తి పెరిగింది.

అప్పటినుంచి వాడు ఇంట్లో వాళ్లందరినీ జాగ్రత్తగా గమనిస్తూ, ఎవరేం మాట్లాడుకుంటున్నా వినేందుకు ప్రయత్నిస్తున్నాడు. విషయం ఏమిటో తెలిసీ తెలియనట్టు తెలుస్తోంది. ఒకరోజు వాడి సెలవురోజున వాళ్ల నాన్న తెల్లవారుజామునే లేచి మిత్రులతో కలిసి వేటకు బయలుదేరాడు. అప్పుడాయన ఇంట్లో అందరినీ నిద్రలేపి హడావుడి చేశాడు. అలెగ్జాండర్‌కు మెలకువ వచ్చినా, కళ్లు గట్టిగా మూసుకుని నిద్ర నటించాడు. నాన్న వెళ్లిన తరువాత అక్క నెమ్మదిగా నడుచుకుంటూ అమ్మానాన్నల పడకగదిలోకి వెళ్లింది. ఆ గదిలో అమ్మా అక్కల మధ్య సంభాషణ మొదలైంది. ఎప్పటిలానే అలెగ్జాండర్ చెవులు తెరిచి వినేందుకు ప్రయత్నించాడు. వినపడడం లేదు, వినిపించిన నాలుగు ముక్కలూ అర్థం కావడం లేదు. అమ్మ అంటోంది. "ప్రేమని పరీక్షించుకోవాలి. అసలు అదేమీ లేకుండానే ఒక మనిషి తాను ప్రేమలో పడ్డాననుకుంటాడు. వెన్న కొనేప్పుడైనా అది ఎటువంటిదో పరీక్షిస్తాం కదా. అలాంటిది హఠాత్తుగా కలగా అనుభూతులను విశ్వసించి, వాటి వెనుక గుడ్డిగా పరుగులు పెట్టడం పిచ్చితనం కాదా?"

"ప్రేమను పరీక్షకు పెట్టడం అసాధ్యం కదా?" నాద్య ప్రశ్న.

తరువాత కొద్దిసేపు నిశ్శబ్దం. నెమ్మదిగా మాట్లాడుకుంటున్నారేమో. లేక అమ్మ నాద్య తలని నిమురుతోందా? వాడి ఆలోచనలు తెగకముందే అమ్మ గొంతు వినిపించింది. "చిత్రంగా మాట్లాడతావు. ప్రేమను పరీక్షించడం అది నిజమైనదా, బలమైనదా, మంచిదా కాదా అని తెల్సుకోవడం అతి సులభం."

"అమ్మా అది చాలా కష్టం అమ్మా" నాద్య బహుశా దిండులోనో, తల్లి వొడిలోనో బోర్లా పడుకుని ఉండాలి. ఆమె గొంతు రాసుకుపోయినట్టు వినిపించింది.

అలెగ్జాండర్ ఆత్రం ఆగలేదు. గబుక్కున లేవబోయాడు. కానీ లెక్క ప్రకారం తాను ఇప్పుడు నిద్రపోతుండాలి. లేస్తే వాళ్లు మాటలు ఆపేస్తారు.. ఆ విషయం గుర్తొచ్చి మళ్లీ అయిష్టంగా సోఫాలో వాలి, కళ్లు మూసుకున్నాడు.

"కష్టమే కావచ్చు. కానీ కొంత అనుభవం కలిగితే అది సులభం" అమ్మ సలహా.

"అమ్మా భలే చెప్తావే. కొంత అనుభవమా? ప్రేమలో ఆ అనుభవం ఎలా వస్తుంది? ప్రేమించడానికి ముందు నేను అనుభవజ్ఞురాలనైన ప్రేమికురాలిని అవాలా? చిత్రంగా మాట్లాడుతున్నావమ్మా" నాద్య గొంతులో అసహనం. అక్క ఇంక ఏడుస్తుంది. తప్పదు అనుకున్నాడు అలెగ్జాండర్ భయంగా.

"నాద్య, నేను చెబుతున్న అనుభవం ప్రేమకు సంబంధించినది కాదు. జీవితంలో అనుభవం సంపాదించాలని" అమ్మ విశదపరచింది.

"నాకేం అనుభవం ఉంది?" అక్క అనుమానం.

"ఎందుకు లేదు? నీకు పదిహేడేళ్లు. ఎంతో అనుభవం ఉంది."

"అమ్మా నాకు అర్థం కావడం లేదు. ఏమైనా చెప్పు. చెప్పమ్మా" అక్క ఆత్రంగా అడుగుతుంది.

"నీకు తెలియదా? ఎందుకు నటన?"

"నేను.. నటిస్తున్నానా?" అక్క గొంతులో నివ్వెరపాటు.

"కాక మరేమిటి? ఆడవారికి ఉండవలసిన ఆత్మ గౌరవం, మర్యాద గురించి తెలియదా? ఈ గౌరవ, మర్యాదలు లేని యువతిని ఏ మగవాడూ గౌరవించడు. విలువ ఇవ్వడు. అందువల్ల అనుభూతుల వొత్తిడి ఎంత తీవ్రమైనా, క్షణంలో కలగా ఉద్వేగానికి చోటివ్వకూడదు. నిన్ను నువ్వు అదుపులో ఉంచుకోవాలి."

"కానీ.. అదే ప్రేమ అనిపిస్తే? దానికే తలవంచాలనిపిస్తే.. ఎలా?" అక్క అడుగుతోంది.

"సరే నువ్వంత బలహీనురాలివైతే ఏం చేయగలం? తలవంచు. కానీ గుర్తుంచుకో ఇలా బలహీనతలకు లొంగేవారు చివరకు తమ జీవితాలను పాడు చేసుకుంటారు" అమ్మ హెచ్చరిక.

"కానీ. అమ్మా మునుపు ఈ విషయాల్లో పెద్దలు, సమాజం కఠినంగా ఉండేవారు. కానీ ఇప్పుడు ఈ స్వేచ్ఛ ఏమిటి? కావలసిన వాడిని ప్రేమించవచ్చు, పెళ్లాడవచ్చు... విడాకులు ఇవ్వచ్చు. ఇటువంటి స్వేచ్ఛ ఎలా వచ్చింది. ఎందుకు?"

అమ్మ స్థిరంగా సమాధానం చెప్పింది."నిజమైన ప్రజలను సోవియట్ ప్రభుత్వం విశ్వసిస్తుంది. ఈ నిజమైన, నిఖార్సయిన వ్యక్తిత్వం గల మనిషి ఏం చేయాలో సరిగ్గా నిర్ణయించుకోగలడు. అతను తన జీవితాన్ని చిందరవందర చేసుకోడు."

"నేను అలా చేసుకుంటున్నానా?"

"ఎందుకు వచ్చింది ఆ అనుమానం?"

"ఎందుకంటే... నేను ప్రేమలో పడ్డాను... దాదాపుగా ప్రేమలో పడ్డాను..."

ఈ మాట విని అలెగ్జాండర్ ఉలిక్కిపడ్డాడు. దిండు మీద నుంచి తలపైకి ఎత్తి మరికాస్త శ్రద్ధగా సంభాషణ వినేందుకు ప్రయత్నించాడు.

అమ్మ అంటోంది. "దాదాపుగానా... నిజంగానా... అన్న అనుమానం భయం నాకేం లేవు. నీవు తెలివైన పిల్లవి, నిగ్రహం ఉంది. అందుకే నేను నిన్ను కోప్పడడం లేదు."

"మరి ఈ విమర్శ దేనికి?"

'నువ్వింత బలహీన మనస్కురాలివని నేను అంచనా వేయలేదు కనుక. ఆత్మగౌరవం, మర్యాదకు విలువ విస్తావని అనుకున్నాను కనుక. కానీ నువ్వేం చేశావు? ఒక యువకుడిని రెండుసార్లు కలుసుకొన్నావు. అంతే అతనితో అర్ధరాత్రి దాకా గడిపి వచ్చావు. ఏమనాలి నిన్ను' అమ్మ గొంతులో కొంత పదును.

తరువాత నిశ్శబ్దం. ఎవరూ మాట్లాడలేదు. అక్క బహుశా సిగ్గుతో, అవమానంతో దిండులో తల దూర్చి పడుకుందేమో. ఇంతలో అమ్మ ఆ గదిలోంచి బయటకు, వంట గదిలోకి నడిచింది. అలెగ్జాండర్ అప్పుడే లేచినట్టు పెద్దగా చప్పుళ్లు చేస్తూ, దగ్గుతూ, కళ్లు నులుముకుంటూ హడావుడి చేశాడు. అందరూ బల్ల దగ్గర కూర్చున్నప్పుడు అమ్మ వంక, అక్క వంక చూపులు మార్చి, మార్చి చూశాడు. తనకి సంగతి తెలుసన్న విషయం వాళ్లిద్దరికి తెలియదన్న జ్ఞానం వాడికి ఆనందం కలిగించింది. అక్క మామూలుగా ఉండేందుకు ప్రయత్నించింది. నవ్వుతూ సరదాగా మాట్లాడింది. ఆమె కళ్లు మాత్రం నిద్ర లేమి వల్లనో, ఏడవడం మూలంగానో ఎర్రగా ఉన్నాయి. జుట్టు సరిగ్గా దువ్వలేదు. తల్లి తల వంచుకుని టీ కప్పులోకి చూస్తూ పొడిగా నవ్వుతోంది. ఆ

నవ్వులో విచారమే ఎక్కువగా ఉంది. ఉన్నట్టుండి ఆమె కొడుకు వంక చూసింది. "ఏంట్రా అలా మిర్రి మిర్రి చూస్తున్నావు?" అని అడిగింది. అలెగ్జాండర్ ఉలిక్కిపడి, సర్దుకున్నాడు. "నేనా? అదేంలేదే!" అన్నాడు.

నాద్య తమ్ముడి వంక నవ్వుతూ చూసి తల ఆడించింది. ఏమీ మాట్లాడలేదు. ఆ రోజు వాడికి భౌగోళిక శాస్త్రంలో చివరి పరీక్ష. అదే గుర్తు వచ్చి గభాలున లేచి ఆ పుస్తకం అందుకున్నాడు.

బడికి వెళ్తూ దారంతా ఉదయం అమ్మగదిలో జరిగిన, తను విన్న సంభాషణను నెమరు వేసుకున్నాడు. వాడికి కులాసాగా అనిపించింది. తనకు ఆ రహస్యం తెలిసిపోయిందన్న అనుమానమే ఎవరికీ లేదు. అదీ వాడి ఆనందం, అక్క కూడా ఏదో పొరపాటు చేసిందని అర్థమై వాడి సంతోషంగా అనిపించింది. అదే సమయంలో ఆమెకు ఏమైనా అవుతుందేమోననే భయం కలిగింది. వాడి ఊహలో వినీల ఆకాశంలో తెల్లటి మబ్బులు... అమ్మాయిల గుంపు.. తేలియాడుతోంది. అందరూ ఆహ్లాదకరంగా ఉన్నారు. అదే సమయంలో వాళ్ల గురించి వోలోద్యా చేస్తున్న వ్యాఖ్యలు, చెప్పే కబుర్లు నిజమేనేమో అనే అనుమానం కలిగింది. అంతలోనే అది అదృశ్యమై అమ్మ పొద్దున్న అక్కతో జరిపిన సంభాషణ గుర్తు వచ్చింది. ఆమె చెప్పిన మాటలు చాలా ముఖ్యమైనవని వాడికి తట్టింది. అయితే వాటి గురించి ఏం ఆలోచించాలో తెలియలేదు. ఆ మాటల్లోని తెలివితేటలు, వాటి బలం వాడికి అర్థమయ్యాయి. ఆత్మగౌరవం లేని అమ్మాయికి ఒక మగవాడు విలువ ఇవ్వడన్న అమ్మ మాటలకు అర్థం ఏమిటి? ఇదేదో ఆసక్తికరంగా అని పించింది. తనకు సంబంధించిన వ్యవహారంలా తోచింది. మగవాడు అంటే, తనే. తండ్రి నాలుగు రోజుల క్రితం తొలిసారి తన గురించి ఆ మట అన్నప్పటి నుంచీ వాడి మనసులో అది మెదులు తూనే ఉంది. తను మగవాడు. ఆ పదమే బలానికీ, దృఢచిత్తానికి పర్యాయపదంలా అనిపించింది. ఇంతలోనే వాడి బుర్రలో వోలోద్యా, ఇది వరకటి ఇల్యాలు సవివరంగా చెప్పిన చెత్త కథలు మెదిలాయి. క్షణాల్లో మళ్లీ మబ్బుల గుంపుల మధ్య ఆ ఆడపిల్లలు ప్రత్యక్షమయ్యారు.

అలెగ్జాండర్ బడికి త్వరగా వచ్చాడు. పరీక్ష పదకొండు గంటలకు. ఇప్పుడు సమయం పావు తక్కువ పది. చాలామంది పిల్లలు బడి ఆవరణలో తలోమూలా కూర్చుని చివరి క్షణం చదువులో ఉన్నారు. మరికొందరు మ్యాప్‌లో వివిధ పట్టణాలను గుర్తించడంలో తలమునకలై ఉన్నారు. వోలోద్యా మాత్రం వీరందరినీ పర్యవేక్షిస్తున్నట్టు రెండు చేతులు వీపు వెనక పెట్టుకుని గంభీరంగా పచార్లు చేస్తున్నాడు. వీడికి ఇవాళ్టి పరీక్షకు చదవాల్సింది ఏమీ లేదా? అనే అనుమానం వచ్చింది అలెగ్జాండర్‌కు. వోలోద్యా వీడిని సమీపించి రెండు ప్రశ్నలేవో వేశాడు. తనకు పెద్ద మార్కులు అవసరం లేదని ఓ మాదిరి వస్తే చాలనీ చెప్పాడు. అకస్మాత్తుగా వాడు అలెగ్జాండర్‌ని పరీక్షగా చూస్తూ, "అంటే మీ అక్కకు పెళ్లి అయిపోయినట్టేనా?" అని ప్రశ్నించాడు.

అలెగ్జాండర్ ఉలిక్కిపడ్డాడు. కళ్లు పెద్దవి చేసి వెర్రిగా చూస్తూ "ఏమిటీ?" అని అడిగాడు.

"ఓ, భలే... అక్కకి పెళ్లి అయిపోయిలది. తమ్ముడికి ఆ సంగతే తెలియదు. భలే ఉంది" అన్నాడు వోలోద్య.

""ఏంటి అంటున్నావు? పెళ్లేమిటి? ఎలా?"

"భలే అమాయకుడివిరా. పెళ్లి ఎలా అంటావా? ఏముంది అయిపోతుంది. అంతే...

ఒకటి... రెండు... తొమ్మిది నెలలు గడిస్తే వాళ్లకో పిల్లాడు కూడా..." అన్నాడు వోలోద్యా.

అలెగ్జాండర్‌కి వెర్రి కోపం వచ్చింది. "నువ్వు అబద్ధం చెబుతున్నావు" అన్నాడు.

వోలోద్యా పెద్ద మనిషి తరహాలో నవ్వి, భుజాలు ఎగరేసి "నీకే తెలుస్తుందిలే" అంటూ అక్కడి నుంచి వెళ్లిపోయాడు. అలెగ్జాండర్ బొమ్మలా నిలబడిపోయాడు. ఒక క్షణం తరువాత అక్కడ బెంచీపై కూలబడ్డాడు. తనిప్పుడు మగవాడు. అలానే ఆలోచించాలి అనుకున్నాడు. అదృష్టవశాత్తూ పరీక్ష సులభంగానే ఉంది. వాడు బాగా రాసి ఆనందంగా ఇంటికి వచ్చాడు. కానీ ఇంట్లో అక్కను చూడగానే వాడి ఉషారు అంతా ఆవిరైంది. అక్క నాద్య ఏదో రాసు కుంటోంది. వాడు ఆమె వైపు నడిచాడు.

"ఎలా రాశావు పరీక్ష?" అని అడిగిందామె.

"పరీక్షకేం అద్భుతం. కానీ నువ్వో సంగతి చెప్పాలి."

"ఏమిటది?"

అలెగ్జాండర్ భారంగా నిట్టూర్చి "చూడు, నాకు చెప్పు. నీకు పెళ్లయిందా, లేదా?"

"ఏమిటీ?" నిర్ఘాంతపోయినట్టు చూసింది నాద్య.

"అవును. పెళ్లయిందా?" రెట్టించాడు అలెగ్జాండర్.

"నాకు... పెళ్లా? ఏంటి వాగుతున్నావు?"

"కాదు చెప్పు... అయిందా, లేదా?"

నాద్య తమ్ముడి వంక తదేకంగా చూస్తూ లేచి నిలబడి, వాడి భుజాలు గట్టిగా పట్టుకొంది. "చెప్పు.. ఏంటి నీ ఉద్దేశం? నువ్వేం అడుగుతున్నావు?" అని గట్టిగా అడిగింది.

అలెగ్జాండర్ అక్క వంక చూశాడు. ఆమె కోపంగా చూస్తోంది. ఆ చూపులో ద్వేషం ఉంది. ఆమె వాడిని ఒక్క తోపు తోసి గదిలోంచి లోపలికి పరుగు తీసింది. పడకగది నుంచి నాద్య ఏడుపు వినిపించింది. వాడికేం చేయాలో తెలియలేదు. ఆలోచిస్తూ భోజనాల గదిలోకి నడవ బోయాడు. అక్కడ గుమ్మంలోనే తల్లి ఎదురైంది.

"అక్కతో ఏం చెత్త కూశావు?" తల్లి కోపంగా అడిగింది.

దీంతో అలెగ్జాండర్‌తో నాన్న మళ్లీ సుదీర్ఘంగా మాట్లాడవలసి వచ్చింది. ఇప్పుడు కూడా తలఎత్తి తండ్రి వంక చూడకుండా ఆయన యూనిఫారం చేతి చివరన ఉన్న నక్షత్ర పతకాలపైనే దృష్టి నిలిపాడు. కానీ ఇదివరలోలా ఇప్పుడు కలవరపడడం లేదు. ధైర్యంగా ఉన్నాడు. అందుకే ఒకసారి ఆయన వంక చూశాడు. ఆయన దయగా నవ్వి "చెప్పు ఏమిటీ నీ వ్యవహారం?" అన్నాడు.

"నేను మీకు వాగ్దానం చేశాను...."

"ఏమని?"

"ఇకపై జ్ఞానం వచ్చిన యువకునిలా ప్రవర్తిస్తానని."

"అవును."

"అదే చేశాను... చేస్తున్నాను."

"కానీ ఒక్క విషయంలో పొరబడ్డావు?" అన్నాడాయన ప్రశాంతంగా.

"అంటే నేను సరిగా వ్యవహరించలేదంటారా?"

"అవును. నువ్వు నాద్యను ఆ సంగతి అడగాల్సింది కాదు.

"మరి ఎవరు అడగాలి?"

"నేను"

"మీరా?"

"అవును నేనే. అసలేమైంది. నీకేం తెలుసు? ఎలా తెలుసు? చెప్పు అన్నాడు నాన్న కుర్చీలో సర్దుకుని కూర్చుంటూ.

అలెగ్జాండర్ గొంతు విప్పాడు. అక్క ఆ రోజు ఆలస్యంగా రావడం, తల్లితండ్రులతో సంభాషణ. తరువాత నాన్న వేటకు వెళ్లినప్పుడు అమ్మ - అక్కల మాటలు వినడం, బడిలో వోలోద్యా చెప్పిన విషయం, చేసిన వ్యాఖ్యనం.. అన్నీ పూసగుచ్చినట్టు వివరంగా చెప్పాడు.

నాన్న శ్రద్ధగా తుదికంటా విన్నాడు. ఒక్క ప్రశ్నకూడా వేయకుండ తల ఊపుతూ విన్నాడు. తరువాత ఆయన లేచి నిలబడి బల్లపై నుంచి సిగరెట్ పెట్టి తీసి అందులోంచి ఒక సిగరెట్‌ను అందుకుని ముట్టించాడు. ఏదో ఆలోచిస్తూ తన చుట్టూ దట్టమైన పొగమేఘాన్ని సృష్టించాడు. ఒక తల విదిల్చి, పెదాల మధ్య సిగరెట్ తీయకుండానే అలెగ్జాండర్‌ని అడిగాడు.

"ఇంతకీ ఈ సంగతులన్నీ నీకెందుకు తెలియాలంటావు?"

"అప్పుడు వోలోద్యా ఆ కూత కూయడు."

"ఏమని?"

"అక్కకి పెళ్లి అయిపోయిందని."

"ఎందుకనకూడదు?"

"అది అబద్ధం కనుక."

"పోనీ వాడిని అబద్ధమాడనివ్వు."

"కానీ వదిలేస్తే వాడిలానే అబద్ధాలు చెబుతూ పోతాడు."

"అయితే ఏం నష్టం. దాంట్లో హానేం ఉంది కనక? పెళ్లి కావడం చెడ్డపనా?

"అది కాదు. పెళ్లయిపోయిందన్నాడు. ఇంకా చెత్తసంగతులు మాట్లాడాడు" అలెగ్జాండర్ తండ్రికి వివరించలేకపోతున్నాడు.

"అంటే నీకు అర్థం అయిందిగా?"

"అయింది."

తండ్రి వాడి దగ్గరికి వచ్చి, వాడి గడ్డం పట్టుకుని తల పైకెత్తి కళ్లలోకి చూశాడు.

"నువ్విప్పుడు బాలుడివి కావు. మగాడివి. ఎదిగిన మనిషివి. ఇకనుంచి అన్ని సంగతులు ఇలానే అర్థం చేసుకోవాలి" అన్నాడు.

★ ★ ★

మరునాడు స్కూల్లో అలెగ్జాండర్ రోజు కూర్చునే బెంచిలో కాక, వోలోద్యాకు దూరంగా కూర్చునాడు. కానీ క్లాసు అయిపోయిన తరువాత వోలోద్యా వాడి దగ్గరికి వచ్చి ఇకిలించాడు. అలెగ్జాండర్ చీదరించుకుని వాడిని అవతలికి పొమ్మన్నాడు.

"అంటే, నేను నీ వెంట పడతాననుకున్నావా?" అంటూ తల ఎగరేసి వోలోద్యా దూరం జరిగాడు. ఈ కథ ఇంతటితో అయిపోవాల్సిందే. కానీ పరీక్షలు పూర్తయిన పదిహేను రోజులకు ఇక స్కూలుకు సెలవులు ప్రకటించినప్పుడు అలెగ్జాండర్ బడినుంచి బయటకు వస్తున్నాడు.

అక్కడ పిల్లల గుంపులో వోలోద్యా నిలబడి వెకిలిగా నవ్వుతూ "పదో తరగతిలోని క్లావా గురించి మీకేం తెలియదు. ఆ పిల్ల మొన్న...." అంటూ ఏదో చెబుతున్నాడు. వాడి చుట్టూ చేరిన పిల్లలకు అవన్నీ అబద్ధాలని తెలిసినా ఆసక్తిగా వింటున్నారు. అలెగ్జాండర్ సహించలేకపోయాడు.

"ఆపు నీ చెత్త వాగుడు. అబద్ధాలు కట్టిపెట్టు" అన్నాడు. అంటూ గుంపులో జొరబడి వోలోద్యా ఎదుట నిలిచాడు.

వోలోద్యా వీడి వంక బద్ధకంగా చూసి, "అబద్ధమా? అయితే ఏమైందిట?" అన్నాడు వెటకారంగా.

"నువ్వు చెప్పేవన్నీ అబద్ధాలే. కాకమ్మ కథలే" అలెగ్జాండర్ రగిలిపోతున్నాడు.

చుట్టూ ఉన్న పిల్లలు వాడి గొంతులో పదును గుర్తించారు. దూరంగా జరిగారు.

వోలోద్యా మాత్రం మొహం చిట్లించి, "నీ చెత్త వాగుడు వినే టైం నాకు లేదు" అంటూ అక్కడి నుంచి కదలబోయాడు.

"ఆగు, కదలద్దు" హెచ్చరించాడు అలెగ్జాండర్.

"ఎందుకో?"

"నేను కొట్టబోతున్నాను కనుక."

వోలోద్యా మొహం ఎర్రబారింది. అయిన వాడి మొహంలో ఇంగ్లీసు వాడి గాంభీర్యం నిలిచే ఉంది. "ఏదీ కొట్టు చూద్దాం" సవాలు చేశాడు.

మరుక్షణం అలెగ్జాండర్ పిడికిలి బిగించి వోలోద్యా చెవిపై బలంగా చరిచాడు. వోలోద్యా అందుకు సిద్ధంగా ఉన్నాడు. వెంటనే స్పందించి ప్రత్యర్థిని కొట్టాడు. పదమూడేళ్ల పిల్లల కొట్లాటల్లో విజేతలెవరో, ఓడిందెవరో తేల్చడం కష్టం. ఈలోగా స్కూల్లోని పెద్ద పిల్లలు వచ్చి విడదీసే దాకా ఇద్దరూ కొట్టుకుంటూ దొర్లుతున్నారు. అప్పటికే ఇద్దరి ముక్కులనుంచీ రక్తం కారుతోంది. చొక్కా గుండీలన్నీ ఊడిపోయాయి.

"ఏంటీ గొడవ? ముందు కొట్టిందెవరు?" అని అడిగారు సీనియర్ కుర్రవాళ్లు, "ఇద్దరు కొట్టుకున్నారు" గుంపులోంచి ఎవరో అరిచారు.

"అదేం కాదు" క్లాసులో ఎప్పుడు బాగా చదివి ప్రథమశ్రేణి తెచ్చుకొనే కుర్రవాడు కోసాల్య రంగంలోకి దిగాడు. 'అదేం కాదు. ఇద్దరినీ తప్పు పట్టడం పొరపాటు. వాడు వోలోద్యాగాడు అందరి గురించి చెత్తంతా వాగుతుంటే సహించలేక అలెగ్జాండర్ కొట్టాడు. వాడు తిరగబడ్డాడు' అని వివరించాడు. "అలాంటి వాడిని కొట్టాల్సిందే" అని చివరన జోడించాడు.

పిల్లలంతా గట్టిగా నవ్వారు.

వోలోద్యా లేచి చొక్కా అంచుతో ముక్కు తుడుచుకుంటూ, చుట్టూ చూసుకుంటూ అక్కడినుంచి వేగంగా వెళ్లిపోయాడు. వాడి నడకలో మునుపటి గాంభీర్యం లేదు.



సెక్సు సమస్యను గురించి పిల్లలతో మాట్లాడకుండా ఉంటే, వారి అనుమానాలను తీర్చి సరైన దారిలో నడిపించకపోతే కొత్త సమస్యలు తలెత్తుతాయి. పెద్దలు పిల్లలతో ఈ విషయాలను చర్చించకపోయినా, ఎదుగుతున్నకొద్దీ మిత్రుల నుంచి, పరిసరాలనుంచీ పిల్లల తమకు కావలసిన జ్ఞానాన్ని పోగుచేసుకుంటారు. అయితే ఈ అరకొర జ్ఞానం వల్ల వారు ప్రేమ అన్న

భావనను తేలికగా చూస్తారు. అది వారికి చవక అయిపోతుంది. సరైన పద్ధతిలో ఈ విషయాలను తెలుసుకోకపోవడం వల్ల ప్రేమలో అంతర్భాగమైన వాంఛ గురించే ఎక్కువ పట్టించుకుంటారు. శృంగారం అనుభూతుల గురించి కాని, అనుభవాల కోసం వారు తపించే అవకాశమూ ఉంది. ప్రేమకు సంబంధించిన సున్నితమైన అనుభూతులను అనుభవించ గలగాలంటే యువతీ యువకులకు నిగ్రహం అత్యవసరం. ఈ నిగ్రహం, సంయమనం అనేవి బాల్యం నుంచే ఒక పద్ధతిలో అలవాటై, అది వారి జీవన విధానంగా మారడం అవసరం. అనుభూతుల వొత్తిడిని, ఊహలను, కాంక్షలను నియంత్రించుకోగల సామర్థ్యం యువతీ యువకులకు ఏర్పడాలంటే ముందు వారికి శారీరకంగా, పవిత్రంగా ఉండటం అన్న భావనపై గౌరవం కలగాలి.

లైంగిక విద్య అవసరం గురించి మాట్లాడేవారిలో చాలామంది, దానిని పూర్తిగా ప్రత్యేక అంశంగా, జాగ్రత్తగా, రహస్యంగా పరిశీలించవలసిన విషయంగా పరిగణిస్తారు. మరికొందరు అసలు మనిషి అభివృద్ధి, వ్యక్తిత్వ వికాసం లాంటి మౌలిక అంశాలనే ఇది ప్రభావితం చేయగలదని, ఒక వ్యక్తి స్త్రీయా, పురుషుడా అన్న దానిపైనే వారి వారి వ్యక్తిత్వాలు ఆధారపడి ఉంటాయనీ, అందువల్ల విద్య అంటే ప్రధానంగా లైంగిక విద్యే అనీ భావించేవారున్నారు. ఈ రెండు వర్గాల వారి ఆలోచనల్లో వైరుధ్యం ఉన్నప్పటికీ రెండు రకాల వారూ పిల్లలకు ప్రయత్న పూర్వకంగా, ప్రత్యేకంగా లైంగిక విద్యా బోధన జరగవలసిన అవసరం ఉన్నదని భావించేవారే.

అయితే లైంగిక విద్యను మిగిలిన అంశాల నుంచి వేరు చేసి ప్రత్యేక స్థానం ఇవ్వడం వలన ఫలితాలు చివరకు విచారకరంగానే ఉంటాయనేది నా అనుభవం. శృంగారం అనేది ఈ ప్రపంచానికే అతి కొత్త విషయమన్నట్టుగా, దీనికి గతమే లేనట్టుగా, అతిగా చేసి బోధించడం, లేదా శీల పవిత్రత అన్న భావనను అధునాతన, విప్లవాత్మక భావనగా చూపడం వల్ల ప్రయోజనం శూన్యం. శృంగార పరమైన భావనలు ఒక మనిషి పూర్తి వ్యక్తిత్వానికి అతీతమైనవిగా పరిగణిస్తే, ఆ దృష్టితో వాటి గురించి వివరించడానికి ప్రయత్నించినా, లేదా ఈ భావనలే వ్యక్తుల మనస్తత్వాలకు ప్రాతిపదిక అని పరిగణించినా మొత్తం విద్యాబోధనా క్రమమే పక్క దారి పట్టే ప్రమాదం ఉంది. శృంగారం గురించి, లైంగిక విజ్ఞానం గురించి ప్రత్యేకంగా బోధించడం ద్వారా ఒక మంచి పౌరుడిని మనం తయారు చేయలేకపోవచ్చు. కానీ పసిపిల్లలను బాధ్యతాయుతమైన పౌరులుగా రూపుదిద్దే క్రమంలో వారికి లైంగిక విజ్ఞానాన్ని కూడా అందించగలం.

కేవలం శరీర వాంఛనుంచే ప్రేమ ఉద్భవించదని, శృంగారానికి అతీతమైన మానవ సంబంధాల్లో సైతం ప్రేమ ఉన్నప్పుడే స్త్రీ పురుషుల మధ్య, ఆరోగ్యకరమైన ప్రేమ సంబంధం నెలకొంటుందని నా విశ్వాసం. తల్లితండ్రులను ప్రేమించలేని ఒక యువకుడు తరుణ వయసులో ఒక యువతిని ప్రేమించగలడనుకోలేం. తన దేశాన్ని, సమాజాన్ని, తన వృత్తిని, స్నేహితులను, సహచర కామ్రేడ్‌లను ప్రేమించగల వ్యక్తి ఒక స్త్రీని కేవలం శారీరక వాంఛతోనే ప్రేమించడు. అంటే స్త్రీని కేవలం సుఖాన్నిచ్చే యంత్రంగానే పరిగణించేవారు తమ పరిసరాలను, సమాజాన్ని, కుటుంబాన్ని సవ్యంగా ప్రేమించలేరు. అతనొక బాధ్యతాయుతమైన పౌరుడు కాలేడు. అటువంటి వారిని పూర్తిగా ఎవరూ విశ్వసించలేరు. శృంగారపరమైన భావం, వాంఛ మనిషిని ఎటువైపైనా తీసుకెళ్లగలదు. ఈ విషయంలో నిగ్రహం, కట్టుబాటు లేకపోతే ఒక

మనిషి సంఘ వ్యతిరేకిగా మారేందుకు పూర్తి అవకాశాలున్నాయి. లైంగిక విద్యాబోధన అనేది ఈ విషయాన్ని ప్రాతిపదికగా చేసుకోగలగాలి.

సంఘ జీవనం, అందరితో కలిసిమెలసి ఉంటూ ఆమోదయోగ్యంగా వ్యవహరించడం, క్రమశిక్షణ ఉన్నప్పుడు శరీరగతమైన కోరికలు, ఆకాంక్షలు, వాంఛ అన్నవి సమున్నతమైన సౌందర్య ఆరాధనకు తద్వారా అందమైన, సౌఖ్యవంతమైన అనుభవాలకు తలుపులు తెరవగలవు. ఈ క్రమంలో కుటుంబం పాత్ర కీలకమైంది. ఒక మనిషి సంఘజీవితానికి అలవాటు పడేది ఇక్కడినుంచే. ఈ తొలి అడుగులు సక్రమంగా పడితే ఒక మనిషి అవసరమైన లైంగిక విజ్ఞాన సముపార్జన క్రమం నవ్యంగా ఉండగలదు. తల్లితండ్రులకు కుటుంబ వ్యవహారాలపై నియంత్రణ అనేది వారి వారి వ్యక్తిత్వాలు, వారి వారి వృత్తి, వారి అనుభవాల ఫలితంగా సమకూరినప్పుడు, వారు కనుక తమ పిల్లల పెంపకం బాధ్యతను సక్రమంగా నిర్వర్తించగలిగితే, అంటే, తొలినాళ్లలో పరిసరాలలో పిల్లలకు సంబంధాలు ఏర్పడే క్రమాన్ని, వారి చదువులను, ఆటలను, మనోభావాలను, సుఖదుఃఖాలను ఆ తల్లితండ్రులు నిశితంగా పరిశీలించి, పిల్లలకు మార్గదర్శకత్వం వహించగలిగితే ఆ కుటుంబంలో క్రమశిక్షణ, నియంత్రణ సరైన రీతిలో ఉండ గలవు. ఈ వాతావరణంలో, అటువంటి తల్లితండ్రుల నేతృత్వంలో ఎదిగే పిల్లల్లో సెక్సుకి సంబంధించిన భావనలు, పరిజ్ఞానం కూడా సక్రమంగా అభివృద్ధి చెందుతాయి. ఇటువంటి కుటుంబాల్లో పిల్లలకు శృంగారానికి సంబంధించి, లైంగిక జ్ఞానం గురించి ప్రత్యేకంగా బోధన అవసరం ఉండదు. కుటుంబ సభ్యుల మధ్య సత్సంబంధాలు, మౌనంతో కూడిన పరిష్కృత విశ్వాసం ఉన్నప్పుడు సెక్సు విజ్ఞానం అభివృద్ధి చేసేందుకు ప్రత్యేకమైన ప్రయత్నం, కృషి అవసరం ఉండదు. తగిన సమయంలో సరైన పద్ధతిలో విషయాలను సున్నితంగా వివరించడం ద్వారా ఒక ప్రత్యేక కార్యక్రమం అవసరం లేకుండానే సెక్సు పరిజ్ఞానాన్ని పిల్లలకు సమకూర్చ వచ్చు. ప్రేమ గురించి పిల్లలతో గంభీరంగా, గుంభనంగా, గౌరవనీయంగా మాట్లాడడం ద్వారా వారు భవిష్యత్తులో అందమైన ప్రేమ అనుభవాన్ని పొందేందుకు సహకరించవచ్చు.



## CHAPTER - 8

# అమ్మ త్యాగానికీ అవధులు ఉండాలి

పట్టణ శివార్లలో వెలిసిన అతిపెద్ద ఫ్యాక్టరీకి గల గ్రంథాలయాల్లో వెరా ఇగ్నత్యేవ్నా కొరబోవా పని చేస్తుంది. సాధారణంగా ఆమె రోజూ ఐదుగంటల ప్రాంతంలో ఇల్లు చేరుతుంది. కానీ ఇవాళ ఆమెతోపాటు, ఆమె సహాయకులు, ఇతర సిబ్బంది, మిత్రులూ కలిసి రేపు జరగబోయే ఒక సమావేశానికి ఏర్పాట్లలో హడావుడిగా ఉన్నారు. ప్రముఖ సాహితీవేత్త, రచయిత ఒకరు ఈ సమావేశంలో పాల్గొంటారు. ఆ రచయితకు గల అభిమానుల్లో వెరా కూడా ఒకరు. అందుకే ఆమె ఉత్సాహంగా సమావేశం ఏర్పాట్లలో నిమగ్నమై ఉంది. హాల్లోనే అద్దాల బీరువాలో ఆ రచయిత రాసిన వివిధ గ్రంథాలపై వచ్చిన విమర్శలు, సమీక్షలు, పరిచయాలకు సంబంధించిన పుస్తకాలన్నీ పొందికగా సర్దింది. సమావేశానికి సంబంధించిన సమాచారాన్ని గ్రంథాలయ పాఠకులకు తెలిపేందుకు గోడలకు నోటీసులు అమర్చడంతోపాటు, బల్లపై పత్రికల్లో ఆ వివరాలతో కూడిన కరపత్రాలను పెట్టారు. అద్దాల బీరువా మధ్యలో ఆ రచయిత ఫొటోను అమర్చారు. అది మంచి ఫొటో, అందులోని అతిసాధారణంగా, సాదాసీదాగా, స్నేహభావం ఉట్టిపడుతూ ఉన్నాడు. ఇక్కడ ఈ ఏర్పాట్లు అన్నీ పూర్తయి ఇల్లు చేరేందుకు వెరాకు చాలా సమయం పడుతుంది.

సాయం సమయాల్లో గ్రంథాలయం పని అంటే వెరాకు చాలా ఇష్టం. పగలంతా పాఠకులు తిరిగి ఇచ్చిన పుస్తకాలను తిరిగి వాటి వాటి స్థానాల్లో, జాగ్రత్తగా పెట్టడం, గ్రంథాలయ సభ్యుల కార్డులను క్రమపద్ధతిలో ఉండేలా చూడటం, సహాయకురాలైన వృద్ధమహిళ మార్ఫా సెమ్యోనోవా పుస్తకాల అలమార్లను శుభ్రంగా దులుపుతుందో లేదో గమనించడంలాంటి పనులను వెరా అతి శ్రద్ధగా చేస్తుంది. అన్ని పనులు పూర్తయి గ్రంథాలయం అంతా ఒక పద్ధతిలో ఉందని సంతృప్తి చెందాకే ఆమె ఇంటికి బయలుదేరుతుంది. ఇవాళ సహచరులతో కలిసి ఇలా పని చేయడం ఆమెకు మరింత నచ్చింది. లైబ్రరీలో ఉండే వివిధ పుస్తకాలకు ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్నదని వెరా ఉద్దేశం. బీరువాల్లో అమర్చిన కొన్ని పుస్తకాలు ఇక్కడ బల్ల మీద గల దీపం వెలుగులో ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. అలా చూస్తుంటే రాత్రివేళ వీధి దీపాల కాంతిలో షికారు చేస్తున్న పెద్ద మనుషుల్లా ఉంటాయవి. మిగిలిన పుస్తకాలు చీకటి మాటున నిద్రకు వొరిగిన పిల్లల్లా ఉంటాయి. దూరంగా వరసగా పేర్చిన పాతపత్రికలు గాఢనిద్రలో ఉన్నట్టుంటాయి. సాధారణంగా పాఠకులెవరూ ఆ నిద్రను భంగంచేయరు. ఈ పుస్తకాలను తాకినప్పుడు, చేతుల్లోకి తీసుకున్నప్పుడు కూడా వాటి ప్రత్యేక లక్షణాలు తెలుస్తూంటాయి. కొన్ని పుస్తకాలు బద్ధకంగా,

వొద్దికగా ఉంటాయి. కొన్ని బిడియంగా రిజిస్టర్‌లో నమోదయ్యేంత వరకూ ఆమె చేతుల్లో ఉంటాయి. మరికొన్ని పుస్తకాలు ఆత్రంగా ఎదురుచూసే పాఠకుల చేతుల్లోకి వెళ్లేందుకు ఉవ్విళ్లూరుతుంటాయి. ఇంకొన్ని అయితే ఎవరినీ ఆకర్షించలేక దిగాలుగా తిరిగి తమ స్థావరానికి బీరువాల్లోకి వెళ్లేందుకు సిద్ధమవుతుంటాయి.

వెరా వయసు ముప్పయి ఎనిమిదేళ్లు. ఇప్పటికీ ఆమె మొహంలో యవ్వనం మిగిలే ఉంది. ఆమె భుజాలు, తెల్లటి మెడ కూడా ఆమె వయసేం మీరిపోలేదని చెబుతాయి. అయితే ఎప్పుడూ తన గురించి పెద్దగా పట్టించుకోని వెరాకు ఈ సంగతి తెలియదు. ఆమె తన పుస్తకాల గురించి, కుటుంబం గురించి మాత్రమే ఆలోచిస్తుంది. ఈ ఆలోచనలకు ఒక తీరూతెన్నూ ఉండదు. అవి ఒక క్రమపద్ధతిలో ఉండవు.

సాయంత్రం గ్రంథాలయం మూసేవేళకు ఆమె హడావుడిగా తన సామాన్లన్నీ చేతిసంచిలో సర్దుకొని ఇంటికి బయలుదేరుతుంది. రద్దీగా ఉండే ట్రాముకారులో ఆమె ఒక సీటు వెనక నిలబడుతుంది. చాలాసేపు సాగే ఈ ప్రయాణం పూర్తయ్యేలోగా వెరా తన పుస్తకాల ప్రపంచం నుంచి బయటపడి ఇంటి వ్యవహారాల గురించి ఆలోచిస్తుంది. ఇవాళ ఇంటికి వెళ్లడం ఖాయంగా ఆలస్యమవుతుంది. అంటే ఇంటి దగ్గర పని హడావుడి ఎక్కువగా ఉంటుంది. ఇలాంటి ఆలోచనలతో ట్రాము ప్రయాణం సాగిస్తుంటే ఆమెకు ఎందుకో తెలియని ఆనందం కలుగుతుంది. అకస్మాత్తుగా పావ్‌లూష, లేదా తమారా మొహం ఆమె ముందు ప్రత్యక్షమవుతుంది. ఆ ఆనందంలో ఆమె ట్రాముకారులోని తోటి ప్రయాణికులను, ప్రయాణంలో కుదుపులను, దారిలోని స్టేషన్‌లను గమనించదు. పావ్‌లూష మొహం తాజాగా, ముద్దొస్తూ కళకళలాడుతుంది. వాడి కళ్లు గోధుమరంగులో మెరుస్తుంటాయి. కుచ్చులాంటి కనురెప్పలతో నిగూఢంగా, తీక్షణంగా చూసే తమారా గుర్తువస్తే వెరాకు అపేక్ష పొంగిపొర్లుతుంది. చిన్న వయసులోనే హుందాగా, గంభీరంగా వ్యవహరించే తమారాకు నుదిటిపై, మెడపై వాలే దట్టమైన ఉంగరాల జుట్టు వింత అందాన్నిస్తుంది. వీళ్ల గురించిన ఆలోచనలు, వారితో గడిపే సమయం తప్పిస్తే వెరా బతుకు ఎలాంటి వొడిదుడుకులు, వేగం, ఎత్తుపల్లాలు లేని స్థిరమైన ప్రవాహం లాంటిది. అనేక సంవత్సరాలుగా ఎటువంటి మార్పు లేకుండా ఆమె యాంత్రికంగా తన పనులు తాను చేసుకుంటూ పోతుంది. ఇంటి పని, లైబ్రరీకి రావడం, అక్కడ పని, మళ్లీ ఇంటికి, అక్కడ పని, పిల్లలు, భర్త - ఇవాన్ పెట్రోవిచ్‌కు కావలసినవి అమర్చడం ఇదంతా ఒక పద్ధతి ప్రకారం జరిగిపోతుంది. చివరకు ఇవాన్ పెట్రోవిచ్‌తో వివాహం కూడా చిక్కనైన బతుకు అల్లికలో అంతర్భాగంగానే జరిగిపోయింది. అలా అని తనకేదో తక్కువైందని వెరా ఎన్నడూ అనుకోలేదు. అన్నీ సవ్యంగా జరిగిపోయాయి, జరుగుతున్నాయి. అంతే, ఇప్పుడామె తన పిల్లల వంక ఆనందంగా చూస్తుంది. వారి గురించి ఆలోచిస్తుంది. వాళ్లతో పాటు పుస్తకాలు ఆమెకు జీవితంపై ఆకర్షణను పెంచాయి.

నిజానికి వెరా ఇగ్నత్యేవ్నా ఏనాడూ తన జీవితాన్ని విశ్లేషించుకోలేదు. ఆమెకు ఆ వ్యవధి లేదు. అందివచ్చిన బతుకు బావుందో, లేదో అన్న సంగతి కూడా ఏనాడూ ఆమె యోచించలేదు. కూతురు తమారా తనలా బతకదని, భిన్నంగా ఉంటుందని వెరాకు తెలుసు. తమారా ప్రస్తుతం భవన నిర్మాణశాస్త్రం చదువుతోంది. గదిలో బల్లపై రకరకాల డిజైన్లు, డ్రాయింగులూ చెల్లా

చెదురుగా ఉంటాయి. అవి మాత్రమే తమారా భవిత కాకున్నా, మొత్తానికి ఆమె ఆనందంగా ఉండగలదనే నమ్మకం వెరాకు ఉంది.

ట్రాము దిగిన వెరా ఇంటికి నడిచింది. తమారా తలుపు తీసింది. వెరా తన చేతిసంచిని కిటికీలో ఉంచి, ఆ గదిని పరీక్షగా చూసింది.

"పావ్‌లూష భోజనం చేశాడా?"

"చేశాడు"

"బయటికి వెళ్లాడా?"

"తెలియదు. స్కేటింగ్‌కి వెళ్లాడేమో"

ఇంట్లో అందరూ భోజనం ముగించారని, పావ్‌లూష స్కేటింగ్‌కి వెళ్లాడని అంటే అంతా సక్రమంగానే ఉందని అర్థం. భోజనాల బల్లపై కంచాల మధ్య పిల్లలు వదిలిన ఎంగిళ్లు ఉన్నాయి. గదిలో నేలపై దుమ్ము కొన్ని వైరుముక్కలు పడి ఉన్నాయి. వెరా గదిని మరోసారి పరిశీలించి మూలనున్న చీపురు అందుకొని, తుడవడం ప్రారంభించింది. తమారా పెద్ద కుర్చీలో కూర్చుని, తలకట్టు విప్పి జుట్టును సవరించుకుంటూ కిటికీలోంచి బయటకు చూసింది. హటాత్తుగా ఇటు తిరిగి "సరే, నా బూట్ల సంగతేమిటమ్మా?" అని ప్రశ్నించింది.

వెరా తల తిప్పకుండానే సమాధానమిచ్చింది. "ఉన్న బూట్లతో సరిపెట్టుకోవచ్చేమో, చూడు తమారా" అంది.

తమారా కుర్చీలోంచి లేచి తల్లి వంక కోపంగా చూసింది. "అమ్మా అలా ఎలా మాట్లాడగలవు? గోధుమరంగు డ్రస్‌కు గులాబీరంగు బూట్లు వేసుకోవాలా? ఎంత అసహ్యంగా ఉంటాయో తెలియదా?" అంది. ప్రస్తుతం ఆమె గులాబీరంగు గౌను, అదే రంగు మేజోళ్లు బూట్లు వేసుకొని ఉంది.

వెరా తన పని ఆపి కూతురువంక సానుభూతిగా చూసి "సర్లే జీతాలు రానీయ్, మరో జత కొందాంలే" అంది.

తమారా విసురుగా తన గులాబీరంగు బూట్లను అవతలకు తోసింది. తల్లి వంక, అమె చేతుల్లోని చీపురువంక పరీక్షగా చూసింది. ఆ చూపును కొంచెం పక్కకు, కిందికి దింపితే ఆ పిల్ల తల్లి కాళ్లకున్న నలిగిపోయి, వెలిసిపోయి, శిథిలావస్థలో ఉన్న బూట్లను చూడగలిగేది. కానీ తమారా ఆ పని చేయలేదు.

"జీతాలు..... జీతాలు... నాకు విసుగు వచ్చేస్తుంది. ఎన్ని జీతాల కోసం, ఎంత కాలం ఎదురు చూడాలి" అని విసుక్కుంటూ తమారా పడకగదిలోకి నడిచింది. వెరా తన పని పూర్తి చేసి వంట గదిలోకి వెళ్లింది. అక్కడ గిన్నెలు తోమే పని ఉంది. వీళ్లకి ఇంటి పనులు చేసేందుకు ప్రత్యేకంగా మనిషి లేదు. అపార్ట్‌మెంట్‌ల కావలి మనిషి భార్య ప్రతి రోజూ మధ్యాహ్నం రెండు గంటలకు వచ్చి పిల్లలిద్దరికీ భోజనం వండి వెళుతుంది. వెరా, ఇవాన్ పెట్రోవిచ్‌లు తమ ఆఫీసుల్లోనే భోజనం చేస్తారు. ఇది వాళ్లకు శ్రమ తగ్గించే ఏర్పాటు.

ఇంటి పనిని కూడా వెరా ఆప్యాయంగా పూర్తి చేస్తుంది. వంటింట్లో ఉన్న స్టవ్వు, తిని వదిలేసిన కంచాలు చెప్పే కబుర్లను కూడా ఆమె అర్థం చేసుకోగలదు. గిన్నెలూ, కంచాలు తన చేతుల్లో వేడి నీళ్లలో స్నానం చేసి శుభ్రంగా బయటపడేందుకు తహతహలాడుతున్నాయని

వెరా ఊహిస్తుంది. ఇంట్లో, గ్రంథాలయంలో చుట్టూ ప్రతి వస్తువుతో సన్నిహిత సంబంధం ఏర్పరుచుకొని, వాటితో కబుర్లు చెప్పగల వెరా దగ్గర మనుషులతో మాత్రం అలా వ్యవహరించ లేదు. బంధువులైనా సరే వారితో సవ్యంగా ఉండలేదు. ఆమె కళ్లలో నవ్వు అదృశ్యం అవుతుంది. మాటలు రావు. కుటుంబసభ్యులతో సైతం ఆమెకు ఉండవలసిన సాన్నిహిత్యం లేదు.

ఇవాళ వెరాకు పని పెద్దగా ఉత్సాహాన్నివ్వలేదు. ఆమె తమారా బూట్ల సమస్య గురించి ఆలోచిస్తోంది. ఇంతకు ముందే వెరా ఈ సమస్య గురించి పరిశీలించింది. తమారాకు పొడవైన గులాబీరంగు డ్రెస్ ఉందని అదే రంగు బూట్లు కొనడం పొరపాటు చేశానేమో అనుకుంది. డ్రస్సును బట్టి బూట్లు కొనడం పొరపాటే. తమారాకు గల గోధుమరంగు దుస్తులు ఈ సమస్యని సృష్టించాయి. ఆ డ్రస్ ఒకటే కొంటే చాలని వెరా అనుకుంది. మొన్న ఒకరోజు ఆమె కూతురు కొత్త డ్రస్‌ను, గులాబీరంగు బూట్లను దగ్గర పెట్టుకొని పరీక్షించింది. అది లేత గోధుమరంగు గౌను, బూట్లు కూడా ముదురు గులాబీరంగు కాదు. ఆ డ్రస్‌కి ఈ బూట్లు వేసుకొన్నా పెద్ద తేడా రాదని ఒకక్షణం ఆమెకు అనిపించింది. వెంటనే అమె ఆలోచనకు తననితాను మందలించు కుంది. వేదనాభరితమైన తమారా మొహం ఆమె ముందు ప్రత్యక్షమైంది. అది ఆమెకు బాధ కలిగించింది.

ఇంతలో బయటి తలుపును ఎవరో తడుతున్న శబ్దం వినిపించి, వెరా చేతులు కడుక్కొని వెళ్లి తలుపు తెరిచింది. అక్కడ ఆండ్రీ స్టోయనోవ్ నిలబడి ఉన్నాడు. ఆండ్రీ మంచి పాఠకుడు, పుస్తకాలంటే వెరాకు ఉన్నంత ప్రేమ అతనికీ ఉంది. కానీ అతను గ్రంథాలయంలో పనిచేయడు. ఫ్యాక్టరీలో యంత్రాల అపరేటర్. మంచి పనివాడనే గుర్తింపు ఉంది. తోటి కార్మికులంతా అందుకు అతన్ని గౌరవిస్తారు. కానీ ఇటువంటి సంగతులను వెరా అర్థం చేసుకోలేదు. ఆండ్రీ మంచి ఆపరేటర్ అయితే ఏమిటి? అన్నది ఆమె సందేహం. కానీ ఫ్యాక్టరీలో ఆండ్రీ, అతని బృందం అద్భుతంగా పని చేస్తారని ఆమె విని ఉంది. ఆ బృందంలోని కార్మికులు తాము పని చేసే యంత్రాల చుట్టూ అందమైన పూలమొక్కలు కూడా వేశారట. అయితే ఏమిటట? అని వెరా ఆశ్చర్యపోతుంది. ఆమెకు సంబంధించి ఆండ్రీ చక్కని పాఠకుడు. పుస్తకాల ప్రేమికుడు. అసలు పుస్తకాలను అంత ప్రేమించే మనిషి యంత్రాలపై ఎలా పని చేస్తాడన్నది ఆమెకు అర్థం కాలేదు.

గ్రంథాలయంలో ఎక్కువ సమయం గడపడం కోసమే ఆండ్రీ ఫ్యాక్టరీలో తనకు రోజూ రాత్రి డ్యూటీ వేయించుకున్నాడు. గ్రంథాలయంలో తనకు ఏదైనా పని అప్పగించమని అతను తన ఫ్యాక్టరీలోని కార్మిక సంఘం కమిటీని కోరాడు కూడా. పుస్తకాల మధ్య గడపడం అతనికి అంత ఇష్టం.

పుస్తకాలు అంటే ఇష్టపడడానికి ఆండ్రీకి సొంత కారణాలున్నాయి. అతని దృష్టిలో పుస్తకాలు అంటే రెండు అట్టల మధ్య ఉండే మనుషులు. ఆ పుస్తకాల్లో మనుషుల గురించేకాక ప్రకృతి, వాన, అడవులు.... వీటన్నిటి గురించి రచయితలు ఎందుకు వర్ణిస్తారో అతనికి బోధపడదు. ఒక్కొక్కసారి ఆండ్రీ గ్రంథాలయంలో పుస్తకాలు తిరగేస్తూ మధ్యలో వెరా గదికి వచ్చి ఈ విషయం మట్లాడతాడు.

"మనుషులను అర్థం చేసుకోవడం కష్టం. వారిలో నిగూఢమైనది ఏదో ఉంటుంది. అదేమిటో ఒక రచయిత చెప్పగలడు. చదివితే మనకు అర్థంఅవుతుంది. కానీ, వర్షం గురించే ఆలోచించండి.

ఏముంది అందులో. వాన అంతేగా. నేనయితే వానని వానలానే చూస్తాను. అది చిరుజల్లా, పెద్ద వానా, తుపానా, ప్రమాదకరమైందా, లేదా అన్న విషయాన్ని నేను పరిశీలిస్తాను. అంతే, అడవులైనా అంతే, మన కంటికి కనిపించేదాన్ని రచయిత వర్ణించగలడా?" ఇదీ ఆంద్రీ అభ్యంతరం.

అయితే పుస్తకాల్లో మనుషుల గురించి వర్ణనలంటే అతనికి అమిత ఇష్టం. ఎంతో శ్రద్ధగా చదువుతాడు. ఈ పాత్రల స్వభావాల గురించి ఆంద్రీ మాట్లాడతాడు. వైరుధ్యాలను తేలికగా గుర్తించగలడు. రచయిత ఒక పాత్రకు అన్యాయం చేస్తే విలవిలలాడతాడు. "దోస్తోయేవ్‌స్కీ అంటే నాకు గిట్టదు. ఆయన మనుషుల లోతుపాతులను వర్ణించవచ్చు. కానీ చదివితే సిగ్గు కలుగుతుంది. రాస్కల్నికోవ్ (నేరము-శిక్ష) పాత్రని చూడండి. అతడేం చేశాడు. ఒక ముసలావిడను హత్య చేశాడు. అందుకు ఏం చేయాలి? సరిగా విచారణ జరిపి శిక్షిస్తే చాలు. కానీ రచయిత ఏం చేశాడో చూడండి. పుస్తకమంతా రాస్కల్నికోవ్ వ్యధను వర్ణించాడు. చదవగా చదవగా అతడంటే సానుభూతి ఏర్పడింది. జాలి కలిగింది. అదే నాకు కోపం తెప్పించింది. అతనిపై నేనెందుకు జాలిపడాలి? ఎందుకు పడ్డానంటే రచయిత అతడిని చిత్రవధకు గురి చేశాడు. అలాంటప్పుడు అతనిపై జాలిపడక తప్పదు" అనేవాడు.

ఆ ఆంద్రీ ప్రస్తుతం బయట నిలిచి ఉన్నాడు. వెరాను చూసి కొంచెం సిగ్గుగా, అందంగా, హుందాగా నవ్వాడు. ఆ నవ్వు నలభైఏళ్ల అనుభవజ్ఞుడైన మిల్లు కార్మికుడి నవ్వులాలేదు. ఒక యువతి దరహాసంలా ఉంది. అయితే దీనివల్ల అతని హుందాతనానికి లోటు రాలేదు. "చిన్న పనిపై వచ్చాను. లోనికి రావచ్చా?" అని అడిగాడు. పుస్తకాల గురించి అడపాదడపా అతనిలా రావడం మామూలే. కానీ ఇవాళ వేరే ప్రత్యేకమైన పనిపై వచ్చినట్టుంది.

వెరా అతన్నిలోనికి ఆహ్వానించింది. వచ్చి వంటగదిలో బల్లపై కూర్చున్నాడు. "హాల్లో కూర్చుందాం రండి" అంది వెరా.

"లేదు. ఇక్కడే మాట్లాడదాం. ఏం లేదు. చిన్న రహస్యం" అంటూ వంట గదిలోంచి బయటకు తొంగి చూశాడు. ఎవరూ అక్కడ లేరని సంతృప్తి చెందాడు.

వంటింట్లో వెరా తోమి, శుభ్రంచేసి, వరుసగా పేర్చిన గిన్నెలు, పళ్లాల వంక చూసి "ఇవన్నీ మీరు భోజనానికి ఉపయోగించినవా?" అని అడిగాడు.

"కాదు. పిల్లలు తిన్నవి" అంది వెరా చేతులు తుడుచుకుంటూ.

"అలాగా!..... పోతే, నేనిప్పుడు ఫ్యాక్టరీ కార్మిక సంఘం తరపున వచ్చాను. చిన్న సమస్యనొక దాన్ని సరిచేయాల్సి ఉంది" అన్నాడు.

"రేపటి సమావేశానికి సంబంధించా?" వెరా అడిగింది.

"కాదు. సాంస్కృతిక రంగంలో కృషి చేసేవారిని గుర్తించి బహుమతి ఇవ్వాలని కార్మిక సంఘం నిర్ణయించింది. ఈసారి ఆ బహుమతి మీకే ఇవ్వబోతున్నాం. మామూలుగా అయితే ప్రతి సంవత్సరం తొలిరోజు ఈ అవార్డు ఇవ్వాలనుకున్నాం. కానీ రేపు గ్రంథాలయంలో ఒక ఉత్సవం జరుగబోతోంది. కాబట్టి, ఆ సందర్భంగా ఈ అవార్డు ఇవ్వాలనుకుంటున్నాం. అందరికీ ఈ బహుమానాన్ని డబ్బు రూపంలో ఇద్దామని నిర్ణయించాం. కాని మీకు డబ్బు రూపంలో ఇవ్వడంపై నేను అభ్యంతరం వ్యక్తం చేశాను. దాని వల్ల ప్రయోజనం ఉండదని అన్నాను."

"నాకేం అర్థం కాలేదు" అంది వెరా చిరునవ్వుతో.

"పెద్ద కష్టమైన విషయం కాదు. డబ్బుకి నిలకడ ఉండదు. ఇవాళ ఉంటుంది. రేపు పోతుంది. అందువల్ల వేరే ఏదైనా బహుమతి ఇస్తే బావుంటుందని...." అని వివరించాడు.

"వేరే?.... ఏమిటది?"

"ఆలోచించండి" ప్రోత్సహించాడు ఆంద్రీ.

"సరే కానీ, నాకు బహుమతి ఇవ్వడం అవసరమా?"

"అది మీకు సంబంధించిన విషయం కాదు. పెద్దస్థాయిలో నిర్ణయమై పోయింది. దాన్ని గురించి పట్టించుకోకండి. బహుమతి ఏమైతే బావుంటుందో చెప్పండి" అన్నాడు.

ఆమెకు తమారా మొహం గుర్తువచ్చింది. వెంటనే "నాకు ఒక జత బూట్లు కావాలి ఆంద్రీ. నిజంగా నాకెంతో అవసరం"

ఆంద్రీ స్టోయనోవ్ జాగ్రత్తగా ఆమె పాదాలని పరిశీలించాడు. వెరా లేచి నిలబడి కడిగిన గిన్నెల వైపు నడిచింది.

"బూట్లు... అవును అదే మంచిది. ఉపయోగకరం కూడా. అదే మంచిది. సరే, మేం మీకు ఒక జత బూట్లు బహుమతిగా ఇస్తాం" అన్నాడు ఉత్సాహంగా.

వెరా మొహమాటంగా నవ్వింది. "నాకు గోధుమరంగు బూట్లు కావాలి" కామ్రేడ్ ఆంద్రీ అంది అతికష్టం మీద.

"గోధుమరంగా?" అంటూ విచారంగా నవ్వాడు.

"సరే మీ ఇష్టం. అవే తీసుకొందాం. కాకపోతే కాళ్లకు వేసుకు చూడకుండా సరైన సైజు బూట్లు కొనలేం. పైగా మీకు ఆ డిజైను, అదీ నచ్చాలి. అందుచేత మనం షాపుకి కలిసి వెళదాం" అని ప్రతిపాదించాడు ఆంద్రీ.

"నేను రావడం దేనికండీ. ఎప్పుడూ సైజు చెప్పికొంటాను నేను!"

"సైజుని బట్టా? సరే అలాగే కానివ్వండి. ఏ సైజు తీసుకోవాలి?"

"అఁ... నాలుగు"

"నాలుగా?! చిన్నవైపోవూ?"

వెరా అతనికి బదులివ్వకుండా గిన్నెలు తుడిచేందుకు పొడి తువ్వాలు అందుకుంది. ఆంద్రీ లేచి నిలబడ్డాడు. "అదేం కుదరదు వెరా ఇగ్నత్యేవ్నా" అన్నాడు నవ్వుతూ.

"ఏం. ఎందుకు?" అని ప్రశ్నించింది వెరా అతనివైపు తిరగకుండానే.

"నాలుగో నెంబరు బూట్లు.... ఊహుఁ కుదరదు" అన్నాడు. అని, పెద్దగా నవ్వాడు. "మీ అమ్మాయి కోసమేగా. అదేం కుదరదు. ఆమెకు గోధుమరంగు బూట్లను ఇవ్వడం కుదరదు. ఈ బహుమతి మీకు. అది మీకు ఉపయోగపడేదిగా ఉండేలా చూడమని నన్ను పంపారు. ఆ బూట్లు లేకుండానే మీ అమ్మాయి అందగత్తె. ఇక అవి అవసరం లేదు" అన్నాడు.

వెరాకు కోపం ముంచుకు వచ్చింది. "అది మీకు అనవసరం" అనబోయి తమాయించుకుంది. ఆంద్రీ వంటి మంచిమనిషిని నొప్పించకూడదు. ఏమనాలో ఆమెకు అర్థం కాలేదు. మౌనం పాటించింది.

అంద్రీ అనునయంగా అన్నాడు. "మీ ఇంటి వ్యవహారాల్లో జోక్యం చేసుకుంటున్నందుకు క్షమించండి. కానీ ఒక్కొక్కసారి అది అవసరం. ఈ బహుమతి మీ కోసం. అది అలా ఉండేలా చూడడం నా బాధ్యత. బుట్టబొమ్మలాంటి తమారాకు కావాలంటే వాళ్ల నాన్న ఆ బూట్లుకొంటాడు. సరేనా?"

వెరాకు మళ్లీ కోపం వచ్చింది. తన కూతురు బుట్టబొమ్మా? అంద్రీ అలాంటి మాట ఎలా అనగలిగాడు? కుచ్చులాంటి కనురెప్పలతో, అందమైన ఉంగరాల జుత్తుతో, అద్భుతంగా ఉండే తమారాను అంద్రీ ఆ మాట ఎలా అన్నాడు. ఇంతకీ కొంపతీసి ఈ పెద్దమనిషి తమారాకు శత్రువు కాదు కదా? ఆమె అతని వంక అనుమానంగా చూసింది. వెరా తన జీవితంలో కొందరు శత్రువులను చూసింది. కానీ అంద్రీ అలాంటివాడిలా లేడు. అతనికి వంపు తిరిగిన గడ్డం ఉంది. పెద్దమనిషి తరహాలో నవ్వుతూ, హుందాగా తల పంకిస్తున్నాడు. కానీ అతని మాటలకీ, రూపానికీ పొంతన లేదు. ఏమో ఎవరు చెప్పగలరు? శత్రువేనేమో, తేల్చుకోవాలి.

"తమారా గురించి అంత కటువుగా ఎందుకు మాట్లాడుతున్నారు?" నిలదీసిందామె. అంద్రీ మొహంలో చిరునవ్వు అదృశ్యమైంది. అతను ఆందోళనగా తల తడుముకున్నాడు.

"వెరా ఇగ్నత్యేవ్నా. నిజం చెబుతాను వినండి"

"ఏమిటా నిజం?" అని అడిగిందే కానీ వెరాకు హటాత్తుగా భయం వేసింది. తనకు ఆ నిజం అవసరం లేదనిపించింది.

"నిజమే చెబుతాను. దయచేసి ఒక్కనిముషం ఆ ప్లేట్లు తుడవడం ఆపి అలా కూర్చుంటారా?"

ఆమె మౌనంగా ఆ ప్లేటును పక్కన పెట్టి కిటికీ దగ్గర చిన్న బల్లపై కూర్చుంది. "నిజాన్ని ఎదుర్కోడానికి భయపడనవసరం లేదండీ. కోపం తెచ్చుకోకండి. ఇది మీ గురించి. అంటే మీ పాప గురించి కూడా అని నాకు తెలుసు. విషయం ఏమిటంటే తోటి ఉద్యోగిగా మేం మిమ్మల్ని గురించి పట్టించుకుంటాం. విషయాల్ని గమనిస్తాం. మీరు వేసుకున్న దుస్తులనే చూడండి. ఇది మీకు ఉన్న ఒకే ఒక స్కర్టు అని అందరికీ తెలుసు. రోజూ ఉద్యోగానికీ అదే. రేపటి సభకూ అదే. ఇంట్లో గిన్నెలు తోమేటప్పుడు అదే స్కర్టు. నిజానికి దాని పని ఎప్పుడో అయి పోయింది. నల్ల రంగులో ఉంది కాబట్టి ఇంకా మీరు ధరించగలుగుతున్నారు. మీ భార్యాభర్తలిద్దరూ ఉద్యోగులే. తమారాకు ఇన్‌స్టిట్యూట్‌లో ఉపకారవేతనం వస్తోంది. మీకు ఇద్దరే పిల్లలు. అయినా ఈ పేదరికం ఏమిటి? ఏమనుకోవద్దు. తమారాకు బట్టల సరదా ఎక్కువ. చివరకు మా మహిళా ఇంజనీర్లు కూడా ఆమెలా దుస్తులు ధరించరు. తమారా తరచు క్లబ్‌కి వస్తుంది. రకరకాల డ్రస్సులు. ఒకసారి నలుపు... ఒకసారి నీలం... మరోసారి ఇంకో రంగు... అసలు విషయం అది కాదు. ఆమెకు ఇష్టం వచ్చినట్టు, తోచినట్టు రకరకాల దుస్తులు వేసుకోవచ్చు. కానీ మేం మాత్రం మీ గురించి ఆలోచిస్తాం. ఏం? ఇంట్లో ఆ గిన్నెలు మీరు ఎందుకు తోమాలి?" అని ఓదార్పుగా మాట్లాడాడు.

"చూడండి అంద్రీ, నేను ఒక తల్లిని. నా కుటుంబం బాగోగులు చూడడం నా బాధ్యత."

"అవును మీరొక తల్లి. నేను కాదు. నా భార్య ఎలెనా తల్లేగా? కానీ మా పిల్లలు ఎలా పని చేస్తారో గమనించండి. వాళ్లు పిల్లలు ఆడుకోడానికి, సరదాలకీ చాలా సమయం ఉంది. ఇప్పుడు పని చేయవలసివస్తోందని వాళ్లు గింజుకోరు. మీరు మేథస్సును ఉపయోగించి పని చేసే

ఉద్యోగి. అయినా ఇటువంటి పనుల విషయంలో ఎలెనా మీతో పోటీ పడలేదు. ఇది అవమాన కరం. మీరింకా యువతే. ఎంతో జీవితం ముందుంది. అందమైనవారు. కానీ బతుకుతీరు ఇదేనా?" అని ప్రశాంతంగా ప్రశ్నించాడు ఆంద్రీ.

వెరా కళ్లు దించుకుంది. మోకాలిపై స్కర్టు మడతను సరిచేసుకోబోయి ఆగింది. ఇప్పుడే ఆంద్రీ ఈ స్కర్టు గురించి మాట్లాడిన సంగతి జ్ఞాపకం వచ్చింది. పైగా స్కర్టుకు ఇప్పటికే అనేక అతుకులు, కుట్లూ పడిన సంగతి గుర్తుకొచ్చింది. మోకాలిపై నుంచి చెయ్యి తీసేసింది. క్రమంగా ఆమెకు కోపం పెరుగుతోంది.

"చూడండి ఆంద్రీ. ప్రతి వారికీ సొంత బతుకు ఉంటుంది. ఇలా బతకడమే నాకిష్టం" అంది తీవ్రంగా.

కానీ అతనామె వంక మరింత కోపంగా చూశాడు. చివరికి అతని గడ్డంకూడా కోపంతో వణుకుతున్నట్టు అనిపించింది. "మేం అలా ఒప్పుకోం" అన్నాడు కచ్చితంగా.

"మీరెవరు?"

"మీ చుట్టూ ఉండే, మీతో పాటు పని చేసే జనాలం. మేమెంతో గౌరవించే మా గ్రంథాలయ బాధ్యురాలు ఇటువంటి దుస్తుల్లో....... ఎటువంటివో నాకు తెలియదనుకోండి, అంతెందుకు మీ భర్తకు సైతం ఇలా అయితే నచ్చదు."

"నా భర్త గురించి మీకేం తెలుసు? మీరెప్పుడూ ఆయన్ని చూడలేదు కదా?"

"నేను ఆయన్ని చూశాను. అది విషయం కాదు. భర్తలు ఎవరైనా ఒకేలా ఉంటారు. వాళ్లని ఓ కంట కనిపెట్టి ఉండాలి." అంటూ ఆంద్రీ చిన్నగా నవ్వాడు.

ఆమె మాట్లాడలేదు.

"ఇదంతా ఎందుకండీ. మా కార్మిక సంఘం మీకు మంచి స్కర్టుకు కావలసిన గుడ్డను బహుమతిగా ఇవ్వదలిచింది. ఆ బట్ట పేరేమిటో నా నోరు తిరగదు. నా భార్య ఎలెనా చెప్పగలదు. సరే, దాన్ని ఫ్యాక్టరీ కార్మికుల దర్జీయే కుడతాడు. అందువల్ల మీకు సరిపోయేలా కుట్టించుకో వచ్చు. అందుకు అవసరమైన డబ్బు నాకు ఇచ్చారు కూడా. అదీ సంగతి" అన్నాడు, ఇక చర్చించిందేమీ లేదన్నట్టుగా.

వెరా అతని వంక, కడిగిన గిన్నెల వంకా చూసింది. నెమ్మదిగా నిట్టూర్చింది. అతని మాటలు సబబుగానే ఉన్నాయి. కానీ అవి ఆమె జీవితపు అల్లికలో ఒక అవసరమైన ముడిని విడదీస్తు న్నాయి. అది ఆమెకు భయం కలిగిస్తోంది. పైగా ఈ మనిషి తన తమారాపై శత్రుభావాన్ని ప్రకటించడం ఆమె సహించలేకపోతోంది. అంతా విడ్డూరంగా తోచింది. పోనీ అతన్ని ద్వేషిద్దామా అంటే, పుస్తకాలంటే అతనికి వెర్రి అభిమానం. ఫ్యాక్టరీ కార్మిక సంఘం సభ్యుడు. చెప్పదల్చిన విషయాన్ని చక్కగా వివరించి ఒప్పించగలడు.

"చెప్పండి. ఏమంటారు?" అంటూ ఆమె ఆలోచనా ప్రవంతికి అడ్డుపడ్డాడు. ఆమె సమాధానం చెప్పబోతుండగా తలుపు గభాలున తెరుచుకుంది. అక్కడ అందంగా తయారైన తమారా నిలిచి ఉంది. సొగసైన పొడవాటి గౌను, సరిపోయే మేజోళ్లు, రిబ్బన్లు, బూట్లతో తళతళలాడుతోంది. తమారా ఎవరికీ అర్థంకాని రీతిలో ఏదో అని గబుక్కున అక్కడి నుంచి వెళ్లి పోయింది. ఆంద్రీ గడ్డాన్ని ఓసారి సవరించుకొని, "చెప్పండి, ఏమంటారు?" అని తిరిగి ప్రశ్నించాడు.

"ఏముంది చెప్పేందుకు? అది అవసరమనిపిస్తే... అలాగే కానివ్వండి. మీకు నా కృతజ్ఞతలు ..." అంది.

ఆ సాయంత్రం పనులు యధావిధిగా పూర్తయినప్పటికీ వెరా మాత్రం అన్యమనస్కంగా గడిపింది. గిన్నెలు శుభ్రం చేసి, వంటగదిని పొందికగా సర్ది, రాత్రి భోజనాల ఏర్పాటులో పడింది. అంతలో కొడుకు పావ్‌లూష ప్రత్యక్షమయ్యాడు. ఎప్పట్లా హుషారుగా, చలాకీగా ఉన్నాడు. వాడి వొళ్లు తడిసి, చెమ్మగా ఉంది. రావడంతోనే వాడు, "నాకు చచ్చేంత ఆకలేస్తోంది. ఏంటి భోజనం? మంచి తిండిపెట్టు.... సర్లే నువ్వేం చేస్తుంటే అదే పెట్టు" అన్నాడు.

"అదేంటి అలా తడిశావు?" అడిగింది తల్లి.

"నేనేం తడవలేదు. అందరం మంచుతో కొట్టుకున్నాం."

"ఏదైతేనేం. బాగా తడిశావా?"

"అబ్బే ఏం లేదు. ఇక్కడే కొంచెం..."

వెరా చేస్తోన్న పని వదిలి వాడి బట్టలు మార్చేందుకు సిద్ధమైంది. వాడి వీపంతా తడిగా ఉంది. మేజోళ్లు అయితే తడి ముద్దలు. వొళ్లంతా తుడిచి, "వెళ్లి మంచం మీద పడుకుని ఏదైనా కప్పుకో" అంది. వాడికి ఆ పథకం నచ్చలేదు. తల్లి తడిబట్టలను ఆరేస్తూండగా వాడు నాన్న బూట్లు, అక్క కాలేజీ వర్క్‌షాపులో వేసుకొనే నీలిరంగు కోటు ధరించాడు. తన వేషాన్ని మొదట అక్క తమారాకీ చూపించాడు.

"ముందు దాన్ని విడిచెయ్" అని గావుకేక పెట్టిన తమారా, వాడి వెంట పడింది. వాడు పరుగుపరుగున మొదట హాల్లోకి, తరువాత పడక గదిలోకి దూరాడు. నాన్న మంచం మీద రెండుసార్లు గంతులేసిన తరువాత మళ్లీ హాల్లోకి వచ్చాడు. తమారా ఇక్కడ వాడిని పట్టుకోగలిగేదే. కానీ వాడు కుర్చీలనీ, బల్లలనీ వేగంగా దారిలో అడ్డం జరుపుతూ, కిలకిలా నవ్వుతూ అక్కని వెక్కిరించాడు. ఆ కుర్చీలని ఢీ కొంటూ ముందుకు వచ్చిన తమారా ఉక్రోషంతో "ముందు ఆ కోటు ఇవ్వు" అని మరో అరుపు అరిచింది. ఈ అరుపులు, చప్పుళ్లు, విన్న అమ్మ కంగారుగా ముందు గదిలోకి వచ్చింది. అమ్మ రాకను గమనించిన తమారా తమ్ముడిని ఎలాగైనా పట్టుకొనేందుకు వేగంగా పరుగులు తీస్తూ ఆమెను బలంగా ఢీకొంది. వెరా వెళ్లి చెక్క బీరువాపై పడింది. చెయ్యికి గట్టి దెబ్బే తగిలినట్టుంది. ఆ బాధ తెలిసేలోగా గాజు సామాను పగిలిన చప్పుడు విని వెరా ఉలిక్కిపడింది. పొరపాటున బీరువాపై ఉన్న నీటి జాడీని కిందకు తోసినట్టు అర్థమైంది. ఆమె వంగి నేలపై ఉన్న గాజుముక్కల వంక చూస్తుంటే, పావ్‌లూష అక్కకి దొరికి పోయి, బిడియంగా నవ్వుతున్నాడు. తమారా బలవంతంగా వాడు వేసుకొన్న కోటు ఊడలాగి, వాడి భుజంపై చరిచింది.

"ఇంకోసారి ఈ కోటు తీశావంటే ఇలాగే వాయిస్తాను" అంది.

"అలాగా? కొడతావేం? ఏదీ అంత బలం ఉందా? ఇప్పుడు కొట్టు" అన్నాడు పావ్‌లూష అల్లరిగా.

తమారా అమ్మ వంక చూసింది. అమె కిందపడిన గాజు ముక్కలను ఏరుతోందని గమనించి పెద్దగా అరవడం ప్రారంభించింది. "అమ్మా ఏమిటిది? వీడెప్పుడూ నా వస్తువులు లాక్కుంటాడు. నాకేదైనా డ్రస్ కావాలంటే ఏళ్ల తరబడి అడగాలి. చివరికొక జత బూట్లు కొనే దిక్కు లేదు.

వాడు మాత్రం నా వస్తువుల్ని లాక్కుని ధ్వంసం చేస్తాడు. ఎవరూ ఏమీ అనరు. ఏమిటిది? ఎంత ఘోరం!" అంది. దుఃఖంతో ఆ పిల్ల గొంతు పూడుకుపోయింది. కోటును విసురుగా బల్లపై పడేసి, తల్లి వంక తిరిగింది. ఆమె ఏడుపు ఆగిపోయింది. కారణం తల్లి ఆమెను ఓదార్చే ప్రయత్నం చేయకుండా దీక్షగా గాజుపెంకులు ఏరుతోంది. మామూలుగా ఇటువంటి సందర్భాల్లో వెరాకు కూతురిపై అపరిమితమైన జాలి కలిగి, చేస్తున్న పని ఆపి ఆమెను ఊరడిస్తుంది. కానీ ఇప్పుడు మాత్రం ఆమె గాజుపెంకులను ఏరి ఒక కాయితంలో పోసి వాటిని చెత్తబుట్టలో పడ వేసేందుకు వంటగదిలోకి నడిచింది. తమారాకు తల్లి ధోరణి అర్థం కాలేదు. ఆశ్చర్యంగా ఆమెనే చూసింది. తల్లి మళ్లీ ఈ గదిలోకి రావడం గమనించి మొహాన్ని మళ్లీ బిగదీసుకొని, విచారంగా పెట్టింది తమారా. వంట గదిలోంచి వెరా ఒక పాతగుడ్డను తెచ్చి పగిలిన జాడీ నుంచి తొణికిన నీటిని తుడుస్తోంది. మధ్యలో ఆపి తమారాతో, "ఈ నీళ్లలోంచి బయటికి నడు. తుడవాలి" అంది.

తమారా మాట్లాడకుండా వెళ్లి తన రాతబల్ల వద్ద కూర్చుని తల్లినే చూస్తోంది. నిజానికి ఇవాళ జరుగుతున్న దాంట్లో పెద్ద విశేషం లేదు. పిల్లలు ఇలా పరుగులు పెట్టడం ఏదో వస్తువును పడదోయడం, పగలగొట్టడం మామూలే. వెరా నెమ్మదిగా వంట పూర్తి చేసి గిన్నెలన్నీ తెచ్చి భోజనాల బల్లపై సర్దింది. అర్థ నగ్నంగా ఉన్న పావ్‌లోష పరుగు పరుగున బల్ల వద్దకు చేరి తినడం ప్రారంభించాడు. మరోచేత్తో పాలగ్లాసును గట్టిగా పట్టుకున్నాడు. వాడికి పాలంటే ప్రాణం. తమారాకు కాయగూరలు ఇష్టం ఉండదు. ఆమెకు మాంసం కావాలి. తల్లి ఆమె కోసం, భర్త కోసం విడిగా కట్‌లెట్‌లు చేసింది. తమారా ప్లేట్‌లో రెండు వేడివేడి కట్‌లెట్‌లు ఉన్నాయి. కానీ ఆ పిల్ల తన రాత బల్లను అతుక్కుపోయి కూర్చుని, అమ్మను కానీ కట్‌లెట్‌లను కానీ పట్టించుకోనట్టు మొహం పెట్టింది. వెరా కూతురు వంక చూసింది. ఆమె తల్లి ప్రాణం విలవిలలాడింది. తమారాపై అపారమైన జాలి పొంగింది.

"దా నాన్నా, వచ్చి ఏమైనా తిను" అంది ఆప్యాయంగా.

'సరే'నని గొణుగుతూ బల్ల వద్ద కూర్చున్న తమారా కట్‌లెట్‌ను అందుకుంది.

రోజు ఎప్పట్లా గడుస్తోంది. రాత్రి పదకొండు గంటలకు వెరా భర్త ఇవాన్ పెట్రోవిచ్ ఇల్లు చేరాడు. రోజూ అతను వచ్చే సమయమే అది. అతను సరాసరి ఆఫీసునుంచే వస్తున్నాడా, మరెక్కడికైనా వెళ్లి వస్తున్నాడా అన్నది వెరాకు తెలియదు. అడగదు. అదొక అనుకోని ఏర్పాటు. ఒక్కొక్కసారి వోడ్కా గుబాళింపులతో అతను ఇంటికి వచ్చినా, వెరా అతని ఆరోగ్యం గురించి ఆందోళన చెందుతుందే తప్ప మరేం మాట్లాడదు. ఈ విషయాలు మినహాయిస్తే ఇవాన్ సైతం పెద్దమనిషి తరహాలో, హుందాగా వ్యవహరిస్తాడు. ఈ దంపతులను చూసి పొరుగింటి గృహిణులు కొంత ఈర్ష్యపడడం నిజం. "భలే మంచి భర్త దొరికాడు నీకు. అటువంటి ఉత్తముడు అందరికీ దొరకడు. నువ్వు అదృష్టవంతురాలివి వెరా" అనేవారు. ఈ మాటలు వెరాకు సంతోషాన్నిచ్చేవి. తనను చూసి ఇతర విషయాల్లో ఎవరైనా ఈర్ష్యపడేందుకు ఏముంది కనుక!

ఇవాన్ పెట్రోవిచ్ సీనియర్ ప్రణాళికా నిపుణుడు. ఈ వృత్తిలో ఉండేవారు ఎప్పుడూ కోపంగా, అసహనంతో చిరచిరలాడుతూ ఉంటారని అందరికీ తెలుసు. వారు తరచూ ఉద్యోగాలు మారతారు. కానీ ఇవాన్ మాత్రం ఎప్పుడూ నింపాదిగా, ప్రశాంతంగా ఉంటాడు.

పదిహేనేళ్లుగా ఇదే ఉద్యోగంలో ఉన్నాడు. అతను తన ఉద్యోగం గురించి భార్యతో ఎప్పుడూ మాట్లాడలేదు. అతనొక ప్రణాళికా నిపుణుడనే సంగతి ఎన్నడో పెళ్లప్పుడు విన్నది వెరా.

ఇవాన్ ఎప్పటిలానే ఇవాళ కూడ మంచి సూటులో ఉన్నాడు. అతని మొహం ప్రశాంతంగా ఉంది. గడ్డం చక్కగా కత్తిరించి ఉంది. అతని దుస్తుల సంగతి వెరాకు తెలియదు. అతనేం చెప్పడు. ఎక్కడ కొంటాడో, కుట్టిస్తాడో ఆమెకు అనవసరం. కొత్త సూట్ ధరించినప్పుడు మాత్రం ఒకసారి పరిశీలిస్తుంది అంతే. ఈ విషయంలో ఇవాన్ భార్య సలహాలు కోరడు. ఆమెకు చెప్పడు కూడా. ప్రతినెలా అతను వెరాకు మూడు వందల రూబుళ్లు ఇస్తాడు ఇంటి ఖర్చు కోసం.

ఎప్పటిలానే అతను గుమ్మంలోంచే సరాసరి వచ్చి భోజనాల బల్ల వద్ద కూర్చున్నాడు. వెరా అతనికి భోజనం వడ్డించింది. ఆమె ఈ పనిలో ఉండగా ఇవాన్ గోళ్లు కొరుకుతూ కాలం గడిపాడు. అతని ఎదుట పళ్లెం ప్రత్యక్షం అయింది. అతను తన పని ఆపి, బల్లపై గల చిన్న రుమాలును తీసి చక్కగా కాలర్ లోపలికి దోపి కోటు, జాకెట్‌పై దానిని పరుచుకున్నాడు. ఎప్పుడూ శుభ్రతకు ప్రాధాన్యం ఇచ్చే ఇవాన్ బట్టలపై ఆహారం చిందకుండా ఉండేందుకు ఈ జాగ్రత్త తప్పనిసరిగా తీసుకుంటాడు. కొద్దిగా ఆహారం తీసుకొన్న తరువాత అతను ఏదైనా మాట్లాడతాడు. అదొక అలవాటు.

"ఊఁ తమారా చదువెలా ఉంది?" అని కూతురిని అడిగాడు.

రాత బల్ల దగ్గరున్న తమారా వినయంగా భుజాలు ఎగరేసింది. తల్లి కొంచెం పక్కగా ఉన్న చిన్న బల్లపై కూర్చుని భర్తని ఉద్దేశించి చెప్పింది. "తమారా బాగా బాధపడుతోంది. దానికి మనం ఒక కొత్త జత బూట్లు కొనలేకపోతున్నాం."

ఇవాన్ భోజనం ముగించి, తీరికగా ఒక పుల్లతో పళ్లు కుట్టుకుంటున్నాడు. మెల్లగా తలతిప్పి కూతురి వంక చూశాడు. "బూట్లు.. పెద్ద విషయమే మరి. ఏం... ఏమైంది? మన దగ్గర అందుకు డబ్బులేదా?" అని బద్ధకంగా అడిగాడు.

"నా విషయానికి వచ్చేసరికి ఎప్పుడూ కావలసిన డబ్బు ఉండదు" అంది తమారా విచారంగా.

ఇవాన్ లేచి నుంచుని రెండు చేతులు ప్యాంటు జేబుల్లో పెట్టి, బల్లపై ఉన్న ఖాళీ పళ్లెం వంక చూస్తూ ఏదో ఆలోచించాడు. ఆలోచన తెగలేదు. చిన్నగా ఏదో పాట రాగాన్ని ఈల వేస్తూ పడకగదిలోకి నడిచాడు. అక్కడినుంచి కూడా ఈల పాట వినిపిస్తోంది. తమారా ఆ గది వంక కోపంగా చూసి "హుఁ" అంది. వెరా నిశ్శబ్దంగా బల్ల సర్దడం ప్రారంభించింది.

అలా ఆ సాయంత్రం అతి సాధారణంగా, ప్రశాంతంగా గడిచిపోయింది. ఇది వెరా జీవితంలో మిగిలిన సాయంత్రాలకు భిన్నమైనదేమీ కాదు. ఒక తేడా ఉంది. ఆంద్రీ వచ్చి మాట్లాడి వెళ్లినప్పటి నుంచి ఆమె మనసు కలవరపడుతోంది. ఇంటి పనిలో నిమగ్నమై కూడా ఏదో ఆలోచిస్తూ ఉండడం వెరాకు కొత్తకాదు. సాధారణంగా ఆమె ఈ సమయంలో గ్రంథాలయం గురించి, పుస్తకాల గురించి, పాఠశాలలో జరిపిన వాటి గురించి గుర్తు తెచ్చుకుంటుంది. మనసును కలతపెట్టే విషయాలు కాక, కొంత ఆహ్లాదపరిచే సంఘటనల గురించి ఆమె ఆలోచిస్తుంది.

ఆ సాయంత్రం ఆంద్రీ వచ్చి ఉండకపోతే బహుశా రచయితతో జరిగే సమావేశం గురించి ఆలోచించేదేమో. ఆ సాయంత్రం వంట చేస్తున్నప్పుడు, గాజు పెంకులు ఏరుతున్నప్పుడు అందరూ భోజనాలు చేసిన తరువాత గిన్నెలు శుభ్రం చేస్తున్నప్పుడు కూడా ఆంద్రీ మాటలే

గుర్తు వచ్చాయామెకు. అన్నిటికన్నా ముఖ్యంగా తన స్కర్టు గురించి అతను చేసిన వ్యాఖ్యలు ఆమెను వెంటాడుతున్నాయి. వెలిసి, పాతబడిపోయిన ఆ స్కర్టు ప్రత్యేకంగా ఎవరి దృష్టినీ ఆకర్షించదని వెరా నమ్మకం. అనేక సాయంత్రాలు ఆమె ఆ స్కర్టుకు పట్టిన చిరుగులను అతి జాగ్రత్తగా ఎవరికీ కనపడకుండా ఉండేలా సన్నటి దారంతో కుట్టుకుంది. అలా దాన్ని బాగు చేసుకున్న ప్రతిసారీ అది శుభ్రంగా ఉందనీ, రేపు ఉద్యోగానికి వేసుకు వెళ్లేందుకు అనువుగానే, గౌరవనీయంగానే ఉన్నదనీ ఆమె తేల్చుకునేది. ఒక్కొక్కసారి ఆ స్కర్టు హుందాగా ఉందని కూడా ఆమెకు అనిపించేది. ఇప్పుడు ఆంద్రీ చేసిన వ్యాఖ్యలతో ఆ భ్రమలన్నీ పటాపంచలయ్యాయి."జనం మీ గురించి, మీ దుస్తుల గురించి చాటుగా మాట్లాడుకుంటున్నారు." అని ఆంద్రీ అన్న మాటలు ఆమె చెవుల్లో మార్మోగుతున్నాయి. అంటే ఈ పాత స్కర్టును అందరూ గమనిస్తున్నారు, చాటుగా నవ్వుకుంటున్నారు అన్న ఆలోచన ఆమెకు శాంతి లేకుండా చేసింది. పైగా రేపు సమావేశం ఒకటి.

గిన్నెలు కడగడం పూర్తయిన తరువాత వెరా తన స్కర్టును తీసి బల్లపై పరచింది. వెలసిపోయిన ఆ స్కర్టు చాలా చోట్ల ముడతలు పడి ఉంది. దాని వంక చూస్తుంటే ఆమె కళ్ల వెంట నీళ్లు తిరిగాయి. బల్లపై ఆ స్కర్టు తన వంక విచారంగా, అలసటగా చూస్తున్నట్టు అనిపించింది. అవకాశం ఉంటే ఇక విశ్రాంతి ఇవ్వరాదూ అని అడుగుతున్నట్టు తోచింది. కొన్నేళ్ల క్రితం సిల్కుతో నేసిన ఆ బట్ట ఇప్పుడు నాటి మెరుగులన్నీ కోల్పోయింది. ఇన్నేళ్ల కాలం వాడకంలో తగిలిన గాయాలు చిరుగుల రూపంలో, అతుకులు తెర వెనక దాక్కున్నా పరీక్షగా చూస్తే తెలిసిపోతూనే ఉన్నాయి. ఒకటి రెండు చోట్ల పూర్తిగా చిరగకపోయినా బట్ట పలచబడి దారం పోగులు జల్లెడలా కనిపిస్తున్నాయి. వెరా ఇస్త్రీ పెట్టె వేడిచేసి అతి జాగ్రత్తగా దానిని చలువ చేసింది. నెమ్మదిగా ఆ ఇస్త్రీ పెట్టెను స్కర్టుపై నడుపుతూ, దారం పోగులు పెట్టెకు అడ్డు పడకుండా జాగ్రత్త తీసుకుంది. చివరికి ముడతలన్నీ పోయి, ఆ స్కర్టు వెచ్చగా, మెత్తగా వెరా చేతుల్లో వొదిగింది. దానిని దీపం వెలుతురుకి అడ్డుగా పెట్టి మరోమారు పరీక్షించింది వెరా. ఇస్త్రీ చేసిన ముడతలు అయితే పోయాయి కానీ, ఆ పాతదనం అలానే ఉంది. కానీ వెరా ధైర్యంగా నవ్వుకొంది. ఫర్వాలేదు, ఇన్నేళ్లు కలిసి ఉన్నాం, మరికొంత కాలం ఇలానే ఉంటాం అని స్కర్టుతో చెప్పింది. తరువాత బూట్లు కూడా శుభ్రంగా తుడిచి, రేపు ఉదయం వేసుకొనేందుకు సిద్ధంగా ఉంచుకుంది. వంట గదిలో ఆ రాత్రి వేళ నిశ్శబ్దంలో వెచ్చగా అలా కూర్చుంటే వెరాకు సంతోషంగా అనిపించింది. ఆమె తన గురించి ఆలోచించడం ప్రారంభించింది. ఆంద్రీ మాటలు ఇంకా వెన్నాడుతున్నాయి. అతని మాటల గరించి పట్టించుకోవల్సిందే అనుకొంది.

ఇంతలోనే బూటు కింది భాగం ఊడిపోతోందని గుర్తు వచ్చి సూది దారం తీసుకుని ఆలోచనల్లో పడిపోయింది. ఉన్నట్టుండి తన వయస్సు తగ్గినట్టు అనిపించి నవ్వుకుంది. సరికొత్త సిల్కు డ్రస్సులో తనని ఊహించుకొని, ఆ ఊహకే అబ్బురపడింది. తనకు కొత్త స్కర్టు రావడం ఖాయమని తేలిన తరువాత కమ్ముకుంటున్న ఆలోచనలు ఆమెకే ఆశ్చర్యం కలిగించాయి. డ్రస్సుతో పాటు జారిపోతున్న యవ్వనం కూడా మళ్లీ అందుబాటులోకి రాబోతున్నట్టు తోచింది. ఆ ఊహే సిగ్గు కలిగించింది. ఆమెలేచి వంటగదిలోనే గోడకి ఉన్న మసకబారిన అద్దం ఎదుట నిలిచింది. అద్దంలో ఆమెకు నవ్వుతున్న రెండు అందమైన కళ్లు, నిండైన పెదవులు కల యువతి

దర్శనమిచ్చింది. ఆ పెదవులు ఏదో రహస్యం చెప్పబోతున్నట్టు తోచింది. అద్దంలో ఆమె గులాబీరంగు శరీరం మసకమసకగా కనిపించినా, బుగ్గలను కమ్మిన వేడి ఆవిర్లు ఆమె దృష్టిని దాటి పోలేదు. ఎందుకో భర్త ఇవాన్ గుర్తు వచ్చాడు. వెళ్లి మళ్లీ చిన్న బల్లపై కూలబడింది. కానీ ఆమె చేతుల్లో సూది అలానే ఉంది. చేయదల్చిన పని గురించి వెరా మరచిపోయింది. అంత అందంగా, శుభ్రంగా, సొగసైన దుస్తులు ధరించే ఇవాన్‌కు తను భార్యా? నిజానికి చాలా కాలంగా వారి మధ్య స్త్రీ పురుష సంబంధాలు లేనేలేవు. అంతెందుకు ఇవాన్ ఆమె లోదుస్తులు చూసి చాలా కాలమే అయింది. ఈ ఆలోచనతో ఆమె ఉలిక్కిపడి, వేగంగా బూట్లు కుట్టడం ప్రారంభించింది. మరేమీ ఆలోచించకుండా వెంటనే నిద్రకు ఒరుగుదామని ఆమె తాపత్రయం.

★ ★ ★

ఆ రోజు సమావేశం ఆసక్తికరంగా సాగింది. పాఠకులు తమ అభిమాన రచయిత గురించి ఉద్వేగంతో, ఆసక్తికరంగా మాట్లాడారు. వారంతా వేదిక దిగి వెళుతూ ఆయనకు ప్రేమగా కరచాలనం చేశారు. ప్రతి వక్తను వెరా ఆదరంగా వేదికపైకి పిలిచి పరిచయాలు సాగించింది. వారు ఉపన్యాసం పూర్తి చేసి తిరిగి వెళ్తుంటే తృప్తిగా నిట్టూర్చింది. యువకులు, వృద్ధులు అనే తేడా లేకుండా పాఠకులంతా తాము చెప్పదల్చిన విషయాన్ని సూటిగా, నిరాడంబరంగా చెప్పగలగడం ఆమెకు సంతోషాన్నిచ్చింది. చివరలో ఆంద్రీ లేచి వేదిక పైకి వచ్చాడు.

"మన అభిమాన రచయిత రాసిన గ్రంథాలు నాకు సంబంధించినంత వరకూ ఆహ్లాదకర మైనవే. ఇది నిజం. ఒకసారైతే పుస్తకం చదివి రెండు రాత్రులు నిద్ర పట్టక దొర్లాను. ఆయన రచనల్లోని మనుషులు ధీరోదాత్తులు, సాహసవంతులు. ఎన్ని కష్టాలు ఎదురైనా వారు తమ లక్ష్యసాధన వైపే ముందుకు సాగుతారు. ఒక పుస్తకం పూర్తి చేసి ఉదయమే లేచి పరిసరాలను పరికిస్తే ఆ పుస్తకంలోని పాత్రలు, ధీరోదాత్తులైన కార్మికులు మన చుట్టూ ఉన్నట్టు బోధపడుతుంది. అంతెందుకు నేనూ వారిలో ఒకడిని...."

ఇక్కడ శ్రోతలంతా హర్షధ్వానాలు చేస్తూ తమ ఆమోదాన్ని తెలిపారు. ఆంద్రీ ఉలిక్కిపడి, మీసం సవరించుకుని, ఉపన్యాసం కొనసాగించాడు.

"సాంస్కృతికంగా మనం మరింత అభివృద్ధి చెందాలి. అది అవసరం. దాని కోసం మనమంతా పాటు పడుతున్నాం కూడా. ఈ గ్రంథలయాన్నే చూడండి. ఎంత పెద్దది! ఎన్ని పుస్తకాలు! ఎంతమంది పాఠకులు! మన ఈ గ్రంథాలయాన్ని చూసేందుకు, ఇక్కడి పాఠకులతో మాట్లా డేందుకు పెద్ద రచయితలు ఇక్కడికి వస్తున్నారు. మన పాఠకుల స్థాయి పెరగడానికి లైబ్రరీ అధికారి వెరా ఇగ్నత్యేవ్నా ఒక ప్రధాన కారణం."

ఆంద్రీ ఈ మాటలనగానే పాఠకులు, శ్రోతలు కరతాళ ధ్వనులతో తమ ఆమోదాన్ని ప్రకటించారు. వెరా కలవరపాటుతో ప్రధాన వక్త అయిన రచయిత వంక చూసింది. అప్పటికే ఆయన కుర్చీలోంచి లేచి నిలిచి వెరా వంక అభిమానంగా చూస్తూ చప్పట్లు చరుస్తున్నాడు. ఆ హాల్లోని చాలామంది శ్రోతలు సైతం లేచి నిలచి ఆయనతో చేతులు కలిపారు, అందరూ వెరా వంకే అపేక్షగా చూస్తున్నారు. ఆందోళన చెందిన వెరా తన కుర్చీలోంచి బయటకు పారిపో బోయింది. కానీ రచయిత ఆమెను అడ్డుకుని ప్రేమగా ఆమె భుజాలపై చేతులు వేసి, కుర్చీలో కూర్చోబెట్టాడు. వెరా తన కుర్చీలో ఒక్క క్షణం మౌనంగా కూర్చుని అంతలోనే కుర్చీ వెనక్కు

చేతులు జాపి, వాటిపై తలవాల్చి ఏడుపు ప్రారంభించింది. మీటింగ్ హాల్లో క్షణంలో నిశ్శబ్దం అలముకొంది. కానీ ఆంద్రీ మాత్రం నవ్వుతూ వేళాకోళంగా చేతులు కదిపాడు. శ్రోతలు కూడా చిన్నగా, అపేక్షగా నవ్వుతూ వెరాను ఊరడించే ప్రయత్నం చేశారు. వెరా లేచి కళ్లు తుడుచుకుని, తను పెద్దగా నవ్వుతూ శ్రోతలతో జత కలిపింది. ఆంద్రీ ఒక కాగితం తీసి పైకి చదివాడు. తమ ఫ్యాక్టరీ కార్మిక సంఘం, పార్టీ విభాగం యాజమాన్యం ఈ గ్రంథాలయ ప్రధాన అధికారి వెరా ఇగ్నత్యేవ్నాను అభినందించదలచిందని, సాహితీ, సాంస్కృతిక రంగాలకు అందిస్తున్న సేవలకు గాను ఖరీదైన స్కర్టు నొకదాన్ని బహూకరించాలని నిర్ణయించామనీ ప్రకటించాడు. దీనికి శ్రోతలు మరోసారి హర్షధ్వానాలు చేశారు.

తరువాత ఆంద్రీ తన చేతి సంచిలోంచి గోధుమరంగులో ఉన్న ప్యాకెట్ తీసి అందరికీ ప్రదర్శించి, వెరాకు కరచాలనం చేసి, బల్లపై ఆ ప్యాకెట్‌ను ఆమె ముందుంచాడు. సరిగ్గా అప్పుడే వెరాకు తన పాత స్కర్టు గురించి జ్ఞాపకం వచ్చి, అందరూ దాన్నే పరీక్షగా చూస్తున్నా రనిపించి సిగ్గుతో కుర్చీలో కుదించుకు కూర్చుంది.

సమావేశం అంతటితో పూర్తి కాలేదు. చివరగా రచయిత లేచి మంచి ఉపన్యాసం ఇచ్చాడు. ఈ సమావేశం సందర్భంగా వెరా వంటి అద్భుతమైన వ్యక్తిని సన్మానించాలని నిర్ణయించినందుకు ముందు ఆయన కార్మిక సంఘాన్ని అభినందించి, కృతజ్ఞతలు తెలిపాడు. సాహితీ ప్రపంచంలో చాలామందికి వెరా ఇగ్నత్యేవ్నా గురించి తెలుసని అన్నాడు. ఒక పుస్తకం రాయడం పెద్ద గొప్పపనేమీ కాదు. దాన్ని పాఠకులందరికీ అందించడం నిజమైన సాహితీ సేవ. ఇది పాఠకుల్లో రాజకీయ, సాంస్కృతిక, నైతిక చైతన్యం కలిగిస్తుంది. అటువంటి కీలకమైన బాధ్యతను నిర్వ ర్తిస్తున్న వెరా వంటి మనుషులు ఈ సమాజానికి అత్యవసరం. ఆమెను సన్మానించడం ద్వారా మనమంతా ఇవాళ మన బాధ్యతను నెరవేర్చాం. సోవియట్ సమాజం నేడు ఉపయోగకరమైన సేవలందించే ఇటువంటి చక్కటి వ్యక్తులను గౌరవించగలుగుతోంది. నియంతృత్వ దేశాల్లో గ్రంథాలను నిషేధించి, అగ్నికి ఆహుతి చేస్తుంటే, మనం మాత్రం రచయితలను, పుస్తకాలను గౌరవిస్తున్నాం. ఆ పుస్తకాలను అందరికీ అందుబాటులోకి తెస్తున్న వెరా వంటి వ్యక్తులను అభినందించగలుగుతున్నాం అంటూ ఆయన ప్రసంగించాడు. చివరిలో రచయితలందరి తరపునా వెరాకు కృతజ్ఞతలు తెలిపి, ఆమె మరింతకాలం ఆరోగ్యంగా ఉండాలని, ఇలాగే సాహితీ ప్రపంచానికి తోడ్పాటునివ్వాలనీ ఆకాంక్షిస్తూ ఉపన్యాసం ముగించాడు.

రచయిత ప్రసంగాన్ని వెరా శ్రద్ధగా వింది. అవును తను ఎంతో బాధ్యతాయుతమైన, కీలకమైన పని చేస్తోంది. పుస్తకాలంటే తనకు గల అపరిమిత ప్రేమ వ్యక్తిగత వ్యవహారం ఏమీ కాదు. అది ఎంతో ఉపయోగకరమైన, ప్రధానమైన అభిరుచి. తన ఉద్యోగానికి, చేస్తున్న పనికి గల సామాజిక ప్రాధాన్యం ఇంతవరకూ ఆమెకు ఏనాడూ స్ఫురించలేదు. ఇప్పుడు, ఇన్నేళ్లుగా తన గ్రంథాలయంలోకి వచ్చిన వేలాది పుస్తకాలు ఆమె కళ్లముందు ప్రత్యక్షమయ్యాయి. వాటి కోసం వచ్చే వేలాది పాఠకులు గుర్తు వచ్చారు. మొదట్లో ఈ పాఠకుల్లో చాలామందికి ఎలాంటి పుస్తకాలు చదవాలో, వాటి కోసం ఎక్కడ అన్వేషించాలో తెలిసేది కాదు. మొహమాటంగా తన వద్దకు వచ్చి "ఫలాన విషయంపై ఏదైనా పుస్తకం ఉందా?" అని అడిగేవారు. క్రమంగా వారు తమకు కావలసిన గ్రంథాలు ఏమిటో తెలుసుకుని, అవే కావాలని అడగడం మొదలైంది.

ప్రస్తుతం పాఠకులు తమకు కావలసిన పుస్తకం కోసం గట్టిగా అడుగుతూ, "అదేంటండీ, ఇంత పెద్ద లైబ్రరీకి రెండు ప్రతులే వచ్చాయా?" అని గొణగడం కూడా ప్రారంభించారు.

లైబ్రరీలో ఆమెకు ఎనిమిదిమంది సహాయకులు పని చేస్తున్నారు. అందరికీ తమ పని బానే తెలుసు. చాలా సాయంత్రాలు వాళ్లంతా గ్రంథాలయాన్ని మరింత శాస్త్రీయంగా ఎలా సర్దాలి, అందరికీ పుస్తకాలు అందుబాటులో ఉండాలంటే ఏం చేయాలి అని మాట్లాడు కొంటారు. మిగిలిన గ్రంథాలయాలు ఎలా పనిచేస్తాయో కూడా వెరాకు తెలుసు. గ్రంథాలయాల నిర్వహణపై జరిగిన ఎన్నో సమావేశాలకు, సదస్సులకు ఆమె హాజరైంది. ఎన్నో పుస్తకాలు, సాహిత్య విమర్శలు ఆమె చదివింది. అయితే ఏనాడూ ఆమె తనొక అద్భుతమైన పనిలో ఉన్నానని కానీ, ఆ పని తనకు పూర్తిగా తెలుసునని కానీ గమనించలేదు, గర్వపడలేదు. ఆ రచయిత ఈ సంగతి బాగానే గమనించాడు. అందుకే -

"వెరా వంటివారు నిరాడంబరులు. వాళ్లు తమ గురించి ఏనాడూ ఆలోచించరు. పని గురించే వారి ధ్యాస. కానీ మనం వారి గురించి పట్టించుకోవాలి. కృతజ్ఞతలు ప్రకటించాలి. ఆమెకు ఖరీదైన డ్రస్సు బహూకరించాలని కార్మిక సంఘం నిర్ణయించడం సరైన పని. మనం ఆమెకు చెప్పాలి. మీరు మీ గురించి కూడా ఆలోచించుకోండి. సంతోషంగా బతకండి. శుభ్రమైన దుస్తులు ధరించండి అని గుర్తు చేయాలి. మన కోసం శ్రమించే వారి బాగోగులు పట్టించుకోవడం మన బాధ్యత" అని ప్రకటించాడు.

సమావేశం తరువాత లైబ్రరీ సిబ్బంది, రోజువారీ పాఠకుల కోసం చిన్న విందు జరిగింది. బల్లలపై వైను, కేకులు ఉంచారు. వెరా సహచరులంతా రచయిత చుట్టూ చేరి అనేక సంగతులు మాట్లాడుకున్నారు. పనిలో ఎదురయే ఇబ్బందులు, అనుమానాలు, పాఠకులతో రోజువారీ సంబంధాలు, పుస్తకాలు, స్నేహితులు, రచయితలూ..... ఇలా అనేక సంగతులు వారి మాటల్లో దొర్లాయి. విందు తరువాత అందరూ ఇళ్లకు బయలుదేరినప్పుడు ఆంద్రీ లేచి వెరా వద్దకు వచ్చి ఆమె చేతుల్లోని గోధుమ రంగు ప్యాకెట్‌ను తీసుకొన్నాడు.

"దీన్ని ఇంటికి తీసుకెళ్లనవసరం లేదు. ఇక్కడే బల్ల సొరుగులో పెట్టి తాళం వేద్దాం. రేపు తీసుకెళ్లి దర్జీ వానికి ఇద్దాం" అన్నాడు.

ఈ మాటలు విని రచయిత పెద్దగా నవ్వాడు. వెరా మొహమాటంగా చూసి మౌనంగా నిలబడింది.

ఇంటికి తిరిగివచ్చిన వెరా ఎప్పటిలానే పనిలో పడింది. కొడుకు పావ్‌లూష ఎప్పటిలానే ఇల్లంతా చిందర వందర చేసి ఆటలకు బయటకు వెళ్లాడు. తమారా స్కూలుకు కూడా వెళ్లినట్టు లేదు. కనీసం ఆమె తలకూడా దువ్వినట్టు లేదు. రాత బల్లపై నిన్నటి పుస్తకాలే అడ్డదిడ్డంగా పడి ఉన్నాయి. ప్రస్తుతం తమారా తల్లితో మాట్లాడడం లేదు. అంటే మరో యుద్ధానికి ఆ పిల్ల సిద్ధమవుతోంది. ఇప్పటివరకూ ఇటువంటి పరిస్థితి ఎదురైనప్పుడు కూతురు మనసు నొచ్చుకున్న దని వెరా అనుకునేది. కానీ అందులో తన తప్పు ఏదో ఉన్నదని ఆమెకు అనిపించేది. కాని ఇవాళ మాత్రం వెరా అలా భావించడం లేదు. అయినా ఆ చిన్నపిల్ల అలా బాధతో మొహం ముడుచుకుని నిశ్శబ్దంగా కూర్చోవడం తల్లికి విచారంగా అనిపించింది. జాలి కలిగింది. తమారా తన కష్టానికి తల్లే కారణం అనుకొంటుందని వెరాకు తెలుసు. కానీ వెరా దృష్టిలో పాప బాధకు

కారణం భర్తే. తమారాకు బూట్లు కావాలని తెలిసికూడా పట్టించుకోని ఇవాన్‌పై వెరాకు అనుకోకుండా కోపం కలిగింది. నెలకు మూడు వందల రూబుళ్లు మాత్రం ఇంటికి ఇస్తాడు. ఏం చాలుతుందని? అసలు అతని జీతం ఎంత? ఇదివరకు ఎప్పుడో అతనికి ఏడువందల రూబుళ్ళ జీతం వచ్చేది. ఇప్పుడు తగ్గడం ఏమిటి?

ఈ ఆలోచనలు ఇలా సాగుతున్నప్పటికీ, ఆ సాయంత్రం తను సాధించిన అద్భుత విజయం కలిగించిన సంతోషం నుంచి వెరా బయటపడలేదు. ఎంతో సంతృప్తిగా ఉందామెకు. అందుకే ప్రస్తుతం ఆమె స్పష్టంగా ఆలోచించగలుగుతోంది. రచయిత తను చేస్తున్న పని గురించి మెచ్చుకోవడం. పాఠకులు హర్షధ్వానాలు చేయడం ఆమెకు కొత్త ధైర్యాన్నేదో ఇచ్చాయి. కాని ఇంటి దగ్గర మాత్రం వాతావరణం, విచారంగా, మందకొడిగా ఉంది. అలా అని ఇంటిపనిని కాదనలేదు. ఎప్పటిలానే ఆ పని అలా ఉంటుంది. తేడా రాదు. ఆ రాత్రి వెరా మరోసారి పిల్లలకు భోజనం వడ్డించింది. తమారా మౌనం వీడకుండా పళ్లెంలోని కట్‌లెట్‌ని ముక్కలు చేస్తూ, విచారంగా తల పంకించింది. ఆ పిల్ల ధోరణి వెరాకు ఇబ్బందిగా ఉంది. గొంతులో ఏదో అడ్డం పడినట్టు అనిపించింది. ఉన్నట్టుండి లైబ్రరీ సొరుగులో ఉన్న గోధుమ రంగు ప్యాకెట్, జ్ఞాపకం వచ్చింది. ఆ ప్యాకెట్ తన అహాన్ని తృప్తిపరచే సాధనం తప్ప మరేమీ కాదు. కానీ ఇక్కడ ఈ చిన్నపిల్ల బూట్లు లేకపోవడం వల్ల తనకు ఎంతో ఇష్టమైన డ్రస్సు ధరించలేక పోయింది. కార్మిక సంఘం బహూకరించిన ఖరీదైన స్కర్టు ధరించి తను షోకుగా తిరుగుతుంది. కానీ ఈ పసిదానికి సాయపడేదెవరు? పోనీ ఆ స్కర్టు గుడ్డను ఏదైనా షాపులో ఇచ్చేసి తమారాకు బూట్లు తీసుకుంటే.... ఎలా? అది ఇప్పటికీ ఆంద్రీ ఆధీనంలోనే ఉంది. ఆమె ఆలోచనలు ఇలా సాగుతుంటే ఇవాన్ ఇంటికి వచ్చాడు.

అతను ఎప్పటిలానే బల్ల వద్ద కూర్చుని భోజనం చేస్తుంటే, వెరా అతనికి చెప్పింది. "ఇవాళ గ్రంథాలయంలో మీటింగు జరిగింది. ఓ విషయం చెప్పనా? మీటింగు తరువాత వాళ్లు నాకు ఒక బహుమతి ఇచ్చారు."

తమారా తల్లి వంక ఆసక్తిగా చూసింది. ఇవాన్ మాత్రం బద్ధకంగా అడిగాడు. "బహుమతా? ఏమిటది?"

"ఒక స్కర్టు కుట్టేందుకు కావలసిన బట్ట."

"అదేం బహుమతి? పాతకాలం పద్ధతి" అన్నాడు ఇవాన్.

తమారా కళ్లు పెద్దవి చేసి, చేతిలో చెంచా, ఫోర్కు బల్లపై ఉంచి తల్లి దగ్గరకు వచ్చి ప్రశ్నించింది. "ఏదీ ఇంటికి తెచ్చావా?"

"లేదు... కుట్టేందుకు ఇచ్చాను."

"అంటే, దాన్ని నీ చేతికి ఇచ్చారన్నమాట."

వెరా సిగ్గుగా తల ఊపింది.

"ఎలాంటి గుడ్డ అది?" తమారా ఆసక్తిగా అడిగింది.

"ఏదో ఖరీదైనదే. క్రేప్ డి చినే అన్నారు" తల్లి వివరించింది.

"ఏ రంగు?"

"నేను చూడలేదు... తెలియదు."

తమారా రెండు అరచేతుల్లో బుగ్గలు ఆనించుకొని తల్లి వంక శ్రద్ధగా, పరీక్షగా చూసింది. తల్లి ధరించిన స్కర్టు, బూట్లు పరిశీలించింది. చివరికి -

"అయితే డ్రస్సు కుట్టించుకుంటున్నావా?" అని ప్రశ్నించింది.

వేరాకు మరింత అవమానంగా, సిగ్గుగా అనిపించింది. అతి కష్టంపై నెమ్మదిగా బదులిచ్చింది.

"అవును... కుట్టించుకుందామనే... నా స్కర్టు బాగా పాతబడిపోయింది" అంది సంజాయిషీ ఇస్తున్నట్టు.

తమారా లేచి తల్లి వంక చూస్తూ "అది ఏ రంగులో ఉందో?" అంది సాలోచనగా.

ఇవాన్ పెట్రోవిచ్ భోజనం ముగించి కుర్చీలోంచి లేస్తూ, "మా ఆఫీసులో ఇలాంటి బహుమతులు ఇవ్వదలిస్తే డబ్బు రూపంలోనే ఇస్తారు. అలా అయితేనే తీసుకొనేవారికి ఉపయోగం" అన్నాడు.

★ ★ ★

మర్నాడు ఆంద్రీ మధ్యాహ్నం వేళలో గ్రంథాలయానికి వచ్చాడు. దర్జీ దగ్గరకు వెళ్దామని ఆలోచన. కానీ లైబ్రరీలో వెరా సహాయకురాలైన మరూస్య అభ్యంతరం తెలిపింది. అది ఆడవాళ్ల దర్జీ దుకాణం. మీరు రాకూడదని అడ్డుకొంది. మొత్తానికి వెరా, తన సహాయకులైన నలుగురు యువతులతో దర్జీ దుకాణానికి వెళ్లింది. అక్కడ ఆ పిల్లలంతా వెరాను చుట్టుముట్టి, సరికొత్త ఫ్యాషన్‌లో స్కర్టు కుట్టించేందుకు విశ్వప్రయత్నం చేశారు. వాళ్లంతా వెరాను మళ్లీ పెళ్లికూతురిని చేస్తున్నంత హడావుడి చేశారు. వెరా మాత్రం అందరినీ నవ్వుతూ కసురుకుని, పెద్ద మనిషి తరహాలో, సాదాగా ఉండేలా స్కర్టు కుట్టమని దర్జీకి పురమాయించింది. ఇంతకీ ఆమె స్కర్టు బట్ట ముదురు కుంకుమ రంగులో ఉంది. మెత్తగా, సున్నితంగా, పలుచగా, పట్టులా ఉన్న వస్త్రం ముట్టుకుంటేనే జారిపోతోంది.

లైబ్రరీకి తిరిగివస్తూ వెరా తన పాదాల వంక చూసుకుంది. ఆ బూట్లు నలిగి, చిరిగి పాతబడి చూసేందుకు విచారం కలిగిస్తున్నాయి.

ఆ సాయంత్రం వెరా రోజుకంటే ప్రసన్నంగా, ప్రశాంతంగా ఇంటికి తిరిగి వచ్చింది. దారిలో ఆమెకు రోజులాన్నే తమారా, పావ్‌లూషలు గుర్తు వచ్చారు. మురికిగా ఉన్న భోజనాల బల్ల చిందరవందరగా ఉన్న ఇల్లు ఆమె కోసం ఎదురు చూస్తున్నాయి. అలవాటు ప్రకారం ఆమె ఆ దృశ్యాన్ని పరికించింది. కానీ వాటిని శుభ్రం చేయాలనే రోజు కలిగే తొందర ఆమెలో ఇవాళ లేదు. లోపలికి నడిచి తమారా కూర్చునే కుర్చీ ఎదురుగా కూర్చుంది. పడకగదిలోంచి తమారా వచ్చింది.

"ఇవాళ కూడా ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్లలేదా?" తల్లి ప్రశ్నించింది.

"లేదు" అని ముభావంగా చెప్పింది తమారా.

"ఎందుకిలా మానేస్తున్నావు?"

"ఏం వేసుకువెళ్లాలి?"

"తమారా, ఏమిటిది? మనం ఏం చేయగలం?"

"ఏం చేయాలో నీకు తెలియదా?"

"ఇంకా బూట్ల గురించేనా ఈ అలక?" తల్లి లాలనగా అడిగింది.

"అవును, గోధుమరంగు డ్రస్సు వేసుకొని, గులాబీరంగు బూట్లతో వెళ్లాలా? జనం నవ్విపోతారు."

"కానీ నీకు వేరే గౌనులున్నాయిగా తమారా. అదీకాక నల్ల బూట్లు కూడా ఉన్నాయి. ఏం? మీ క్లాసులో పిల్లలంతా ప్రతిరోజూ గౌనుకు తగ్గ బూట్లు వేసుకొనే వస్తారా?" ప్రశ్నించింది వెరా.

"నల్లబూట్లా?" నివ్వెరిపోయినట్టు ప్రశ్నించింది తమారా. అలమారలోంచి ఆ బూట్లు తీసి తల్లి ముందు ఉంచింది. "ఇవా? ఇవి వేసుకోవాలా?" అని గట్టిగా అడిగింది.

"కానీ తమారా? నా బూట్లు చూడు ఎలా ఉన్నాయో. నేను వాటితోనే కదా ఆఫీసుకి వెళ్తున్నాను" ఆమె మెల్లగా, స్నేహంగా మాట్లాడింది. కానీ తమారా ఇదేం పట్టించుకోలేదు. తల్లి తెచ్చిన ఈ పోలిక పూర్తిగా అసంబద్ధంగా తోచింది ఆ పిల్లకు.

"ఏంటమ్మా? ఏమిటా పోలిక? అంటే నేను కూడా నీలా దుస్తులు ధరించాలనా? నువ్వు పెద్దదానివి. ఇలాంటివన్ని ఎప్పుడో చూసే ఉంటావు. నేనింకా చిన్నదాన్నే. కాస్త సరదాగా, శుభ్రంగా ఉండద్దా?" అని తల్లిని నిలదీసింది.

"నేను చిన్నగా ఉన్నప్పుడు కూడా ఇప్పుడు నీకున్నన్ని సౌకర్యాలు లేవు. చాలాసార్లు ఖాళీ పొట్టతో, ఆకలితో నిద్రపోయేదాన్ని" అంది వెరా గతాన్ని తలచుకుంటూ.

తమారా చికాకు పడింది. "అవేం చెప్పకు. ఆ రోజుల్లో నీకేం ఉన్నాయో, ఏం లేవో నాకేం తెలుసు. ఆ రోజులు వేరు, ఈ కాలం వేరు. ఇప్పుడు తల్లితండ్రులు పిల్లలకు అన్నీ ఇవ్వాలి. ఈ సంగతి అందరికీ తెలుసు. మీకు తప్ప. నేను పెద్దయితే, నా కూతురికి బూట్లు కొని ఇవ్వడానికి ఇంత యాగీ చేయను" ఆ పిల్ల అరిందాలా మాట్లాడుతోందని వెరా గమనించింది. కానీ ఆ పాప కళ్లలో నీళ్లు ఉబుకుతున్నాయి.

వెరా మాత్రం తేలికగా కూతురికి లొంగిపోదలచలేదు. "అయితే నాకు వయసు అయి పోయిందంటావా? ఈ చిరుగు పాతలే నాకు చాలంటావ్?" కూతురిని అడిగింది. తమారా అంతకంటే మొండిగా వాదించింది "నువ్వు ఏ దుస్తులు ధరించాలో నేను నిర్ణయించను. నీ యిష్టం కానీ నలుగురి ముందు నన్ను నవ్వుల పాలు చేయవద్దు. నువ్వొక కొత్త స్కర్టు కుట్టించుకుంటున్నావని నాకు తెలుసు. అంటే నీకేం కావాలంటే అవి ఉంటాయి. నాకు అవి దొరకవు. నువ్వు మాత్రం సరికొత్త సిల్కు స్కర్టు వేసుకోగలవు" అంది కసిగా.

"తమారా! నీకు కూడా కొత్త డ్రస్ ఉందిగా."

"ఆ ఉంది. బూట్లు లేని కొత్త డ్రస్. ఇంతకీ నీకు ఆ కొత్త స్కర్టు దేనికి? నాన్న కోసమా? ఇంతకీ అది ఏ రంగులో ఉంది?"

"అది.... ముదురు కుంకుమరంగు......."

దీంతో తమారా కోపం కట్టలు తెంచుకుంది. "ఆహా! ఆ రంగు కావాలని ఎన్నిసార్లు అడిగాను? అడిగి అడిగి విసుగుపుట్టిందే కానీ, నువ్వు నాకు కొనివ్వలేదు" అంటూ పెద్దగా కేకలు ప్రారంభించింది. "నాకు అది కావాలి. ఆ స్కర్టు నాకే కావాలి. నాకు కావాలంటే ఇవ్వవు కానీ, నువ్వు మాత్రం కొత్త డ్రస్సు ధరించి షోగ్గా తిరుగుతావేం?" అంటూ కాళ్లు చరుస్తూ పడకగదిలోకి వెళ్లి వెక్కిళ్లతో పెద్దగా ఏడుపు అందుకొంది.

తమారా ఏడుపు ఇల్లంతా వినిపిస్తోంది. వెరా కలవరపాటుతో కుర్చీలో బిగుసుకుపోయింది.

ఆమె సిగ్గుపడుతోంది కూడా. ఇంతలో బయట తలుపు చప్పుడైంది. వెరా గట్టిగా నిట్టూరుస్తూ లేచి తలుపు తీసింది. వచ్చింది ఆండ్రీ. లోపలికి అడుగు పెడుతూనే అతను పడకగదివైపు తమారా ఏడుపు విన్నాడు. తరువాత తల పంకించి వెరా వంక చూసి చిరునవ్వు నవ్వాడు.

"దర్జీవానికి ఇచ్చేందుకు ఉచిత కూపన్లు తెచ్చాను. తీసుకోండి" అన్నాడు.

"రండి" అంది వెరా యాంత్రికంగా.

అతను వచ్చి కూర్చోగానే ఏదో గుర్తు వచ్చినట్టు ఆమె గబగబా పడకగది వైపు నడిచి ఆ తలుపు మూయబోయింది. అంతలోనే తమారా గది గుమ్మంలోకి వచ్చి నిలిచి, చేతిలో ఉన్న నల్ల ప్యాకెట్‌ను తల్లి వైపు విసిరింది.. అందులోంచి గోధుమ రంగు డ్రస్సు అలలు అలలుగా నేలపై వెరా పాదాలముందు పరచుకొంది. 'తీసుకో ఆ డ్రస్సు వేసుకుని ఊరేగు. నాకేం అక్కర్లేదు' అని తమారా గట్టిగా అరిచింది. ఆ పిల్ల అప్పటికే గదిలో ఉన్న ఆండ్రీని చూసింది. కానీ లెక్క చేయలేదు. పడక గది తలుపు పెద్ద చప్పుడుతో మూసి, లోపలికి వెళ్లిపోయింది. వెరా నోట మాటరాక బొమ్మలా నిలిచిపోయింది. ఆమెకు అవమానంగా అని పించింది. బుర్ర పనిచేయలేదు. ఇంట్లో అతిథి ఎదుట కూతురు అలా ప్రవర్తించడం చూసి ఆమె కలత చెందింది.

ఆండ్రీ చటుక్కున వంగి నేలపై ఉన్న డ్రస్సు అందుకుని, కుర్చీ చేతులపై ఉంచాడు. అనాలోచితంగా ఆ గౌను చేతులను సర్దాడు. మడతలు సరి చేశాడు. తరువాత వెరా వంక ప్రశ్నార్థకంగా చూసి, "ఏమిటిది? ఆ పిల్లను చూసి భయపడుతున్నారా?" అని నిలదీశాడు.

అతను కావాలనే గట్టిగా ఈ ప్రశ్న వేశాడు. పడకగదిలో ఉన్న తమారాకు కూడా వినిపించాలని అతని ఉద్దేశంలా ఉంది. నిజంగానే తమారా ఉన్నట్టుండి ఏడుపు ఆపివేసింది.

వెరా కుర్చీ వెనక నిలిచి "ఆండ్రీ ఏమిటి? ఏమంటున్నారు?" అని ప్రశ్నించింది.

'ఇంకా ఏమీ అనలేదు వెరా ఇగ్నత్యేవ్నా. ఎన్ని మాటలని ఏం లాభం. మేం మిమ్మల్ని ఎంత గౌరవిస్తాం! కానీ ఇలాంటివి చూస్తూ ఊరుకోలేం. ఇక్కడ ఈ ఇంట్లో మీరేం చేస్తున్నారు? ఎలాంటి పిల్లలని పెంచుతున్నారు. మీరు మీ స్వహస్తాలతో శత్రువులను తయారు చేస్తున్నారు' అన్నాడు ఉగ్రంగా.

"శత్రువులెవరు ఆండ్రీ?" అయోమయంగా అడిగింది వెరా.

"కాస్త ఆలోచించండి. ఆ పిల్ల ఏమనుకుంటోంది? నేనలా మాట్లాడడం మీకు ఇబ్బందిగా ఉందేమో. ఉండనివ్వండి. ఇదంతా మీ కుటుంబ వ్యవహారం అనుకుంటున్నారేమో. అదేం కాదు. ఆ పిల్ల ఉంది హాయిగా భోజనం చేసింది. బల్లమీద ఎంగిలి పళ్లాలు, గిన్నెలు అలానే వదిలింది. మీరు అవన్నీ శుభ్రం చేయాలా? ఆమె ఏం చేస్తుంది. చెత్తంతా వాగుతూ, నానా యాగీ చేస్తుంది. మిమ్మల్ని శాపనార్థాలు పెడుతుంది. ఇంట్లో మీ శ్రమకు అది ప్రతిఫలమా? కష్టించి పనిచేసేవారి పట్ల ఆమె ధోరణి అదే అయితే, రేపు నిజమైన కార్మికుల పట్ల ఆమె ధోరణి ఎలా ఉంటుంది? పైగా ఆమె కమ్యూనిస్టు విభాగం సభ్యురాలేమో కూడా కదూ?"

దీనికి తమారా జవాబు చెప్పింది. "అవును అయితే ఏమిటి?" అప్పటికే ఆమె పడకగది గుమ్మంలో నిలిచి ఉంది.

ఆండ్రీ ఆమె వైపు చూసి, కోపంగా అన్నాడు. "ఓహో కమ్యూనిస్టువి కూడానా. సరే వచ్చి ఈ కంచాలు కడుగు. పనికిమాలిన పిల్లా!"

తమారా జవాబు ఇవ్వకుండా ఆంద్రీ వంక ద్వేషంతో నిండిన చూపు సారించింది. "ఏం మాట్లాడవు? అన్నం తిన్నావా?" అడిగాడు ఆంద్రీ.

"అది మీకు అనవసరం. నాపై కేకలు వేయడానికి మీకేం అధికారం ఉంది?" అడిగింది తమారా ధిక్కార స్వరంతో.

దీనికి ఆంద్రీ సూటిగా బదులివ్వలేదు. 'కమ్యూనిస్టువి కూడా. ఏం? 1918లో నేనూ యువ కమ్యూనిస్టు విభాగంలో సభ్యుడిని. నీలాంటి పనికిమాలిన పిల్లలను చాలామందినే చూశాను.'

"ఎందుకలా అరుస్తారు? పనికిమాలినదాన్నా? బహుశా మీకంటే ఎక్కువ పనే నేను చేయగలను" అంది తమారా బింకంగా.

ఇద్దరు ఒకరినొకరు పరీక్షగా చూసుకున్నారు. ఉన్నట్టుండి ఆంద్రీ మొహంలో కోపం అదృశ్యమైంది. అతను విశాలంగా నవ్వుతూ, కళ్లు కొంటెగా చిట్లించి "సరే అలాగే కానివ్వు. నాకో సాయం చెయ్యి. కాస్త ఈ గిన్నెలు శుభ్రం చెయ్యి" అన్నాడు స్నేహంగా.

తమారా కళ్లల్లోనూ నవ్వు మెదిలింది. వెంటనే ఆమె మొహంలో లేని కోపం తెచ్చుకొని తల్లి వంక చూసింది. కుర్చీలో ఉన్న గోధుమరంగు గౌనును గమనించింది. ఆంద్రీతో అంది. "సరే రండి ఇద్దరం కలిసి పనిచేద్దాం. మీరు గిన్నెలు కడగండి. నేను తుడుస్తాను" అంటూ బల్ల వద్దకు నడిచి, దానిపై ఉన్న పళ్లేలు, గిన్నెలూ సర్ది, వంటగదిలోకి తీసుకెళ్లింది.

"అదీ... అలా ఉండాలి పిల్ల అంటే" అని వ్యాఖ్యానించాడు ఆంద్రీ.

"అది మీకు అనవసరం...." అని గొణుక్కుంటూ వెళ్లి తన గౌనుపై పొడవాటి కోటు ధరించింది తమారా.

వెరా తన అతిథి వంక పరీక్షగా చూసింది. కొత్తగా కనిపించాడు. పుస్తకాలను ప్రేమించి, మనుషులతో మర్యాదగా వ్యవహరిస్తూ, చిరునవ్వులు చిందించే తనకు తెలిసిన ఆంద్రీకి బదులు గది మధ్యలో బలంగా, దృఢంగా, ఉగ్రంగా నిలిచిన కొత్తమనిషి కనిపించాడామెకు. ఉన్నట్టుండి గదంతా కలియ తిరుగుతూ ముసలివాడిలా గొణగడం ప్రారంభించాడు. "నువ్వు ఇంకా చిన్నపిల్లవి. ఆరిందాలా మాట్లాడకు. పెద్దవాళ్లని గౌరవించు. అమ్మమీద అలా అరవకు. కేకలు పెట్టకు. పనికిమాలిన పిల్లా. ఏమనుకుంటున్నావు? నీ సంగతి తేలుస్తానుండు" అంటూ తమారాను హెచ్చరిస్తున్నాడు.

ఆంద్రీ తన చొక్కా చేతులను పైకి మడిచాడు. తమారా అతని వంక భయం భయంగా చూసి వంట గదిలోకి నడుస్తూ ఆంద్రీతో అంది. "మీరే పెద్ద పనివాళ్లు అనుకుంటున్నారేమో. మీరే గొప్ప కార్మికులనుకొంటున్నట్టు ఉంది. మాకూ చేతనవుతుంది. ఇంటి దగ్గర మీరు మాత్రం గిన్నెలు కడుగుతారా? మీ ఆవిడ ఆ పని చేస్తుంది. మీరు మాత్రం ఇక్కడ పెద్ద మనిషిలా నటిస్తారు."

"ఆ మాటలే వద్దంది. వెళ్లు. ఆ ప్లేట్లు కడుగు" అని గద్దించాడు ఆంద్రీ.

ఇంతలో వెరాకు స్పృహ వచ్చినట్టు అయింది. "ఏం చేస్తున్నారు మీరిక్కడ?" అని వారిని ప్రశ్నించింది. ఆంద్రీ అడ్డుగా నిలిచి, ఆమె చెయ్యి పట్టుకుని కుర్చీలో బలవంతంగా కూర్చోబెట్టాడు. ఈలోగా తమారా బల్ల అంతా శుభ్రం చేసి, పళ్లేలు, గిన్నెలు, చెంచాలు, ఫోర్కులు పోగుచేసి వంటగదిలో గట్టుపై అమర్చింది. ఆంద్రీ ఆమె వంక తీవ్రంగా చూస్తున్నాడు. అతను

ఆ పిల్ల వెనకే తిరుగుతూ బలమైన చేతులను గాలిలో కదుపుతున్నాడు. చూస్తే గిన్నెలు కడగడం కాక, పెద్ద కొండలు తవ్వేందుకు సిద్ధమవుతున్నట్టు కనిపించాడు. వెరా నిశ్శబ్దంగా కూర్చుని అంద్రీ వంక చూస్తోంది. ఆమెకు ఈర్ష కలిగింది. ఇలాంటి కార్మికులే ఫ్యాక్టరీలో పనిచేస్తూ చైతన్యవంతులుగా, తెలివైనవారుగా తయారు అవుతున్నారు. అక్కడి పని నిజమైన పని. వాళ్లు సలక్షణమైన మనుషులు. వాళ్ల పని ముందు లైబ్రరీలో తన పని ఏమీ కాదని అనుకుంది.

వెరా లేచి వంట గదిలోకి తొంగి చూసింది. అక్కడ అంద్రీ చిన్న బల్లపై కూర్చుని ఉన్నాడు. కాళ్లు ఎడంగా పెట్టి బలమైన చేతులను వళ్లో పెట్టుకుని వంకరగా నవ్వుతున్నాడు. "అదీ అలా పనిచేయాలి. బావుంది. క్షణాల్లో మంచి పనిగత్తెగా మారావు. నిన్ను చూస్తుంటే సంతోషం కలుగుతోంది. కానీ ఇంతకు ముందు ఏం చేశావు? కొత్త బట్టలను విసిరేశావు. అదేమన్నా బావుందా? ఎంత అసహ్యంగా ఉందో నువ్వలా చేయడం" అంటున్నాడు.

తమారా మౌనంగా పళ్లేలు కడుగుతుంది.

"చూడు ఇలా పనిచేస్తే ఎంత బావుందో. దీనికి బదులు ఫ్యాషన్లు, షోకుల వెంటపడ్డావు. ఎందుకన్ని షోకులు? నీకు ఎన్ని బట్టలున్నాయి? నల్లది, తెలుపు డ్రస్సు, పసుపు రంగుది, గోధుమ రంగు గౌను.... ఎందుకన్ని? అన్ని లేకపోతే అందంగా ఉండనని అనుమానమా? ఏం కాదు. నీకేం చక్కగా ఉంటావు" అని సాధిస్తున్నాడు అంద్రీ. "పైగా నీ దుస్తుల కోసం మరెవరో కష్టపడాలి" అన్నాడు.

"బహుశా అది వారికి కష్టం కాదేమో. వారికి అలా కష్టపడడం ఆనందం కలిగిస్తోందేమో" అంది చిన్న స్వరంతో తమారా.

"ఎవరికి ఆనందం? ఒక జత బూట్ల కోసం ఇంత అల్లరి చేస్తే ఎవరికి ఆనందం? బుద్ధిలేని పిల్లా. పైగా సమర్థించుకోవడం ఒకటి" అని అరిచాడు.

"అలా అరవద్దు" అంది తమారా మళ్లీ కోపం తెచ్చుకుని.

"ఏమిటి అరవకూడదా? మరి నీకు బుద్ధి ఎలా వస్తుంది? ఎంత కృతఘ్నురాలివి? అమ్మ గురించి ఆలోచించు. ఫ్యాక్టరీలో అందరూ ఆమెను గౌరవిస్తారు. ఆమె ఎంతో కష్టపడి ఉద్యోగం చేస్తున్నారు. నాకు తెలుసు. ఎందుకంటే నేనూ కష్టపడి పనిచేసేవాడినే కనుక. అగు.. ఏమిటిది? దీన్ని కడగడం అంటరా? ఆ ప్లేటు వెనక వైపు ఎవరు కడుగుతారు? ఆకాశం నుంచి ఎవరైనా వస్తారా?" అని మందలిస్తున్నాడు.

"అబ్బబ్బ?......" అని విసుక్కుంది తమారా.

"ఆ విసుగే వద్దంటున్నది" అని తిరిగి ప్రారంభించాడు అంద్రీ. "లైబ్రరీలో వేలాది గ్రంథాలు వాటన్నిటి గురించి అమ్మ తెలుసుకోవాలి. వాటి గురించి అందరికీ చెప్పాలి. ఎవరికి కావలసిన పుస్తకం ఏమిటో గుర్తించి, అందించాలి. అది కష్టమైన చాకిరీ కాదా? అంత కష్టపడి తీరా ఇంటికి వస్తే ఇక్కడ కూడా చచ్చేంత పని. గొడ్డు చాకిరీ తప్పడం లేదు. ఎవరి కోసం? ఎందుకింత పనిచేయాలి? చెప్పు. నువ్వే చెప్పు. ఎందుకంత పనిచేయాలామె? అలా ఆమె పనిచేస్తే నువ్వు కాలు కదపకుండా కూర్చుని ఎదుగుతావు. నీ సరదా కోసం, నీ కోసం ఆమె ఈ పని చేయాలి. అంతే కదా? నీ అమ్మ గురించి నీకేం తెలుసు. ఆమె చేస్తున్న పనిని బట్టి అసలు ఆమె నడిచిన నేలను నువ్వు కళ్లకు అద్దుకోవాలి. ఆమె కోసం నువ్వు ఎంతైనా కష్టపడాలి. ఏ పనైనా చేయాలి.

"అవును, గోధుమరంగు డ్రస్సు వేసుకొని, గులాబీరంగు బూట్లతో వెళ్లాలా? జనం నవ్విపోతారు."

"కానీ నీకు వేరే గౌనులున్నాయిగా తమారా. అదీకాక నల్ల బూట్లు కూడా ఉన్నాయి. ఏం? మీ క్లాసులో పిల్లలంతా ప్రతిరోజూ గౌనుకు తగ్గ బూట్లు వేసుకొనే వస్తారా?" ప్రశ్నించింది వెరా.

"నల్లబూట్లా?" నివ్వెరపోయినట్టు ప్రశ్నించింది తమారా. అలమారలోంచి ఆ బూట్లు తీసి తల్లి ముందు ఉంచింది. "ఇవా? ఇవి వేసుకోవాలా?" అని గట్టిగా అడిగింది.

"కానీ తమారా? నా బూట్లు చూడు ఎలా ఉన్నాయో. నేను వాటితోనే కదా ఆఫీసుకి వెళ్తున్నాను" ఆమె మెల్లగా, స్నేహంగా మాట్లాడింది. కానీ తమారా ఇదేం పట్టించుకోలేదు. తల్లి తెచ్చిన ఈ పోలిక పూర్తిగా అసంబద్ధంగా తోచింది ఆ పిల్లకు.

"ఏంటమ్మా? ఏమిటా పోలిక? అంటే నేను కూడా నీలా దుస్తులు ధరించాలనా? నువ్వు పెద్దదానివి. ఇలాంటివన్ని ఎప్పుడో చూసే ఉంటావు. నేనింకా చిన్నదాన్నే. కాస్త సరదాగా, శుభ్రంగా ఉండద్దా?" అని తల్లిని నిలదీసింది.

"నేను చిన్నగా ఉన్నప్పుడు కూడా ఇప్పుడు నీకున్నన్ని సౌకర్యాలు లేవు. చాలాసార్లు ఖాళీ పొట్టతో, ఆకలితో నిద్రపోయేదాన్ని" అంది వెరా గతాన్ని తలచుకుంటూ.

తమారా చికాకు పడింది. "అవేం చెప్పకు. ఆ రోజుల్లో నీకేం ఉన్నాయో, ఏం లేవో నాకేం తెలుసు. ఆ రోజులు వేరు, ఈ కాలం వేరు. ఇప్పుడు తల్లితండ్రులు పిల్లలకు అన్నీ ఇవ్వాలి. ఈ సంగతి అందరికీ తెలుసు. మీకు తప్ప. నేను పెద్దయితే, నా కూతురికి బూట్లు కొని ఇవ్వడానికి ఇంత యాగీ చేయను" ఆ పిల్ల ఆరిందాలా మాట్లాడుతోందని వెరా గమనించింది. కానీ ఆ పాప కళ్లలో నీళ్లు ఉబుకుతున్నాయి.

వెరా మాత్రం తేలికగా కూతురికి లొంగిపోదలచలేదు. "అయితే నాకు వయసు అయి పోయిందంటావా? ఈ చిరుగు పాతలే నాకు చాలంటావ్?" కూతురిని అడిగింది. తమారా అంతకంటే మొండిగా వాదించింది "నువ్వు ఏ దుస్తులు ధరించాలో నేను నిర్ణయించను. నీ యిష్టం కానీ నలుగురి ముందు నన్ను నవ్వుల పాలు చేయవద్దు. నువ్వొక కొత్త స్కర్టు కుట్టించుకుంటున్నావని నాకు తెలుసు. అంటే నీకేం కావాలంటే అవి ఉంటాయి. నాకు అవి దొరకవు. నువ్వు మాత్రం సరికొత్త సిల్కు స్కర్టు వేసుకోగలవు" అంది కసిగా.

"తమారా! నీకు కూడా కొత్త డ్రస్ ఉందిగా."

"ఆ ఉంది. బూట్లు లేని కొత్త డ్రస్. ఇంతకీ నీకు ఆ కొత్త స్కర్టు దేనికి? నాన్న కోసమా? ఇంతకీ అది ఏ రంగులో ఉంది?"

"అది.... ముదురు కుంకుమరంగు......."

దీంతో తమారా కోపం కట్టలు తెంచుకుంది. "ఆహా! ఆ రంగు కావాలని ఎన్నిసార్లు అడిగాను? అడిగి అడిగి విసుగుపుట్టిందే కానీ, నువ్వు నాకు కొనివ్వలేదు" అంటూ పెద్దగా కేకలు ప్రారంభించింది. "నాకు అది కావాలి. ఆ స్కర్టు నాకే కావాలి. నాకు కావాలంటే ఇవ్వవు కానీ, నువ్వు మాత్రం కొత్త డ్రస్సు ధరించి షోగ్గా తిరుగుతావేం?" అంటూ కాళ్లు చరుస్తూ పడకగదిలోకి వెళ్లి వెక్కిళ్లతో పెద్దగా ఏడుపు అందుకొంది.

తమారా ఏడుపు ఇల్లంతా వినిపిస్తోంది. వెరా కలవరపాటుతో కుర్చీలో బిగుసుకుపోయింది.

ఆమె సిగ్గుపడుతోంది కూడా. ఇంతలో బయట తలుపు చప్పుడైంది. వెరా గట్టిగా నిట్టూరుస్తూ లేచి తలుపు తీసింది. వచ్చింది అంద్రీ. లోపలికి అడుగు పెడుతూనే అతను పడకగదివైపు తమారా ఏడుపు విన్నాడు. తరువాత తల పంకించి వెరా వంక చూసి చిరునవ్వు నవ్వాడు.

"దర్జీవానికి ఇచ్చేందుకు ఉచిత కూపన్లు తెచ్చాను. తీసుకోండి" అన్నాడు.

"రండి" అంది వెరా యాంత్రికంగా.

అతను వచ్చి కూర్చోగానే ఏదో గుర్తు వచ్చినట్టు ఆమె గబగబా పడకగది వైపు నడిచి ఆ తలుపు మూయబోయింది. అంతలోనే తమారా గది గుమ్మంలోకి వచ్చి నిలిచి, చేతిలో ఉన్న నల్ల ప్యాకెట్‌ను తల్లి వైపు విసిరింది.. అందులోంచి గోధుమ రంగు డ్రస్సు అలలు అలలుగా నేలపై వెరా పాదాలముందు పరచుకొంది. 'తీసుకో ఆ డ్రస్సు వేసుకుని ఊరేగు. నాకేం అక్కర్లేదు' అని తమారా గట్టిగా అరిచింది. ఆ పిల్ల అప్పటికే గదిలో ఉన్న అంద్రీని చూసింది. కానీ లెక్క చేయలేదు. పడక గది తలుపు పెద్ద చప్పుడుతో మూసి, లోపలికి వెళ్లిపోయింది. వెరా నోట మాటరాక బొమ్మలా నిలిచిపోయింది. ఆమెకు అవమానంగా అని పించింది. బుర్ర పనిచేయలేదు. ఇంట్లో అతిథి ఎదుట కూతురు అలా ప్రవర్తించడం చూసి ఆమె కలత చెందింది.

అంద్రీ చటుక్కున వంగి నేలపై ఉన్న డ్రస్సు అందుకుని, కుర్చీ చేతులపై ఉంచాడు. అనాలోచితంగా ఆ గౌను చేతులను సర్దాడు. మడతలు సరి చేశాడు. తరువాత వెరా వంక ప్రశ్నార్థకంగా చూసి, "ఏమిటిది? ఆ పిల్లను చూసి భయపడుతున్నారా?" అని నిలదీశాడు.

అతను కావాలనే గట్టిగా ఈ ప్రశ్న వేశాడు. పడకగదిలో ఉన్న తమారాకు కూడా వినిపించాలని అతని ఉద్దేశంలా ఉంది. నిజంగానే తమారా ఉన్నట్టుండి ఏడుపు ఆపివేసింది.

వెరా కుర్చీ వెనక నిలిచి "అంద్రీ ఏమిటి? ఏమంటున్నారు?" అని ప్రశ్నించింది.

'ఇంకా ఏమీ అనలేదు వెరా ఇగ్నత్యేవ్నా. ఎన్ని మాటలని ఏం లాభం. మేం మిమ్మల్ని ఎంత గౌరవిస్తాం! కానీ ఇలాంటివి చూస్తూ ఊరుకోలేం. ఇక్కడ ఈ ఇంట్లో మీరేం చేస్తున్నారు? ఎలాంటి పిల్లలని పెంచుతున్నారు. మీరు మీ స్వహస్తాలతో శత్రువులను తయారు చేస్తున్నారు' అన్నాడు ఉగ్రంగా.

"శత్రువులెవరు అంద్రీ?" అయోమయంగా అడిగింది వెరా.

"కాస్త ఆలోచించండి. ఆ పిల్ల ఏమనుకుంటోంది? నేనలా మాట్లాడడం మీకు ఇబ్బందిగా ఉందేమో. ఉండనివ్వండి. ఇదంతా మీ కుటుంబ వ్యవహారం అనుకుంటున్నారేమో. అదేం కాదు. ఆ పిల్ల ఉంది హాయిగా భోజనం చేసింది. బల్లమీద ఎంగిలి పళ్లాలు, గిన్నెలు అలానే వదిలింది. మీరు అవన్నీ శుభ్రం చేయాలా? ఆమె ఏం చేస్తుంది. చెత్తంతా వాగుతూ, నానా యాగీ చేస్తుంది. మిమ్మల్ని శాపనార్థాలు పెడుతుంది. ఇంట్లో మీ శ్రమకు అది ప్రతిఫలమా? కష్టించి పనిచేసేవారి పట్ల ఆమె ధోరణి అదే అయితే, రేపు నిజమైన కార్మికుల పట్ల ఆమె ధోరణి ఎలా ఉంటుంది? పైగా ఆమె కమ్యూనిస్టు విభాగం సభ్యురాలేమో కూడా కదూ?"

దీనికి తమారా జవాబు చెప్పింది. "అవును అయితే ఏమిటి?" అప్పటికే ఆమె పడకగది గుమ్మంలో నిలిచి ఉంది.

అంద్రీ ఆమె వైపు చూసి, కోపంగా అన్నాడు. "ఓహో కమ్యూనిస్టువి కూడానా. సరే వచ్చి ఈ కంచాలు కడుగు. పనికిమాలిన పిల్లా!"

తమారా జవాబు ఇవ్వకుండా ఆంద్రీ వంక ద్వేషంతో నిండిన చూపు సారించింది. "ఏం మాట్లాడవు? అన్నం తిన్నావా?" అడిగాడు ఆంద్రీ.

"అది మీకు అనవసరం. నాపై కేకలు వేయడానికి మీకేం అధికారం ఉంది?" అడిగింది తమారా ధిక్కార స్వరంతో.

దీనికి ఆంద్రీ సూటిగా బదులివ్వలేదు. 'కమ్యూనిస్టువి కూడా. ఏం? 1918లో నేనూ యువ కమ్యూనిస్టు విభాగంలో సభ్యుడిని. నీలాంటి పనికిమాలిన పిల్లలను చాలామందినే చూశాను.'

"ఎందుకలా అరుస్తారు? పనికిమాలినదాన్నా? బహుశా మీకంటే ఎక్కువ పనే నేను చేయగలను" అంది తమారా బింకంగా.

ఇద్దరు ఒకరినొకరు పరీక్షగా చూసుకున్నారు. ఉన్నట్టుండి ఆంద్రీ మొహంలో కోపం అదృశ్యమైంది. అతను విశాలంగా నవ్వుతూ, కళ్లు కొంటెగా చిట్లించి "సరే అలాగే కానివ్వు. నాకో సాయం చెయ్యి. కాస్త ఈ గిన్నెలు శుభ్రం చెయ్యి" అన్నాడు స్నేహంగా.

తమారా కళ్లల్లోనూ నవ్వు మెదిలింది. వెంటనే ఆమె మొహంలో లేని కోపం తెచ్చుకొని తల్లి వంక చూసింది. కుర్చీలో ఉన్న గోధుమరంగు గౌనును గమనించింది. ఆంద్రీతో అంది. "సరే రండి ఇద్దరం కలిసి పనిచేద్దాం. మీరు గిన్నెలు కడగండి. నేను తుడుస్తాను" అంటూ బల్ల వద్దకు నడిచి, దానిపై ఉన్న పళ్లేలు, గిన్నెలూ సర్ది, వంటగదిలోకి తీసుకెళ్లింది.

"అదీ... అలా ఉండాలి పిల్ల అంటే" అని వ్యాఖ్యానించాడు ఆంద్రీ.

"అది మీకు అనవసరం...." అని గొణుక్కుంటూ వెళ్లి తన గౌనుపై పొడవాటి కోటు ధరించింది తమారా.

వెరా తన అతిథి వంక పరీక్షగా చూసింది. కొత్తగా కనిపించాడు. పుస్తకాలను ప్రేమించి, మనుషులతో మర్యాదగా వ్యవహరిస్తూ, చిరునవ్వులు చిందించే తనకు తెలిసిన ఆంద్రీకి బదులు గది మధ్యలో బలంగా, దృఢంగా, ఉగ్రంగా నిలిచిన కొత్తమనిషి కనిపించాడామెకు. ఉన్నట్టుండి గదంతా కలియ తిరుగుతూ ముసలివాడిలా గొణగడం ప్రారంభించాడు. "నువ్వు ఇంకా చిన్నపిల్లవి. ఆరిందాలా మాట్లాడకు. పెద్దవాళ్లని గౌరవించు. అమ్మమీద అలా అరవకు. కేకలు పెట్టకు. పనికిమాలిన పిల్లా. ఏమనుకుంటున్నావు? నీ సంగతి తేలుస్తానుండు" అంటూ తమారాను హెచ్చరిస్తున్నాడు.

ఆంద్రీ తన చొక్కా చేతులను పైకి మడిచాడు. తమారా అతని వంక భయం భయంగా చూసి వంట గదిలోకి నడుస్తూ ఆంద్రీతో అంది. "మీరే పెద్ద పనివాళ్లు అనుకుంటున్నారేమో. మీరే గొప్ప కార్మికులనుకొంటున్నట్టు ఉంది. మాకూ చేతనవుతుంది. ఇంటి దగ్గర మీరు మాత్రం గిన్నెలు కడుగుతారా? మీ ఆవిడ ఆ పని చేస్తుంది. మీరు మాత్రం ఇక్కడ పెద్ద మనిషిలా నటిస్తారు."

"ఆ మాటలే వద్దంది. వెళ్లు. ఆ ప్లేట్లు కడుగు" అని గద్దించాడు ఆంద్రీ.

ఇంతలో వెరాకు స్పృహ వచ్చినట్టు అయింది. "ఏం చేస్తున్నారు మీరిక్కడ?" అని వారిని ప్రశ్నించింది. ఆంద్రీ అడ్డుగా నిలిచి, ఆమె చెయ్యి పట్టుకుని కుర్చీలో బలవంతంగా కూర్చోబెట్టాడు. ఈలోగా తమారా బల్ల అంతా శుభ్రం చేసి, పళ్లేలు, గిన్నెలు, చెంచాలు, ఫోర్కులు పోగుచేసి వంటగదిలో గట్టుపై అమర్చింది. ఆంద్రీ ఆమె వంక తీవ్రంగా చూస్తున్నాడు. అతను

ఆ పిల్ల వెనకే తిరుగుతూ బలమైన చేతులను గాలిలో కదుపుతున్నాడు. చూస్తే గిన్నెలు కడగడం కాక, పెద్ద కొండలు తవ్వేందుకు సిద్ధమవుతున్నట్టు కనిపించాడు. వెరా నిశ్శబ్దంగా కూర్చుని ఆంద్రీ వంక చూస్తోంది. ఆమెకు ఈర్ష కలిగింది. ఇలాంటి కార్మికులే ఫ్యాక్టరీలో పనిచేస్తూ, చైతన్యవంతులుగా, తెలివైనవారుగా తయారు అవుతున్నారు. అక్కడి పని నిజమైన పని. వాళ్లు సలక్షణమైన మనుషులు. వాళ్ల పని ముందు లైబ్రరీలో తన పని ఏమీ కాదని అనుకుంది.

వెరా లేచి వంట గదిలోకి తొంగి చూసింది. అక్కడ ఆంద్రీ చిన్న బల్లపై కూర్చుని ఉన్నాడు. కాళ్లు ఎడంగా పెట్టి బలమైన చేతులను వళ్లో పెట్టుకుని వంకరగా నవ్వుతున్నాడు. "అదీ అలా పనిచేయాలి. బావుంది. క్షణాల్లో మంచి పనిగత్తెగా మారావు. నిన్ను చూస్తుంటే సంతోషం కలుగుతోంది. కానీ ఇంతకు ముందు ఏం చేశావు? కొత్త బట్టలను విసిరేశావు. అదేమన్నా బావుందా? ఎంత అసహ్యంగా ఉందో నువ్వలా చేయడం" అంటున్నాడు.

తమారా మౌనంగా పళ్లేలు కడుగుతుంది.

"చూడు ఇలా పనిచేస్తే ఎంత బావుందో. దీనికి బదులు ఫ్యాషన్లు, షోకుల వెంటపడ్డావు. ఎందుకన్ని షోకులు? నీకు ఎన్ని బట్టలున్నాయి? నల్లది, తెలుపు డ్రస్సు, పసుపు రంగుది, గోధుమ రంగు గౌను.... ఎందుకన్ని? అన్ని లేకపోతే అందంగా ఉండనని అనుమానమా? ఏం కాదు. నీకేం చక్కగా ఉంటావు" అని సాధిస్తున్నాడు ఆంద్రీ. "పైగా నీ దుస్తుల కోసం మరెవరో కష్టపడాలి" అన్నాడు.

"బహుశా అది వారికి కష్టం కాదేమో. వారికి అలా కష్టపడడం ఆనందం కలిగిస్తోందేమో" అంది చిన్న స్వరంతో తమారా.

"ఎవరికి ఆనందం? ఒక జత బూట్ల కోసం ఇంత అల్లరి చేస్తే ఎవరికి ఆనందం? బుద్ధిలేని పిల్లా. పైగా సమర్థించుకోవడం ఒకటి" అని అరిచాడు.

"అలా అరవద్దు" అంది తమారా మళ్లీ కోపం తెచ్చుకుని.

"ఏమిటి అరవకూడదా? మరి నీకు బుద్ధి ఎలా వస్తుంది? ఎంత కృతఘ్నురాలివి? అమ్మ గురించి ఆలోచించు. ఫ్యాక్టరీలో అందరూ ఆమెను గౌరవిస్తారు. ఆమె ఎంతో కష్టపడి ఉద్యోగం చేస్తున్నారు. నాకు తెలుసు. ఎందుకంటే నేనూ కష్టపడి పనిచేసేవాడినే కనుక. ఆగు.. ఏమిటిది? దీన్ని కడగడం అంటరా? ఆ ప్లేటు వెనక వైపు ఎవరు కడుగుతారు? ఆకాశం నుంచి ఎవరైనా వస్తారా?" అని మందలిస్తున్నాడు.

"అబ్బబ్బ?......" అని విసుక్కుంది తమారా.

"ఆ విసుగే వద్దంటున్నది" అని తిరిగి ప్రారంభించాడు ఆంద్రీ. "లైబ్రరీలో వేలాది గ్రంథాలు వాటన్నిటి గురించి అమ్మ తెలుసుకోవాలి. వాటి గురించి అందరికీ చెప్పాలి. ఎవరికి కావలసిన పుస్తకం ఏమిటో గుర్తించి, అందించాలి. అది కష్టమైన చాకిరీ కాదా? అంత కష్టపడి తీరా ఇంటికి వస్తే ఇక్కడ కూడా చచ్చేంత పని. గొడ్డు చాకిరీ తప్పడం లేదు. ఎవరి కోసం? ఎందుకింత పనిచేయాలి? చెప్పు. నువ్వే చెప్పు. ఎందుకంత పనిచేయాలామె? అలా ఆమె పనిచేస్తే నువ్వు కాలు కదపకుండా కూర్చుని ఎదుగుతావు. నీ సరదా కోసం, నీ కోసం ఆమె ఈ పని చేయాలి. అంతే కదా? నీ అమ్మ గురించి నీకేం తెలుసు. ఆమె చేస్తున్న పనిని బట్టి అసలు ఆమె నడిచిన నేలను నువ్వు కళ్లకు అద్దుకోవాలి. ఆమె కోసం నువ్వు ఎంతైనా కష్టపడాలి. ఏ పనైనా చేయాలి.

నువ్వింకా చిన్నపిల్లవి. పని గురించి నీకేం తెలియడం లేదు. రా ఒకసారి మా ఇంటికి రా చూడు. నా పిల్లలు నీలానే అందంగా ఉంటారు. తల్లిని కూర్చోపెట్టి పనంతా చేస్తారు. చదువుల్లో కూడా వెనకబడిలేరు. ఒకామె డాక్టర్ కాబోతోంది. మరొకామె చరిత్ర చదువుతోంది. కావాలంటే వచ్చి చూడు."

"సరే ఒకసారి వస్తాను" అని చెప్పింది తమారా.

అంద్రీ గొంతు మార్దవంగా మారింది. "తప్పకుండా రా. చూడు. అది నీకు లాభం. నువ్వసలు మంచి పిల్లవు. కానీ దుర్మార్గంగా తయారయావు. పూర్తిగా నీ తప్పు కాదనుకో. నా పిల్లలు తల్లిని నీలా ఓ సేవకురాలిలా చూస్తారనుకుంటున్నావా? రాణిలా చూస్తారు. గౌరవిస్తారు. నీకేమో గిన్నెలు కడగడమే రాదు. ఆ పళ్లేన్ని అరగంట నుంచీ తుడుస్తున్నావు. కనీసం నూనె మరకలు పోలేదు చూడు."

వెరా నిశ్శబ్దంగా అవతలి గదిలోకి వచ్చి కుర్చీలో ఉన్న గౌను తీసి మడతలు పెట్టి, బల్లను మరింత శుభ్రంగా తుడిచింది. అవతలి గదిలో ఒక బయటి వ్యక్తి తన పని చేస్తున్నాడు. పిల్లలను సక్రమంగా పెంచవలసిన తన బాధ్యతను అడగకుండానే చేపట్టాడు. అతనలా గట్టిగా తిడుతుంటే, మందలిస్తుంటే తమారా వినయంగా తలవంచుకుని పని ఎలా చేస్తోందో ఆమెకు అర్థం కాలేదు. ఆ పిల్ల ఎదురు తిరగకుండా అంత ఓపికగా అతనెలా బుద్ధి చెప్పగలుగుతున్నాడు? అని ఆలోచించింది. ఇంతలో తమారా వంటగదిలోంచి కడిగిన గిన్నెలు తెచ్చి అలమారులో ఉంచింది. ఆమె వంక తృప్తిగా చూసిన అంద్రీ "సరే ఇక వెళ్లొస్తాను కామ్రేడ్" అన్నాడు.

తమారా అతన్ని సమీపించి, అతని చెయ్యిపై తన మృదువైన వేళ్లతో గట్టిగా చరించింది. "క్షమాపణ చెప్పండి. నాకు క్షమాపణ చెప్పండి. ఎన్ని తిట్లు తిట్టారు! నేను పనికిమాలిన దాన్నా? బుద్ధి లేదంటారా? సోమరిపోతునా? ఎన్ని మాటలన్నారు. ఒక అడపిల్లతో ఇలాగేనా మాట్లేడేది? పైగా కార్మికుడిని అంటూ గొప్పలకు పోవడంవచ్చు. సరే క్షమాపణ చెప్పండి" అంది చిరుకోపంతో.

అంద్రీ చిరునవ్వుతో తల వంచి "క్షమించండి కామ్రేడ్. ఇంకెప్పుడు అలా అనను. ఇదే చివరిసారి. అవును మనమంతా కార్మికులం. ఒకరితో ఒకరం మర్యాదగా వ్యవహరించాలి" అన్నాడు.

తమారా ఓ సారి నవ్వి హటాత్తుగా అంద్రీ మెడ చుట్టూ చేతులు వేసి అతని బుగ్గలపై ముద్దు పెట్టుకుంది. అంతలోనే అతన్ని వదిలి తల్లి దగ్గరకు వచ్చి ఆమెని కావలించుకుని ముద్దాడింది. తరువాత మెల్లగా పడకగదిలోకి వెళ్లింది.

అంద్రీ ఆ వైపే చూస్తూ 'మంచి పిల్ల. చూడండి ఎంత అపేక్షో! మీరు దాన్ని చెడగొట్టకండి' అన్నాడు.

★ ★ ★

ఆ రోజునుంచి వెరా దినచర్యలో మార్పు వచ్చేసింది. ప్రస్తుతం తమారా ఇంటిపనుల్లో పూర్తిగా నిమగ్నమైంది. వెరా ఇంటికి వచ్చేసరికి అంతా పరిశుభ్రంగా ఉంటోంది. ఒక్కొక్కసారి ఏదైనా పని తలపెట్టినా తమారా బలవంతంగా తల్లిని ఆపి వేరే గదిలోకి తరిమేసి ఆ పనేదో తానే చేస్తోంది.ఇల్లంతా సుడిగాలిలా తిరుగుతూ ప్రతిపనీ చక్కపెడుతున్న కూతురిని చూస్తే వెరాకు సంతోషం కలుగుతోంది. ఈ మార్పు పావ్‌లూషని బాగా భయపెట్టింది. ఎప్పుడూ

శుభ్రంగా ఉండి తీరాలని తిట్టిపోసే అక్కకు మొదటవాడు నిరసన వ్యక్తం చేశాడు. కానీ లాభం లేకపోవడంతో ఇప్పుడు సాయంత్రమంతా వీధిలో, పెరట్లో, ఆటల్లో గడిపేస్తున్నాడు. కొద్ది రోజుల తరువాత, ఓనాటి ఉదయం తమారా తల్లితో అంది. "అమ్మా ఇవాళ సాయంత్రం ఇల్లంతా కడిగి శుభ్రం చేద్దామనుకుంటున్నాను. నువ్వు ఆలస్యంగా రా"అని. వెరా సరేనని బయటికి నడిచింది.

కూతురులో వస్తున్న మార్పు వెరాకు సంతోషం కలిగిస్తోంది. ఆమెకిప్పుడు సాయంత్రం పని ఉండడం లేదు. దానితో కొద్దిరోజుల్లోనే ఆమె, విశ్రాంతి మూలంగా కొంచెం ఆరోగ్యంగా కనిపిస్తోంది. చేతులు, బుగ్గలు నునుపెక్కాయి. కానీ పసిపిల్ల అంత పనీ చేయడం ఒక్కొక్కసారి ఆమెకు బాధ కలిగించేది. తమారా పనితో పాటు, ఇప్పుడు చదువును కూడా గట్టిగా పట్టించు కుంటోంది. కూతురు అలా పని చేయడం బానే ఉన్నా ఏదో తప్పు చేసిన భావం వెరాను పీడించేది. అయినా పాతరోజులు మళ్లీ రావని ఆమెకు తెలిసిపోయింది. కొత్త డ్రస్సును తల్లిపైకి విసిరేసిన తమారాలో పూర్తి మార్పు వచ్చింది. ఇక ఆమె ఎంత మాత్రం మొండిగా వాదిస్తూ తన షోకుల కోసం తల్లిని పీడించే వెనకటి పిల్ల కాదు. కాబోదు. ఇంతకాలం తను చేసిన తప్పు ఏమిటో వెరాకు తెలిసివస్తోంది. "ఇంట్లో ఒక శత్రువుని పెంచుతున్నావు" అంటూ ఆండ్రీ చేసిన ఆరోపణ ఆమె మనసులో బలంగా నాటుకుంది. ఒక బయటి మనిషి వచ్చి పిల్లలను పెంచడం, వారికి బుద్ధి చెప్పడం వంటి తన బాధ్యతను స్వీకరిస్తే తను నిస్సహాయంగా బయట గదుల్లో ఎలా పచార్లు చేసిందో వెరా మరచిపోలేదు. తను ఇలాగే ఉంటే భవిష్యత్తులో పిల్లలను ఎవరు పెంచుతారు? రోజూ ఆండ్రీ లాంటి మనుషులైతే రారు కదా. రేపు పావ్లూష కూడా ఇలాగే మొండికేస్తే మళ్లీ వెళ్లి ఆండ్రీ సాయం అడగలేదు కదా. మొత్తం మీద బాధ్యతకు సంబంధించి ఏదో ముఖ్యమైన అంశాన్నే తను గమనించలేకపోతున్నానని ఆమె గుర్తించింది. ఆలోచనలతోనే ఆమె లైబ్రరీ చేరుకుంది.

అక్కడ లైబ్రరీలో పుస్తకాలు ఇచ్చే చోట జనం ఎదురు చూస్తున్నారు. వారి పనేమిటో చూసి, పుస్తకాలు ఇవ్వవలసిన మరూస్య గందరగోళంగా, హడావుడిగా అన్ని బీరువాలు వెదుకుతూ కనిపించింది. వెరా అక్కడికి వెళ్లి "ఏమైంది?" అని ప్రశ్నించింది.

మరూస్య అయోమయంగా చూసింది. పుస్తకం ఏదో కనపడలేదని అక్కడ పెరుగుతున్న జనాన్ని చూసి ఆమె కంగారుపడుతోందని వెరాకు అర్థమైంది.

"సరే నువ్వు వెళ్లి జాగ్రత్తగా ఆ పుస్తకం వెతుకు. నేను ఇక్కడ పుస్తకాలు ఇస్తాను" అని మరూస్య కుర్చీలో కూర్చుంది. ఆ పిల్ల వెరా వంక భయం భయంగా చూసి మళ్లీ బీరువాల వద్దకు వెళ్లింది. ఇంతకీ తాను ఆ పుస్తకాన్ని ఎక్కడ పెట్టినదీ ఆమెకు జ్ఞాపకం రాలేదు. వెరా వంక భయంగా చూస్తూ బీరువాల చుట్టూ తిరిగింది మరూస్య. కొద్ది నిమిషాల్లోనే అక్కడ వేచి ఉన్న పాఠకులందరి పని చూసి పంపిన వెరా తన కుర్చీ వద్దకు నడుస్తూండగా, మరో మూల నుంచి పెద్ద గొంతు వినిపించింది.

అక్కడ మరో సహాయకురాలు వార్య భయం భయంగా చూస్తూ నిలిచి ఉంది. ఆమె ఎదురుగా నిలబడిన ఒక పాఠకుడు గట్టిగా మాట్లాడుతున్నాడు "ఏమైంది నాకు అర్థం కావడం

లేదు. దయచేసి మపాసా పుస్తకం ఏదైనా ఇవ్వండి. నేనేమీ ఊరుపేరులేని రచయిత గ్రంథం కావాలనడం లేదే. మపాసా పుస్తకం ఏదైనా సరే ఇవ్వండి అంటున్నాను. లేదంటే ఎలా?" అని నిలదీస్తున్నాడు.

"లేదండీ... అలాంటిదేమీ లేదు...." అని వార్య బతిమాలుతున్న గొంతుతో చెపుతోంది. ఇది విన్న వెరా అటువైపు వెళ్లి "వార్యా వెళ్లి నా పని చూడు ఈ పుస్తకం నేను ఇస్తాను" అని ఆ పిల్లను అక్కడినుంచి పంపేసింది.

వార్య మొహం అవమానంతో కమిలిపోయింది. ఆమె తన బల్ల వద్ద నుంచి నడుస్తూ దారిలో వెరాను ఢీకొంది. దీనితో ఆమె మరింత సిగ్గుపడింది, భయంతో వణుకుతున్న పెదాలతో "క్షమించండి" అంటూ గబగబా అవతలికి నడిచింది. ఈలోగా మరూస్యా అతి కష్టం మీద ఆ పుస్తకం ఏదో వెతికి పాఠకుడికి అందించింది. వెరా వంకే చూస్తూ అక్కడున్న మిగిలిన పాఠకులకు ఏం కావాలో రహస్యంగా అడుగుతోంది. వెరా తన ఎదురుగా ఉన్న యువకునికి మపాసా కథల పుస్తకం ఒకటి ఇచ్చి, తన గదికి తిరిగివెళ్లింది. అక్కడ మరూస్యా ఆమె కోసం, మందలింపు కోసం ఎదురు చూస్తోంది.

"మరూస్యా, ఏమిటిది? ఒక్క పుస్తకం కోసం అంతసేపు వెతికి, అంతమందిని నిలబెట్టేస్తే ఎలా?" ప్రశ్నించింది వెరా.

"క్షమించండి. ఇంకెప్పుడూ అలా జరగదు. జాగ్రత్తపడతాను" అంది మరూస్యా అర్థింపుగా.

"సరే. వెళ్లు. జాగ్రత్త" అంటూ ఆ పిల్లవంక చూసి నవ్వింది వెరా.

అరగంట తర్వాత వార్యా కూడా ఆమె గది బయట తచ్చాడింది. ఆమె కూడా వెరా మంద లింపు కోసమే వచ్చింది. మామూలుగా అయితే గది బయట అలా తిరగదు. దుమారంలా దూసుకొస్తుంది. అంటే తనవల్ల పొరపాటు జరిగిందని ఆమె గుర్తించింది. అందుకుగాను వెరా ఒకసారి మందలిస్తే ఆమెకు చాలు. ఇక ధైర్యంగా పనిచేసుకోవచ్చు. అదీ ఆమె ఉద్దేశం.

వెరా ఆమెను లోపలికి పిలిచింది.

వార్యా బిడియంగా తలవంచుకొని లోపలికి వచ్చి, వెరా ఎదుట నిలిచింది.

"వార్యా మన దగ్గర ఏ పుస్తకాలు ఉన్నాయో మనకి తెలియకపోతే ఎలా? ఎంత అవమానం. పుస్తకాల జాబితాలు చూస్తుండమని చెప్పానా, లేదా?" అని వెరా ప్రశ్నించింది. వార్యా మాట్లాడ కుండా విచారంగా తల ఊపింది.

"సరే. పదిరోజుల వ్యవధి ఇస్తున్నాను. పుస్తకాల జాబితాలు బాగా చదువు తరువాత నీకు పరీక్ష పెడతాను వెళ్లు" అంది వెరా.

"వెరా ఇగ్నత్యేవ్నా పుస్తకం అడుగుతున్న ఆ పెద్దమనిషిని చూసి భయం వేసి అయోమయంలో పడ్డాను....." అంటూ సంజాయిషీ చెప్పబోయింది వార్య.

"చాల్లే, పుస్తకం కావాలంటున్న వారిని చూసి భయం వేసిందా? అది సరైన సమాధానమా? వెళ్లు, వెళ్లి పుస్తకాలు జాబితాలు చదివి, ఇక్కడ ఏం ఉన్నాయో అర్థం చేసుకో" అని మంద లించింది వెరా.

వార్య తల ఊపి గదిలోంచి బయటకు నడిచింది. మధ్యాహ్నం ఏదో పనిపై బయటికి వచ్చిన వెరాకు ఒక మూల పుస్తకాల జాబితాలను శ్రద్ధగా పరిశీలిస్తున్న వార్యా కనిపించింది.

మరోవైపు మరూస్యా అంతకంటే శ్రద్ధగా బీరువాల్లో పుస్తకాలు సర్దుతోంది. "మంచి పిల్లలు!.." అనుకుంటూ తృప్తిగా నవ్వుకొంది వెరా.

★ ★ ★

జరిగిన రెండు సంఘటనలు ఆమె మనసులో మెదులుతున్నాయి. తప్పుచేసిన ఆఫీసు సహచరులను వెరా ఇంతకంటే గట్టిగా ఎప్పుడూ మందలించదు. గొంతు పెంచదు, జరిగిపోయిన పొరపాట్లను పదేపదే ప్రశ్నిస్తూ వాళ్లని తిట్టదు. కానీ ఆమెకు తమ పని నచ్చలేదని వాళ్లకి అర్థమైపోతుంది. వెంటనే వాళ్లు ఆ పొరపాటు సరిదిద్దుకొనే ప్రయత్నంలో పడ్తారు. జరిగిన పొరపాటుకు ఆమె తమను మందలించాలని వారు భావిస్తారు. అలా జరగకపోతే మధనపడతారు.

లైబ్రరీలో పెద్దగా పరిచయంలేని, సన్నిహితులు కాని వారిని ఇలా తేలికగా అదుపులో పెట్టగలుగుతున్న తాను ఇంటి దగ్గర ఎందుకు విఫలమవుతోంది? సొంత మనుషులతో స్వేచ్ఛగా వ్యవహరించలేకపోవడం ఏమిటి?

వెరా నెమ్మదిగా సమస్య లోతును అర్థం చేసుకొనే ప్రయత్నంలో పడింది. ఆఫీసు జీవితాన్ని, ఇంటి వ్యవహారాలను పోల్చి చూసింది. ఇక్కడ లైబ్రరీలో పనిచేయడం తన విధి, అందులోనుంచి తనకు ఆనందం, సంతోషం లభిస్తాయి. ఇంటిదగ్గర పనిని తప్పనిసరిగా ప్రేమించాలి. అందులో నుంచీ ఆనందాన్ని పొంది తీరాలి. అదీ పనే మరి. ఇంత పనిచేసి తను ఇంట్లో పెంచుతోంది "శత్రువును", ఏదో తేడా వుంది. ఇంటి దగ్గర పని అంత కష్టంగాను, ఇక్కడ ఆఫీసు పని అంత తేలికగా, సంతోషదాయకంగా ఎందుకు ఉంటుంది. ఇక్కడ పనికీ, సంతోషానికీ మధ్య అంతరం కనిపించదు. అసలు పని ఎక్కడ ముగుస్తుందో, ఆనందం ఎక్కడ మొదలవుతుందో ఈ లైబ్రరీలో గుర్తించడమే కష్టం.

వెరా తన బతుకు పుస్తకంలోని పేజీలను వెనక్కి తిప్పి చూసింది. ఎన్నడూ కుటుంబ జీవితంలో సుఖం, సంతోషం, ఆనందం వంటివి ఉన్నట్టు కనిపించలేదు. అయితే ఎప్పుడూ ప్రేమకు కుటుంబంలో కీలకపాత్ర ఉంటూ వచ్చింది. కానీ ఈ ప్రేమ మూలంగానే ఇంటి పనుల్లో ఆనందం, బతుకులో సంతోషం దూరమవ్వడం విచిత్రం. అంటే ప్రేమ వల్ల తనకు ఆనందం దూరమవుతోందా. ఎంత విడ్డూరం. తనకంటే మరెవరైనా పిల్లలను గాఢంగా ప్రేమిస్తు న్నారా? ఈ ప్రేమను ఆమె ఎప్పుడూ బాహాటంగా వ్యక్తం చేయని మాట నిజం. ఆమె ఎన్నడూ కొడుకు పావ్‌లూషను దగ్గరకు తీసుకుని తల నిమరలేదు. తమారాను ముద్దాడలేదు. అంటే తన ప్రేమ ఎన్నడూ తనకుగానీ, పిల్లలకు కానీ సంతోషాన్నివ్వలేదా? అంటే ఏదో గట్టి త్యాగం చేస్తున్నట్టు, బండగా ఇంటి చాకిరీ చేయడమేనా ప్రేమంటే? అందుకేనా పిల్లలు అలా మొండిగా, అహంకారంతో మెలుగుతూ, అపరిమితమైన ఆశపోతులుగా తయారవుతున్నారు? ఇంట్లో శత్రువుని పెంచడం అంటే ఇదేనా?

ఇదేం ప్రేమ?!

ఈ గుడ్డిప్రేమకు విలువ ఏమిటి??

హటాత్తుగా ఆమెకు విషయం బోధపడింది. లైబ్రరీలో మరూస్య, వార్యాల పట్ల తన ప్రేమ విజ్ఞతతో కూడుకున్నది. వారిని బాధ్యతాయుతమైన కార్మికులుగా రూపొందించాలనే తపన ఆ ప్రేమ వెనక ఉంది. అది తెలియబట్టే ఇక్కడి సిబ్బంది తను ఒక్కమాట మాట్లాడితే, ఒక్క

సైగచేస్తే, కొద్ది కోపం తెచ్చుకుంటే, సంతోషంగా నవ్వితే....... అంత పట్టించుకుంటారు. ఆ బాధ్యత లేకుండా కేవలం పిల్లలపై జంతు ప్రేమ ప్రదర్శించడం వల్లనే వాళ్లు అలా తయారవుతున్నారు. ఈ స్పృహ రావడంతో ఆమె ఇంక ఆఫీసులో కూర్చోలేకపోయింది. మరూస్య, వార్యాలకు బాధ్యత అప్పగించి ఇల్లుచేరింది. ఇంటి వద్ద తమారా పనిలో హడావుడిగా ఉంది.

"తమ్ముడు రాలేదా?" అని ప్రశ్నించింది వెరా.

"రాలేదు. సరేకానీ, నీకేం చెప్పాను? ఆలస్యంగా రమ్మన్నానా?" అంది తమారా తల్లిని నిలదీస్తూ. ఆ పిల్ల మొహంలో మరూస్యను చూసేందుకు వెరా ప్రయత్నిస్తోంది.

"ఇలారా, ఆ కుర్చీ లాక్కో" అంది.

"ఎందుకమ్మా?"

"రా. ఇలా కూర్చో" మరోసారి చెప్పింది వెరా.

తమారా ఏదో గొణుక్కుంటూ కుర్చీలో కూర్చుని, తల్లి వంక చూసింది. తల్లి మొహంలో ఏ భావం కనిపించిందో ఏమో కానీ, కుర్చీలో ఒదిగి కూర్చొని "ఏమిటమ్మా?" అంది.

"తమారా ముందు ఇది చెప్పు. నన్ను ఇంట్లో ఉండవద్దని, ఆలస్యంగా రమ్మని ఎందుకు అన్నావు?"

"ఎందుకు? ఇల్లంతా కడిగి శుభ్రం చేద్దామని."

"అది ఎవరు నిర్ణయించారు?"

"నేనే....."

వెరా కూతురు వంక దీక్షగా చూస్తోంది. తమారా ఇబ్బందిగా నవ్వి "ఏంటమ్మా" అంది.

"ఏం లేదు. నీలో మార్పు వస్తోంది. కొత్త జీవితం ప్రారంభించావు. అది కాస్త అర్థవంతంగా ఉండాలి. ఏమంటావు? అర్థమైందా?"

"అయింది."

"అయితే చెప్పు. నన్నెందుకు ఆలస్యంగా రమ్మన్నావు? ఏమన్నా వేళాకోళమా? నీ ఉద్దేశం ఏమిటి?" ప్రశ్నించింది తల్లి.

తమారా మాట్లాడలేదు.

"నన్ను బాధపెట్టడం నీ ఉద్దేశం కాదుగా?" కూతురుని అడిగింది వెరా. ఇక తమారా ఆగలేదు. వచ్చి తల్లి భుజంపై తలపెట్టి ఏదో గొణుగుతూ ఆనందంగా నవ్వింది.

★ ★ ★

కొత్త డ్రస్సు అనుకున్న సమయానికి తయారైంది. వెరా మొదటదాన్ని ఇంట్లో వేసుకుని చూసింది. తమారా తల్లికి సాయం చేస్తూ, ఆమెను అన్ని వైపుల నుంచీ పరిశీలనగా చూసింది. చివరికి కోపంగా చేతులు ఎగరేసి, "అమ్మా, ఆ గౌను మీద ఆ బూట్లు అసలు బాలేదు" అంది. అంటూనే "అరెరె... మర్చిపోయా" అని గొణుగుతూ తన చేతి సంచి తీసి ఏదో వెతికింది. సంచిలో సామానునంతా కెలుకుతూ ఏదో పాట అందుకుంది. ఏదో ఉత్సాహంతో కాళ్లు తాటించడం మొదలుపెట్టింది. చివరికి ఆ సంచిలోంచి ఐదు రూబుళ్ల నోట్లు కొన్ని తీసి తల్లి దగ్గరకు వచ్చింది. "అమ్మా ఈ నెల ఇన్‌స్టిట్యూట్‌లో ఇచ్చిన ఉపకార వేతనం ఇది. తీస్కో మంచి బూట్లు కొందాం" అంది.

గదిలోకి వచ్చిన పావ్‌లూష, తల్లి వంక సంభ్రమంతో చూశాడు. "భలే డ్రస్సు అమ్మా!" అన్నాడు.

"బావుందా పావ్‌లూష?" తల్లి అడిగింది.

"చాలా...." అంటూ కళ్లు పెద్దవి చేశాడు.

ఆ సాయంత్రమంతా వాడు ధూరం దూరంగా తిరుగుతూ తల్లి వంకే చూస్తున్నాడు. పొర పాటున తల్లి వాడి మొహంలోకి చూస్తే వాడి మొహం చాటంత చేసుకుని నవ్వుతున్నాడు.

చివరికి అన్నాడు. "అమ్మా ఎంత బావున్నావో తెలుసా? నువ్వెప్పుడూ ఇలాగే ఉండాలి."

* * *

ఈ డ్రామాలో చివరి అంకం ఆ సాయంత్రం జరిగింది. ఇవాన్ పెట్రోవిచ్ మామూలుగా ఇంట్లోకి అడుగు పెట్టబోతే, బల్ల వద్ద కూర్చుని ఉన్న అందమైన యువతిని చూసి ఒక అడుగు వెనక వేశాడు. ఒకసారి టై సర్దుకుని గంభీరంగా లోపలికి వచ్చాడు. అంతలోనే భార్యను గుర్తుపట్టి, చేతులు రుద్దుకుంటూ, నవ్వుతూ సమీపించాడు.

"భలే కొత్తగా ఉన్నావ్!" అన్నాడు.

వెరా ఎప్పుడూ లేనట్టు తల ఎగరేసి "మీకు నచ్చిందా? సంతోషం" అంది హుందాగా.

ఆ సాయంత్రం భోజనానికి ముందు ఇవాన్ ఎప్పటిలా గోళ్లు కొరకలేదు. గోడవంక నిశ్చలంగా చూస్తూ కూర్చులేదు. ఈలపాటల జోలికి పోలేదు. తాను నవ్వుతూ, అందరినీ నవ్వించాడు. మధ్యలో వెరా వంక చూసి కళ్లు చికిలించాడు. రాత్రి పడుకోబోయే ముందు వెరా భర్తని అడిగింది.

"అవునూ. ఇంతకీ ఇప్పుడు మీ జీతం ఎంత?"

* * *

మన చుట్టూ ఉన్న తల్లులందరూ ఈ సమాజంలో పౌరులు. మన పిల్లలు, తండ్రుల్లానే వారు కూడా సుఖంగా, సంతృప్తిగా జీవించగలగాలి. తల్లుల నిశ్శబ్ద త్యాగాల కారణంగా పిల్లలు పెరిగి పెద్దవాళ్లు కావాలని మనం కోరుకోకూడదు. ఈ నిరంతర త్యాగం పిల్లలను కేవలం స్వార్థపరులుగా తయారు చేస్తుంది. సమాజంలో దోపిడీకి స్థానం ఉండకూడదని భావించే వారంతా, తల్లులు తమ పిల్లలకోసం నిశ్శబ్దంగా ఆవిరైపోవడాన్ని సహించకూడదు. ఈ జీవితం పిల్లలకే అంకితమని భావించే తల్లితండ్రులైనా గుడ్డిప్రేమతో పిల్లలకు బానిసలవడం ఎవరికీ మంచిది కాదు. అది ఎవరికీ ఉపయోగపడని త్యాగం. తల్లి ప్రేమ పిల్లలను మంచి పౌరులుగా తయారుచేయాలే తప్ప, వారి గుడ్డి ప్రేమ పిల్లలను మొండిగా, అహంకారులుగా మార్చకూడదు. అటువంటి తల్లులే సమాజానికి ఉపయోగపడగల, మంచి పౌరులను రూపొందిస్తారు. వారు సైతం ఆనందంగా, సుఖంగా బతకగలుగుతారు.



# CHAPTER - 9

## బాల్యంలోనే సరైన పునాది

ఐదేళ్ల క్రితం వాసిలీమినయేవ్ ఆ వూరు వచ్చి స్థిరపడ్డాడు. విప్లవ ప్రతీఘాతదళాలైన వైట్‌గార్డ్స్ ఆ పట్టణాన్ని ఆక్రమించుకున్నప్పుడు; అనేకమంది బోల్షివిక్‌లతో కలిసి వాసిలో ఆ వూరువచ్చి, ఆ తరువాత శత్రుమూకలను తరుముకొంటూ వెళ్లాడు. తరువాత ఈ వూరువచ్చి ఇక్కడే ఉండి పోయాడు. అతనిప్పుడు సైనికుడు కాదు. తుపాకితో పనిలేదు. కానీ ఇప్పటికీ పిల్లలిద్దరినీ కూర్చోబెట్టి రాత్రి సమయాల్లో నాటి వీరోచితగాథలను వివరిస్తాడాయన. పెద్ద కొడుకు సెర్జీ నాటి పోరాటానికి సంబంధించిన వివరాలను గురించి ప్రశ్నిస్తాడు. వాడు ఇప్పుడు ఫ్యాక్టరీ శిక్షణా నిలయంలో రెండో సంవత్సరం చదువుతున్నాడు. చిన్నవాడు టిమ్కా ఇంకా రెండో తరగతే. వాడికి తండ్రి చెప్పే కథలు, నాటి పరిస్థితులు బోధపడుతున్నాయో లేదో, తెలుసు కోవడం అసాధ్యం. కానీ వాడు కూడా తండ్రిని అడ్డదిడ్డమైన ప్రశ్నలు అడుగుతూనే ఉంటాడు. తను కూడా తండ్రిలా శత్రుసేనలపై చేతిబాంబు విసురుతున్నట్టు ఊహించుకునేవాడు. అన్నయ్య మాత్రం "బాంబు విసరడమంటే గులకరాళ్లతో కొట్టుకోవడం కాద"ని గంభీరంగా చెప్పేవాడు. అయినా టిమ్కాకు నిరుత్సాహం కలిగేది కాదు.

నది వొడ్డున గల ఆ వూర్లో ఎన్నో రంపంమిల్లులు, గోదాములు, ఎక్కడ పడితే అక్కడ తారు పీపాలు, పట్టాల వెంట పరుగులు తీసే రైల్వే భోగీల చప్పుళ్లు హడావుడిగా అనిపించేవి. ఆ శీతాకాలం టిమ్కాలో క్రొత్త జ్ఞానాన్ని నింపింది. వాడి ఉత్సాహానికి అంతు ఉండేది కాదు. వాడి ఆటలకు రోజే చాలేది కాదు. పగలంతా పరుగులు పెట్టి, అలిసిపోయి, రాత్రి మంచం ఎక్కినా వాడి నోరు అలసట లేకుండా కదులుతుండేది. చివరికి గాఢనిద్రలో కూడా ఏ చిటికిన వేలో కదుపుతూ ఉండేవాడు.

ఆ రోజు భోజనం చేసి నాన్న ఫ్యాక్టరీకి వెళ్లినప్పటి నుంచీ టిమ్కాకు కంగారుగా ఉంది. సమయం మించి పోతోంది. బోలెడు ఆటలు ఆడాలి మరి. అన్నం పూర్తవ్వగానే బయటికి నడిచి, వీధులో-పెరట్లో ఆడుకోవడం అలవాటు. పెరట్లో ఆ రోజు బురదబురదగా ఉంది. రాత్రి కురిసిన వర్షం, మంచుతో పెరట్లో పెద్ద సరస్సు ఏర్పడింది. ఆ నీళ్లలో గంతులు వేయాలని ఉన్నా, దాని బూట్లు పెద్ద ప్రతిబంధకం. కాయితంతో వాడు చేసుకొన్న పడవ హాయిగా నీటిలో తిరగడం బదులు వొడ్డున గల ఒక చెట్టు వేరును తగులుకుని నిలిచిపోయింది. పడవలు అంత బుద్ధిహీనంగా ఎలా వ్యవహరిస్తాయో టిమ్కాకు అర్థంకాదు. పెరటి ఆవల వీధిలో పరిస్థితి ఇంకా సంక్లిష్టంగా ఉంటుంది. అది నదీ వివాదాలకు సంబంధించిన సమస్య. వాళ్ల

ఇంటి ఆవరణ పక్కగా ప్రవహించే వాన నీటి నది తమదేనని టిమ్కా అభిప్రాయం. కానీ, ఆ ప్రాంతంలోని మిగిలిన పిల్లలు వాడి ఈ హక్కుని పెద్దగా గౌరవించరు. ఎవడికివాడు తమ పడవలు తెచ్చుకొని అక్కడ నౌకావిహారాలు మొదలెపెడతారు. ఎవరి కర్ర వాడు తెచ్చుకొని తమ పడవల యాత్రకు దారులు వేసే ప్రయత్నం చేస్తారు. ఇదంతా టిమ్కాకు నచ్చదు. ఈ రోజూ బయట అదే దృశ్యం. వాడికి కోపం ముంచుకు వచ్చింది. వాడు బయటికి వచ్చి అక్కడి పిల్లలపై అరిచాడు. "ఏమిటిది ఎందుకు వచ్చారు? మా నదుల జోలికి మేం రాం కదా? మీరెందుకు నా నది దగ్గర కొచ్చారు" అని వారిని గద్దించాడు.

కానీ ఈ పిల్లల రాజ్యంలో అంతర్జాతీయ న్యాయ సూత్రాలకు విలువ లేదు. ఎవరూ వాటిని మన్నించరు. దర్జీ పనివాడు గ్రిగోర్లేవ్ కొడుకు మిత్రొష్కా కూడా అంతే. వాడు ఆ ప్రవాహం అవతల గట్టుపై నిలబడి టిమ్కాని కసురుకొన్నాడు.

"నువ్వెవడివి చెప్పేందుకు? నీ యిష్టమేనా? మీ నాన్న బోల్షివిక్ అయితే గొప్పేమిటి? ఈ నదిని కొనుక్కొచ్చావా?" అని హేళన చేశాడు.

టిమ్కా సమాధానం చెప్పలేదు. బదులుగా తన చేతిలో కర్రని పైకెత్తాడు. అది నౌకావిహారం సజావుగా సాగేలా చూసేందుకు ఉద్దేశించిన కర్ర. వాడు దానితో నదిలో ఉన్న మిత్రొష్కా పడవని చాచి ఒక దెబ్బ కొట్టాడు. అది నీళ్లల్లో మునిగితేలి, తడిసిన పాత గుడ్డపీలికలా మారింది. మురికినీళ్లు ఆ పడవలో చేరాయి. ఇలా అంతర్జాతీయ న్యాయాన్ని అమలు చేసిన టిమ్కా ఒక్క క్షణం కూడా ఆగకుండా తన ఇంటి ఆవరణలోకి పరుగుతీశాడు. ప్రత్యర్థులు విసిరిన ఇటుక ముక్కలు వాడి వెంటనే దూసుకొచ్చి ప్రహరీకి తగిలి కిందపడ్డాయి.

తరువాత దాదాపు ఇరవై నిముషాలు టిమ్కా ఒక్కడే పెరట్లో తిరిగాడు. గోడ పక్కన ఉన్న మంచుపై గంతులు వేసి దాన్ని చిన్న చిన్న ముక్కలుగా మార్చాడు. ఇంతలో లోపలినుంచి కిరిక్ వచ్చాడు. వాడు టిమ్కా వాళ్లు అద్దెకు ఉన్న ఇంటి యజమాని కొడుకు. ఆ యజమాని బైచకోవ్ వడ్రంగి. తనే చాలా కష్టపడిపోతున్నానని, మేధావులు, కార్మికులు-చేతి వృత్తుల కాళాకారులనే పేరుతో చాలామంది పెద్ద పని చేయకుండా సుఖంగా ఉన్నారని అతని బాధ. పనిచేస్తూనే ఉన్నట్టుండి బైచకోవ్ ఆ కనిపించని సోమరిపోతులను తిట్టేవాడు. రెండు బుట్టలు అల్లి అదంతా కళ అనడం మోసం అనీ, తనలా పడవలు, తెప్పలు, విశాలమైన భవనాలు కట్టడం అందరికీ చేతనయ్యే పని కాదనీ అతని దృఢ అభిప్రాయం. బోల్షివిక్‌లమని చెప్పుకొనే కార్మికులు రోజుకి ఎనిమిది గంటలు పని చేసి, హాయిగా పేపరు చదువుకొంటూంటే తను మాత్రం పన్నెండుగంటల పని చేయాల్సి వస్తోందని అతని బాధ. అయితే అతను ఏనాడూ టిమ్కా తండ్రి వాసిలీతో ఈ విషయం ప్రస్తావించలేదు. అసలు వాసలీ ఎదురుపడితే అతను మర్యాదపూర్వకంగా నమస్కరించి, ప్రశాంతంగా అక్కడి నుంచి వెళ్లిపోతాడు. అతని కొడుకైన కిరిక్ స్కూల్లో టిమ్కాతో పాటు రెండో తరగతి చదువుతున్నాడు. ఆయన పెద్దకొడుకు కిరిక్ అన్నయ్య అయిన ల్యోన్కా ఫ్యాక్టరీ శిక్షణాలయంలో సెర్గీకి ఒక ఏడాది సీనియర్.

కిరిక్ అంటే టిమ్కాకు ఇష్టం. ఆ పిల్లవాడు ఎప్పుడూ ప్రశాంతంగా, మందహాసంతో ప్రసన్నంగా ఉంటాడు. వాడు ఇప్పుడు టిమ్కాకు వచ్చిన కష్టాన్ని గురించి ఓపికగా విన్నాడు. నదీజలాల వివాదాలు వాడికి కొత్తేం కాదు. ఈ సమస్యకు ఇవాళ ఒక పరిష్కారం సాధించాలని కిరిక్‌కి

అనిపించింది. "అవును, ఇదో గొడవగానే ఉంది. ఒక పని చేద్దాం. సాయంత్రం ఇద్దరం కలిసి ఆ నదిని లోపలికి తెచ్చేదాం..." అన్నాడు.

"ఎలా తేగలం?" టిమ్కాకు అనుమానం వచ్చింది.

"ఏముందీ. కాలవని లోపలికి తవ్వేసి గేటు కిందగా ఇక్కడికి తీసుకొద్దాం. అప్పుడు వాళ్లకి నది మిగలదు" అని కిరిక్ వివరించాడు.

పిల్లలిద్దరూ కలిసి గేటు వరకూ వెళ్లి దానికున్న పగులులోంచి బయటికి చూశారు. బయట నది ప్రశాంతంగా ప్రవహిస్తోంది. దాన్ని లోపలికి మళ్లించడం సులభమే. "కానీ బయట ఆ పిల్లలు ఉంటారుగా?" అని టిమ్కా అడిగాడు.

"ఎప్పుడూ ఇక్కడే ఉండరుగా. సాయంత్రం ఇళ్లకు పోవలిసిందేగా" అని కిరిక్ హామీ ఇచ్చాడు.

తరువాత వాళ్లిద్దరూ గేటు దాటి బయటికి వచ్చారు. అక్కడ దాదాపు పదిమంది నౌకా విహారంలో తలమునకలై ఉన్నారు. మిత్రోష్కా మొహం కూడా బురద కొట్టుకొని ఉంది. వాడు ఇంకా టిమ్కా పడవపై తన ప్రతాపం చూపిస్తున్నాడు. వీళ్లని చూసి ముందే జాగ్రత్తపడి తన పడవని తోసుకుంటూ దూరంగా నడిచాడు. నదిలో దాదాపు డజను పడవలున్నాయి. పిల్లలు ఉత్సాహంగా వాటిని ముందుకు నడిపే ప్రయత్నం చేస్తున్నారు. రకరకాల పడవలు. అన్నింటిలోకీ పెట్యాగుబెంకో పడవ గట్టిగా, పెద్దగా, అందంగా ఉంది. చెట్టు బెరడుతో చేసిన ఆ పడవకు జెండా, తెరచాప కూడా ఉన్నాయి. వీళ్ళు నీళ్ల దగ్గరకి నడిచారు. పెట్యా తన పడవని ప్రవాహం మొదలు దగ్గరకు తీసుకెళ్లి నీళ్లలోకి వదిలాడు. అది ఠీవిగా బయలుదేరి, నీటితోపాటు గుండ్రంగా తిరుగుతూ, చిన్న చిన్న అడ్డంకులను దాటుకొని వేగంగా ముందుకు వచ్చింది. పెట్యా ప్రవాహానికి అటువైపు గట్టుపై పరుగుపెడుతూ తన పడవని అనుసరించాడు. అది నదిలో అడ్డం తిరిగి ఇటువైపు ప్రయాణించి ఒక మంచుముక్క అడ్డురావడంతో నిలిచి పోయింది. టిమ్కా నీటిలో చెయ్యి పెట్టి ఆ పడవని అందుకున్నాడు. పెట్యా అరుస్తాడని, వాడిని ప్రతిఘటించాలని టిమ్కా సిద్ధమయ్యాడు. కానీ పెట్యా ప్రశాంతంగా నిలబడి ఇటువైపు చూశాడు. పడవని పట్టుకోనిచ్చినందుకు టిమ్కాకు వాడంటే అభిమానం కలిగింది.

"నీ పడవ భలే తేలికగా ఉంది" అన్నాడు మెచ్చుకోలుగా.

"బెరడుతో చేశాను మరి" అని పెట్యా బదులిచ్చాడు.

"నువ్వే చేశావా? అంటే పేనాకత్తితో బెరడుని కోశావా?"

"అవును"

"నీకు పేనాకత్తి ఎక్కడిది?"

"నా దగ్గర సొంత కత్తి ఉంది"

"నిజమా. చూపించవా?"

పెట్యా ఎలాంటి అనుమానం ప్రదర్శించకుండానే జేబులోంచి పెనాకత్తి తీసి ప్రవాహం మీదుగా టిమ్కాకు అందించాడు. ఆ కత్తి మొండిగా ఉంది. అయితే ఏం వాడికి సొంత కత్తి ఉంది. ఎలా వచ్చిందో. అదే అడిగాడు టిమ్కా.

"నీకెవరు ఇచ్చారు?"

"ఒక నావికుడు"

"ఎక్కడ?"

"మొన్న వేసవిలో నాన్నతో కలిసి నదిలో చేపలు పట్టేందుకు వెళ్లాను. ఆ పడవ నడిపే ఆయన దాన్ని నాకిచ్చాడు." ఇలాంటి కథలు టిమ్కా చాలా విన్నాడు. వాడికి వీటిల్లో నమ్మకం తక్కువ. నావికుడు కనిపించడం, కత్తి ఇవ్వడం జరిగేపని కాదని వాడికి తెలుసు.

"మీ నాన్న ఫ్యాక్టరీ కాపలాదారు కదా?" అని పెట్యాని అడిగాడు.

"అవును. ఫ్యాక్టరీని కాపాడతాడు."

"మా నాన్న ఫ్యాక్టరీలో ఒక బృందం నాయకుడు" అని టిమ్కా గొప్పగా చెప్పాడు.

పెట్యా మాట్లాడలేదు.

"ఆయన కమ్యూనిస్టు కూడా" టిమ్కా కొనసాగించాడు.

పెట్యా అదేం పట్టించుకోకుండా "ఇటివ్వు" అన్నాడు. టిమ్కా వైపు చెయ్యి చాచి.

టిమ్కా కత్తిని తిరిగివ్వకుండా దాన్ని పరిశీలిస్తూ "మీ నాన్న కమ్యూనిస్టు కాదు కదూ!" అన్నాడు.

పెట్యా ప్రశాంతంగా చూశాడు. "ఆయన కమ్యూనిస్టు కాదు. కానీ దాని వల్ల తేడారాదు. ఆయన ఫ్యాక్టరీని రక్షిస్తాడు" అన్నాడు.

"చాల్లే. రక్షిస్తాడా?" అన్నాడు టిమ్కా సహించలేక.

"అవును. ఆయన వద్ద నిజమైన తుపాకీ ఉంది."

"ఏమిటీ? తుపాకీనా? నువ్వు చూశావా?"

"చూశాను."

"నిజమైనదేనా?"

"అవును. అది రైఫిల్."

"మరి ఆయన దాన్ని ఇంటికి ఎప్పుడూ తేలేదేం?"

"అలా తేకూడదు. అది ఫ్యాక్టరీ సొత్తు."

"తుపాకితో ఆయన ఎవరినైనా కాలుస్తాడా?"

"అవసరమైతే బందిపోటు దొంగలను కాలుస్తాడు."

"బందిపోట్లు ఇప్పుడెవరున్నారు? సరే కానీ, ఇలాంటి పడవ ఒకటి నాకు చేసి ఇస్తావా?"

పెట్యా చిన్నగా నవ్వాడు. "కావాలంటే ఈ పడవ తీసుకో" అన్నాడు.

"నిజంగా!" టిమ్కా కళ్లలో సంబరం.

"నిజంగా తీస్కో పర్వాలేదు. నేను మరోటి చేసుకుంటాను" అన్నాడు పెట్యా.

టిమ్కా మనసు కృతజ్ఞతతో నిండింది. వాడికి ఏమైనా తిరిగి ఇద్దామనుకున్నాడు. "సరే. తీసుకుంటాను. మరి నీకు చేపలగాలానికి సరిపోయే కొక్కెం ఇవ్వనా?" అని అడిగాడు.

"వద్దు. నా దగ్గర ఉంది"

"ఉండనీ, ఇదీ తీస్కో, రెండు వుంటాయి. మనిద్దరం చేపల వేటకి వెళ్దాం."

"సరే. మా పడవలో వెళ్దాం" పెట్యా హామీ ఇచ్చాడు.

దీన్ని టిమ్కా నమ్మలేకపోయాడు. "మీకు సొంత పడవ ఉందా? ఎక్కడిది?" అని అడిగాడు ఆత్రంగా.

"నాన్న తయారుచేశాడు."

టిమ్కాకు ఆశ్చర్యంతో మతిపోయింది. చూస్తుంటే ఈ పెట్యాకు లేనిదేదీలేనట్టుంది. అనుకుంటూ ప్రవాహాన్ని ఒక్క గంతులో దూకి అవతలికి చేరాడు. ఇద్దరూ చాలాసేపు కబుర్లు చెప్పుకున్నారు. ఈ పెట్యా నాన్న నిజంగా మాంత్రికునిలా ఉన్నాడు. ఆయనకు చేతకాని పనంటూ ఏమీ లేనట్టుంది. నిజమైన పడవలో తిరుగుతూ చేపలు పట్టడం ఊహించుకుంటూ వాడికి అలవికాని సంతోషం కలిగింది.

★ ★ ★

ఇంటిదారి పట్టాడు టిమ్కా. అప్పటికే ఆవరణలో కిరిక్ పెద్దపారతో కాలువ తవ్వుతున్నాడు. టిమ్కా వంక చూసి, "ఎక్కడికి పోయావు?" అని అడిగాడు.

"ఏం, ఎందుకు?"

"ఎందుకేమిటి? నదిని మన పెరట్లోకి తెచ్చేసుకోవద్దు? మరచి పోయావా?"

టిమ్కాకి హటాత్తుగా పెట్యా గుర్తు వచ్చాడు. నదిని ఇలా సొంతం చేసుకుంటే వాడుఎక్కడ పడవ నడుపుతాడు? అందుకే కిరిక్‌ని అడిగాడు "మరి మనతో పెట్యాని ఆడుకోనిద్దామా?"

"పెట్యా? దేనికి?"

"వాడు నాకు ఈ పడవ ఇచ్చాడు మరి"

కిరిక్ ఆ పడవని పరిశీలించాడు. "పెట్యా సొంతంగా తయారు చేశాడా?" అని ప్రశ్నించాడు.

"అవును"

"మరి నాకూ ఇలాంటిది ఇస్తాడా?"

"ఏమో అడుగుదాం."

ఆ సాయంత్రం చీకటి పడిన తరువాత బయట కుర్రవాళ్లు ఇళ్లకు తిరిగి వెళ్లిన తరువాత కాలువ తవ్వకం మొదలు పెట్టాలని నిర్ణయించుకున్నారు ఇద్దరూ. కానీ పెట్యా ఏమంటాడో, నొచ్చుకుంటాడు అనే అనుమానం టిమ్కాను బాధిస్తోంది. ఇప్పుడు వాడిని బాధిస్తే రేపు చేపల పడవ ఎక్కనివ్వడేమోననే ఆందోళన వాడిని పీడిస్తోంది. పడవ ఎక్కి చేపలు పడుతూ, అవతల దరికి చేరితే, చీకట్లో చేపల పులుసు కాచుకోవచ్చు, ఆడుకోవచ్చు. క్రితం ఏడాది వాడు నాన్న, అన్నయ్యలతో కలిసి ఫ్యాక్టరీ కార్మికుడు ఎలెనిచ్ పడవలో అలా వెళ్లాడు. కానీ ఆ పడవలో ఎలెనిచ్ కొడుకు, ఇంకా అన్న సెర్గీ స్నేహితులూ కూడా ఉన్నారు. వాళ్లంతా పెద్దవాళ్లు. ఎవరి ఆలోచనలు వారికి ఉన్నాయి. వారు టిమ్కాను అసలు పట్టించుకోలేదు. వాడి సరదాలు తీరలేదు. అందుకే ఇప్పుడు పెట్యాతో కలిసి వేటకు వెళ్లాలనుకొంటున్నాడు. కానీ, ఇలా నదిని ఇంట్లోకి తెచ్చేసుకుంటే వాడికి కోపం వస్తుందేమో..... వాడి ఆలోచనలు తెగలేదు.

★ ★ ★

సాయంత్రం కిరిక్‌తో కలిసి టిమ్కా కాలవ తవ్వకం మొదలు పెట్టాడు. చీకటిపడేలోగా ఆవరణలో కాలువ పని పూర్తయింది. లోపల నీళ్ల తొట్టె పక్కన పడవల కోసం రేవు కూడా

కడదామని కిరిక్ ప్రతిపాదించాడు. సొంత నదిలో, సొంత పడవల కోసం సొంత రేవు. టిమ్కాకు నచ్చింది ఈ ఆలోచన.

లోపల తవ్వకం పూర్తయిన తరువాత ఇద్దరూ పారలతో గేటు బయటకు వచ్చారు. 'చూడు మన సొంత నదిలో పడవలు తిప్పుకుంటాం. ఆ పిల్లలంతా వచ్చి ఈర్ష్యతో మన వంక చూస్తారు' అన్నాడు కిరిక్. ఇద్దరూ గేటు బయట తవ్వడానికి సిద్ధమయ్యారు. అప్పుడే ఒక ఆకారం చీకటి లోంచి వచ్చి వాళ్ల ఎదుట నిలిచింది. అది టిమ్కా నాన్న మేనయేవ్.

"ఎవరది? టిమ్కా? పక్కనెవరు? కిరిక్?" అని ప్రశ్నించాడతను.

"అవును"

"ఏం చేస్తున్నారు చీకట్లో?"

"తవ్వుతున్నాం. కాలువ తవ్వుతున్నాం" అని టిమ్కా గొప్పగా చెప్పాడు.

"ఏం కాలువ?" అనుమానంగా అడిగాడాయన.

"చూడు. రోడ్డు మీద ఈ కాలువ ఉందా? దాన్ని లోపలికి మళ్లిస్తున్నాం. లోపల తవ్వడం అయిపోయింది. ఈ కాస్త తవ్వితే కాలవ లోపలికి వచ్చేస్తుంది." టిమ్కా గొంతులో ఉత్సాహం.

"కాలువ? లోపలికా? ఎందుకు?" అయోమయంగా అడిగాడు నాన్న.

"ఎందుకేమిటి? అందరూ ఇక్కడకు తయారవుతున్నారు. పడవలు తీసుకొస్తున్నారు..."

"ఎవరూ?" ఇంకా ఆయనకు అర్థం కాలేదు.

"వీధిలో పిల్లలంతా. మన ఇంటి ముందు నీళ్లు బాగా నిలిచాయని, ఇక్కడ ఈ జలపాతం కూడా ఉందనీ అందరికీ ఈర్ష్యగా ఉంది. వాళ్లు పడవలు చేసుకొని ఇక్కడికి వచ్చేస్తున్నారు" టమ్కా సహనంగా వివరించాడు.

"అదీ సంగతి. మంచి కుర్రవాళ్లే మీరు. అంటే నది మీ ఒక్కరిదే కావాలి. మరెవ్వరూ రాకూడదు. మీరు మాత్రమే పడవలు తిప్పాలి. అంతేనా?" అన్నాడాయన.

టిమ్కాకు తండ్రి గొంతులో ఏదో మెలిక వినిపించింది. అయితే దాన్ని గురించి ఆలోచించే వ్యవధి వాడికి లేదు. అదీకాక సొంత నదిలో తనూ, కిరిక్ మాత్రమే పడవలు నడుపుకోవడం అనే ఊహ వాడికి కొత్త ఉత్సాహాన్నిచ్చింది.

"అవును. అప్పుడు వాళ్లంతా వచ్చి గేటు బయట నిలబడి మా వంక కుళ్లుగ చూస్తారు" అని బదులిచ్చాడు.

"మామూలుగా అందరూ ఇంట్లోకి వచ్చిన నీటిని బయటికి పంపేదుకు ఇలా కాలువలు తవ్వుతారు. మీరు మాత్రం బయటి మురికినీరు లోపలికి వచ్చేందుకు పనిచేస్తున్నారు. భేష్. ఇంత గొప్ప ఆలోచన ఎవరిది?" అని ప్రశ్నించాడు నాన్న.

"కిరిక్, నేనూ ఆలోచించాం."

ఇంతసేపూ కిరిక్ మాట్లాడలేదు. టిమ్కా నాన్న మాటల్లో ఏదో వేళాకోళం, విమర్శ ఉందని వాడికి అర్థమవుతోంది. అదీకాక కాలువ తవ్వాలనే అద్భుతమైన ఆలోచన తనొక్కడిదీ అయితే, ఈ టిమ్కా అది తనకూ తట్టిందని గొప్పలు చెప్పకోవడం కిరిక్‌కు నచ్చలేదు. దాంతో వాడు మౌనం కొనసాగించాడు.

టిమ్కా నాన్న వీళ్ల తవ్వుతున్న కాలువకు అటూఇటూ కాళ్లు వేసి నిలబడి పిల్లలవంక విచిత్రంగా చూశాడు. "అవును ఒక్క నదికి బదులు మొత్తం వీధినే ఇంట్లోకి తెచ్చుకోగలిగితే బావుంటుంది" అని వ్యాఖ్యానించాడు.

తండ్రి మాటల్లో టిమ్కాకు ఏదో ప్రమాదం కనిపించింది. వాడు జవాబు ఇవ్వలేదు. కిరిక్ మాత్రం పెద్దగా నవ్వి "వీధిని ఇంట్లోకి తెచ్చుకోవడం దేనికండీ?" అని అడిగాడు.

"అప్పుడు మీరు ఒక్కరే వీధిలో నడవచ్చు. మరెవరూ నడవలేరు. అది మీ సొంతం అవుతుంది" అన్నాడు మినయేవ్.

ఈ చర్చ ఇలా సాగడం మంచిదికాదని టిమ్కాకు అర్థం అయ్యింది. కానీ అప్పటికే పరిస్థితి చెయ్యి దాటి పోయింది.

నాన్న గంభీరంగా మొహం పెట్టి, టిమ్కా వంక చూసి, "ఇక ఇంటికి రా" అన్నాడు. వాడు బుద్ధిగా నడుస్తూ తండ్రి కంటే రెండడుగులు ముందు వేసి ఇల్లు చేరాడు. దారిలో తాము ఇంతకు ముందు తవ్విన కాలువను తొక్కి పాడుచేస్తున్నానని వాడికి తట్టలేదు. వాడసలు పరిసరాలను పట్టించుకోకుండా నడిచాడు. ఇంట్లోకి ఎలా వెళ్లాడో, కోటు ఎలా విప్పుకున్నాడో వాడు గుర్తించలేదు. లోపలికి వెళ్లి ఒక మూల కూర్చుని తండ్రి మందలింపులు వినేందుకు సిద్ధపడ్డాడు.

తండ్రి వంటగదిలోంచి తువ్వాలుతో చేతులు తుడుచుకుంటూ ఈ గదిలోకి వచ్చి పెద్ద గొంతుతో ప్రారంభించాడు - "భలే కొడుకు దొరికాడు. ఇలాంటి వాడు బూర్జువాలకు బాగా నచ్చుతాడు. చివరికి రోడ్డుపై ప్రవహించే నీటి కాలువను చూసినా ఈర్ష్యే వాడికి. అందరూ ఆడేసుకుంటున్నారని బెంగ. ఆ కాలువని జేబులో దాచేసుకోవాలనే స్వార్థం. రోడ్డుపై ఉన్న నీటిమడుగులో మిగిలిన పిల్లలు పడవలు వేసుకుంటే నష్టం ఏమిటి? అయినా టిమ్కాకు అది కుదరదు. తాను ఒక్కడే ఆడుకోవాలి. ఎంత కాపీనం?! ఎంత స్వార్థం!" అన్నాడాయన.

టిమ్కా మౌనంగా గది మూలకు చూస్తున్నాడు. తండ్రి చేస్తున్న విమర్శతో వాడి హృదయం కుంగిపోయింది. ఆయన గది మధ్య నిలిచి, చేతులు తుడుచుకుంటూ కంచుకంఠంతో దాడి సాగిస్తున్నాడు. ఆయనసలు టిమ్కా వంక చూడడం లేదు. నాన్న మాటల కంటే ఆయన గొంతులో ఆరోపణ, ఆ ధోరణి టిమ్కాను ఎక్కువ బాధించాయి. తండ్రి ఎదుట తానొక సూక్ష్మ జీవినని వాడికి అనిపించింది. వాడికి ఎందుకో కోపం వచ్చింది. అన్న సెర్గీ తనను చూసి పళ్లు ఇకిలిస్తున్నాడు. తల్లి విచారంగా ఉన్నట్టు మొహం పెట్టి నాన్న పక్కనే నిలబడింది. వాళ్లిద్దరిలో ఎవరికీ తనకు సాయపడే ఉద్దేశం లేదు. పైగా అలా తిట్లు తింటుంటే బాగా సంతోషిస్తున్నట్టు కనిపించారు వాడికి. తండ్రి తన మాటలు ఆపి తిరిగి వంటగదిలోకి వెళ్లినప్పుడు సెర్గీ తమ్ముడిని చూసి పెద్దగానవ్వాడు. "నిజంగా ఆ మురికిగుంటని నీ సొంతం చేసుకొందామనుకొన్నావా?" అని అడిగాడు.

టిమ్కా వాటి వంక కాల్చేసేట్టు చూశాడు. కానీ కూర్చున్న చోట నుంచి కదల్లేదు. ఇలా అవమానాలు భరించడం టిమ్కాకు అసాధ్యంగా ఉంటుంది. ఇటువంటప్పుడు వాడు మొహాన్ని విచారంగా పెట్టి శూన్యంలోకి చూస్తూంటాడు. నాన్న ప్రారంభించిన దాడి అంతటితో ఆగిపోయిం దనుకుని హాయిగా నిట్టూర్చబోయాడు. ఈలోగా తల్లి అందుకుంది "వాడికి అసూయకేం

తక్కువ లేదు. రోడ్డు మీద మురికి కాలువ ఒక్కటేంటి? నాన్న తినే కేక్ కూడా వాడికి కావాలి. ఏం?" అందామె.

వాడిక తట్టుకోలేకపోయాడు. లేచి విసురుగా వెళ్లి పడకగదిలో మంచం మీద వాలాడు. తడి బూట్లు మంచం పట్టా మీదుగా నేలవైపు వేలాడుతున్నాయి. దుఃఖంతో వాడు రగిలి పోయాడు. బయట సెర్జీ పెద్దగా నవ్వుతుంటే, వాడికి విచారం ఆగలేదు. అంతా నాశనమైంది అనుకున్నాడా బాధగా.

ఇంతలో అమ్మ వచ్చి మంచం అంచుపై కూర్చుని వాడి తల నిమిరింది. "అలా ఏడవకు. కాసిన్ని కేక్‌ల కోసం ఏడవాల్సిన పనిలేదు" అంది ఓదార్పుగా.

ఈ మాటలతో అంతవరకూ చిన్న జల్లులా సాగిన టిమ్కా ఏడుపు పెద్ద తుఫానుగా మారింది. ఇంతలో నాన్న గొంతు పక్క గదిలోంచి వినిపించింది. "కేక్‌లు తినేశాడా? ఏవీ? నా కోసం ఉంచినవా?" వెంటనే టిమ్కా ఏడుపు ఆపాడు. కారణం వాడి విచారం తగ్గడం కాదు. నాన్న పక్క గదిలోంచి నెమ్మదిగా మాట్లాడుతున్నాడు. ఆ మాటలు వినాలని.

"టిమ్కా అలా తినడే. నా కోసం ఉంచినవి ముట్టుకోడే. నేనంటే ఎంతో ప్రేమ అని చెప్తాడు. అలా ఎందుకు తింటాడు? బహుశా చుంచులు, ఎలుకలు తినేసి ఉంటాయి" అన్నాడు నాన్న.

టిమ్కా కళ్ల ముందు టేబుల్‌పై ప్లేటువైపు పాకుతున్న రెండు చుంచులు కనిపించాయి. ఇంతలోనే అవి టిమ్కాగా మారాయి. వాడికి ఆ దృశ్యం నచ్చలేదు. వాడు ఏడుపు కొనసాగించాడు. అప్పుడే మంచంపై నుంచి దిగడం ప్రమాదమని వాడికి తెలును. తల్లి వాడి భుజం పట్టుకొని, "అలా తినవచ్చా? నీకు ఎన్ని కేక్‌లు కావాలంటే అన్ని ఇస్తాను. కానీ నాన్న కోసం ఉంచినవి తినెయ్యకూడదు. ఏం?" అంది అనునయంగా. వాడు తల్లి మొహం చూడలేదు. కాని అమె మెల్లగా నవ్వుతోందని, ఆపేక్షగా చూస్తున్నదని వాడికి తెలుసు. ఉన్నట్టుండి వాడికి తప్పు వొప్పుకుందా మనిపించింది. తల్లితో ఏకీభవించాలనిపించింది. తల్లి వాడి మొహాన్ని తన వైపునకు తిప్పుకొంది. అమె ప్రేమగా నవ్వుతోంది. ఆ నవ్వులో హేళన లేదు.

"ఇంకెప్పుడూ అలా చెయ్యనమ్మా" అన్నాడు గుసగుసగా.

"అదీ మంచి పిల్లాడివి. దా, భోజనం చేద్దాం" అంటూ తల్లి లేచి బయటికి నడిచింది. కానీ లేవాలంటే వాడికి భయం వేసింది. నాన్న ఇంకా ఇంట్లో తిరుగుతూనే ఉన్నాడు. లేస్తే మళ్లీ దండకం మొదలవుతుందని వాడి అనుమానం. నాన్న పడకగదిని సమీపించినట్టు బూట్ల చప్పుడుని బట్టి అర్థమైంది. అయన గదిలోకి వచ్చి కుర్చీ లాక్కొని టిమ్కా మొహాన్ని నిశితంగా చూశాడు. కళ్లు మూసుకుందామని వాడికి తట్టలేదు. అయన వాడి వంకే చూస్తూ "పర్వాలేదు టిమ్కా అమ్మ మాటలు పట్టించుకోవద్దు. నీకు ఎక్కడైనా నీటి గుంటలుకానీ, బల్లపై కేక్‌లు కానీ కనిపిస్తే గభాలున సొంతం చేసుకో, లేకపోతే మరెవరైనా వాటిని తీసుకునే ప్రమాదం ఉంది" అన్నాడు. తండ్రి టక్కరితనం వాడికి అర్థమైంది.

"కాదు. అలా చేయడం తప్పు" అన్నాడు టిమ్కా నెమ్మదిగా.

"అలాగా? అయితే మంచిదే. నీకేం అర్థం కాదనుకున్నాను. సరే పద భోజనం చేద్దాం" అన్నాడు తండ్రి.

"నా మీద కోపం లేదుగా?" టిమ్కా అర్థింపుగా అడిగాడు.

"ఏం లేదు. పద" అంటూ ఆయన వాడి చెయ్యి పట్టుకొని భోజనాల బల్ల వద్దకు నడిచాడు. అక్కడ అన్నయ్య చదువు కట్టిపెట్టి బల్ల దగ్గర చేరాడు అప్పటికే. అమ్మ అందరికీ పళ్లేల్లో భోజనం పెట్టింది. అందరూ తింటూండగా తండ్రి అన్నమాటలు టిమ్కాకు ఆసక్తిని కలిగించాయి.

"పిల్లలు రోడ్డు మీద నదిని ఇంట్లోకి తెద్దామనుకొన్నారు. సరే. కానీ, ఆ సరైన నదే ఇళ్లల్లోకి వచ్చే ప్రమాదం పెరిగింది. నదిలో నీటిమట్టం పెరిగిందట" అన్నాడు.

"అవునా?" అంది తల్లి ఆందోళనగా.

"అవును. నిన్న నీటిమట్టం ఒక మీటరు పెరిగింది. ఇవాళ మీటరు కంటే ఎక్కువైంది" వివరించాడు ఆయన.

"మనం ఏం చేయాలి?" అనడిగింది తల్లి.

"మనం ఏం చేస్తాం. వాళ్లు పని మొదలుపెట్టారు. రాత్రికి నదికట్టని కాస్త గట్టిపరుస్తారు"

నిజానికి నది పొంగడం వల్ల కట్ట అవతల ఉన్న కాలనీకి పెద్ద ప్రమాదం లేదు. కానీ క్రమంగా రైలు కట్టకు ఆవతల ఉన్న పల్లం భూమిలో ఇళ్లు పెరగడంతో నది హద్దు దాటితే నష్టం కలిగే ప్రమాదం ఎదురవుతుంది. పల్లంలోని ఆ ఇళ్లన్నీ ఎన్నడో మట్టి, చెక్క, పేడలతో నిర్మించారు. వాటి చుట్టూ పళ్ల చెట్లు, పొద్దు తిరుగుడు మొక్కలతో ఆ కాలనీ మనోహరంగా ఉంటుంది. నది వల్ల ప్రమాదాన్ని ముందే ఊహించిన వారు చాలా మంది ఎత్తయిన కంచెలు కట్టుకొని వాటిపై ఇళ్లు ఏర్పాటు చేసుకొన్నారు. అయినా నది పొంగితే అంత అందాల పూలతోట లాంటి కాలనీ, బురదగుంటగా మారడం ఖాయం.

ఆ మర్నాడు ఆదివారం. ఉదయం పలహారం కాగానే టిమ్కా తన మిత్రబృందంతో నది వొడ్డుకు బయలుదేరాడు. ఈ కాలనీ నుంచి చాలామందే అటువైపు నడుస్తున్నారు. వాళ్లలో పెట్యా కూడా ఉన్నాడు. ఇవాళ వాడి మొహం సంతోషంగా ఉంది. "నువ్వూ అక్కడికేనా?" అన్నాడు టిమ్కాతో.

"అవును. అక్కడికే. ఏంటివాళ సంతోషంగా ఉన్నావు?" అని అడిగాడు పెట్యాను. "నిన్న అక్క నటాషాతో గొడవపడ్డాను. అందుకే అలా ఉన్నాను" అన్నాడు.

"నటాషా ఎవరు?"

"మా అక్కయ్య. తను తొమ్మిదోక్లాసు" వివరించాడు పెట్యా.

ఆమె ఎవరో టిమ్కాకు తెలుసు. ఆమె స్కూలు కమిటీ అధ్యక్షురాలు. మాటిమాటికీ క్లాసు గదుల్లోకి వచ్చి పిల్లలని శుభ్రం విషయంలో మందలిస్తుంటుంది. ఆదివారం కావడంతో అప్పటికే చాలా మంది జనం వచ్చి కట్టపై నుంచుని వింత చూస్తున్నారు. ఏప్రిల్ ఎండ ఆకాశాన్ని ప్రకాశ వంతం చేస్తోంది. నది పక్క కట్ట బలంగా ఉంది. దానిపై మంచు పూర్తిగా కరగలేదు. ఎదురుగా పల్లంలో ఇళ్ల గుమ్మాల దాకా నీళ్లు వచ్చేశాయి. ఆ ఇళ్లలో మనుషులు నిచ్చెన ద్వారా కంచె ఎక్కి లోపలికి, బయటికి తిరుగుతున్నారు. నీరు ఇంకా కట్టపైకి రాలేదు. అక్కడి నీరు స్థిరంగా, మురికిగా ఉంది. ఏడాది పొడవునా కింది పల్లంలో ఉన్న కాలనీ వీధుల్లో పేరుకున్న దుమ్ము, పేడ, గడ్డిపరకలు, కాయితం ముక్కలను తనతో తెచ్చుకొన్న నీరు సహజంగానే మురిగ్గా

ఉంటుంది. కట్టను మరింత బలంగా చేసేందుకు పని సాగుతోంది. వడ్రంగులు, తాపీ పనివారు హడావుడిగా ఉన్నారు. దాదాపు కిలోమీటరు పొడవున్న కట్ట మొదటినుంచీ చివరి వరకు వడ్రంగులు పని చేస్తూ కనిపిస్తున్నారు. ఊడిపోతున్న చెక్కలని బిగించడం, అవసరమైతే కొత్త చెక్కలను మేకులతో కొట్టడం సాగిస్తున్నారు. మరోపక్క అనేక బళ్లలో అనేకమంది కార్మికులు మట్టిని ఇక్కడకు తరలిస్తున్నారు. అటూఇటూ తిరుగుతున్న టిమ్కాకు మధ్యలో వడ్రంగి, కిరిక్ తండ్రి అయిన బైచకోవ్ కనిపించాడు. ఆయన దర్జీ పనివాడైన గ్రిగోర్లేవ్‌తో మాట్లాడు తున్నాడు. "ఎంత మందిని తెచ్చారో చూడు అనవసరంగా. అసలు వరద వస్తోందని ఎవరన్నారు? ఎప్పుడు? ఐదేళ్ల క్రితం వచ్చింది వరద. మరో ఐదేళ్లదాకా రాదు. ఆ విషయం తెలిసినా మనమంటే ఎంత శ్రద్ధో ప్రదర్శించేందుకు హంగామా చేస్తున్నారు. చూడు అక్కడ చూడు, చేతిలో పుస్తకంతో, అందరిపై అజమాయిషీ చేస్తున్నాడే అతనే మొత్తం పని చేస్తున్నట్టు హడావుడి..... ఇంతకీ ఎవరతను ఫ్యాక్టరీల్లో సాధారణ కార్మికుడు. కానీ ఇవాళ? ఒక బోల్షివిక్ అయిపోయాడు. అతనికి వరదల గురించి ఏం తెలుసు? ఆనకట్ట ఎంత బలంగా ఉండాలో ఎలా తెలుసు? మనం అడగకూడదు. ఆయన ప్రస్తుతం బోల్షివిక్ అంతే" అంటూ ఉపన్యాసం ఇస్తున్నాడు.

పెట్యా, టిమ్కాలు అటూఇటూ తిరిగి నీళ్లలోకి ఓ కర్రముక్క విసిరేశారు. అది మునుగు తుందా? తేలుతుందా? అనేది వారి అనుమానం. అది కాస్సేపు తేలి చివరికి చిన్న అలతోపాటు దూరంగా వెళ్లిపోయింది. టిమ్కాకు పడవ గుర్తొచ్చింది.

"పెట్యా మీ పడవ ఏదీ?" అని ప్రశ్నించాడు.

"అక్కడ నదిలో ఉంది. అక్కడ మామయ్య వంతెనపై పని చేస్తున్నాడు"

ఈ సమాధానం విని టిమ్కాకు అసూయ కలిగింది. ఈ పెట్యాగాడికి ప్రపంచంలో ఉన్న మంచి సంగతులన్నీ అందుబాటులో ఉన్నందుకు చికాకు పుట్టింది. నిన్న నావికుడి గురించి చెప్పాడు. ఇప్పుడు వంతెన బాగుచేసే ఇంజనీర్ తన మామయ్య అంటున్నాడు అని ఉడుక్కున్నాడు.

"అంటే మీ మామయ్య బోల్షివిక్ కూడానా?" అనడిగాడు.

"అవును" అన్నాడు పెట్యా.

"ఆ పడవని ఇక్కడకు తేవచ్చుగా?"

"తేకూడదు. ఇంకా ఒకటి, రెండు రోజుల్లో నీరు ఈ కట్ట దాటి లోపలికి వస్తుంది. కాలనీలోకి వచ్చేస్తుంది" వివరించాడు పెట్యా.

"నీకెలా తెలుసు?" టిమ్కా అనుమానం.

"నాన్న చెప్పాడు"

"మీ నాన్నకెలా తెలుసు?"

"ఆయనకు అన్నీ తెలుస్తాయి" పెట్యా గొంతులో కొంచెం గర్వం.

"అయితే కాలనీలోకి నీళ్లు వస్తాయా?" అంటూ టిమ్కా ఇళ్లకేసి చూశాడు. అక్కడి చెట్లూ, ఇళ్లూ అన్నీ నీళ్లలో తేలియాడటం వాడి కళ్ల ముందు కనిపించింది. వాడికి సంతోషంగా అనిపించింది.

"భలే అన్నీ మునిగిపోతే జనం హాయిగా పడవల్లో తిరగచ్చు. చక్కగా పడవల్లోనే ఫ్యాక్టరీకి వెళ్లవచ్చు" అన్నాడు.

కానీ పెట్యా విభేదించాడు "వరద వస్తే ఫ్యాక్టరీ మూతపడతుంది తెలుసా?" అని అడిగాడు. ఈ ఆలోచన టిమ్కాకు భయం గొల్పింది. ఏదేమైనా ఫ్యాక్టరీ మూతపడకూడదని వాడికి తెలుసు.

★ ★ ★

ఆ ఆదివారం హుషారుగా, సరదాగా గడిచిపోయింది. నది ఒడ్డున ముమ్మరంగా పని సాగించి, ఫ్యాక్టరీ కార్మికుడు స్విరిడాన్ నేతృత్వంలో అందరూ ప్రశాంతంగా పనిచేశారు. యువతీ యువకులు ఆనందంగా గెంతుతూ పనివాళ్లకు అడ్డుపడ్డారు. అయినా ఎవరూ ఆందోళన చెందకుండా ఎవరి పనిలోవారు నిమగ్నమయ్యారు. ఒక పెద్ద పడవలో ఇంజీన్ వెర్యోవ్కిన్ కొందరు యువతీయువకులను ఎక్కించుకొని పనిని పర్యవేక్షిస్తుంటే, కుర్రవాళ్లు అకర్డియన్ వాయిస్తూ పండగ జరుపుకున్నారు. ఆ రాత్రి నెగళ్లు మండించారు. పగలంతా పని చేసినవారు విశ్రాంతి కోసం తప్పుకుంటుంటే కొత్త బృందం కార్మికులు ఆ బాధ్యతలు చేపట్టారు. పిల్లలైతే ఆ కట్టపైనే పరుగులు పెడుతూ, అల్లరి చేస్తూ ఏడాదికి సరిపడా కబుర్లు మూటకట్టుకున్నారు. పెద్దలు తీరికగా కూర్చుని ఇది వరకటి వరదల గురించి గుర్తు తెచ్చుకొన్నారు. ఇంతలో చీకటి పడి పిల్లలకు ఆకలి మొదలైనా వారు మాత్రం అక్కడి నుంచి కదిలే ప్రయత్నం చేయలేదు. దీనితో ఇళ్ల నుంచి వాళ్ల అమ్మలు వచ్చి, చీకట్లో పిల్లలను వెదుక్కుంటూ, పట్టుకొని లాక్కెళ్లారు. పిల్లలకు అంత పెద్ద ఉత్సవాన్ని వదిలి ఇళ్లకు పోబుద్ధికావడం లేదు.

అప్పుడే ఒక యువకుడు కడుపు నిండా తాగి, కాలుజారి నీళ్లలోకి పడి లేస్తాడు. అంతలో దూరంగా కేకలు వినిపిస్తాయి. కార్మికులు బరువైన దూలాలను ఈడుస్తూంటారు. మరోవైపు ఒక కారు ఆగి, అందులోంచి కార్యనిర్వాహక అధిపతి దిగుతాడు. ఇంకోవైపు పెద్ద శబ్దంతో లారీ ఒకటి వచ్చి ఆగింది. ఈ హడావుడికి అంతే లేదు.

కానీ మర్నాడు పరిస్థితి మారింది. పల్లంలో ఉన్న కాలనీలోకి మరింత నీరు చేరింది. పిల్లా, పెద్ద అందరూ కలిసి ఇళ్లలోంచి సామాను బయట చేరవేస్తున్నారు. మళ్లీ కార్యనిర్వాహక అధ్యక్షుడు ఒకసారి అక్కడకు వచ్చి ఆ దృశ్యాన్ని చూసి విచారంగా తలపంకించాడు. మరో రెండు రోజులకు నీటి వేగం పెరిగింది; ఇళ్ల కిటికీలు సైతం నీటిలో మునిగిఉన్నాయి. నీటి ప్రవాహం ఉధృతమైంది. క్రమంగా కట్ట చుట్టూ నీటిమట్టం పెరిగింది. దీంతో రాత్రింబవళ్లు పని చేస్తూ కార్మికులు దాని ఎత్తు మరిన్ని మీటర్లు పెంచారు. కాని కొందరు మాత్రం వాళ్లు అనవసరంగా శ్రమపడుతున్నారని, దాని వల్ల ఫలితం ఉండదని పెదవి విరుస్తున్నారు. చివరకు నాలుగో రోజు నీటి వేగం పెరిగింది. ఫ్యాక్టరీని మూసివేసి కార్మికులంతా వరదపై సమరం సాగించాలని నిర్ణయించారు. ఊళ్లో బడులు కూడా మూతపడ్డాయి. ఇళ్లు మునిగిపోయిన జనాన్ని బయటికి తరలించేందుకు గూడ్సు రైళ్లు స్టేషన్‌కు చేరుతున్నాయి.

★ ★ ★

ఆ మర్నాడు ఏప్రిల్ 25న మినయేవ్‌ల కుటుంబం తెల్లవారుతుండగానే మేలుకుంది. ఆ ముందు రోజు రాత్రి నాన్న చెప్పాడు. "మనకొక వ్యాన్ కేటాయించారు. అయితే నది వద్దకు వెళ్లడానికి మనకు ఇంకా వ్యవధి ఉంది" అని తెలిపాడు. ఆ తరువాత పెద్ద కొడుకు వంక

తిరిగి "సెర్జీ ఇంట్లో ఉన్న పారలు, గునపాలు సిద్ధం చెయ్యి" అని ఆదేశించాడు. టిమ్కాతో మాత్రం, "నువ్వు మా కాళ్లకు అడ్డం పడకు. ఇంట్లోనే ఉండు. నది వొడ్డుపైకి నువ్వు రానవసరం లేదు" అన్నాడు. కానీ, ఆ మాటతో టిమ్కా మొహంలో అలముకున్న విషాదాన్ని చూసి అయన గట్టిగా నవ్వాడు. "సర్లే వద్దువుగానీ, కానీ అక్కడ మా పనికి ఒక ప్రేక్షకుడికి అవసరం లేదు. నువ్వు కూడా ఒక బకెట్ తెచ్చుకో."

తండ్రి ఈ మాటలకు టిమ్కా ఖిన్నుడయ్యాడు. నన్ను 'ప్రేక్షకుడు' అంటారా? నిన్నంతా మట్టి మోసేందుకు కావలసిన *స్ట్రెచర్లు తయారుచేయడంలో సాయపడలేదూ? అని గింజు కున్నాడు.

ఆ రోజు నది వొడ్డున గల కట్టను మూడు భాగాలుగా విభజించారు. ఎడమ చేతి వైపు ముక్కను ఫ్యాక్టరీ కార్మికులకు, మధ్య భాగాన్ని స్థానిక కాలనీ వాసులకు అప్పగించారు. వరద నీరు ఉధృతంగా పొర్లేందుకు అవకాశం ఉన్న కుడివైపు చివర భాగంలో పనిచేసేందుకు ఒక బృందం ఎర్ర సైనికులను పిలిపించారు. సైనికులు నిన్ననే పని ప్రారంభించారు. టిమ్కా వాడి స్నేహితులు రెడ్ ఆర్మీ వచ్చిన సంగతి విని నది వద్దకు పరుగులు తీశారు. కానీ అక్కడ రైఫిళ్లతో కాపలా ఉన్న సెంట్రీలు ఎవరినీ కట్టపైకి రానివ్వలేదు. దాంతో పిల్లలు గంటల తరబడి కొంచెం దూరంలో ఉన్న ఒక కంచె ఎక్కి వాళ్ల పనిని పరిశీలించారు. వాళ్లు చేస్తున్న పని ఎంతో ముఖ్యమైనదని పిల్లలకు తోచింది. సైనికులు నిశ్శబ్దంగా, గంభీరంగా వంచిన నడుం ఎత్తకుండా పనిలో నిమగ్నమై ఉన్నారు. లారీల్లో అదే పనిగా మట్టి అక్కడికి వస్తోంది. ఆ రాత్రి నాన్న పిల్లలతో అన్నాడు. "కుడిచేతి వైపు పని చేయడం చాలా కష్టం. వరద తాకిడిని తట్టుకోవడం సులభం కాదు. కానీ అక్కడ పనిచేస్తున్నది రెడ్ ఆర్మీ. నది ఎంత గింజుకున్నా వారిని గెలవలేదు" అని. ఈ మాటలను టిమ్కా నోరు వెళ్లబెట్టి విన్నాడు. అవును మరి సైనికులు బలంగా, ఉత్సాహంగా ఉన్నారు. ఏకంగా ఒక రెజిమెంట్ సైన్యం రంగంలోకి దిగితే నది మాత్రం ఏం చేయగలదు? అనుకొన్నాడు. ఇక వాడికి నదిలో పడవ షికార్లు చేయాలనిపించడం లేదు. తాను కూడా ఆ సైనికుల్లా క్రమశిక్షణతో పనిచేస్తూ వరదతో పోరాటంలోకి దిగాలను కున్నాడు. ప్రస్తుతం నది పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తోంది. బలమైన అలలు వొడ్డును ఢీ కొంటున్నాయి. ఇక్కడ ఇప్పుడు తన అవసరం ఎంతైనా ఉందని వాడి నమ్మకం. అందుకే వాడికి బైచకోవ్‌పై కోపం వచ్చింది.

నిన్న నాన్న, టిమ్కా, సెర్జీ కలిసి వెనక షెడ్‌లో స్ట్రెచర్లు తయారు చేస్తున్నారు. బకెట్లతో, గంపలతో కంటే గోనెబట్టకు అటూ ఇటూ కర్రలు అమర్చిన ఈ స్ట్రెచర్లలో ఒకేసారి ఎక్కువ మట్టి మోయగలం. వాటిని తయారు చేస్తుంటే బైచకోవ్ అక్కడికి వచ్చి చాలాసేపు ఏమీ మాట్లాడకుండా ఆ పనిని పరిశీలించాడు. కాస్సేపటి తరువాత కళ్లు చికిలించి, పళ్లు బిగించి, "ఎందుకలా వృథాగా శ్రమపడతారు వాసిలీ గారు. వాళ్లు మిమ్మల్ని మొత్తం నదిపై అధికారిగా నియమించారట కదా! ఇంతకీ ఆ స్ట్రెచర్లు దేనికో?" అన్నాడు టిమ్కా నాన్నతో.

---

*ఎక్కువ మట్టి తరలించేందుకు వీలుగా గోనెగుడ్డకు అటూ ఇటూ రెండు కర్రలు అంచులకు కుట్టి మోసే సాధనం

"నేను నదిపై అధికారినేం కాదు. ఒక భాగానికి బాధ్యునికి సహాయకుడిని. ఇక స్ట్రెచర్లు అంటారా, మట్టి తరలింపునకు అవి ఎలాగూ కావాలి" అని బదులిచ్చాడు టిమ్కా తండ్రి.

"అలాగా? వీటి సాయంతో వరదను ఆపగలమనుకుంటున్నారా? ఇవెలా ఉపయోగ పడతాయి."

"వీటిలో మట్టి మోయవచ్చు."

ఈ మాటతో బైచకోవ్ సంతృప్తి చెందలేదు. అసమ్మతి సూచకంగా తల అడ్డం తిప్పి, "ఇప్పుడు ఏం చేసి ఏం లాభం? ఇప్పటికే ఆలస్యమైపోయింది. ఇదంతా శీతాకాలంలోనే చేయవలసింది. పోనీ ఇప్పుడైనా వాళ్లు తగినంతమంది సైనికులను పంపారా అంటే అదీ లేదు. బలవంతాన ఒక రెజిమెంట్ సైన్యాన్ని ఇక్కడికి తోశారు. ఈ నది ముందు వాళ్లేం సరిపోతారు?" అన్నాడు ఎకసెక్కంగా.

దీనికి యెనయేవ్ సమాధానం చెప్పేలోగా ఎక్కడినుంచో బైచకోవ్ పెద్ద కొడుకు ల్యోన్యా అక్కడికి దూసుకొచ్చాడు. అతను తండ్రి వంక తిరస్కారంగా చూశాడు.

"నువ్వు నా తండ్రివి కావచ్చు. కానీ చెత్త వాగుతున్నావు" అన్నాడు స్థిరంగా.

"అలాగేం వచ్చాడండీ మరో ప్రవక్త. ఇంతకీ ఎక్కడినుంచి ఊడిపడ్డారు తమరు?" బైచకోవ్ మాటల్లో ఎత్తిపొడుపు స్పష్టంగా తెలుస్తోంది. అసలాయన ఉద్దేశమే అది.

"ఎక్కడినుంచో రాలేదు. నీ మాటలన్నీ వింటున్నాను. ఆ సైన్యాన్ని బలవంతంగా ఇక్కడికి పంపారా? ఈ వయసులో అలాంటి మాటలు ఎలా అనగలిగావు? సైన్యం వచ్చినది నీకు, నాకు సాయం చేసేందుకు. నువ్వేమో వాళ్లు అయిష్టంగా వచ్చారని తేల్చావు!" అన్నాడు ల్యోన్యా కోపంగా.

"గొప్ప సాయమే. ప్రభుత్వం వాళ్లని బలవంతంగా పంపింది. అందుకే వాళ్లు వచ్చారు. వెళ్లమని ఆదేశాలు వచ్చాయి కాబట్టి వచ్చారు. నాతో వాదన ఎందుకు. సైనికుడి ఉద్యోగం అంటే ఏమిటో అందరికీ తెలుసు. అయినా తండ్రితో మాట్లాడే పద్ధతేనా ఇది?" అని నిలదీశాడు బైచకోవ్.

ల్యోన్యా కొద్దిక్షణాలు ఆ తలుపు దగ్గరే నిలిచి తండ్రిని తదేకంగా చూసి, తర్వాత ఆ తలుపును విసురుగా మూసి అవతలికి నడిచాడు. బైచకోవ్ చాలాసేపు కొడుకు వెళ్లినవైపే చూస్తుండిపోయాడు. ఈలోగా మినయేవ్ పని కొనసాగించమని పిల్లలను తొందరపెట్టాడు.

"కానివ్వండి. ఈ పనికిమాలిన మాటలు వినడం దండగ. స్ట్రెచర్లు ఎందుకు అన్నది ఒక ప్రశ్నేనా........ కానివ్వండి" అన్నాడు.

బైచకోవ్ చటుక్కున వెనక్కి తిరిగాడు. "ఏమిటీ పనికిమాలిన మాటలా?" అని రెట్టించాడు.

"అవును." ఈ సమాధానం విన్న పిల్లలు గట్టిగా నవ్వారు. దాంతో బైచకోవ్ కోపంతో పెద్ద అడుగులు వేస్తూ అక్కడినుంచి నిష్క్రమించారు.

ఇదంతా ఇప్పుడు తండ్రి, అన్నయ్యలతో కలిసి నదివొడ్డు వైపు వెళుతుంటే టిమ్కాకు గుర్తు వచ్చింది. వాడు పరిసరాల్లో అందరినీ గమనించాడు. అందరి మొహాల్లో ఆందోళన తెలుస్తోంది. అదేమిటో వాడికి పూర్తిగా అర్థం కాలేదు. ఆ రోజంతా వాళ్లు పనిచేశారు.

మర్నాడు సాయంత్రం ఆరుగంటలవుతుండగా తండ్రి టిమ్కా దగ్గరకు వచ్చి "ఇంకా పని చేస్తున్నావా? నీ స్థానంలో రావలసినవారు రాలేదా?" అని ప్రశ్నించాడు.

"వచ్చాడు. కానీ ఇంకాస్సేపు పనిచేస్తాను."

"కాదులే. నాతోరా. కట్టపైకి వెళ్లి చూద్దాం."

టిమ్కా తన బకెట్‌ను అప్పుడే వచ్చిన మరో కుర్రవాడు వోలోద్యాకు ఇచ్చి తండ్రి వెనక పరుగుతీశాడు. ఇద్దరూ గట్టుపైన నడుస్తున్నారు. ఆ రోజు పని బాగా సాగింది. వాతావరణం వెచ్చగా ఉంది. నదిపై నుంచి చల్లటి గాలి వీస్తోంది. ప్రస్తుతం పల్లంలో గల కాలనీ ఇంటి కప్పులు మాత్రం పైకి కనిపిస్తున్నాయి. చిన్న పడవలు హడావుడిగా ఆ నీటిలో అటూ ఇటూ తిరుగుతూ ఆ ఇళ్లల్లో ఇంకా మిగిలున్నవారిని వొడ్డున ఉన్న వాహనాల వద్దకు తరలిస్తున్నాయి. ఆ ముందురోజే టిమ్కా కుటుంబం కూడా ఇంటినుంచి ఎత్తయిన వేరే చోటికి తరలిపోయింది. ఇప్పుడు నదిలో నీరు గట్టు అంచుదాకా వచ్చింది. చూస్తుంటే నిండా నీళ్లు ఉన్న గ్లాసులా ఉంది ఆ దృశ్యం. వాడికి భయం వేసి తండ్రిని అందుకునేందుకు మళ్లీ పరుగుతీశాడు. నదిలో నీరు కాలనీ పై కప్పుల కిందనుంచి అస్తమిస్తున్న సూర్యునిదాకా వ్యాపించి తుదీ మొదలు లేని సముద్రంలా కనిపిస్తోంది. ఇప్పటికి ఆ నీళ్లు స్థిరంగా ఉన్నప్పటికీ ఏదో ఒక క్షణాన అవి గట్టు తెంచుకుని కాలనీ మీదకి దూకేందుకు సిద్ధంగా ఉన్న సంగతి తెలుస్తూనే ఉంది.

గట్టు మీద దూరంగా ల్యోన్య అక్కడి పర్యవేక్షకునితో గొడవపడుతున్నాడు. తానూ ఫ్యాక్టరీ కార్మికుడినేనని. ఇంకాస్త సేపు పనిచేస్తానని వాదిస్తున్నాడు. అక్కడి అధికారి మాత్రం ఈ వాదనను ఆమోదించడం లేదు. ల్యోన్య కార్మికుడు కాదని, కాలనీవాసి అని అయన అంటున్నాడు. ఇంతలో ఎవరో, "పాపం కాలనీని, తన ఇంటినీ కాపాడుకోవాలని వాడి తాపత్రయం" అని వెక్కిరించారు. దీనితో ల్యోన్య మరింత కోపం తెచ్చుకున్నాడు. ఈ గొడవ విన్న మినయేవ్ అక్కడకు నడిచాడు.

"చూడు ల్యోన్య పగలంతా పనిచేశావు. ఇకచాలు. ఇంకా పనిచేస్తానంటూ వాదిస్తూ కాలం వృధా చేయకు. నువ్వు నిజంగా హీరోవే. కానీ నీలాంటి యువకులు ఇంకా చాలామంది ఉన్నారు. అందరూ పనిచేస్తారు. నువ్వు వెళ్లి విశ్రాంతి తీసుకో. రేపు నీ అవసరం ఉంటుంది" అని ల్యోన్యాకు నచ్చచెప్పి అక్కడినుంచి పంపేశాడు. ల్యోన్య మొన్న తండ్రితో గొడవ జరిగినప్పటి నుంచి ఇంటికి పోకుండా ఫ్యాక్టరీ శిక్షణాలయం వసతిగృహంలోనే ఉంటున్నాడు. వాడు అయిష్టంగా నది దగ్గర నుంచి కదిలాడు.

ఇంతలో పెట్యా తండ్రి వాచ్‌మెన్ గుబెంకో అక్కడికి వచ్చాడు. అతని మొహంలో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది.

'వాసిలోగారూ, ఈ కాలనీ జనంతో నేను పనిచేయించలేను. నా వల్ల కాదు. చేయగలిగిన వారెవరూ పనిలోకి రారు. పనికిరాని వాళ్లంతా గట్టుపైకి చేరి నానా గందరగోళం సృష్టిస్తున్నారు' అని చిరచిరలాడాడు.

టిమ్కా తండ్రి ఆయనతో "పదండి చూద్దాం" అంటూ కాలనీ వాసులు పనిచేస్తున్న మధ్య భాగం వైపు నడిచాడు. అక్కడ నిజంగానే పరిస్థితి అయోమయంగా ఉంది. కాలనీకి చెందిన

ఫ్యాక్టరీ కార్మికులెవరూ అక్కడలేరు. కొందరు మహిళలు, పిల్లలు అక్కడ చేరి యాగీ చేస్తున్నారు. కట్ట కింద నుంచి నీరు బయటికి, కాలనీలోకి చిన్న ధారగా ప్రవహిస్తుంటే వాళ్లు గట్టుపైన మట్టి బస్తాలు కుమ్మరిస్తున్నారు. కార్మికులంతా ఏమయ్యారని మినయేవ్ వారిని ప్రశ్నించాడు.

"బైచకోవ్..... అవతల..... ఎత్తుగా ఉన్న చోట కొత్త ఇల్లు కట్టుకుంటున్నాడు.

"వోలోన్‌చక్ వచ్చాడు కానీ తాగేసి ఉన్నాడు. కష్టాలు మరిచిపోయేందుకట."

"జుకార్‌చెంకో నిన్న వచ్చాడు. ఇవాళ ఏదో పనిపై పొరుగూరు వెళ్లాడు"! ఇవీ వారి సమాధానాలు.

"సరే నీరు కిందమంచి కారిపోతుంటే మీరు పైన మట్టిపోసి లాభం ఏమిటి? కింద నుంచి ప్రారంభించండి. పునాది ఉండాలిగా" అని మినయేవ్ ఆదేశాలు జారీచేశాడు.

తరువాత రోజు ఉదయం నది వద్ద పరిస్థితి మరింత ఆందోళనకరంగా ఉంది. అదేపనిగా పడుతున్న వానజల్లు వెనకనుంచి నది కాని, గట్టు కనిపించడంలేదు. నదిలో నిండా ఉన్ననీరు బలంగా వీస్తోన్న గాలులతో కదలి గట్టుపైకి నాలుకలు చాపుతోంది. ఆ పూట పనిలోకి వచ్చిన వారెవరూ తిరిగి ఇళ్లకు వెళ్లడం గురించి ఆలోచించగల స్థితిలో లేరు.

బస్తాలో మట్టి నింపేందుకు టిమ్కా, పెట్యా బృందం చేస్తున్న ప్రయత్నాలు ఈరోజు పెద్దగా ఫలించలేదు. కురుస్తున్న వానకు తడిసి ముద్ద అయిన నల్లటి మట్టిని పెళ్లగించడం అసాధ్యంగా మారింది. అయినా పిల్లలు కొంచెం దూరంగా కూలిపోయేందుకు సిద్ధంగా ఉన్న షెడ్‌లలోని మట్టిని పోగుచేస్తున్నారు. ఇంతలో మినయేవ్ ఆదేశాలు స్పష్టంగా వినిపించాయి.

"గొలుబెవ్ వెంటనే కుర్రవాళ్లందరినీ తీసుకుని గట్టు మధ్యకు వెళ్లండి. అక్కడ ప్రవాహం ఉధృతమవుతోంది. మనవాళ్లు ఆపగలిగేలా లేరు" అని.

కుర్రవాళ్లంతా అక్కడకు చేరారు. అప్పటికే గట్టు మధ్యలో పెద్ద చీలిక ఏర్పడి నదిలోని వరదనీరు ధారాపాతంగా కాలనీలోకి ప్రవహిస్తోంది. 'మరింత మట్టి.... ఇంకాసిని బకెట్లు తెండి.'

"తొందరగా"

"పరుగెత్తు... మట్టి కావాలి."

అన్న అరుపులు వినిపిస్తున్నాయి.

ఎవరెంత ప్రయత్నించినా కొద్ది నిమిషాలకే ఏటవాలుగా ఉన్న గట్టుపై పేర్చిన మట్టి సంచులు పెద్ద పెట్టున కుప్పకూలాయి. నీరు శరవేగంగా ప్రవహించడం మొదలైంది.

టిమ్కా, పెట్యా లిద్దరి కాళ్ల కింద నుంచి మట్టి కోసుకుపోతోంది. ఇద్దరూ పట్టుతప్పి నీళ్లలోకి జారిపోతున్నారు. ఇంతలో ఎవరో "వాడిని పట్టుకో" అనడం టిమ్కాకు వినిపించింది. వాడు తల ఎత్తి చూశాడు. ఒక్క క్షణంలో సగం సేపు తండ్రి మొహం కనిపించి అదృశ్యమైంది. వాడు మళ్లీ నీటిలోకి జారిపోయాడు. పెట్యా ఏమయ్యాడో వాడికి అర్థం కాలేదు. ఇంతలో వాడి మొహానికి తడి కుంచె వంటిది ఏదో తగిలింది. కళ్లు తెరిచి చూస్తే పెట్యా నాన్న. ఆయన వాడిని జాగ్రత్తగా ఎత్తుకుని గట్టుపైకి తీసుకువచ్చాడు. అక్కడ టిమ్కా నాన్న, పక్కనే పెట్యా ఉన్నారు. ఇక నదిని అడ్డుకోలేమని తేల్చుకొని అందరూ పడవల్లో వెనక్కి బయలుదేరారు. ఒక పడవలో టిమ్కా, పెట్యా, వాళ్ల తండ్రులిద్దరూ కూర్చున్నారు. టిమ్కా తమ వీధిని గుర్తే

పట్టలేదు. ఆ వీధిలో నీరు ఇంటి పై కప్పుల అంచులను చేరింది. గోడల జాడే లేదు. అక్కడ ఒక ఇంటి పైకప్పుపై బైచకోవ్ కూర్చుని ఉన్నాడు. వాళ్లని చూడగానే.

"ఒహో పడవ షికార్లా? మరి నా సంగతేమిటి? నా ఇల్లు ధ్వంసమైంది మీ వల్ల. నా కొడుకుని దూరం చేశారు" అన్నాడు కోపంగా.

"ఏం తాగేశావా?" అని అడిగాడు మినయేవ్ ప్రశాంతంగా.

"తాగాను. అయితే ఏమిటి? ఇప్పుడు తాగకూడదాఏం? మీరెవరు చెప్పేందుకు? నా కొడుకుని నాకు కాకుండా చేసిన పెద్ద మనుషులు."

పడవ నడుపుతున్న పెట్యా నాన్న గుబెంకో గట్టిగా నవ్వాడు. "నాలాంటి తండ్రి ఎవరికి కావాలి? నా వల్ల పిల్లలకేం ఉపయోగం?" అని ప్రశ్నించాడు. పడవ బైచెంకోను దాటిపోయింది. అయితే ఇంటి కప్పుపై నుంచి బైచెంకో ఇంకా ఏదో అరుస్తూనే ఉన్నాడు.

"ల్యోన్యా అయన్ని వదిలి హాస్టల్లో చేరాడు తెలుసా? తండ్రిని వొట్టి స్వార్థపరుడని తిట్టాడు కూడా" అంటూ టిమ్కా తన మిత్రుడు పెట్యాతో గుసగుసలాడాడు.

పెట్యా తల వూపి "వాడన్నది సబబే. నిజంగానే బైచెంకో స్వార్థపరుడు" అని నిర్ధారించాడు.

'అవును. ఇక్కడ నదికి వరద వచ్చి జనం రాత్రింబగళ్లు కష్టపడుతుంటే అయన మాత్రం దూరంగా తన కోసం కొత్త ఇల్లు వేసుకునే ప్రయత్నం చేశాడు. దానివల్ల నాలుగు డబ్బులు మిగులుతాయని ఆయన ఆశ. ఎప్పుడూ పని దొరికితే దాన్ని సొంతం చేసుకుందామనే దురాశ' అన్నాడు టిమ్కా. వాడే నాలుగు రోజుల క్రితం వీధిలో పారే మురికినీటి గుంటని సొంతం చేసుకుందామని ప్రయత్నించింది.

బిడ్డ పుట్టిన తొలినాళ్లలోనే ఆశ అనేది ఆకలి రూపంలో ఆవహిస్తుంది. ఇది దురాశ కాకుండా చూడగలిగితే బిడ్డ పెంపకానికి సంబంధించిన అనేక వైఫల్యాలను నిరోధించగలం. ఒక్క ఆశ మాత్రమే మనుగడకు పునాది, సారధి అయినట్లయితే సామాజిక జీవనం, సాంస్కృతిక ప్రగతి సాధించడం అసాధ్యమవుతుంది. కోరికలతో పాటే, జీవితానికి సంబంధించిన జ్ఞానం అభివృద్ధి చెందుతుంది. వీటికంటే ముఖ్యంగా కోరికలను నియంత్రించుకునేందుకు అవసరమైన జ్ఞానం సమకూరుతుంది. బూర్జువా సమాజాల్లో మనిషి కోరికలను, ఆశను నియంత్రించేది పోటీ మనస్తత్వం. ఒక వ్యక్తి కోరికలకు పరిమితులు విధించేది మరో వ్యక్తి ఆశ మాత్రమే. మరో మనిషిని ధ్వంసంచేసి, దోపిడీ చేసి కోరికలు తీర్చుకోవాలంటే బూర్జువా సమాజంలో అది సాధ్యమే. అయితే ఇది సాధించాలంటే ముందు దానిని అడ్డుకనేందుకు అవతలి వ్యక్తికి గల ప్రతిఘటనా సామర్థ్యం ఎంతో నీకు తెలిసి ఉండాలి. లేకపోతే ఈ దురాశ ఎవరినైనా ముంచు తుంది.

మనిషికి సహజ సిద్ధంగా ఉండే కోరికలు, అవసరాలలో దురాశ ఉండే అవకాశం లేదు. కాలుష్య కూపంలాంటి నగరం నుంచి పచ్చటి అడవిలోకి వచ్చిన మనిషి హాయిగా, తృప్తిగా గుండెల నిండా పరిశుభ్రమైన గాలి పీల్చుకున్నంత మాత్రాన దాన్ని మనం దురాశ అనలేం. మరో మనిషి అవసరాలకు, తన అవసరాలకూ మధ్య వైరుధ్యం మొదలయినప్పుడే దురాశ తలెత్తుతుంది. మరొకరి నుంచి సుఖాన్నీ, సంతోషాన్నీ దోచుకుందామని, మోసం చేసి సాధిద్దామని భావించడం దురాశే.

అందరికీ అన్నీ లభించగల అవకాశం ఉన్నప్పుడు కూడా మరొకరికంటే ముందే ఒక అడుగు ముందువేసి ఉన్న దాన్ని చేజిక్కించుకొనాలనుకోవడం నిజంగా దురాశ. వనరులు పరిమితమైనప్పుడు పక్కవాడిని వెనక్కి నెట్టి ముందుకు సాగుదామనుకోవడం పేరాశ.

ప్రజల్లో అసమంజసమైన పోటీ మనస్తత్వం ఉండకూడదనుకుంటే, వారి మధ్య సదవగాహన, సంఘీభావం నెలకొనాలంటే దానికి వారి బాల్యంలోనే సరైనపునాది పడి ఉండాలి. మన సంతోషాలనూ, సంతృప్తినీ అన్వేషించడంలో తప్పులేదు కానీ, దానికోసం మరొకరి ఆనందాన్ని దోచుకోవడం సరికాదన్న భావన పిల్లలకు కలిగించగలిగినప్పుడే, సమాజం ఆరోగ్యవంతంగా ముందుకు సాగుతుంది. ఇందుకు తల్లి తండ్రులు చేయగలిగింది, చేయవలసింది ఎంతో ఉంది.













ప్రపంచ ప్రసిద్ధ విద్యావేత్తలలో ఒకరైన ఆంటన్ సెమ్యోనోవిచ్ మకరెంకో పిల్లల పెంపకంపై తన ఉద్దేశాలను, లక్ష్యాలను తెలియచెబుతూ, తల్లితండ్రుల కోసం ప్రత్యేకంగా రాసిన పుస్తకం "ఏ బుక్ ఫర్ పేరెంట్స్". దానికి సంక్షిప్త అనువాదం ఇది. అల్లరి పిల్లలను, వివిధ కారణాల వల్ల నేరస్థులుగా మారిన పిల్లలనూ సక్రమ మార్గంలో పెట్టేందుకు నాటి సోషలిస్టు సోవియట్ యూనియన్ ప్రారంభించిన పిల్లల కాలనీల్లో పదిహేనేళ్లు పనిచేసిన మకరెంకోకు వారి అనుభావాలు, ఉద్దేశాలు, ఉద్వేగాలు, వేదనలు, సంతోషం, విచారం, ఆగ్రహం వంటి అన్ని అనుభూతులతో సన్నిహిత సంబంధం ఉంది.

పిల్లలను కావాలనుకోవడమే ఒక బాధ్యతను స్వీకరించడమని, దానిని తల్లితండ్రులు గుర్తించాలనీ మకరెంకో అంటారు. బాధ్యతను చేపట్టడం అంటే వారిని జీవితంలో ఆర్థికంగా స్థిరపడేలా చూడగలగడం ఒక్కటే కాదని ఆయన కచ్చితమైన అభిప్రాయం. చిన్నారులు మైనం ముద్దలవంటివారనీ, వారు పెద్దలుగా ఎదిగి ఎలా తయారైనా బాధ్యత అమ్మా, నాన్నలదేననీ విశ్వసిస్తారు. పసిపిల్లలకు ఇల్లే పాఠశాల అన్నది ఆయన నమ్మకం.

విద్యాబోధనారంగంలో ప్రజాస్వామ్య భావనలను ప్రవేశపెట్టిన మకరెంకో కుటుంబంలోనూ ఈ ధోరణులు ఉండటం వాంఛనీయమని భావించారు. అతి గారాబం లేదా అతి క్రమశిక్షణ, అర్థంలేని అధికార ప్రదర్శనల వల్ల పిల్లల మనస్తత్వం ఎలా రూపొందుతుందో మకరెంకో ఈ గ్రంథంలో ఉదాహరణలతో సహా రాశారు. సునిశితమైన ఆయన పరిశీలనాశక్తి, సున్నిత మనస్తత్వం, మొత్తం సమాజం పట్ల బాధ్యత ముఖ్యంగా పిల్లలపై ఆయనకు గల అపారమైన అనురాగం ఇందులో ఆద్యంతం కనిపిస్తాయి.

పిల్లల పెంపకం బాధ్యతలు వహించే అమ్మా నాన్నలకు స్వార్థం ఉండకూడదంటూనే అర్థంలేని త్యాగాల వల్ల ఫలితం రాదని మకరెంకో అంటారు. ఆయన వ్యక్తం చేసిన అన్ని అభిప్రాయాలతో ఏకీభవించలేకపోయినా విద్యాబోధనారంగ నిపుణునిగా, దశాబ్దాల తరబడి పిల్లలతో సాన్నిహిత్యం కలిగిన పరిశీలకునిగా, అన్నింటికంటె ప్రధానంగా అత్యున్నతమైన మానవతావాదిగా మకరెంకోకు గల గుర్తింపును దృష్టిలో ఉంచుకుంటే బిడ్డల పెంపకంపై తల్లిదండ్రుల కోసమే రాసిన ఈ పుస్తకం పెద్దలందరికీ నిస్సందేహంగా ఉపయోగకరం.



విద్యాబోధన పద్ధతులు, బిడ్డల శిక్షణ వంటి అంశాలపై మకరెంకో రాసిన వివిధ గ్రంథాలు పలు ఖండాల్లో, అనేక భాషల్లో లక్షల సంఖ్యలో ప్రచురితమై, ప్రజాదరణ పొందాయి. మకరెంకో రచనల్లో తెలుగులో వచ్చిన రెండో పుస్తకం ఇది.